శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః.

అఖిలకలికల్మషాపహంబగు

# శ్రీమద్భాగవతము

ఆంధ్రవచనము.

ఆఱవభాగము. (1633 - 2024)

---

శ్రీ దేవరాజసుధీమణి ప్రణీతము.



ఆనంద ముద్రణాలయ ముద్రితము.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనివారిచే

ప్రకటితము.

1927.

---

# విషయసూచిక.

---





శ్రీరస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమదాంధ్ర భాగవతము.

---

## దశమస్కంధము.

{ *శ్రీమద్భగవంతుఁడగు శ్రీకృష్ణునియొక్క వివిధవిచిత్రలీలావిశేషములను వర్ణింపఁగా వినుటకై పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగీంద్రునడుగుట. }

పరీక్షిన్మహారాజు—'మునిసత్తమా ! చంద్రసూర్యులవంశ విస్తారములను జెప్పితివి; ఆ యుభయుల వంశములందుఁ బుట్టిన రాజుల వంశవిస్తారములను, మిక్కిలి యద్భుతములయిన వారల చరిత్రములనుఁ జెప్పితివి. మఱియు వారియందు మిక్కిలి ధర్మశీలుఁడయిన యదుని వంశవిస్తారమును దెలిపితివి. ఆయదుని వంశముననే కదా తన† యంశమగు బలరామునితోఁ గూడి

---

* కడచిన నవమస్కంధమునఁ గడపట 'జాతో గతః పితృగృహా ద్వ్రజ మేధితార్థో హత్వారిపూన్, సుతశతాని కృతోరుదారః। ఉత్పాద్య తేషు పురుషః క్రతుభి స్సమీజ, ఆత్మానమాత్మనిగమం ప్రథమం జనేషు' ఇత్యాదులచే సంగ్రహముగాఁ బ్రవర్ణింపఁబడిన కృష్ణావతారచరిత్రమును సవిస్తరముగా వినఁగోరి పరీక్షిత్తు శుకమహర్షి నడుగుచున్నాఁడని సంగతి తెలియునది.

† 'తత్రాంశేనావతీర్ణస్య విష్ణోర్వీర్యాణిశంస నః' అని మూలము. ఇట 'అంశేనావతీర్ణస్య' అనుటచే పరశురామాద్యవతారములవలె కృష్ణావతార

విష్ణుండు శ్రీకృష్ణుండై యవతరించెను. కాన యట్లవతరించినట్టి విష్ణుని వీర్యగుణ విచిత్రములను మాకు వినిపింపుము. *భూతభావనుండును విశ్వాత్ముండు నగునాభగవంతుని వీర్యచరితములను—అతని పరవ్యూహాది రూపములందలివీర్యములను గాదు సుమీ—యదువంశమం దవతరించి కావించిన వీర్యచరిత్రములను, మొదటినుండియు విస్తరించి మాకుఁ జెప్పుము. 'పలుమాఱు వినివిని యున్నవిష్ణుని వీర్యముల నిపు డడుగనేల' యందువా? అట్లుకాదు. ఆయుత్తమశ్లోకుని కల్యాణ గుణగణముల ముచ్చట మెచ్చయినయమృతము సుమీ ! ఇది ప్రసిద్ధమైన యమృతముకంటె నతిశయించినది. ఆ యమృతము, విషయాభిలాషులకు భోగులు కొనియాడునది. ఈయమృతమో, విషయస్పృహ వీడినయోగులు కొనియాడునది.అదిసంసారమును బెంచునది; ఇది సంసారమునుద్రుంచుమందు. మఱియు నిది దానివలె నాలుకకు మాత్రమే రుచ్యముగా నుండక, చెవులకును, మనస్సు

---

మును అంశావతారమని తలంపరాదు. 'ఏతేచాంశకలా విష్ణోః కృష్ణస్తు భగవా న్స్వయమ్' అనియు, 'ఏష నారాయణ శ్శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః। నాగపర్యఙ్కముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్' అనియుఁ గల వచనముల కిది విరుద్ధ మగుచున్నది. గాన 'అంశేన' అనుటకు'అంశమైన బలరామునితోడ' ననికాని, 'సంకల్పరూపజ్ఞానముచేత' ననికాని, 'దివ్యవిగ్రహము యొక్క అంశముచేత' ననికాని యర్థము గ్రాహ్యము.

* 'భూతభావనః' అనఁగా, భూతాని = సాధుభూతాని, భావయతి = విభావయతి-త్రాయతే-సాధువులను రక్షించువాఁడు, 'విశ్వాత్మా' అనఁగా విశ్వమునకు అంతరాత్మయైనవాఁడు; లేక విశ్వమును, ఆత్మగా=శరీరముగా గలవాఁడు అని యర్థము.

నకును నయిత మింపై సొంపారునది. అపూర్వమైనయట్టి యమృత మునందు-భగవంతునికల్యాణగుణకథామృతమునందు-పశువుల నుజంపుకసాయివాఁడో, పశువువలె వర్తించుమూర్ఖుఁడో, లేక పరులు చేసినయుపకారమును జక్కఁగా దెలియనేరనిమూఢుఁడో, కాక మఱియెవ్వఁడు విరక్తి నొందును.? ఆయుత్తమశ్లోకుఁడు మాకుఁ జేసిన యుపకారమేమని చెప్ప! తొల్లి కౌరవసేనాసముద్రము దేవతలనైన యుద్ధమున జయించునట్టి యతిరథులు భీష్మద్రోణాదు లనెడుతిమింగిలము లానరించియుండుటవలన దాఁటుట కెంత మాత్రముఁ దరముగాకుండఁగా, మాపెద్ద లెవ్వని నోడఁగాఁ గొని యట్టి మహాసాగరమును గోష్పదమువలె దాఁట నేర్చిరో, నేను మాతల్లిగర్భమునం దున్నపు డశ్వత్థామ తనబాణముల చిచ్చుచేఁ గౌరవపాండవుల సంతతులను మొలపించుమూల బీజమై యున్న నా యీ దేహమును దహింపఁగా, మాయమ్మ 'కృష్ణా! పాహి' యని శరణుఁజొచ్చి కుయ్యిడఁగా, నపుడెవ్వఁడు చక్రముచేతఁగొని మాతల్లి కుక్షిలోఁ జొచ్చి నన్నుఁ గాచిపుచ్చెనో; అట్టి పరమోపకారి కల్యాణగుణామృతము నెంతద్రావినను విరక్తి యెట్లు కలుగును? కాన యాభగవంతుని శ్రీకృష్ణుని వీర్యచరితములనే ముచ్చటింపుము. ఆదేవుఁడు, సమస్తదేహధారుల*లోపలను వెలుపలను వరుసగాఁ బెక్కు పురుష

* లోపల క్షేత్రజ్ఞరూపములతో నుండి స్థితిని, వెలుపల కాలరూపములతో నుండి నాశమును, గలిగించువాఁడనుట. ఇట్లు సర్వమునకు స్థితి వినాశహేతు వగుటచే సర్వజగత్కారణుఁడని యర్థము. 'కారణంతు ధ్యేయః' అని కారణవస్తువునే ధ్యానింపవలయునని శ్రుతి. ధ్యానమునకు శ్రవణమననము లంగములు. కృష్ణుఁడు సర్వజగత్కారణత్వముచే ధ్యేయుండగుటవలన ధ్యా

క్షేత్రజ్ఞ) రూపములను గాలరూపములను నెలకొనియుండి, స్థితివినాశములను గలిగించు చుండుసకలజగత్కారణుఁడు. అట్టి వానికి మనుష్యత్వ మెట్లుకలిగె ననవలదు. అతఁడు మాయా మనుష్యుఁడు సుమీ. ఆలీలామానుషవిగ్రహుని వీర్యవిలసన ములను దెలుపుమా. నీ విదియంతయుఁ దెలిసినవాఁడవుగదే. సంకర్షణావతారరూపుండగుబలరాముఁడు, రోహిణికిఁ గొడుకని చెప్పితివి; మఱియు దేవకికి గర్భమందుఁ గలిగినవాఁడంటివి. మఱి యొక దేహమును గయికొనక యొక్క దేహముతోనే యాయిరు వురకును గొడుకుగాఁబుట్టుట యెట్లు? భగవంతుఁ డాముకుం దుఁడు, తండ్రియగు వసుదేవుని గృహమునుండి వ్రేపల్లె కేలపో యెను? ఆ*సాత్త్వతపతి జ్ఞాతులయిన యదువులతోడ నెక్కడ వసించియుండెను? కేశవుఁడు వ్రేపల్లెయందును మధురయందును వసించియుండి యేమేమి చేసెను? అతఁడు మానుషవిగ్రహ మును దాల్చి వృష్ణులతోఁ గూడ ద్వారకయం దెన్నియేండ్లుం డెను? ఆవిభునకు భార్య లెందఱయిరి? కృష్ణచేష్టితములను నే నడిగినవానిని మఱి యడుగనివానిని నన్నింటిని, మునీంద్రా! విన నువ్విళ్లూరుచున్న నాకు సవిస్తరముగాఁ జెప్పఁదగును. నీ వన్నియుఁ దెలిసినవాఁడవుగదే! నేను బ్రాయోపవేశమునుబట్టి జలపానమును సైతము విడిచితిని. దానిచె నాకిదెకొంచెమైనను సైఁపరాని పేరాఁకలి కలిగియున్నది; కాని, నీముఖారవిందము

---

నుంగమగు శ్రవణాభిలాష యతని వీర్యచరితములందుఁ దనకుఁ గలిగి యున్నదని తెలుపుకొనుటకు స్థితివినాశహేతుత్వముఁ జెప్పి, జగత్కారణత్వ మును దెలిపినాఁడని తెలియునది.

* భక్తులకు పతియని యర్థము.

నుండి దొరుఁగు హరికథామృతమును బానము సేయుచున్నందున నన్నది బాధింపలే కున్నది' అనెను.

సూతుఁడు, 'భృగునందనా! శౌనకా! ఇట్లు సాధుజనోత్తముఁడగు పరీక్షిత్తు లెస్సగా నడిగినవాక్యమును విని, పూజ్యుండగు శుకుఁ డాతని నెంతయు నభినందించెను. అంత, *భాగవతప్రధానుం డగునమ్ముని, సకలకల్మషములను బోకార్చునట్టి శ్రీకృష్ణ చరితమును జెప్పందొడంగినవాఁ డయ్యె.

—••◆ శ్రీభగవదవతారకారణ ప్రవచనఘట్టము. ◆••—

శుకుఁడు, 'రాజర్షిసత్తమా! నీబుద్ధి మిక్కిలియు జక్కఁగాఁ గుదురుపడియున్నది చుమీ! కావుననే వాసుదేవుని కథయందే యది యింతనిష్ఠతో నెలకొనియున్నది. వాసుదేవుని కథల నూరక నడుగుటయు, జెప్పువానిని, నడుగువానిని, వినువారిని నిట్లీ మువ్వురుపురుషులను, నద్దేవుని శ్రీపాదసలిలం బగుగంగానదివలెఁ బావనులను జేయుచున్నది.' ఇఁక దానిని విన్నను జదివినను జెప్పవలయునా? దైత్యుల సమూహములు వందల వేలకొలఁదని గర్వితులయి రాజులరూపములం బుట్టి భూమినెంతయు నాక్రమించి పీడించుచుండిరి. భూదేవియు వారి వెనుభారమునకు సైఁపనేరక బ్రహ్మదేవుని శరణుఁజొచ్చెను. ఆదేవి గోరూపమును దాల్చి దీనయై నెమ్మొగ మశ్రువులం దొప్పఁదోఁగుచుండ జాలి పుట్టునట్లు బిట్టురోదనము సేయుచు, బ్రహ్మదేవుని సమీపమున నిలిచి స్తుతిచేయుచుఁ దనదుఃఖమున ద్దేవునికి విన్నవించుకొనెను. బ్రహ్మయు నాయమదుఃఖము నెఱింగి, యంత దేవతాగణము

* భగవత్స్వరూపగుణాదులను అనుసంధించుటయె ముఖ్యప్రయోజనముగాఁ గలవాఁడు భాగవతప్రధానుఁడు.

లను త్రినయనుండగు రుద్రునినిగూడి పాలసముద్రపుఁ దీరము నకుఁ బోయెను. అట్లు పోయి యచట సమాహితచిత్తుఁడై యంత జగన్నాథుండును దేవదేవుండును బరమపురుషుండు నగు శ్రీమహావిష్ణునిఁబురుషసూక్తంబున స్తుతించుచు మనంబున ధ్యానించెను. బ్రహ్మ యట్లు సమాధియం దుండఁగా నొక యశరీరవాణి యతనికి వినఁబడెను. అద్దేవుఁడు దేవతలను జూచి 'సురలారా! నాకు సమాధియందుఁ బరమపురుషుని మాట యొకటి వినఁబడెను. దానిని జెప్పెదను వినుఁడు. విని యాచొప్పున నే మీరు వేగ చేయవలయును. జాగుకూడదు. పరమపురుషుఁడు మనము విన్నవించుటకుమునుపే భూమికిఁ గలిగియున్న క్లేశమును దెలిసియున్నాఁడు. మీరు మీమీ*యంశములచేత యదువులయందుఁ బుట్టుఁడు ఆయీశ్వరేశ్వరుఁడు తన కాలశక్తిచేత భూభారమును హరింప నవతరింపఁగలఁడు. అంతకుమునుపే మీరు పుడమియందుఁ బుట్టవలయును. భగవంతుఁడా పరమపురుషుఁడు తాను †బరిపూర్ణుఁడై వసుదేవుని గృహమందుఁ బుట్టనున్నాఁడు. అతనిని బూజించుకొఱకు నప్సరస్త్రీలును భూమియందుఁ బుట్టవలయును. అద్దేవుని యానతినిబట్టి ఋషులుసయితము గోరూప

---

* అంశముచేతఁ బుట్టుటయనఁగా—ఆత్మస్వరూపము అణువైనదిగాన ఒక్కటికంటె నెక్కుడు దేహములందు వర్తించుట గలుగదు. ఆత్మకు రెండు జ్ఞానములు గలవు. ఒకటి స్వరూపముతోఁ జేరినది. రెండవది ధర్మమైనది. ఆ ధర్మభూతజ్ఞానముచే జీవాంతరము నధిష్ఠించియుండుటయే అంశముచేతఁ బుట్టుట యని తెలియునది.

† కపిలాదులవలె నంశావతారమునఁగాక పూర్ణుఁడై యవతరించుటను దెలియునది.

ములంబూని జనింపవలయును. వారు తమ తపముచేతనే కాక యట్లు గోరూపములఁ బాలుపిదికి యర్పించుటచేతను గూడ విష్ణువునకుఁ దృప్తి గావించినవా రగుదురు. వాసుదేవుని కళయు సహస్రముఖుఁడును స్వతంత్రుఁడు నగుననంతుఁడును హరికిఁ బ్రియము సేయఁగోరి యతనికి నగ్రజుఁడుగాఁ బుట్టఁగలఁడు. జగమునంతయు మిక్కిలి మోహింపఁజేయు భగవతియగు విష్ణుమాయయుఁ బ్రభువునాజ్ఞచేత, నతని కార్యముకొఱకు నంశమున నవతరింపఁగలదు' అనెను. ప్రజాపతులకెల్లఁ బతియగు నాబ్రహ్మ యిట్లు దేవగణముల కానతిచ్చి భూమిని దగుమాటల నూఱడించి యంత మిక్కిలియుత్తమం బయినతన నెలవునకుం బోయెను. తొల్లి యదువులకు రాజయిన శూరసేనుం డనువాఁడు మధురాపురియందు వసించియుండి మాథురములును శూరసేనములు నను దేశముల ననుభవించుచుండెను. అంత నుండియు నామధుర యాదవు లగు రాజులకందఱకును రాజధానియై యుండెను. అందు భగవంతుఁడగు హరి,(తన యావిర్భవస్థానమగుటం బట్టి) యెపుడును సన్నిహితుఁడై యుండును. ఆపురమునం దొకప్పుడు శూరుని పుత్రుఁడయిన వసుదేవుఁడు దేవకీదేవిని బెండ్లాడి యాపెండ్లికూఁతుతోడ స్వగృహమునకుఁ బయనమై రథ మారోహించెను. అపు డుగ్రసేనుని కొడుకయిన కంసుఁడు బంగారుమయము లయిన నూఱు రథములు తన్నుఁ బరివేష్టించి వచ్చుచుండఁగా, నప్పసెల్లెలయిన యాదేవకికిఁ బ్రియము సేయఁగోరి, యాతేరినెక్కి దానిని దోలుటకై గుఱ్ఱముల వాగెలను జేతంబూనిన వాఁడయ్యె. అంతఁ దండ్రియగు దేవకుఁడు పుత్రికలందు మిక్కిలియు మక్కువ గలవాఁడుగాన దనకన్న కూఁతు

రయిన దేవకికి బంగారు పూమాలికలచే వెలుంగుచున్న యేనుం గుల నన్నూటిని, బదియేనువేల గుఱ్ఱములను, వేయు నెనమన్నూఱు రథములను, జక్కఁగ నలంకృతలై చొక్కపుఁగొమిరె ప్రాయంబు గులుకుచున్న దాసీజనంబులనిన్నూటిని, పల్లకీలు మొదలగు వాహనములను, సరణముగా నిచ్చెను. వధూవరులు, పయనంబగుట కుపక్రమించునపుడు మంగళార్థముగా శంఖములయు దూర్యములయుమృదంగములయు దుందుభులయు ధ్వనులొక్కుమ్మడిఁ జెలంగెను. అట్లు పయనమైపోవు మార్గమునఁ గుఱ్ఱములవాగెలుపూని తోలుచున్న కంసునితో నొకయశరీరవాణి 'ఓరీ' యని పేర్కొని 'నీవు పతిగృహమునకుఁ గొంపోవుచున్న యీపడఁతి యెనిమిఁదవచూలు నిన్నుఁ జంపఁగలదు సుమీ ! ఇస్సీ ! ఇది తెలియవు గా!' యనెను. ఇట్లు చెప్పఁగానే భోజకుల పాంసనుఁ డయినయాపాపాత్ముఁ డెంతయు మూర్ఖుఁడు గావునఁ దన చెల్లెలిని జంపు తెంపునకుఁ బూని, చేత ఖడ్గముగొని దెప్పరంబున నాబిడ్డకొప్పుఁ బట్టికొనెను. చెల్లెలని తలంపక చంపునట్టి కుచ్చితపుఁబనికి నొడిగట్టియున్న యాసిగ్గుమాలినకట్టిఁడివానినిఁజూచి వసుదేవుఁడు మిక్కిలియుబుద్ధిమంతుఁడు గావునఁదిన్నని మాటల మెట్టుపఱుచుచు, "నీగుణములు శూరులకెల్లఁ గొనియాడఁదగినవిగదే! మఱి నీవు భోజకులమునకెల్ల వన్నెఁదెచ్చు కన్నాకవు. ఇట్టి నీవు తుదిఁ బోయిపోయి యొకయాఁడుదానిని, అందును బెండ్లియై పతిగృహప్రవేశమనుశుభకర్మము నాచరించుచున్న దానిని, మీఁదు మిక్కిలి నీచెలియలిని, నెట్లు చంపఁబూనితివో కదా? 'నా చావునకు మూలముగాన చెల్లెలయినను జంపుదు' నందువా? వీరా! ఒకదాని మరణమునకు మఱియొకటి మూల

మగునా? జన్మమెత్తువాని కెల్ల దేహముతోఁగూడనే మృత్యువు పుట్టుచున్నది; కాన, యొక్కొక్క ప్రాణకిని నేఁటికో లేక నూఱేండ్ల పిదపనో మృత్యువు రాక తప్పదు. ఇది నిజము. 'ఓయీ! నూఱేండ్లు కడపట ముదిసి మూలంబడిన దేహమును మృత్యువు కొనిపోయినఁ బోనీ. ఇప్పటి మేలయిన యీ దేహమునది కొనిపోవునేని యిట్టిది దొరకుట యరుదుగా' యందువా? ఇట్టి దేహము మఱియొకటి దొరకుట యరుదుగాదు. దేహము మరణము నొందఁబూనినపుడు, దేహమందలి జీవుఁడు పూర్వకర్మవశమునకు లోనై యాకర్మమునకు ననుగుణమయిన మఱియొక దేహమును నూఁదియే మునుపటి దేహమును విడుచుచున్నాఁడు. (కాన యీ దేహము పోయినను గర్మానుగుణముగా మఱియొక దేహము తనంతటనే కలుగుచున్నది. చెల్లెలినిజంపు నిట్టి చెడుపనిచేసి నీచమయిన దేహమును బొందుటకంటె, నిప్పటి మరణభయమును విడిచి, చెల్లెలిప్రాణములను రక్షించు శుభకర్మమువలన నింతకంటె మేలయిన దేహమును బొందుట మంచిదికదా! కాన, దీనిని జంపఁదగదు దేహాంతరమును బొందియె పూర్వదేహమును విడుచుట యెట్లందువేని తృణజలూకను జూడుము) * తృణజలూక తానుబోవ నుంకించినపుడు, తనకా

* ఇందులకు 'వ్రజం స్తిష్ఠ న్పదైకేన యథైవైకేన గచ్ఛతి, యథాతృణజలూకైవం దేహీ కర్మగతిం గతః' అని మూలము. పూర్వశ్లోకమున దేహాంతరము బొందియే మరణించుచున్న పూర్వదేహమును ద్యజించుచున్నాఁడనుటకిట తృణజలూకాదృష్టాంతము చెప్పంబడెను. అయినను అణువగు జీవుఁడు మరణమునొందుచున్న దేహమునండియే దేహాంతరము నధిష్ఠించుచున్నాఁడని శంకింపరాదు. అణువగుటచే నట్లుచేయుట పొసఁగదు. ఒక గృహమునుండి

లొకటినెత్తి యొకతృణమునూఁదుకొని పిదప మఱియొక కాలితోఁ బోవుచున్నది. అట్లే జీవుఁడును మృతినొందిన దేహమును విడుచువాఁడై కర్మానురూపమయిన క్రొత్తదేహము నధిష్ఠించియే పూర్వదేహమును విడుచుచున్నాఁడు. (తృణజలూకయున్న దేహముతోనే పోవలసిన ప్రదేశాంతరమున గాలూఁది పిదపఁ బూర్వముండిన ప్రదేశమును విడుచుచున్నది. కాన దానికి దేహము పోవునని భయశోకాదులు పొందవలసినది లేదు. జీవుఁడన్ననో దేహాంతరమును బొందినపిదపఁ బూర్వదేహమును విడుచుచున్నాఁడనుట గానరాదు. పూర్వదేహమును విడుచుట

---

మఱియొక గృహమును బ్రవేశించువాఁడు ముందు తనయుపకరణములు లాగలవానినందుఁ జేర్చుటచే దానిని బ్రవేశించినవాఁడయినట్లు, జీవుఁడును దన దేహోపకరణములయిన ప్రాణేంద్రియాదులను దేహాంతరమును బొందించుటచే దానిని బ్రవేశించిన వాఁడగుచున్నాఁడని తెలియునది. లేక తద్ధర్మభూతజ్ఞానము ద్వారా దేహాంతరము నధిష్ఠించుచున్నాఁడన్నను విరోధము లేదు; మఱి యీశ్లోకమున 'యథా' శబ్దములు రెండున్నవి. రెండవ 'యథా' శబ్దము దేహాంతరమును బొందియే పూర్వదేహమును ద్యజించుచున్నాఁడనుటకు తృణజలూకను దృష్టాంతీకరించుకొనుటకనియు; మొదటి 'యథా' శబ్దము, దేహమునతోడినీడవలె మృత్యువు వెంబడించుచున్నదనుటకు దృష్టాంతము చెప్పుకొనుటకనియు గ్రహింపవచ్చును. అప్పుడు 'వ్రజంస్తిష్ఠన్పదైకేన యథైవైకేనగచ్ఛతి' అనుటకు పురుషుఁడు ఒకపాదముతో నడచుచును మఱియొకపాదముతో నిలుచుచునే పోవునట్లు, జీవించుచున్నను మృతప్రాయుఁడై యే జీవించుచున్నాఁడని యర్థము. ఇట నొకకాలెత్తి జరుపుట జీవించుటకును, నొకకాలితో నిలిచియుండుట మరణమునకు సాటి. ఇట్లొకకాలు జరపుటయు మఱొకకాలు నిలుపుటయు సమకాలముననే వర్తించునట్లు జీవమును మరణమును సమకాలముననే వర్తించుచున్న వని యాశయము.

మాత్రమే కనుపట్టుచున్నది. కాన మేలయిన పూర్వదేహమును వదలు నెడ భయశోకాదులు గలుగునోయని దానిని వదలకుండునట్టి పరిహారము చేసికొనఁ దలఁచుదువా? అట్లు కాదు.) *స్వప్నమునందు జీవుఁడు తాను గన్నట్టియు విన్నట్టియుఁ దలఁచి

* ఇందులకు 'స్వప్నే యథా పశ్యతి దేహ మీదృశం మనోరథేనాభినివిష్టచేతనః। దృష్టశ్రుతాభ్యాం మనసా విచిన్తయన్ ప్రపద్యతే తత్కిమపి హ్యపస్మృతిః' అని మూలము. వసుదేవుఁడు కంసునితో 'నీచెల్లెలుగాన దేవకిని జంపకుమీ' యనెను. కంసుఁడు 'నాచెల్లెలయినను నాచావునకు మూలమగుటచే దీనిని జంపకతీఱదు' అనెను. వసుదేవుఁడు 'నీచావునకిదియా, అందును, నీకు మీఁదనా మూలముకానున్నది? పుట్టుకతోడనే, దేహమెత్తినపుడే, మరణముగూడ పుట్టుచున్నది. నేఁటికైనను మఱినూఱేండ్లకయినను మరణము రాకమానదు' అనెను. నూఱేండ్లపిదప ముదిసియున్న దేహమునకు మరణము వచ్చినను రానీ! మంచివయస్సుచే సుఖహేతువైయున్న యిప్పటిదేహమునకు మరణము వచ్చెనేని శోకభయాదులు గలుగును గాన దీనిని నిలుపుకొనుటకై దేవకిని జంపవలయును' అనెను. వసుదేవుఁడు 'ఈదేహము పోయిన యెడ మఱొకదేహము కలుగదని తలఁచితివా? తప్పక తనంతటనే యది కలుగుచున్నది. అయినను అది పూర్వకర్మానుగుణముగా మఱింత మంచిది గానో లేక చెడ్డదిగానో కలుగును; కనుక, చెల్లెలిని జంపినపాపముచే మఱింత చెడ్డదేహమును బొందక దానిని రక్షించుట పుణ్యముచే మఱింత మేలయిన దేహమును బొందుట దగును; కావున దేవకిని జంపకుము. మఱియు తృణజలూక జరుగనుంకించినపుడు యొక కాలినెత్తి ముందున్న యొకగడ్డిపరకను బట్టుకొనియె మఱియొక కాలును జరపిపోవునట్లు, జీవుఁడు తనదేహము మరణమునొందుచున్నపుడు దేహాంతరమునుబొందియే పూర్వదేహమును విడుచుచున్నాఁడు. కనుక మఱియొక దేహము సిద్ధమై యుండఁగా నీదేహమును పోవుచున్నదని భయాదులు పడనక్కఱలేదు చుమీ' యనెను. కంసుఁడు 'తృణజలూకయున్న దేహముతో పొందవలసిన క్రొత్తచోటినిబొంది, పిదప మునుపటిచో

నట్టియు వస్తువులకై మనస్సున జింతించుచుఁ దనబుద్ధి యామ

టిని వదలుచున్నది. కాన దేహమును విడుచుటవలని భయాదులు దానికిఁ గలుగవు. జీవుఁడో మునుపటి దేహమును విడుచుచున్నాఁడే కాని క్రొత్తదేహమును బొందుటగానరాదు. కాఁబట్టి మేలయిన మునుపటి దేహమును వదలుటవలన భయశోకాదులు గలుగకతీఱవు' అనెను. వసుదేవుఁడు దేహాంతరమును బొంది నపిదపనే పూర్వదేహమును వదలుచున్నాఁడని నిరూపించుటకై స్వప్నదృష్టాంతమునుగొని 'జీవుఁడు తానుగన్నట్టియు విన్నట్టియు దలంచుకొన్నట్టియు విషయములను బడయఁగోరుచున్నాఁడు; కాన వానిని మనస్సునఁ దలఁచుకొనుచుండుటచే స్వప్నమందు నామనోరథములను బుద్ధిచే ననుభవింపఁజొచ్చుచున్నాఁను. అనఁగా రాజ్యాభిషేకమనెడి మనోరథమును బుద్ధిచే ననుభవింపఁబూనినాఁ డనుకొందము. వాఁడు మొదట రాజదేహమునుజూచి పిదప దానినిబొంది రాజుగాఁ దన్నెన్ని యభిషేకము చేసికొనుచున్నాఁడు. అపుడు స్వప్నావస్థయందుమాత్రము గలుగు నాస్వప్నరాజదేహమును బొందఁగానే మునుపటిసామాన్యదేహమును గుఱించినస్మృతియే వానికిఁగలుగదు; కనుక వానిని విడిచితి ననుభయాదులును వానికిఁగలుగవు. పూర్వదేహమున స్వప్నదేహముఁ బొందినపిదప, మునుపటిదేహమును విడుచుటయు, అట్లు విడిచినందులకు భయాదు లొందకుండుటయుఁ గలుగునట్లే, జీవునకును దేహాంతరమును బొందినపిదపనే పూర్వదేహమును విడుచుటయు దానిని విడుచుటవలన భయాదులు గలుగకుండుటయు గలుగుచున్నవి' అనెడి ప్రశ్నోత్తర విషయము గ్రహించునది. ఇట స్వప్నదేహము ఈయున్న దేహమువంటిది; కాని, యది స్వప్నావస్థయందు మాత్రముండునదియై స్వప్నదర్శి మాత్రముచేతనే యనుభావ్యమై యుండుటవలన నీయున్న దేహమును బోలికగాఁ గొనిచెప్పుటకుఁదరము కాకుండును; గాన 'కిమపి' యని యాస్వప్నదేహమునకు విశేషణము చెప్పఁబడెను. ఆ స్వప్నదేహమును మొదట (పశ్యతి) చూచుటయు, పిదప (ప్రపద్యతే) పొందుటయును, జెప్పుటచేత దేహాంతరమును మొదట జ్ఞానముచేతఁ బ్రవేశించుటయు పిదప స్వరూపముతోఁ బ్రవేశించుటయు సూచితము. మఱియు స్వప్నదేహ

నోరథములను (అనఁగా దేశాంతరగమనము రాజ్యాభిషేకము మొదలైన వానిని) ననుభవింపఁ జొచ్చినపుడు వాఁడియున్న దేహమువంటిదై యిట్టిదట్టి దనరాని స్వప్న దేహమునుగాంచి దానిని బొందినపిదప నియున్న దేహమును గుఱించిన స్మృతిలేక

---

మును బొందినపిదప మునుపటి దేహమును గుఱించిన తలంపుగాని దానిని విడిచితి ననుభయాదులుగాని లేకుండునట్లే యిప్పటి దేహములను బొందినపిదప నింతకు మునుపటి దేహములను గుఱించిన తలంపుగాని దానిని విడిచినందులకెపుడు భయాదులుగాని కలుగకున్నవనియు భావము స్ఫురించుచున్నది. మఱియుఁ బూర్వదేహము మృతినొందుచున్నపుడు దేహాంతరమును బొందుట గానరాదు. దేహాంతరము తనంతట వేఱయొక విశేష్యముగాఁ బొందఁబడునే కాని మఱియొకదానికి విశేషణ రూపముగాఁ బొందఁబడుట గలుగదు; అట్లే పూర్వదేహమును ద్యజించుటయు. కనుక దేహాంతరమును బొందుటయనఁగా మొదట జ్ఞానముచేతఁ బొందుటయనియు పిదప స్వరూపముచేత బొందుట యనియు సమాధానము దెలియునది. లేకయీ 'స్వప్నే' అను శ్లోకము మొదటిసగము దృష్టాంతపరముగాను, రెండవ సగము దార్ష్టాంతిక పరముగాను నర్థము సేయవచ్చును. ఎట్లనఁగా స్వప్నమందు జీవుఁడు దేశాంతరగమనాది మనోరథములందు మనసుచొచ్చినవాఁడై యీయున్న దేహమువలె నాత్మాభిమాన విషయమై, స్వప్నదర్శికిమాత్ర మనుభావ్యమై యాయవస్థయందుమాత్ర ముండునట్టిదియు, స్వప్నమందుమాత్రమే యనుభవింపఁ దగినట్టి ఫలములుగల పుణ్యాపుణ్యకర్మములకు ననుగుణముగాఁ బరమపురుషునిచే సృజింపఁబడినదియు, నగు దేహము చూచి జ్ఞానముచేత నధిష్ఠించి (దేశాంతరగమన రాజ్యాభిషేక శిరశ్ఛేదాదుల ననుభవించుచు,) ఉన్న దేహమును గుఱించిన తలంపు సుంతములేక దానికి బాధాదులు గలుగునోయని భయాదులులేకయు నుండును. అట్లే పురుషుఁడు దృష్టశ్రుతములకొఱకు, అనఁగా ఐహికాముష్మికములకొఱకు మనస్సునఁజింతించుచుఁ గర్మానుగుణముగా నీశ్వరునిచే సృజింపఁబడు

యుఁ గావుననే దీనిని విడుతుమని భయశోకాదుల నొందక యుండునుగదా! అట్లె జీవుఁడును దేహాంతరమును గాంచి పొందియే పూర్వదేహమును విడిచి, యట్లు దానిని విడుచుటవలన భయశోకాదుల నొందక యుండును. దేహాంతరమును బొందు విధ మెట్లందువేని, మనస్సు పూర్వకర్మవాసన పురికొలుపునట్లు సంకల్ప వికల్పరూపమగు వికారములకు లోనై సత్త్వాదిగుణమయమగు ప్రకృతికిం గలపరిణామరూపము లయిన శబ్దాదివిషయము లయిదింటియందు నెద్దానిని స్మరించుచున్నదో యీదేహి యాయాదానిని జొచ్చి* దానితోఁ గూడఁ బుట్టుచున్నది. జీవుని యుత్పత్తి యనుట యిదియె సుమీ. ఆకాశమందు దర్పణరూపున నుండు సూర్యుఁడు మొదలయినజ్యోతులు జలములందును పృథివీపరిణామములయిన యద్దములు మొదలగువానియందును బ్రతిబింబించుచు, వాయువు నురవడిచొప్పునఁ బెద్దవిగను జిన్నవిగను నిట్లు నానావిధములుగ మనకుఁ జూపట్టుచున్నవి. అట్లు యీ జీవుఁడును, దనంతట దేవమనుష్యాదినానాత్వము లేనివాఁ

---

నొకానొక దేహమునుబొంది జ్ఞానముద్వారా అధిష్ఠించి) పూర్వదేహమునుగుఱించి స్మృతిలేనివాఁడైయంతట స్వరూపముచేత యీదేహాంతరమునుబొందుచున్నాఁడని యర్థము. ఇట స్వప్నమందుఁగలుగు దేహాద్యను భోగములను ఈశ్వరుఁడు 'ఈశ్వరోరథాదీన్ సృజతి' అను శ్రుతిచొప్పున సృజించుచున్నాఁడు. స్వప్నమందుమాత్ర మనుభవింపఁదగు ఫలములుగల పుణ్యాపుణ్యకర్మములనుబట్టి యీశ్వరుఁడు స్వప్నమందలి భోగదుఃఖాదులను సృజించుచున్నాఁడని తెలియునది. ఆవిధముననే జాగ్రదవస్థయం దనుభవించు దేహాదులను గర్మానుగుణముగా నీశ్వరుఁడు సృజించుచున్నాఁడని తెలియునది.

* యంయం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కళేబరమ్ । తంతమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః॥ అని భగవద్గీత యిట యనుసంధింపనది.

డయ్యును, తనదేహమును బన్నప్రకృతి పరిణామరూపముల యిన భూతసూక్ష్ములచేత రచితములును గుణపరిణామాత్మక ములునగుశరీరములందు శబ్దాదివిషయములందలియనురాగముఁ బట్టి చొచ్చి నేను దేవుఁడను మనుష్యుఁడ నని యిట్లు నానావిధ ముల మోహమునొందుచుండును. వస్తుస్థితి యిట్లుండుటంబట్టి వస్తుతత్త్వము నెఱింగిన పురుషుఁడు తనక్షేమము నరయువాఁడై యొక్కరికిని ద్రోహముచేయకుండవలయును. అట్లేని దేని వలనను భయము గలుగదు. ద్రోహముచేయువానికే పరునివలన భయము గలుగును. అదియెల్ల నట్లుండనిమ్ము. ఈపడఁతియో నీకుఁజెల్లెలు; తానో మిక్కిలియుఁబసిది; మఱి దీనురాలు; నీకుఁ గన్నకూఁతురువంటిది: ఇట్టికల్యాణిని దీనిని దీనవత్సలుండవగు నీకుఁ జంపఁదగునా ? తగదే' అనెను. ఇట్లు బుజ్జగింపుఁ బలుకులచేతను, నట్లు చంపుటవలనఁ గలుగు భయమును సూచించు బెటుమాటలచేతను, వసుదేవుఁడు చంపవలదని యెంత వారించుచున్నను నాకంసుఁడు మనుష్యులను దినెడిరాక్షసుల స్వభావ మలవడినక్రూరుండుగాన యాకట్టిఁడిపూనిక నుడిగిన వాఁడుగాఁడయ్యె. అంత నాకంసునికట్టిఁడిచలమును గనుఁగొని వసుదేవుఁడు తనయిల్లాలికపుడు దాపరించియున్న మృత్యువును బరిహరించు నుపాయము నాలోచించి యట్టి వెగ వొకటి యూహించుకొని తనలో 'బుద్ధిమంతుఁడగువాఁడు తనబుద్ధిసాగు నంతవఱకు, తనబలము కలకొలఁదినిఁ దాపరించియున్న మృత్యువును వారించుకొనఁ బ్రయత్నింపవలయును. అట్లు చేతనయిన పాటుపడియు నామృత్యువు నివర్తింపక పోవునేని, యపుడతని యందుఁ దప్పేమియుఁ గలుగదు. కాఁబట్టి, పుట్టుచున్న పుత్త్రు

లను కంసుఁడనుమృత్యువునకు నప్పగించెదనని ప్రతిజ్ఞ సేసి దీనవైయె నవయుచున్న యీముద్దరాలిని నీబారినుండి విడిపించెదను. అట్లు ప్రతిన సేయుట దోషమగునేమో! అయినను నాకుఁ బుత్త్రులు నిజముగాఁబుట్టుదురేని,మృత్యువైయిన యీకంసుఁడు వారు పుట్టుటకుమును పే చావకుండునేని, యిట్లీ రెండును జత గూడునేని యపుడు నాపుత్త్రులను నప్పగింతును. ఈ రెండును బొసఁగుట నిశ్చయముగాదు. కాన, ప్రతిజ్ఞ సేయుట యొకదోషముగాదు. లేక యిదియంతయు మఱియొక విధముగా మాఱి నాపుత్త్రులే కంసునికి మృత్యువుగారాదో! కంసుఁడున్నపుడు నాకు బుత్త్రులుపుట్టకుండరాదో! ఇట్లు చూచినను బ్రతిజ్ఞ యొకదోషముగాదు. అయిన నశరీరవాణి యీశ్వరుని వచనమే కాన యది వేఱువిధముగ మాఱుట గలుగదే యనుకొన్నను, ఈశ్వరునిపోకడ తెక్కినవారి కెంతమాత్రము దెలియుట గష్టము. కాన యీశ్వరుఁ డట్లుచెప్పియున్నను నది తప్పుటయుఁ గలుగ వచ్చును. పయింబడవచ్చిన మృత్యువు సయిత మొకానొకచో (మార్కండేయాదులకుం బోలె) మరలిపోవుట గలదు. (వర దానమువలన) మరలిపోయిన మృత్యువు సైతము, (హిరణ్యకశిపు రావణాదులకుంబోలె) మరల పయిఁబడుటయుం గలదు. కాన ప్రతిజ్ఞదోషము కాదు. * అగ్నికి నరణితోడిసంయోగవియోగములకుఁ గర్మము తప్ప మఱియొక్క హేతువు నిశ్చయింపరాకుండునట్లు, ప్రాణికిని శరీరముతోడి సంయోగవియోగము

*అగ్నేర్యథా దారువియోగయోగయో రదృష్టతోఽన్యన్ననిమిత్తమస్తి। ఏవంహి జన్తోరపి దుర్విభావ్యశ్శరీరసంయోగవియోగహేతుః' అని మూలము.ఇట సంయోగమనఁగా శీఘ్రముమగు నుత్పత్తి; వియోగమనఁగా విలంబమై

లకుఁ గర్మముతప్ప మఱొక హేతువు దెలియరాదు. కాన యశరీరవాణి యొక వేళ మాఱుపడక యే యుండినను నాప్రతిజ్ఞ దోషము కాదు. ఏలన వారివారి కర్మమే వారివారి మృత్యువునకుఁ హేతువుగాని మాబోఁటుల ప్రతిజ్ఞలుగావుగదా)'*యని యిట్లు తనబుద్ధి సాఁగునంతకోలఁదిని, విమర్శించి, వసుదేవుఁడు పాపమునకొడిగట్టియున్న యాకట్టిఁడికంసుని నెంతయు బహూకరించుచుఁ దన విమర్శించినయర్థమును వాఁడు సమ్మతించునట్లు చేయువాఁ

న యుత్పత్తియని వీరరాఘవులు, (మునిభావప్రకాశిక యందు) దారుశబ్దము దారుమయగృహాదులకు నుపలక్షణము. వనమందు వృక్షములను గ్రామమందు గృహములను గాల్చునట్టి యగ్ని దగ్గఱనున్నవానిని విడిచి దూరమందున్నవానిని గాల్చుటకు అదృష్టముతప్ప వేఱొక కారణము గాన రానట్లు, ప్రాణికి శరీరముతోఁడి సంయోగవియోగములకును అదృష్టమే కారణమని యర్థము.

* శ్రీధరీయము-వసుదేవుఁడు కంసుని సామభేదములచే దేవకిని జంపవలదని వారించుచున్నాఁడు. సామభేదములనఁగా'లాభోపకృతిసంబంధాన్యాభేదోగుణకీర్తనమ్।సామం పంచవిధం భేదో దృష్టాదృష్టభయం వచః'అని. ఇట లాభము,ఉపకారము, సంబంధము, అభేదము, గుణకీర్తనము,అని సామము ఐదువిధములు. భేదమనఁగా దృష్టాదృష్టభయమయిన మాట. ఇట నీగుణములు శూరులచేఁ గొనియాడఁదగినవి యనుటచే గుణకీర్తనమును, నీచెల్లెలనుటచే సంబంధమును, నీకూఁతువంటి దనుటచే అభేదమును, చంపకుమని స్త్రీవిధముఁండి నివర్తింపించుటచే యశోలాభమును, పెండ్లిపర్వమందని సంతానవృద్ధిచేత నుపకారమును జూపుచున్నాఁడని తెలియునది. కంసవసుదేవుల యుక్తిప్రత్యుక్తికమెట్లన-కంసుఁడు 'మరణభయముచేతఁ జంపుచున్నా' ననఁగా 'దేహము క్షణభంగురము-నిత్యమును మృత్యువుగలుగునని శంకింపనలసినదే'యని వసుదేవుఁడు చెప్పఁ,గంసుఁడు 'మరణముతప్పనిదయినను అవిలంబముగాఁ గలుగుటకై దీనిని జంపుచున్నాను' అనెను. అందులకు 'మరణ మెప్పు

డయ్యెను. అతడు తన ముఖారవిందమును బలవంతముగా వికి

---

డయినననుదప్పక కలుగనుండఁగా విలంబమునకై పాపమాచరింపఁ దగదు.మఱి యీదేహము పోయినపిదప దేహాంతరము గలుగకపోవునేని పాపముచేత నయినను దీనిని బాలించుకొనుట యుక్తమే; కాని యట్లును గలుగదు. దేహమునకుఁ బంచత్వము కలుగనుండఁగా,కర్మవశమునఁ దనప్రయత్నమేమియు లేకయే, మొదట దేహాంతరమును బొంది పిదప పూర్వదేహమును ద్యజించుచున్నాఁడు. ఎట్లనఁగా మనుజుఁడు ముందఱ నొక యడుగెత్తిపెట్టి భూమి నానుకొని దేహమునిలఁబెట్టుకొని పిదప మఱియొకయడుగును మునుపటిచోట నుండియెత్తి ముందుపెట్టి యిట్లుపోవుచున్నాఁడు. తృణజలూకయు ముందఱ వేఱొకతృణమును బట్టుకొని పిదప ముందటితృణమును విడుచుచున్నది.ఇట్లే కర్మపథమందు వర్తించుజీవుఁడును దేహాంతరమునుబొందియే పూర్వదేహమును విడలుచున్నాఁడు. మఱియు స్వప్నమందొక దృష్టాంతము-తాను మేలుకొన్న పుడుచూచిన రాజాదిదర్శనములను విని యింద్రాది శ్రవణములు వాసనలై మనస్సు నావరించి యుండుటవలన నట్టిమనస్సుచే వానినేచింతించుచుస్వప్న మందును నాకన్నట్టి విన్నట్టి రాజాదిదేహముల వంటివియు నతితుచ్ఛములయి నవియునగు దేహములను గాంచుచున్నాఁడు. మఱియొకక్షణమునకే నవియె తానని తలంచుచు మేలుకన్నప్పటి దేహమునుగుఱించినతలంపే లేక యుండును. మేలుకనియున్నపుడే మనోరథముచేతఁ దాను కన్నట్టి విన్నట్టి రాజాది దేహములవంటి దేహములనుగాంచి యదియె తాననితలంచి యప్పటిదేహమునే తలఁచిపోవుచున్నాఁడు. ఇట్లే స్వీకరించినదియుఁ బరిత్యజించినదియు, దేహమునేకాని వేఱుగాదు. (ఇట స్వీకారపరిత్యాగములు దేహవిషయములే యనుటకు స్వప్నదృష్టాంతమొకటియు మేలుకన్నట్టిదృష్టాంతమొకటియునీయఁబడినవి-స్వప్నమునందు కన్నవిన్నట్టి దేహములను మనస్సున ననుసంధించుటయు మేలుకొన్నప్రుడును మనోరథముచేత నట్లె యనుసంధించుటయుఁ దెలియునది. ఇట్లు స్వప్నముయొక్కయు మనోరథముయొక్కయు ననుసంధానముల దేహస్మృతినివిడుచుటయు 'జంతోర్వైకస్యచిద్ధేతోర్మృత్యురత్యం

సిల్లఁ జేసికొనుచు, మనస్సులోన నెంతయుఁ దుందుడుకుపడుచుం

తవిస్మృతిః। జన్మత్వాత్మతయా పుంస స్సర్వభావేన భూరిః। విషయస్వీకృతిం ప్రాహుర్యథా స్వప్నమనోరథా। స్వప్నేమనోరథేచేత్థం ప్రాక్తనం న స్మరత్యసౌ'అని యున్నది.)'అయినను విచిత్ర దేహములకు హేతువులగుకర్మములను జేయకుండఁగా దేహవిశేషముగలుగుటకుఁగారణ మేమి?'' యన్నచో 'దేహము పంచత్వము నొందునపుడు మాయ చేతపంచభూతములు నానాదేహములుగా రచింపఁబడియుండఁగా ఫలాభిముఖ మగు కర్మముచేఁ బ్రేరితమై మనస్సు నానావికారమయమై యాదేహములందు దేవతిర్యగాదిరూపమైనయేయే దేహము వెంటఁబడి 'దేనిదేనియం దభినివేశమునొందునో దానిదానియందీ దేహిపుట్టుచున్నాఁడు'. 'మనస్సుగదాకర్త; యదియె యట్లు పుట్టినలయునుగాని కర్తగాని యాత్మ యట్లు పుట్టుటకుఁ గారణ మేమి?'యన్నచో 'ఆమనస్సే తానని యాయాత్మతలంచుటచే దానితోఁగూడఁ బుట్టుచున్నది'.'మఱి యేదో యొక దేహముగలుగుట సత్యమే కాని యతిప్రియమైనదీ రాజదేహముగానదీనినిరక్షించుకొనుటకై యకృత్యము నేను జేసెద'నన్నచో, 'ఈచంద్రాది జ్యోతులు నీటితోఁగూడినపార్థివములయినఘటాదులయందును,లేక నీళ్లయందును,పార్థివములైన నూనె నేయి మొదలయినవానియందును, ప్రతిబింబితములై వాయువేగమువలనఁ గంపాదులతోఁ గూడినవై కనుపట్టునట్లు, తనయవిద్యచే రచితములయిన దేహములయందుపురుషుఁడు రాగముచేతఁజొచ్చి యిదిప్రియ మిది యప్రియమని మోహము చెందుచున్నాఁడు;కాని, తుదకన్ని దేహములునొక్కటియె యగుచున్నవి.(అనఁగా ఆత్మకు మొదట దేహాధ్యాసమువలన జన్మము-పిదప ఆత్మయు దేహమును బరస్పరధర్మములఁ వ్యవసించుటచే దేహధర్మములయిన కార్శ్యముమొదలయిన వానిని,ఆత్మయందు' నేను స్థూలుఁడనుగృశుఁడను'అని తలంచినట్లు, ఆత్మధర్మములగు ప్రేమాస్పదత్వము జ్ఞానాశ్రయత్వము మొదలగునవియు దేహాదులం దధ్యవసింపఁబడుచున్నవి.కావున రాజుదేహము ప్రియమని తోఁచుచున్నది. వాస్తవమునకు రాజసూకరాది దేహములకు భేదమే లేనందున వానికై మృత్యువును వారింపఁజూచుట వ్యర్థమే' యని చెప్పెను.

డియుఁ బయికి నవ్వుచు, లజ్జ మాలినయాకంసునిఁజూచి 'సౌమ్యా! నీకు మరణభయ మీపడఁతివలనఁ గలుగదుగదా. అశరీరవాణి నీకు భయముగలుగునని జెప్పినదియు నీకును భయముపుట్టియున్నదియు దీని పుత్త్రులవలననే. కాన యాపుత్త్రులను నీ కప్పగించెదను' అనెను. కంసుఁడు నా వసుదేవునిమాటల యభిప్రాయము నెఱింగి, తనచెల్లెలిని జంపక యురిగెను. వసుదేవుఁడు నందులకుఁ బ్రీతుఁడై యాకంసు నెంతయుఁ గొనియాడి తనగృహమును బ్రవేశించెను. అంత దేవకికిఁ జూలుగలుగఁగా సర్వదేవతాప్రాయ మైనయాముద్దియయు, నేఁటేఁట నొక్కొక్కరుగాఁ గొడుకుల నెనమండ్రను నొక్కకూఁతును గాంచెను. అంత వసుదేవుఁడు మొట్టమొదటఁ దానుగన్న గొమరునిఁ గీర్తిమంతుఁ డనువానిని, దానన్నృతమునకు మిక్కిలియు వెనుదీయువాఁడు గాన దుఃఖంబునఁ గంసునికిఁదెచ్చి యర్పించెను. రాజా! *సాధువులకు సైఁపరానిదెయ్యది? ఎఱుకగలవారికి నిష్టమెయ్యది? నీచులకుఁ జేయరాని దెయ్యది? ధృతిమంతులకు దిగవిడువరానిదెయ్యది? ఎద్దియుఁ గలుగదు. అట్లావసుదేవుఁడు సుఖము గలిగినను దుఃఖముగలిగినను సమముగాఁ బాటించి,యాడినమాటయందుఁ దప్పక నిలిచినయానిలుకడకుఁ గంసుఁడు మనంబున సంతుష్టుఁడై యల్లనవ్వుచు నతనితో 'ఈకుమారుని నింటికిఁ మరలఁ గొనిపొమ్ము. నాకు వీనివలన భయములేదు సుమీ;

*కిం దుస్సహం మసాధూనాం విదుషాంకి మపేక్షితమ్। కిమకార్యం కదర్యాణాం దుస్త్యజం కిం ధృతాత్మనామ్' అని మూలము.'విదుషాం కి ముపేక్షిత' మ్మనియు 'దుస్త్యజం కిం ఋతాత్మనా'మనియుఁ బాఠాంతరములు.ఋతాత్ములనఁగా సత్యశీలురు. సత్యసంధులకు విడువరాని దెద్దియని యర్థము.

మీ యిరువురకుఁ బుట్టు నెనిమిదవపుత్త్రునిఁగదా దైవము నాకు మృత్యువుగా విధించియున్నది? కాన వీనితోఁ బనేమి' యనెను. వసుదేవుఁడును వల్లెయని యాంగల్లాకుఁగొడుకునెత్తికొని యింటికిఁ బోయెను; కాని, యాకంసుఁడు మనస్సు కుదురులేని పాపాత్ముఁడు గాన నెప్పుడేమి మరలఁబడునో యని వాఁ డాడిన యాతిన్ననిమాటను బాటిగాఁ గయికొనక యులుకుచునే యుండెను. భగవంతుఁడగునారదుఁ డొకనాఁడు కంసునిగృహమునకుఁబోయి, వానితో 'ఓయీ! వ్రేపల్లెయం దున్ననందుఁడు మొదలయిన గోపకులును వసుదేవుఁడు మొదలయిన యాదవులును నీ యిరుదెఱఁగులవారి పడఁతులును మఱియు వీరలజ్ఞాతులును బంధువులును సుహృదులును నెల్లవారును దేవాంశజనితులగుటంబట్టి దేవతాసములు. కంసా! నీవును నిన్ననుపర్తించుచున్నవార లందఱును నసురసంపత్తిని బుట్టినవారు. కావున నే వీరు లోకమున కుపద్రవముఁ గావించుచున్నవారు. ఇట్లు భూమికి బరువై యుఱవడించు చున్నదుంపెగీం డ్లగుదైత్యుల నెల్ల భగవంతుఁ డగువిష్ణుఁడు వధింప నుద్యమించియున్నవాఁడు' అని చెప్పెను. ఆఋషి వెడలిపోఁగానే, కంసుఁడు యాదవులు దేవాంశసంభవులనియు, విష్ణుదేవుఁడు తన్ను వధించుటకై దేవకిగర్భమునను సంభవించుననియు నెఱింగి, కలఁగంబాఱి దేవకిని వసుదేవునిని బట్టి సంకెలలువైచి చెఱయందు బంధించి వారికిఁ బుత్త్రులు పుట్టుచునుండఁగా నొక్కొక్కనిఁ బట్టి, విష్ణు వనుజంకునను దన కరిష్టముగలుగుననను వెఱపునను, జంపుచువచ్చెను. దయమాలి యిట్లును జంపుదురా? యనవలదు. భూమియందురాజులు పరుల ప్రాణములనయినఁ గొని తమప్రాణములను బోషించు

కొను కఱకుబోయలవంటివారు గావున, తల్లిని దండ్రి నయినను నన్నదమ్ములనైనను, గన్నబిడ్డలనయినను, గారాపుఁజెలికాండ్ర నయినను, వేయేల! చిన్నికూనల నయినను దఱచుగాఁబట్టి, చంపుచుందురు. ఆకంసుఁడు తాను బూర్వజన్మమున విష్ణువుచే హతుండయిన మహాసురుం డగు కాలనేమి యగుటయు, నిట్టి జన్మమునఁబుట్టి యుండుటయు, నారదుని వాక్యమువలన నెఱింగి, యాదవులతోడివిరోధం బూని యదుభోజాంధకుల కధిపతియుఁ దనదండ్రియు నగునుగ్రసేనునిఁబట్టి యడంచిపుచ్చి తానే మిక్కిలియు బలము మెఱసి శూరసేనదేశమును బరిపాలించుచుండెను. ఇది ప్రథమాధ్యాయము.

---

భగవంతుఁడు దేవకీగర్భమును బ్రవేశించుట.
కంసుని కలఁత. గర్భస్థుఁ డగు హరిని
బ్రహ్మాదులు స్తుతించుట

శ్రీశుకుఁడు 'ఆకంసుఁ డంత ప్రలంబుఁడు, బకుఁడు, చాణూరుఁడు, తృణావర్తుఁడు, గర్దభాసురుఁడు, ముష్టికుఁడు, అరిష్టుఁడు, ద్వివిదుఁడు,పూతన, కేశి, ధేనుకుఁడు మొదలగువారును,మఱియు నితరులగు బాణుఁడు నరకుఁడు మొదలుగా నాసురప్రకృతులగు రాజులును, సహాయులుగాఁగూడి బలవంతుఁడయిన జరాసంధుని ప్రాపున నేపుమీఱి, యదువుల కెల్ల నుపద్రవము గావించువాఁడయ్యెను. ఆయదువు లట్లు పీడితులై వెక్కఁడ్రు తమ పట్లు వదలి, కురు పాంచాల, కేకయ, సాల్వ, విదర్భ, నిషధ, మగధ, కోసలదేశంబులం జొచ్చిరి. వారిలోఁ గొందఱు, కంసుని ననుసరించి కొలుచుచుండిరి. దేవకిబిడ్డలాఱ్వురు నట్లు కంసునిచేత

హేతులుకాఁగా, విష్ణువు నంశమే యా దేవకికి నేడవ గర్భముగా గలిగెను. ఆయంశమునే యనంతుఁ డందురు. ఆగర్భము దేవకికి హర్షమును, కంసునివలనఁ గీడుంబట్టి శోకమును, బెంచునదయ్యెను. భగవంతుఁ డగువిష్ణుఁడును, తన్నే దిక్కుగా నమ్మియున్న యదువులకుఁ, గంసునివలనఁ గలుగు భయమును, విశ్వాత్ముండు గాన దెలిసి యంతఁ దనయోగమాయం జూచి 'దేవీ ! కల్యాణీ ! గోసమూహములచేతను గోపకులచేతను వన్నెగులుకుచున్న వ్రేపల్లెకుఁ బొమ్ము. ఆనందునిగోకులమందు, వసుదేవుని భార్య రోహిణియనునది యున్నది. మఱియు నతని భార్యలు తక్కినవారు కంసునికివెఱచి యందుఁ బర్వతబిలాదుల వివరములందుఁ దాగియున్నవారుసుమీ! దేవకీ యుదరమందునాయంశము శేషుం డనఁబడియున్నది. అది యామగువ యుదరమునుండి సన్నికర్షించి (చక్కఁగా వెలువరించి) రోహిణీదేవి యుదరమందుఁ జొప్పింపుము. అంత నేను నాయంశభూతుఁ డగు శేషునితోడ, శుభాత్మురాలా ! దేవకికిఁ బుత్త్రుఁడనై పుట్టెదను. నీవు నీ నందునిపత్నియగు యశోదయందుఁ బుట్టఁగలవు. నీవు సమస్తములయిన కామితములను వరములను నొసంగుచుందువు. ఇంతేకాదు, సమస్తకామప్రదాయినులకెల్ల నీశ్వరివై యుండుటవలన మనుజులు నిన్ను నానావిధము లయిన కానుకలొసఁగియుఁ బూజలు గావించియు నర్చించుచుండఁగలరు. మఱియు నీకు నరులు భూతలమునఁ బెక్కులగు నామధేయములను స్థానములను గల్పింపఁగలరు. నీకు దుర్గ, భద్రకాలి, విజయ, వైష్ణవి,కుముద చండిక, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి,ఈశాన, శారద, అంబిక యనెడు నామములు గల్పింతురు. ఆ యనం

తుని నొకగర్భమునుండి సంకర్షించుటవలన సంకర్షణుఁడనియు, లోకులను రమింపఁజేయుటవలన రాముం డనియు, బలాతిశయమునుబట్టి బలభద్రుఁ డనియు, భూమియందు జనులాడుదురు' అని ఆయానతిచ్చెను. ఆయోగమాయయు నావచనమును వల్లెయని ప్రతిగ్రహించి యద్దేవునికిఁ బ్రదక్షిణము గావించి భూమికిం బోయి భగవంతుఁ డానతిచ్చినచొప్పునఁ గావించెను. యోగనిద్ర దేవకి గర్భమును రోహిణీదేవిని బొందింపఁగాఁ బురజనులు 'ఆహా! దేవకికి గర్భము జాఱిపోయినది' యని బిగ్గఱఁ జెప్పుకొనఁ జొచ్చిరి. అంత విశ్వాత్ముఁడగు భగవంతుఁడు,భక్తులకెల్ల నభయప్రదుండుగావునఁదన యంశ మగు శేషునితోఁగూడ, వసుదేవుని (పుత్త్రత్వమునకై యతని)హృదయమును దొలుతఁ బ్రవేశించెను. అతఁడును బరమపురుషుని తేజంబును దాల్చి సూర్యుఁడుంబోలె నెంతయుఁ దేజంబు ప్రకాశించుచుండెను; కాన, యిట్టివాఁడని యూహించుటకుఁగాని,కంసాదిప్రాణుల కెప్పటికిని జెనకుటకుఁగాని,యలవిగాక వెలయుచుండెను. అంత సమస్తజనంబులకు మంగళప్రదంబై, యప్రచ్యుతం బయినసంకల్పజ్ఞానము గలిగి సమస్తచేతనాచేతన శరీరకంబై యాత్మభూతంబై వెలుంగు భగవంతునిని, వసుదేవునికి హృదయస్థుం డగువానిని, దేవకీదేవి, మబ్బులయందున్న యానందకరుం డగుచందమామను దూర్పుదిక్కువలెనే * గర్భమునఁ దాల్చిన దయ్యెను. సర్వజగన్నివాసున

* ఇట పూర్వదిక్కునకుఁ జంద్రునికినింబోలె దేవకీవసుదేవగర్భములకును భగవంతునికిని సంబంధము దెలియునది.గర్భస్థుం డగుటచే మేఘస్థుఁడనియుపమ.

కును నివాసభూతయై యున్నయాదేవకీదేవి, యాకంసు నింటఁ జెఱఁబడియున్నకతమున నడంపఁబడిన యగ్నిజ్వాలవలెను, వేదవిరుద్ధజ్ఞానము గలమూర్ఖుఁడగువానియందున్ననిర్దుష్టమైన యుపనిషద్వాణివలెను, నంతగాఁ బ్రకాశింప నేరకుండెను. కంసుఁడంత నాకంజాక్షినిజూచి యాబిడ తన ప్రభచేఁ దక్కిన యంతరములనెల్ల జయించి, యున్నభవనంబును దన తేజంబున వెలింగించుచునుండుటనుజూచి, యాతెలినవ్వుగులుకు చిన్నారియున్న యక్కజంపుఁ బెంపునుగాంచి 'ఈబిడ యింతకుమును వెన్నఁడు నిట్టుండినది లేదు. కాన నాప్రాణములను హరించుటకై హరి దీనిగర్భనివాసమునుదప్పక పొందియున్నాఁడు. ఇది నిజము కాదేని యిది యిట్లు కాంతిదొలంకునా? ఆ విష్ణుఁడో దేవతలకార్యమునకు లోనయి యిట్లు గావించియున్నవాఁడు. వానిచేత నాపరాక్రమము గొట్టునడకుండు విధమున నేనిపుడు వానిని మట్టుపెట్టుటకయి చేయవలసిన కర్తవ్యమేమి? దీనిని జంపి నెమ్మదినుండు నంటినా? ఇదియాఁడుది; అందును జెలియలు; మఱియుఁ జూలాలు. ఇట్టిదానిని జంపితి నేని, యిది నాయశస్సును సిరిపెంపును ద్రుంచునే! మఱి యనుకూలం బగు నాయాయువుపెంపునుహరించునే! గర్భవతిని జంపువాఁడు బ్రతికియున్నను జచ్చినట్టె. మఱి యేపురుషుఁడు మిక్కిలియుఁ గ్రూరమయిన చేష్టితముతోడ వర్తించునో వాఁడు దేహాత్మాభిమానియే యగును. అట్టివానిని దేహమును వీడినపుడు మనుష్యులు శపింతురు. అంతట వాఁడును నంధతమస్సును బ్రవేశించుచున్నాఁడు. ఏమి చేయుదును? ఎటు సేయ నయితిగాకున్న దే'యనెను. ఇట్టు గర్భిణి యగుచెలియలిని దుదముట్టించు బెట్టిదంపుఁ దెంపరి

తనంబునుండి, దానినిజంప శక్తుండయ్యును నివర్తించి, వాఁడు హరితోడి వైరమును బయిుబయి సాధించువాఁడై యద్దేవుని జన్మము నెదురుచూచుచు వేచియుండెను. వాఁడు గూర్చున్నపుడును, బరుండునపుడును, నిలుచున్నపుడును, ఆహారములు గుడుచుచున్నపుడును, నిటునటుఁదిరుగఁలాడుచున్నపుడును, పానీయము లుద్రావుచున్నపుడును, హృషీకేశుండగు హరిని జూచుచుండెను. వానిక జగమంతయు హరిమయముగాఁదోఁచెను. అంత బ్రహ్మాదులు, మునులును దేవతలును దదనుచరులును వెంబడించిరా, ధిషణాత్మకుండును గర్భస్థుండు నగుశ్రీవిష్ణుదేవుని నిట్లని తటెసి స్తుతించువారయిరి.

{ బ్రహ్మేశానాది దేవగణములు దేవకిగర్భస్థితుండగు పరమపురుషుని స్తుతించుట. }

దేవతలు——*'సత్యవ్రతుండును, సత్యపరుండును, సత్యంబునకు యోనియు, సత్యంబునందు నిహితుండును, సత్యంబు

* 'సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం సత్యస్య యోనిం నిహితంచ సత్యే। సత్యస్య సత్య మృతసత్యనేత్రం సత్యాత్మకం త్వాం శరణం ప్రపద్యే' అని మూలము. దేవతలు పరమపురుషుని ప్రకృతిపురుషులకుఁ కలుగరాని గుణములతోఁ గూడినవానినిగా స్తోత్రము చేయుచున్నారు. సత్యవ్రతం=సత్యమైన సంకల్పముగలవానిని-చేసిన ప్రతిజ్ఞనునిజముగావించు వాడనుట. సత్యపరం= ఇట సత్యమనఁగా "యదన్యద్దేవేభ్యః ప్రాణేభ్యశ్చతత్సత్" "అథ యద్దేవాశ్చ ప్రాణాశ్చ తత్సత్యం తదేక యావాచావ్యాహ్రియతే సత్యమ్' అను శ్రుతినిబట్టి చిదచిదాత్మకమగు జగత్తు. అట్టి జగత్తునకు, పరం=విలక్షణుఁడైనవానిని, త్రిసత్యం=ప్రకృతిపురుషకాలములనెడు మూఁడును సత్యములు ఇవిగలవాఁడు త్రిసత్యుఁడు. ప్రకృతిపురుషకాలశరీరకుడనుట, ప్రకృతి మొదలగువాని మయమైన జగమంతయును తనకు నియామ్యమై (నియమమునకు లోనై) యుండుట

నకు సత్యంబైనవాఁడును, ఋతసత్యనేత్రుండును, సత్యాత్మకుం

వలన తన సంకల్పమున కెదురులేకుండుటచే సత్యవ్రతుఁడు(అనఁగా అడ్డులేని సంకల్పముగలవాఁడు) అని యర్థము. సత్యవ్రతుఁడు కావుననే సత్యస్యయోనిం=సత్యమునకు (చిదచిత్ప్రపంచమునకు)కారణమైనవానిని, సత్యేనిహితమ్=సత్యమందు (నిర్వికారమైన పరమాకాశమందు) అధిష్ఠించినవానిని, సత్యస్య సత్యమ్=ఇట సత్యమనఁగా 'సత్యేతిసాదితిసేతి సత్యన్యత్పరమ స్యథనామ ధేయం సత్యస్యసత్యమితి ప్రాణావై సత్యం తేషామేషసత్యమ్'అను శ్రుతిని బట్టి ప్రాణములనఁబడు జీవులు-జీవులకంటెను (ఒకప్పుడు జ్ఞానాదిధర్మములందును సంకోచము లేకుండుటనుబట్టి)నిర్వికారుఁడైనవానిని,ఋతసత్యనేత్రమ్=ఇట సత్యమనఁగా 'అసావాదిత్యస్సత్యమ్' అను శ్రుతిచెప్పిన సూర్యుఁడు. తత్సాహచర్యమునుబట్టి 'ఋత'శబ్దము చంద్రపరము కావలయును; కాన 'య ఆదిత్యేతిష్ఠన్ యశ్చన్ద్రమసితిష్ఠన్'ఇత్యాది శ్రుతులచెప్పిన చంద్రసూర్యులను నడపువానినని యర్థము. లేక 'చక్షుషీచన్ద్రసూర్యౌ'అను శ్రుతిచెప్పిన చంద్రసూర్యులు నేత్రములుగాఁగలవానిననియు నర్థము.సత్యాత్మకమ్=స్వరూపమందును నిర్వికారుఁడగువానిని-స్వరూపవికారముగల ప్రధానముకంటెవిలక్షణుఁడైన వానినమట.ఇట్టి,త్వాం=నిన్ను;శరణంప్రపన్నాః=శరణుఁజొచ్చితిమి-ఇందు 'త్రిసత్యమ్' 'సత్యస్యయోనిమ్' అని లీలావిభూతిమత్త్వమును "నిహితంచ సత్యే' అని నిత్యవిభూతిమత్త్వమును జెప్పఁబడినవి. ఈరెండును సత్యపరత్వమునకు-అనఁగా చిదచిద్విలక్షణత్వమునకు హేతు వని తెలియునది. వీరరాఘవీయము.

ఈశ్వరుఁడు తానుజేసిన ప్రతిజ్ఞను సత్యముగావించినాఁడని యుబ్బిన దేవత లతనిని సత్యస్వరూపునిఁగానే ప్రథమమున స్తుతించుచున్నారు. సత్యవ్రతం=సత్యసంకల్పుని, సత్యపరం=సత్యము పరమైన(శ్రేష్ఠమైన)దిగాఁ గలవానిని—అనఁగా అతనిని బొందుటకు సత్యమే శ్రేష్ఠమైన సాధనమనుట. త్రిసత్యం=మూఁడుకాలములందును—అనఁగా సృష్టికి మునుపును ప్రలయమునకు వెనుకను నడుమ స్థితిసమయమందును,తప్పక వర్తించునట్టివానిని-ఈత్రి

డునయిన నిన్ను శరణుఁజొచ్చితిమి. శరీరమనెడి యీయాదివృక్షమునకు * బ్రహ్మ మని పాదొక్కటి; సుఖదుఃఖము లని ఫలములు రెండు; సత్త్వరజస్తమోగుణము లని వేళ్లు మూఁడు. ధర్మార్థకామమోక్షములని రసములు నాలుగు; భూతిసూక్ష్మములని యూఁడలయిదు; ఊర్ములని స్వభావములాఱు; ధాతు

---

కాలవర్తిత్వము నే చెప్పుచున్నాఁడు—సత్యస్యయోనిం = 'సత్' అనఁగా పృథివి, అప్పు, తేజస్సు; 'త్య' అనఁగా వాయువును ఆకాశమును, సచ్చత్యంచ= సత్యం-అనఁగా భూతపంచకము. 'తత్సత్యమిత్యాచక్షతే' అని శ్రుతి. ఈ భూతపంచకమునకు, యోనిమ్=కారణమైనవానిని-దీనిచే సృష్టికిపూర్వమున్నవాఁడని చెప్పఁబడినది. సత్యేనిహితమ్=ఆభూతపంచకమందే అంతర్యామిత్వముచే ఉన్నవానిని-దీనిచేస్థితిసమయమందుండుటయుఁజెప్పఁబడినది. సత్యస్య సత్యం=ఆభూతపంచకమునకంటెపారమార్థికుఁడయినవానిని-అనఁగాఅవినశించినను నశింపకుండువానిని-దీనిచే ప్రలయమందును నుండువానిననుట. ఇట్లు త్రిసత్యత్వము ప్రతిపాదింపఁబడినది. ఋతసత్యనేత్రం='సత్యంచసమదర్శనం ఋతంచసూనృతావాణీ కవిభిఃపరికీర్తితా'అనిభగవంతుఁడే మీఁద వివరించునట్లు, ఋతమనఁగా సూనృతియగు వాణి. సత్యమనఁగా సమదర్శనము. ఈరెంటిని నడపువానిని, ఇట్లు సర్వప్రకారములచేత,సత్యాత్మకం=సత్యస్వరూపుండవగు నిన్ను శరణుఁజొచ్చితిమి. శ్రీధరీయము.

* సమష్టివ్యష్టి దేహరూపమైన సంసారమును వృక్షముగాను దాని ప్రకృతిని పాదుగాను శ్రీధరులు చెప్పియున్నారు. ఆఁకలి, దప్పి, శోకము, మోహము, జర, మృతి అని ఊర్ములాఱు. తోలు, నెత్తురు, కండ, మేదస్సు, మజ్జ, ఎముక, శుక్లము అని ధాతువులేడు. కాళ్లు, చేతులు, తల, కంఠము, ఱొమ్ము, కడుపు అని యంగములెనిమిది. ప్రాణము, అపానము, సమానము,ఉదానము, వ్యానము, నాగము,కూర్మము,కృకరము, దేవదత్తము, ధనంజయము అని ప్రాణములును ఉపప్రాణములును గూడి పది.

వు లని వైపారలేదు; హస్తపాదాదు లని యంగము లెనిమిది; రంధ్రములని తొంటలు తొమ్మిది; ప్రాణాదులని యాకులు పది. జీవపరమాత్ములనిపక్షులు రెండు. *చిదచిదాత్మకమయిన

---

* 'కార్యభూతమయిన యిట్టి సంసారవృక్షమునకుఁ గారణమును లయస్థానమును పాలకుఁడును నీ వొక్కఁడవే.' 'అందులకుఁ బ్రసిద్ధులు బ్రహ్మరుద్రాదులుగదా. నేనొక్కఁడనే యెట్లు ?' అందువేని నీమాయచేత నెఱుకమాలినవారే నిన్నట్లు బ్రహ్మరుద్రాది నానావిధములఁ గనుఁగొందురు. విద్వాంసు లన్ననో యట్లుచూడక యన్నియు నీవేయని తెలియుదురు. 'నేనకికొడుక నగు నన్నేల యిట్లు వర్ణించెద'రందువా? పరమాత్మా! అవబోధైకస్వరూపా! నీవు చరాచరాత్మకమగు జగమునకు సుఖము సేయఁగోరి సత్త్వగుణయుక్తములును, దుర్జనులకు నశుభములును సుజనులకు సుఖావహములు, నగు మూర్తులను దాల్చుచున్నావు. ఇంతేకానినీవొక్కనికినిబుత్త్రుఁడవుగావు. అరవిందాక్షా! మఱియు వివేకులగు కొందఱు తమచిత్తములను సమాధిచేత నీయందుఁ జొనిపి మాయామయమని తలఁపక మిక్కిలి యుత్కృష్టమైనదిగా నీపాదములను మనసున నెన్ని నీపాదకమలములనెడి యోడచే సంసారసాగరము నావుమాడయడుగంతదిగా సరకుసేయక తోడనే దాఁటి ముక్తినొందుదురు. ఇట్లు భక్తుల ముక్తికొఱకు సయితము నీవు మూర్తులను దాల్తువు. స్వప్రకాశా! వారికి నీ పాదములనెడి నావను దగ్గఱినంతమాత్రనే సంసారసముద్రమావుదూడయడుగంతటిది యగుటవలన నది యక్కఱలేకతమంతటనే,యితరుల కెంతమాత్రము దాఁటరాక జెట్టిదమైయుండు నాసముద్రమునుదాఁటి సర్వభూతములందునతిప్రీతిగలవారుగాన నమఃఇతనే యితరులునుదాఁటవలయునపుతలంపునసీపాదారవిందమనెడి యానావను నిచ్చటనే నిలిపి(నీభక్తిమార్గసంప్రదాయము నిచటఁ బ్రవర్తింపఁజేసి) యవ్వలిదరినిబొందినవారైరి. 'నాపాదములనెడి యోడచే దాఁటినవారగుట యె'ట్లందువా?నీవు భక్తులననుగ్రహించువాఁడవుగదే. 'వివేకులు ముక్తులేకదా! వారికి నన్ను భజింపనేల' యందువా? మేము ముక్తులని తమ్ముఁదలంచి నీయందు భక్తిమాలి దానివలన నపరిశుద్ధమైనబుద్ధులుగలవారు

యీజగత్తునకు జన్మకారణమును ప్రలయస్థానమును స్థితిహేతు

బహుజన్మములుతపముచేసి యెంతోకష్టమున మోక్షమునకు దాపయిన సత్కులము తపస్సు శ్రుతము మొదలయినయుత్తమపదముల నెక్కియు నీచరణారవిందములను బాటిగాఁగొనమిచే విఘ్నములచేఁ గడ్పడుదురు. మాధవా! నీయందుఁ బ్రేమగలిగియుండు నీభక్తులు ముక్తిమార్గమునుండియెంతమాత్రము భ్రంశమునొందరు. మఱి నీవు రక్షించుచుండఁగా నిర్భయులై తమకువిఘ్నహేతువులగువారి తెలమిన్నల తలలపై ద్రొక్కి నడతురు. (అనఁగా విఘ్నములనెల్లజయింతురు.) నీవు శరీరులనుబాలించి, వారికర్మములకుఫలసిద్ధిగలిగించునట్టిదియుశుద్ధసత్త్వమయమయినదయునగుదేహమునుగయికొనుచున్నావు. జనులట్టి దేహము నాశ్రయించియే వేదములు క్రియలు తపస్సులు సమాధులనెడు చతురాశ్రమధర్మములచేత నిన్నుఁబూజింప నేర్చుచున్నారు. నీవట్టి దేహమునుబరిగ్రహింపనిచో వారాకర్మములచే నిన్నుఁబూజింపనేరరు; కాన కర్మఫలసిద్ధియు నొందఁజాలరు. ఓధాతా! సత్త్వమయమయిన యీనీశరీరము లేకపోవునేని యజ్ఞానమును దానిచేనగుభేదమునుదూలించిపుచ్చునట్టియపరోక్షజ్ఞానమును లేకయెపోవును. అంత జడములయిన బుద్ధ్యాదులకుఁ బ్రకాశము గలిగించునట్టిసర్వసాక్షియుఁ బరిపూర్ణుండునగునీవు సాక్షాత్కరించుటలేక 'యతనిని సంబంధించినవై యీబుద్ధ్యాదిగుణములు ప్రకాశించుచున్నవి. అతఁడు గుణసాక్షి. అతఁడుబుద్ధ్యాదుల నారోహించుటవలనబాహ్యములగుగుణమయప్రపంచము ప్రకాశించుచున్నది'యని యిట్లనుమితుఁడవు మాత్రమేయగుదువు. శుద్ధసత్త్వదేహమును దాల్చితివేని యపుడు నిన్ను సేవింపఁగాఁ దదాకారమయిన యంతఃకరణమందు నీప్రసాదమువలన సాక్షాత్కారము గలుగవచ్చును. సర్వసాక్షివిగాన నీతత్త్వము మనస్సునకును వాక్కునకును గోచరమయినది. కాన యిట్టి నీదు నామరూపములను కేవలము భక్తులకు భజింపఁ దరమగునేకాని గుణకర్మజన్మములనుబట్టి నిరూపించి తెలిసికొన శక్యము గాదు. అయిన నుపాసకు లుపాసనాది కర్మములందు నిన్ను సాక్షిగాఁ జూచుచున్నారేకదా—శ్రీధరీయము.

వును నీవొక్కఁడవే. ఇట్లు నీవు జీవునకు వేఱైనవాఁడ వయ్యు నీ మాయచేత మనస్సు తెలివిదూలి యున్నయజ్ఞులు నిన్నుఁ బెక్కుజీవరూపముల నున్నవానిఁగాఁ గనుఁగొందురు; కాని విలక్షణమయిన నీయీ పరస్వరూపమును దెలియరు. జ్ఞానస్వరూపుండ వగునీవు చరాచరాత్మకమయిన జగంబుక్షేమము కొఱకు శుద్ధసత్త్వమయములయి సాధువులకు సుఖావహములును దుర్జనులకు నశుభకరములు నగు నవతారరూపములను మాటిమాటికిఁ దాల్చుచుందువు. అంబుజాక్షా! నీ యవతార రూపములయం దాసక్తులయినపురుషులు కొందఱు శుద్ధసత్త్వమయ మగు నీదివ్యమంగళవిగ్రహమును సమాధిచేతఁ దమచిత్తములను జొనిపి సదాచార్యుఁ డను కర్ణధారుఁడు సంతరించిన నీ పాదకమలములనెడియోడచే సంసారమహాసముద్రమును నావు దూడయడుగంతగాఁగొని సుఖముగా దాఁటుదురు. నిత్యవిభూతియుక్తా! వా రట్లువలీలఁ దాము దాటుటమాత్రమే కాదు. సంసారసాగరము భయంకరమై యెంతమాత్రమును దాఁటఁగూడనిదై యున్నను వా రనల్పం బగునీయందలి భక్తివలన నీ పాదకమలపోతముచే దానిని దాము దాఁటుటయేకాక 'భగవంతుని పాదారవిందములే సంసారసాగరమును దాఁటుటకు నావ'యని తక్కినవారికిని జూపి నీపదమును బొందుచున్నారు.

---

* ఈశా! అసంసారివగు నీజన్మమునకుఁ గారణము క్రీడయొక్కటితప్ప మఱిద్దియు మాకుఁ దోఁచకున్నది. నిత్యముక్తా! జీవాత్మయందు నుత్పత్తిస్థితిలయములు నీయందలి యవిద్యచేత నేకావింపఁబడినవికాని యథార్థములుగావు. కాన నిత్యముక్తుఁడవగు నీకు జన్మమునకుఁ గారణములేదని చెప్పవలయునా?—శ్రీధరీయము.

ఇట్లు నీకు సజ్జనుల ననుగ్రహించుటయే స్వభావముకదే! అరవిందాక్షా! వేఱుకొందఱు తమ్ముఁ దాము విముక్తులమని వృథాభిమానము గలిగి నీయందు భక్తియించుకయు లేనందునఁ దమ బుద్ధు లపరిశుద్ధములై యుండగాఁ బూర్వసుకృతవిశేషమున బ్రాహ్మణాదిరూపము లగునుత్తమము లయినజన్మపదముల నెంతో ప్రయాసమున నెక్కియు నీపదారవిందముల నుపాసింపనందున దానికిం గ్రిందుపడి మరల నీచజన్మముల నొందుచున్నారు. మాధవా! నీయందు భక్తిరూపం బగుప్రేమగలిగియుండునీదుభక్తులు భక్తిరహితులుం బోలె, నొకప్పుడును మార్గమునుండి భ్రంశమునొందరు. ప్రభూ! నీవు నలుగడల రక్షించుచుండుటవలన వారు నిర్భయులై విఘ్నసేనాపతి తలలపయిని ద్రొక్కుచుఁ జరించుచుందురు; కాన జీవించియుండునపుడు విఘ్నములచేతఁ దమభక్తియోగ మించుకయుఁ గొట్టువడనివారై నిన్నుఁ బొందుదురు. నీవు పాలించుట యను నెపముపెట్టుకొని రజస్తమస్సంబంధములేని శుద్ధసత్త్వమయశరీరమును గయికొనుచున్నావు. కాని నిజముగాఁ బాలించుటకుఁ గాదు. నిజముగాఁ బాలించుటకేని సంకల్పముచేతనే యట్లు పాలింపనేరవా? శరీరమెత్తెడి ప్రయాస మేల? కనుక నట్టి శరీరమును బరిగ్రహించుట ముఖ్యమగు ప్రయోజనము శరీరులు నిన్నుపాసించి శ్రేయమునొందుటయే కాని మఱేమియుఁ గాదు. ఎట్లనఁగా నీవట్టి శరీరమును దాల్చిననే జనులు నిన్నారాధించుటకును వైదయాగనిరూపమునాఁది యజ్ఞాదిక్రియలచేతను, ఉపాసనములచేతను, ఉపాసనానుగుణమయిన యమనశనాదితపములచేతను వీనిచేతఁ గలుగు సమాధిచేతను, నిన్ను నారాధింపనేర్చువారగు

దురు. లేనిచో నారాధింపఁ దగిననీరూపమును దెలియనందున నారాధింప నేరకుందురు. కాన యారాధకుల ననుగ్రహించుకొఱ కే నీవు శరీరము నాశ్రయించుచున్నావు. విశ్వకారణభూతా! నీవు కయికొనియున్న యీశరీరము శుద్ధసత్త్వమయమైనది. (గాన మణిబరణి తనలోనున్న బంగారమునుంబోలె) తనయందలి యాత్మస్వరూపమును బ్రకాశింపఁజేయునదై యున్నది. దీనిని జూచి రేని ధ్యానించువారికిఁ దమ యాత్మస్వరూప మిట్టిదని తెలియును; గనుక, నీజ్ఞానముచేతఁ దమ్ము 'నేను దేవుఁడను మనుష్యుఁడ' నని నానాభేదములచేఁ దప్పుఁ దలంచుట లెల్లఁ దొలంగిపోవును. ఇట్టి యసాధారణమయిన విగ్రహమును నీవు గయికొనకపోయి తివేని, యంత నాయాపురుషుఁడు కాలము కర్మము మొదలగు కారణములలో, నేదానినిబట్టి సత్త్వాదిగుణములయం దేగుణము తనకు వికసించునో యాగుణము కార్యములగు దేవమనుష్యాది రూపములచేత నిన్ను నితరులయిన దేవమనుష్యాదులపాటివా నినిగా నూహించునేకాని, కార్యమునకుఁగారణభూతుండనియు దేవమనుష్యాదులకు విలక్షణుండనియుఁ దెలియనేరఁడు. నీవు శరీరమును గయికొందువేని, యపుడు నీదివ్యవిగ్రహమున కసాధారణములై దేవమనుష్యాదులకును గలుగరానివై యుండు నీగుణచేష్టితములను గన్నారఁజూచి వానినిబట్టి నిన్ను దేవాదులవంటివాఁడు గాని (విజాతీయుఁ డైన) పరమపురుషుఁడని తలంచుచు ధ్యానముచేయుదురు. 'నేనును దేవాదులకుఁగల యట్టి దేహము గలవాఁడనేకదా' యందువేని వారి స్వభావముకంటె నీస్వభావము వేఱు. నీస్వభావము వారిస్వభావమువలె నింద్రియ గోచరముగాక వేదవాక్యములచేతను మనస్సుచేతను ననుమా

నింపఁదగినదై యున్నది. ఇట్టి స్వభావముగలిగి సర్వసాక్షివై యుండు నీగుణములును గర్మములును జన్మమును నామరూపములును నాయితరుల గుణకర్మాదులవంటివిగా నెంతమాత్రము నిరూపింపఁ దగదు. ఇట్లు దేవాదులకు విలక్షణములగు గుణకర్మాదులతోఁ గూడియున్నవాఁడవయ్యును వైదికములగుయజ్ఞాదికర్మములందుఁ బ్రస్తుతులైన యగ్నీంద్రాదిదేవతలవాటినామరూపములు గలవానినిగా వ్యవహరించెదరు. కాని యాదేవతలకు నీవంతరాత్మభూతుఁడ వగుటచే వారినామరూపములు నీవియే యగుననుబుద్ధిచేత వారి నామరూపములతోఁ గూడిన వానినిఁగా నయితము నిన్నారాధింపవచ్చునని యట్లు తలంచి వ్యవహరించుచున్నారు. ఇంతేకాని వాస్తవమునకు నీకట్టినామరూపములే కలవనికాదు. పురుషుఁ డెవ్వఁడు మంగళకరములయిన నీ నామరూపముల నొకరు చెప్పుచుండఁగా వినుచును, నొకరు వినఁగాఁ జెప్పుచును, జెప్పువారును వినువారును లేనిచోఁ దనంతట నీనామములస్మరించుచును, నీరూపములను జింతించుకొనుచును, వైదికక్రియలందుఁగాని యాసన విహారణభోజనాది లౌకికకార్యములందుఁ గాని నీ చరణారవిందములయందే మనస్సును బొందుపఱిచియుండునో, యట్టివాఁడు సంసారముపాలు గాఁడు. ముక్తినే పడయును. ఆశ్రితార్తిహరా! హరీ! భాగ్యవశమున నీశ్వరుఁడ వగు నీవు జన్మించుటచేత నీపదభూతమైన యీభూమికిఁగల భారము దూలినట్టైచుమీ. ఔరా! ఏమిభాగ్యము. ధ్వజవజ్రాంకుశాదిశుభచిహ్నములచేతఁ జెలువుగులుకుచున్నని యడుగు లిడుటచే బెడఁగై నీదయను బడసియున్న యీ భూమి నిత్యవిభూతియుంబోలె మాకుఁ గనుపట్టుచున్నది.

అభయా! సంసారులకు జ్ఞానవిరోధిని యైనప్రకృతిచేత నీశరీరమైన జగత్తునకుఁగలుగునుత్పత్తిస్థితిలయవికారములు దానికాశ్రయుఁడయి యంతరాత్మయై యున్ననీయందును గావింపఁబడిన వగుచున్నవి. నిర్వికారుఁడవైన నీయందీవికారములు గనఁబడుట నీ వినోదమునకే కదా! ఇట్లే కర్మమూలమయిన పుట్టుక లేని నీకు పుట్టుక గలుగుటకుఁ గారణ మావినోదము దప్పఁ దక్కిన కారణమేదియుఁ గలుగదే కదా యని నేను దలపోయుచున్నాను. ఇంతేకాక మత్స్యము, అశ్వము, కూర్మము, వరాహము, నరసింహము, హంసము, రాజన్యుఁడు (రాముఁడు) విప్రుఁడు దేవతలు మొదలగువానియందవతారములెత్తిమమ్మును ముల్లోకములను దొల్లి గాపాడినవిధముననే యిపుడును భూమి భారమును బోఁగొట్టుము. యదూత్తమా! నీకు వందనము' అని స్తుతించిరి. అంత దేవకినిజూచి 'తల్లీ! మాకుఁ బెంపుగలుగుకొఱకు భగవంతుఁడగు పరమపురుషుఁడు తన సంకల్పాంశముచేత నీయుదరమును బ్రవేశించియున్నాఁడు. కంసుఁడికఁ జావనేయున్నవాఁడు గాన, వానివలన నీకు భయ మెంతమాత్రము గలుగదు చుమీ. నీబిడ్డఁ డితఁడు యదువులనెల్ల రక్షింపఁగలఁడు' అనిరి. దేవతలిట్లు, పరమపురుషునిరూపము తమకుఁ దెలిసినట్టి రీతిని, దమమదికోలఁదిని, నద్దేవుని స్తుతించి యంత బ్రహ్మరుద్రులను మున్నిడికొని దివంబునకుఁ బోయినవా రయిరి. ఇది ద్వితీయాధ్యాయము.

---

(శ్రీహరి నిజరూపమున నవతరించుట, దేవకీవసుదేవస్తోత్రము. వసుదేవుఁడు కృష్ణుని వ్రేపల్లెకుఁ గొని పోవుట.)

శుకుఁడు—అంత జన్మరహితుండగు భగవంతుఁడవతరించు కాలము సమస్తగుణములతోఁ గూడినదై యెంతయు సొంపు వెంపారుచు నరుగుదెంచెను. భగవంతుని జన్మనక్షత్రమగు రోహిణియుఁ బొడతెంచెను. అపుడు తక్కిన నక్షత్రములును గ్రహములును దారకములును ననుకూలములై వెలయుచుండెను. మఱియు దిక్కులన్నియుఁ బ్రసన్నములయ్యెను. ఆకాశమందు నక్షత్రగణములు నిర్మలములై పొడ సూపుచుండెను. పుడమియందుఁగల పురములును గ్రామములును గొల్లపల్లియలు నన్నియు మిక్కిలియు మంగళమునఁ దళుకొత్తుచుండెను. నదులు తేటజలములతోఁ బ్రవహించుచుండెను. మడుఁగులు తామరతంపరలసిరి పొంపిరి వోవుచుండెను. వనపంక్తులయందలి వృక్షముల పూగుత్తులయందుఁ,బులుఁగులు కొలకొలమను నెలుంగులును దుమ్మెదకదుపుల జుంజుమ్మను నినాదములును వీనులకు విందుసేయుచుండెను. గాలియు దుమ్మించుకయు లేక కమ్మని మేలితావులను గొల్లలాడి కయికొని మేని కింపయినసోఁకున హాయిగా వీచుచుండెను. మునుపు పొనుఁగుపడి యున్నత్రివర్ణములవారి యగ్నులును నపుడు మిక్కిలియు జ్వలించుచుండెను. సత్పురుషులయు సురలయు నుల్లంబులు గలంకదేఱి యుల్లసిలుచుండెను. భగవంతుఁ డుదయించుచుండునపుడు మింట దేవదుందుభులు మొరసెను. కిన్నరులును గంధర్వులును బాడిరి. సిద్ధులును జారణులును స్తుతులుసేసిరి. విద్యాధరులును నప్సర



1669. శ్రీకృష్ణావతారము.

సలు నాడిరి. మునులును దేవతలును ముదము నెమ్మనంబులఁ బొదలఁ బువ్వుల సోనలను గురిసిరి.

## శ్రీ కృ ష్ణా వ తా ర ఘ ట్ట ము.

అర్ధరాత్రమునఁ జిమ్మచీఁకటి నలుగడలఁ గ్రమ్మియుండఁగా జనార్దనుండు జన్మించుసమయమున మేఘము లల్లల్లన సముద్ర ఘోషముంబోలె నుఱిమెను. దేవతాసమానురాలగు దేవకియందు, జ్ఞానశక్తిబలాదులగు సమస్తకల్యాణగుణముల కాశ్రయుండగు విష్ణుండు, పూర్వదిక్కునందుఁ బదియాఱుకళలతోఁ గూడిన పూర్ణచంద్రుండునుంబోలె నావిర్భవించెను. తామరస పత్రములవంటి విశాలనేత్రములును జతుర్భుజములును శంఖ చక్రగదాద్యాయుధములును గలిగి యింతకు మునుపు చూచి యెఱుఁగనిరూపమున వింతలు గొలుపుచున్న యాయద్భుత పుఁ జిన్నిబాలుని వసుదేవుఁడు చూచెను. మఱియు నబ్బాలకునకు వక్షంబున శ్రీవత్సం బనుమచ్చయు, నఱుతఁ గౌస్తుభం బనురత్నంబును, నడుమఁ బీతాంబరంబును వెలయుచుండెను. అతఁడు దట్టమై కారుకొన్న మేఘముంబోలె నల్లని మిసిమిచాయ దేలఁ కుచుండెను. మఱియు మిక్కిలియు వెలపొడుగయిన వైడూర్యాదిపణులు పొదిగినకిరీటమును గుండలములయొుఁ గాంతు లతని నుదుటియలకలగుబురు నలమికొని కొమరుచూపుచుండెను. బలువైన మొలనూలు, బాహుపురులు, కంకణములు మొదలయిన యాభరణముల రుచులచే నతఁడు మిక్కిలియు వెలుంగుచుండెను. అపుడావసుదేవుఁడు వింతపాటుచేఁ గన్నులంతయుఁ దేఱ కొనవిచ్చి యాకన్నచిన్నిరిసుతుని శ్రీహరినిఁ గఱవునేఱఁ

జూచి యాకృష్ణావతారమహోత్సవము వలనిసంబరమున మునింగి యపుడే స్నానముగావించి ముదంబుపొదల బ్రాహ్మణులకుం బదివేలగోవులను దనమనస్సున దారవోసెను. అంత నతండు నిజప్రభాపటలముచే నాపురిటింటి నంతయు వెలింగించుచున్న యాచిన్నికుమారునింబరమపురుషుండనినిశ్చయించి యంగనుల కంసునివలని భయముడించి, బుద్ధికెదిట నూలుకొలిపి,వినయంబున నంగములను ముడిఁచి, యతని ప్రభావంబెఱింగి, యిట్లని స్తుతించెను.

{నిజస్వరూపంబున నావిర్భవించిన భగవంతుని వసుదేవుఁడు స్తుతించుట.}

వసుదేవుఁడు—నీవు * ప్రకృతికంటెఁ బరుండును, కేవల జ్ఞానానంద స్వరూపుండును సమస్తబుద్ధి వృత్తుల నొక్కుమ్మడిఁ గనుఁగొను సర్వసాక్షియునగు సాక్షాత్పరమపురుషుఁడవని దెలియును; అట్టి ప్రకృతిపరుండవగు నీవే, సృష్టికిఁ బూర్వముకారణములై యుండి నీకు †శరీరభూతమైన మహత్తుమొదలుగాఁ బృథి

*ప్రకృతికంటె పరుండనుటచే అచేతనప్రకృతికి విలక్షణుఁడనియు, 'సర్వబుద్ధిదృక్' అని సర్వసాక్షిత్వము చెప్పుటచే సంకుచితజ్ఞానులగు బద్ధజీవులకంటె విలక్షణుఁడనియు తెలియునది.

† ఇందు ముక్తజీవులకంటె విలక్షణుఁడగుట చెప్పఁబడినది. ముక్తులు సంసారదశయందు వికృతి నొందియుందురు. ఈశ్వరుఁ డొకప్పుడును వికారమునొందక యుండుటచేవారికి విలక్షణుఁడనుటకు మొదట'సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ' 'విజ్ఞానమానన్దమ్' 'యతోవా ఇమానిభూతాని' అని శ్రుతులయర్థము చెప్పఁబడెను. ఇందు 'తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్' 'సత్యంచానృతంచ సత్యమభవత్' అను శ్రుతుల యర్థము (అనఁగా బ్రహ్మము విచిత్రమగు చిదచిద్రూపమున వికారమునొందినను నిరస్తనిఖిలదోషమును,అపరిచ్ఛిన్నజ్ఞానానందమును, ఏకస్వరూపమునైయే యున్నదని) ప్రతిపాదితము.

వివఱకుఁగల రూపములతోఁ బరిణమించు ప్రకృతిచేతఁద్రిగుణ పరిణామరూపమగుటచేఁద్రిగుణాత్మకమై స్థూలచిదచిన్మయమై యున్న యీజగత్తును సృజించి, పిదప దానిస్థితికొఱకు నందు (సంకల్పరూపంబగు జ్ఞానంబుచేఁ) బ్రవేశించియుఁ దానిని బ్రవేశింపనివాఁడుంబోలె (తద్గతములయినవికారములచేత స్పృశింపఁబడనివాఁడుంబోలె) భావింపఁబడుచున్నావు. * ప్రకృతివికారములయిన మహత్తు అహంకారము తన్మాత్ర లనెడియీయేడు

* (జగద్రూప)కార్యమందును బ్రవేశించియుఁ గార్యమునకు మునుపే దానికిఁ గారణమైయుండుట యెట్లు? కార్యమును జొచ్చినపిదపఁ దద్గతవికారములచేత స్పృశింపఁబడకుండుట యెట్లు? అని శంకరాఁగా దానికి మహత్తు మొదలుకొని పృథగ్వివఱకును గల యచేతనప్రకృతినిదృష్టాంతీకరించి యుపపాదించుచున్నారు. ప్రకృతి వికారములగు మహదాదులు పరస్పరము గలియకుండినందునను దానిచే వానిశక్తులును ఒక్కటిగాఁ గూడకుండినందునను నవి యన్నియుఁగూడియు తమశక్తులనెల్లఁగూర్చి పుట్టింపవలసిన బ్రహ్మాండమునుబుట్టింపలేకుండెను.ఒక్కొక్కటి తనంతటను దన శక్తిమాత్రముచేతను బ్రహ్మాండము పుట్టింపనేరదు.కనుక నీశ్వరుఁడు వానియందుఁ దాను బ్రవేశించి పంచీకరణమనెడి యొక విధమయిన సమ్మేళనము వానికిఁ గలిగింపఁగానంతటనవి యన్నియుఁజేరి బ్రహ్మాండమును బుట్టించెను.పిదప బ్రహ్మాండము లోపలనుగూడ వర్తించుచు దానియందుఁ బుట్టినవానివలెఁ గనుపట్టుచుండినను,నవి దానికిమునుపే యున్నవిగాన యందుఁబుట్టినట్లు తలంపరాదని దృష్టాంతము. ఇందులకు 'హన్తాహమిమా స్తిస్రో దేవతా : అనేనజీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి, తాసాంత్రివృతం త్రివృతమేకైకాం కరవాణి, నామరూపే వ్యాకరోత్, త్రివృతం త్రివృతమేకైకా మకరోత్' అని భగవదనుప్రవేశ త్రివృత్కరణములును, 'మహదాద్యావిశేషాన్తా హ్యణ్డముత్పాదయన్తి తే' యని బ్రహ్మాండోత్పాదనమును బ్రమాణములు.

పదార్థములును, వీని వికారములయిన యాకాశాది స్థూలభూతములును, నధిదేవతలతోఁగూడిన యింద్రియములును, మొదట నొకటితో నొకటి గూడికలేక, వేఱువేఱనుండుటచేఁ దమతమశక్తులను బెరయక భిన్నములై యుండుటవలన బ్రహ్మాండమును బుట్టించుటకుఁ దగినసామర్థ్యము లేకుండెను. అంత (భగవంతునిపంచీకరణము మూలమున)నవి యొండొంటితోఁగూడి నీకు శయనస్థానం బగు బ్రహ్మాండమును బుట్టించుచున్నవి గదా. ఇట్లవి చక్కఁగాఁ బ్రహ్మాండమునుబుట్టించి యాయండములో వర్తించుచు నందుఁ బుట్టినవియుంబోలెఁ గనుపట్టుచున్నవి. కానియవి యండముపుట్టుటకుమునుపే యుండి యుండుటవలన దానియందు వానికిఁ బుట్టుక గలుగనేరదు.* ఇట్లె నీవు దేవమనుష్యాది పదార్థములందును బ్రవేశించియున్నను, బుద్ధిచేత నిరూపింపఁ

*మహదాదులు అండములోని దేవమనుష్యాది భావములం దనువర్తించుచున్నను దానికిమునుపే తత్కారణముగా నుండుటయు, దానియందుఁ బుట్టుకనొందకుండుటయుఁ, బోలి నీవును జగత్తునం దనుప్రవేశించియు, దానికిమునుపే కారణముగా నుండుటయు, దానివికారములచేత స్పృశింపఁబడకుండుటయుఁ గలిగియున్నావని యిట దృష్టాంతదార్ష్టాంతికముల సమన్వయము తెలియునది. జగద్గత వికారములు భగవంతునిఁ బొందవనుటకు 'అనావృతత్వాద్బహిరన్తరంన తే సర్వస్య సర్వాత్మన ఆత్మవస్తునః' అనిహేతువు చెప్పఁబడినది. 'సర్వస్య' అనుటచే సమస్తమును నీవనుట స్వరూపముచేతనా? యన్నచో గాదు. శరీరగోచర బుద్ధిశబ్దములు శరీరపర్యంతము చెల్లునుగాన సమస్తమును శరీరముగాను తాను శరీరిగాను నుండుటవలన శరీరశరీరిభావముచే సమస్తమును నీవేయని తెలుపుటకై 'సర్వాత్మనః' సర్వశరీరకుఁడవు అనఁబడెను. అప్పుడు శరీరగతములగు వికారములు నిన్నుఁ బొందవా? యన్నచో 'ఆత్మవస్తునః' అన్నాఁడు. అనఁగా శరీరగతములైన బాల్యాది వికారములు తదాత్మకుఁ బ్రస

దగినస్వభావములుగలవై యింద్రియములకు గ్రాహ్యములై గుణకార్యములైయున్న దేహాది పదార్థములతోఁ గూడియున్నను, నాదేహాది పదార్థములకుఁగల వికారములచే స్పృశింపఁబడకయే యుందువు. ఎట్లన (సమస్తజగత్కారణుఁడవుఁ గాన జగత్తు) సర్వమునునీవే, యగుదువు; (అట్లగుటచేత స్వరూపముచేతఁగాదు) సమస్తమును శరీరముగాఁగలవాడవు. (గాన సర్వము నీవగుదువు.)శరీరగతములగు వికారములు నిన్నుఁబొందవు. ఏలన, నీవాత్మవస్తువవు. ఇట్లు సమస్తమునకాత్మభూతుఁడవగుటచే నంతటను నపరిచ్ఛిన్నమయినవ్యాప్తి గలిగియు, నిత్యమును నేయావరణమును లేక, యసంకుచితమైనజ్ఞానముతోఁగూడియు,నుంధువుగాన నీకులోను వెలియుఁగలుగవు. కానయొకదాని

---

త్తింపని విధమున నీ వాత్మవస్తువగుటచే నీ కావికారములు ప్రసక్తింపవని భావము. అనఁగా ఒకదేహమందుఁ ప్రవేశించుటచే నాత్మకుదానివికారములుప్రసక్తించుననఁగా నాత్మయా దేహవికారములను దనవిగాభ్రమించుటయని తెలియవలయును. ఇట వికారస్పర్శమునకు మూలము భ్రాంతియే; కాని నిజముగా నది కలుగదు.జీవుఁడు దేహములోన తన స్వరూపమడఁగి యుండుటచే నాదేహమే తానుగాను, తనజ్ఞానము సంకుచితమై యుండుటచే నాదేహగతములగు బాల్యాదులు తనవిగాను భ్రమించుచున్నాఁడు. ఈశ్వరునికో స్వరూపము అపరిచ్ఛిన్నమైన వ్యాప్తియు,జ్ఞాన మసంకుచితమైన ప్రసారమును,గలిగి లోననియు వెలియనియు లేకుండునుగాన ఒకవస్తువులోఁ జొచ్చినను స్వరూప మపరిచ్ఛిన్నమగుటచే దాని వెలుపలనుగూడ నుండునుగాన యదియే తానని దలఁపఁడు. మఱి యావస్తువు వికారములను జ్ఞానము అసంకుచితమగుటచేఁ దనవిగా భ్రమింపఁడు. కాన యావికారము లతనిని స్పృశింపవు. భ్రాంతివలననేకదా వికారస్పర్శము. అది లేదుగాన యీశ్వరునకు నాస్పర్శమును గలుగదని తెలియునది.

లోనం బ్రవేశించినంతమాత్రన యంతటిలో నడఁగి తద్గత వికారములు నిన్నుస్పృశించుననుప్రతీతి నీకుఁగలుగదు. * భగవంతుఁడవగు నీవు నీయాథాత్మ్యము (కలరూపు) నెప్పుడును దెలిసియుందువు; కాన, నీకంటె వేఱయినవియు నింద్రియములకు గ్రాహ్యములును గుణకార్యములు నగు దేవాదిభాసములయందునీవంతరాత్మభూతుఁడవయి యుండియు నిన్నునిరస్తనిఖిల దోషుండవగుటచే నపరిచ్ఛిన్న జ్ఞానానంద స్వరూపునిఁగను నేకరూపునిగను నిర్వికారునిఁగను వేఱుపఱుచుకొనియెదవు. జీవునికి 'నేను బాలుఁడను, వయసు కాఁడను, దేవుఁడను, మనుష్యుఁడను' ననెడి యధ్యవసాయ మున్ననో వివేకులగువారు నిషేధార్థమును వాదరూపముగా నుపయోగించు కొనుటెకాని యది యబాధితము కాదు. ఏలనఁగా నాత్మయాథాత్మ్యమును దెలిసినవాఁడు దిగవిడిచిన యబాధితమగు నధ్యవసాయమును దేహాత్మభ్రాంతిగల పురుషుఁడు తనకుహిత మను బుద్ధితోఁ గయికొను చున్నాఁడు. † విభూ ! సంకల్పముతప్ప మఱియొక వ్యాపారము లేనివాఁడును,

---

* నీ వెప్పుడును నీయాత్మయాథాత్మ్యమును ప్రత్యక్షీకరించుచుందువుగాన నీకు దేహాత్మభ్రాంతి గలుగదు. దానివలన శరీరభూతమైన యచిత్తుయొక్క వికారములుఁ గలుగవు; కాన, జగత్తును బ్రవేశించియుఁ బ్రవేశింపనివాఁడవే యగుదువు గాన జగదుత్పత్తికిఁ బూర్వము దానికిఁ గారణమవై నిర్వికారుఁడవై నెలకొనియుండి నీ వీజగమును సృజించితివని సముదాయార్థము.

† కారణము కార్యములుగా వికారములొందుచున్నది. కాఁబట్టి కారణము కార్యరూపములగు వికారముల కాశ్రయమై యుండును. ఈశ్వరుఁడు జగదుత్పత్త్యాది కార్యవికారముల కాశ్రయుఁడనుటచేఁ జగత్కారణుఁ డగుచున్నాఁడు. నిర్వికారుఁడగు నీశ్వరునందు వికారాశ్రయత్వరూప మగు జగత్కారణత్వము పొసఁగునా యనుశంక కిందు పరిహారము చెప్పఁబడుచు

సత్త్వాదిగుణరహితుండును, నిర్వికారస్వరూపుండును నగునీవల ననుండియె జగత్తునకు నుత్పత్తిస్థితిలయములు గలుగుచున్నవని (వేదాంతులు) చెప్పెదరు. నిర్వికారుఁ డగునీవు జగదుత్పత్తి మొదలగువికారనుల కాశ్రయుఁడవగుట విరుద్ధము గాదా? యన్నచో నీవు ప్రకృతిపురుషులను దేహముగాఁదాల్చి నియమించు నీశ్వరుఁడవు. కనుక స్వరూపముచేత నిర్వికారుఁడవే వై యుండి శరీరభూతములగు చిదచిత్తులమూలమున వికారములకాశ్రయుఁడ వగుచున్నావు. ఇంతటికి నాకు శక్తిగలదాయన్నచో, నీవు సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులగు ననంత కల్యాణగుణములచేతను స్వరూపముచేతను బృహత్త్వముగలసర్వశక్తుఁడ గవగు బ్రహ్మమవు; కాన, యీవికారాశ్రయత్వము నీయందువిరుద్ధముగాకుండును. అయినను నాకు శరీరభూతములగు చిదచిత్తులకుఁగల సృజ్యత్వాదులు నాకేచెప్పుట యెట్లందువేని, నీవు స్వశరీరభూతములయిన యాచిదచిత్తులకు నంతరాత్మరూపమున ధారకుఁడవై యుండుటవలన నాశరీరగతము లయినయుత్పత్తి మొదలయినవి తచ్ఛరీరకుఁడ వగునీయం దుపచరించుచున్న వింతేకాని నీకే చక్కఁజెప్పఁబడవు. జగదుత్పత్త్యాదులకుఁ గారణము బ్రహ్మరుద్రాదులుకాని నేను గాదందువేని యట్లుకాదు.

---

న్నది. అతనిస్వరూపము నిర్వికారము. దేహమే(అనగా చిదచిత్తులే) వికారము నొందుచున్నవి. కనుక స్వరూపమున నిర్వికారుఁడుగానే యుండి శరీర ద్వారా వికారాశ్రయుఁడు-అనఁగాఁగారణభూతుఁడు-అగుటచేఁగారణత్వము పొసఁగుచున్నది. మఱి యాశరీరభూతము లగుచిదచిత్తుల యుత్పత్తి మొదలగు వికారములు శరీరియగుటచే నీశ్వరునివిగా నుపచరింపఁ బడుచున్నవే కాని యీశ్వరునివే యని చెప్పఁబడుట లేదని యాశయము.

అట్టి నీవు ముల్లోకములను బాలించుకొఱకు నీదు(సంకల్పరూప మైన)మాయచేత (రజస్తమస్సుల కందలేక శుద్ధ సత్త్వమయంబైన) శుక్ల(తెల్లని)విగ్రహమును నీవే చక్కఁగయికొనుచున్నావు. ముల్లోకములను సృజించుకొఱకు రజోగుణయుక్తుఁడయిన చతుర్ముఖుం డనుజీవుని పేర రక్తంబగు (ఎఱ్ఱనిదగు) శరీరమును దాల్చుచున్నావు. అట్టిపుట్టుక నొందినయీముల్లోకములఁ బ్రళయముకొఱకుఁ దమోగుణయుక్తుఁ డయిన రుద్రుఁడను జీవుని పేరఁ గృష్ణంబగు(నల్లనిదగు)శరీరమును దాల్చుచున్నావు. అనఁగా బ్రహ్మరుద్రు లనెడిజీవులం దనుప్రవేశించి జన్మలయములను, నీవే నీయంతట స్థితిని, జగమునకుఁ జేయుచున్నావు. విభూ! అఖిలేశ్వరా! నీ వీ లోకమును రక్షించుకొఱకు నాకళత్రమం దవతరించితివి. రాజన్యుల పేరఁ బుట్టి కోట్లకొలఁదినున్న యసురదళపతులు పురికొలిపి తెచ్చుచున్న సేనలను నిర్మూలము సేయుదువు. సురేశ్వరా! సజ్జనులపొత్తున కెంతమాత్రముఁ దగని యీకౄరుఁడు కంసుఁడు నీవు మాయింటఁ బుట్టఁబోయెదవని విని మచ్చరమువలననే నీముద్దులయన్నల నందఱను బట్టి చంపినాఁడు. వాఁడిక నీ వవతరించియున్నావని మనుష్యులు పోయితే లుపఁగానే యిపుడే కేల నాయుధమెత్తికొని పాఱువెంచును.

—●●◆ దేవకి శ్రీకృష్ణుని స్తుతించుట. ◆●●—

కాన యీదివ్యవిగ్రహమును మఱుఁగుసేయుము' అనెను. అంత దేవకి చతుర్భుజాదు లయినపరమపురుషలక్షణములతోఁ గూడియున్న యా కన్నకొమరునిఁజూచి మున్ను కంసునిభయమున విన్ననై యుండియు నాచిన్నారికొడుకు గలిగెనని తెలిచిఱునవ్వు నివ్వటిల్లుచుండ నతని నిట్లు స్తుతించెను. స్థూలంబగుప్రధానము

(ప్రకృతి)వలె వ్యక్తంబులుగాక యవ్యక్తంబును, నావ్యక్తంబునకుం గారణంబగుటచేం దత్పూర్వంబును, నవ్యక్తంబును గారణంబు నగుసూక్ష్మప్రకృతివలె సగుణంబుగాక సత్త్వాదిగుణరహితంబును మఱియు నాప్రకృతివలెవృద్ధిక్షయయుక్తంబును శబ్దాదిగుణ కలితంబునుగాక యెప్పుడు నేకరూపంబును శబ్దాదిరహితంబును, స్వయంప్రకాశం బగుబద్ధజీవునివలె శోకమోహావికారములు లేక నిర్వికారంబును, బుణ్యాపాపరహితంబును, బుణ్యాపాపరహితుండగు ముక్తజీవునివలె సంసారదశయందు జ్ఞానసంకోచమునొందక యసంకుచితధర్మభూతిజ్ఞానయుక్తంబును, నిత్యాసంకుచితజ్ఞాను లగునిత్యులవలె నణుస్వరూపము గాక స్వరూపముచేతను గుణములచేతను బృహత్త్వముగల దగుటచే బ్రహ్మంబును నై యిట్లు స్థూలసూక్ష్మమగు ప్రకృతికిని బద్ధముక్తనిత్యు లనుపురుషులకును విలక్షణంబై ప్రసిద్ధంబగు నారూపంబును సాక్షాద్విష్ణుండని చెప్పుదురు. బ్రహ్మకు* రెండు పరార్ధములును ముగిసి,లయము కలిగినపుడీలోకము నశింపంగా, కాలంపు వేగముచేతం బృథివి మొద లయినమహాభూతములు, తమకారణ పరంపరచొప్పున నాధిభూతమగు నహంకారమందు † లయింపంగా సూక్ష్మావస్థమగు నచిత్తు నహంకారమునకుం

*బ్రహ్మకు నతని కాలంతచొప్పునంగల నూఱేండ్ల యాయువునకు 'పర' మని పేరు. అందు అర్ధము అనంగా ఏంబదియేండ్లు పరార్ధము. రెండుపరార్ధములు బ్రహ్మ ఆయుష్కాలమని తెలియునది.

†ఇట 'భవానేకశ్శిష్యతే శేషసంజ్ఞః' అని మూలము. భగవంతుండొక్కండే శేషించియుండుననియుందక్కిన చిద చిత్తులెల్లనతనియందు లయించియుండుననియుం జెప్పంబడినది. ఇట లయమనంగా విలయము-నాశముగాదు.

బ్రకృతి యగుమహత్తత్త్వమును బొందఁగా, నపుడు శేషించి యుండుపదార్థము నీవొక్కఁడవే; కావున నీవు శేషుఁడని పేర్కొనఁబడుదువు. ప్రలయమందు 'కాలవేగముచేతి' నని కాలముగూడ శేషించియుండఁగా భగవంతుఁ డొక్కఁడే శేషించియుండుననుట యెట్లు? అన్నచో,నీవు నిరతిశయసూక్ష్ముఁడవై నీయందున్నయాచిత్తునకు బంధువువలెనాశ్రయుఁడవగుదువుగదే! సూక్ష్మమైన యాయచిత్తు నీతోడిసంశ్లేషము నొందినను నీక పృథక్సిద్ధవిశేషణమే యగుటచే నీ వొక్కఁడవగుటకు విరోధికానేరదు. అట్లె యట్టి నీకు నిమేషము మొదలుగాఁ గాలమునవలఁగలదై బ్రహ్మాదులకును బ్రభువగుటచేఁ బెద్దదియై విశ్వమునంతయుఁ బ్రవర్తింపఁజేయుచున్న యీయాకాలము నీకుఁ జేష్ట

చిదచిత్తుల కంతముగలదని 'ప్రకృతింపురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి' 'తదేతదక్షయం నిత్యం జగత్స్థావరజఙ్గమమ్' అను వచనములకు విరోధమగును. కాన లయము రెండువిధములు. తన యప్పటియవస్థనువిడచి పూర్వావస్థనుబొందుట-పృథివీత్వావస్థను విడిచి స్వావస్థనుబొందుటవలె. రెండవది తినయవస్థను విడువకయే మఱియొకవస్తువుతో వేఱుపఱుపరానట్లు కలసికొనియుండుట-ప్రకృతిపురుషులు నిత్యసిద్ధములైన తమ ప్రకృతిరూపమును బురుషరూపమునును విడువకయే విశేష్యభూతుఁడగు భగవంతునితో విభాగింపరాని సంయోగము నొందియుండుటవలెనని తెలియునది. ఇట 'అవ్యక్తమక్షరే లీయతే' అక్షరం తమసి లీయతే-తమః పరేదేవ ఏకీభవతి' అను శ్రుత్యర్థము ప్రతిపాదితము. ఈ 'ఏకీభవతి' అనుటయె 'భవానేకః' అను ఏకశబ్దముచేఁ జెప్పఁబడినది. అనఁగా చిదచిత్తులన్నియు నశించి భగవంతుఁడొక్కఁడే మిగిలియుండునని యర్థముసేయక, అన్నియునామరూపములచే వేఱుపఱుపరానంత సూక్ష్ములైవేఱుపఱుపరానట్లు భగవంతునితోఁ గూడియుండుటచేనన్నియుఁజేరి భగవంతుఁడొక్కఁడేయై మిగిలియున్నట్లుచూపట్టుచున్నాఁడని తెలియునది.

యని చెప్పుదురు. అది నీకుఁ జేష్టామాత్రమైన యపృథక్సిద్ధ విశే షణమగుటచే నీ *యేకత్వమునకువిరోధిగానేరదు సుమీ! అట్లు కాలమును జేష్టగాఁగలిగి కాలమునకును నియంతవై క్షేమము నకుఁ బట్టయి యున్ననిన్ను శరణుఁజొచ్చుచున్నాను. జన్మమర ణరూప సంసారశీలుం డగువాఁడు జన్మమరణాది రూపమగు సంసార మనెడుదుష్టమృగమునకు భయంపడి (ముముక్షుఁడై) సమస్తము లయినయుపాయముల ననుష్ఠించి, యీసంసార భ యమును బోఁగొట్టుకొనలేక (ముక్తుఁడుగానేరక )పోయెను. అంత యాదృచ్ఛికమగు సుకృతవిశేష పరిపాకమువలన నీపాదారవింద ముల నుపాయముగా శరణమొంది సంసారదుష్టసత్త్వభయ మును దొలఁగించుకొనుటకు మఱియొక యుపాయాంతరమును బన్ననవశ్యములేక యావజ్జీవము సుఖముగా వర్తించుచుండును. కాఁబట్టి మృత్యువు వానినుండి తొలఁగిపోవును.(వాఁడు సంసా రమునుండి ముక్తుఁడగుచున్నాఁడు) ఇట్లు నీపదాబ్జములను శర ణువేఁడిన మాత్రమున శ్రేయము నేయిచ్చునీకు నీలౌకిక శ్రేయము నిచ్చుటెంత! నీవిట్టి క్షేమకరుఁడవు గాన చూచుటకును బెట్టి దుఁ డయినయీకట్టిఁడి కంసునికి భయపడియున్న మమ్ము భృత్య జనభయము నపహరించువాఁడవుగావునఁ గావుము. మఱియీ నీరూపము నిన్నుఁ బరమపురుషుఁడని పట్టియిచ్చును; ఇదియోగు లధ్యానమునకే శుభాశ్రయభూతమైనది ; కాబట్టి, నీ విట్టిరూప మును మాంసచక్షుల మగుమాబోఁటులకుఁ బ్రత్యక్షముగావిం

* దేహము అపృథక్సిద్ధవిశేషణము; తద్దేహియగు ఆత్మ విశేష్యము. రెం డును జేరి దేహి యొక్కఁడుగానే గ్రహింపఁబడునట్లు అపృథక్సిద్ధవిశేషణము లతోఁగూడిన విశేష్యవస్తు వొక్కటిగానే గ్రహింపఁబడునని భావము.

పకుమా! మధుసూదనా! ఈకంసుఁడు పాపుండు కాన నాయం దు నీవుపుట్టుట యీకట్టిఁడికి దెలియకుండుఁగాఁత. నీవుండఁగా వెలవ నక్కఱలేదుగాని యాఁడుదానను గాన నాబుద్ధికంతగా ధైర్యముచాలదు.కనుక నీ నవతరించినందులకై యీనృశంసుఁ డేమిసేయునో యని కంసునిఁదలంచి దిగులు పడుచున్నాను. విశ్వాత్మా! కాఁబట్టి శంఖచక్రగదా పద్మవిరాజమానమై సిరిగు లుకుచు నలౌకికమై చతుర్భుజముల వెలయుచున్న యీ రూప ము నుపసంహరింపుము. ప్రళయముముగిసి సృష్టిమొదలుపెట్టు కాలమున నీదేహమం దొకానొకయెడ దామర యనుబొడ్డు లోనఁ బరమపురుషుఁడ వగునీవు చిదచిదాత్మకమయిన యీవి శ్వమునంతయుఁ దాల్తువు. అట్టి విశ్వగర్భుఁడ వగునీ వైక పేద యాఁడుదాన నగు నాదు గర్భములో నడఁగియుంటివే! ఔరా! ఇది మీఁదుమిక్కిలి మనుష్యలోకము ననుకరించుటమాత్రమే కదా!' యనెను.

భగవంతుఁడు 'అవ్వా! నీవు తొల్లి స్వాయంభువమన్వంతర మున, నింతకు మూఁడవజన్మమునఁ బృశ్నియను పతివ్రతవుగా నుంటివి. నీభర్తయగు వసుదేవుండపు డకల్మషుండయినసుతపుం డను ప్రజాపతిగా నుండెను. అపుడు బ్రహ్మ మీ యిరువురను బ్రజలను బుట్టింప నియమించెను. అంత మీరింద్రియవర్గమును జక్కఁగా నడంచి యక్కజ మయినతపము సలిపితిరి. అపుడు మీరు నాయాఋతువుల గుణములగు వాన గాలి యెండ మం చు నుక్కయు, వరుసగా వచ్చినపుడు వానికెల్లను జక్క నైఁచి ప్రాణవాయువు నిరోధించుటవలన మనంబులందు రజస్త మంబులకు డిందువడియుండు కందులను గడిగిపుచ్చి, చెట్లనుండి

పండిరాలినయాకులును గాలియు నాహారముగా, నావలనంగో న్నియిష్టార్థములను గోరి, యుల్లములను రాగాదులచేం గలుచప డనీక కుదుటంబెట్టికొని నన్నారాధనము సేసితిరి. కల్యాణీ! ఇట్లు మీరిరువురు నాయందు డెందంబుల నెలకొలిపి, మిక్కిలి యు దుష్కరమయిన తపమును బండ్రెండువేల దివ్యసంవత్సర ములు గావించితిరి. అనఘులారా! మీరు నన్ను నిత్యమును భక్తియుక్తంబుగ హృదయంబులందు ధ్యానము సేయంగా మీ తపంబునకును శ్రద్ధకును నెంతయు సంతుష్టుండనై వరప్రదుల యందు మిన్ననుగాన, మీకోరినవరముల నొసంగుతలంపునం జతుర్భుజాద్యలంకృత మయినయీదివ్యవిగ్రహమున నే మీకుం బ్రాదుర్భవించి 'కోరినవరమును వేఁడు'డని చెప్పంగా మీరిద్ద ఱును నావంటిపుత్త్రుండు గావలయునని యడిగితిరి. మీరింతకుం దపంబున నే కాలంబుపుచ్చి విషయభోగంబుల ననుభవింపక యుండినందునను, అల్లారుముద్దుగ బిడ్డలనుగని పెంచు సుద్దులు లేకుండినందునను, మఱి బలితంబయిన నామాయచేత మోహి తులై యుండినందునను, దుర్లభంబగు ముక్తినివేఁడక నాయీ డుకొడుకునే కోరితిరి. మీరు నా కీడయిన కొడుకునే వరముగాం బడసి నేను బోయినపిదప, మీమనోరథంబు లీడేఱుటయు, విష యభోగంబుల ననుభవించితిరి. నే నంత శీలంబునను నౌదార్య మునందును దక్కిన కల్యాణగుణములందును నా కీడయినవా నిని మఱి యొక్కనిని లోకంబున నెందును గాననేరక యంత నేనే మీకుం బృశ్నిగర్భుం డన బుత్త్రుండనై పుట్టితిని. ఆమీ యిరువురే మఱుజన్మమున నదితియనియుం గశ్యపుండనియుంబు ట్టంగాం గశ్యపునివలన నదితియగునీయందు నుపేంద్రుండను పేర

నుదయించితిని. అపుడు నేను వామనుండ నగుటవలన వామనుం డను పేరను వాసికెక్కియుంటిని. మీయీ మూఁడవపుట్టుకయందు, నాయదితికశ్యపులే యగుమీకు, నాతోంటిరూపుననే మరలఁ బుట్టితిని. సాధ్వీ! నేనుజెప్పినది సత్యమేయగును జుమీ. నేను జతుర్భుజాది యుక్తమయిన యిట్టి నాదివ్యరూపమును మీకుఁ జూపుట, దొల్లియు మీయిరువురకు నేనేపుట్టితినని మీకుఁ దలంపించుటకే కాని మఱేమిగాదు. నేనిట్టిరూపునఁ గాక మఱియొకరూపమునఁ బొడమితినేని మర్త్యుల రగుమీకు నేనవతరించితి ననెడియెఱుక గుఱికొనఁజాలదు. నన్నుఁ బలుమాఱు పుత్త్రుఁడనికాని లేక యొక్కమాఱయినను బ్రహ్మమనికాని తలంచుచు నాయందు నెయ్యముఁ దియ్యము నెఱపుదురేని పరమంబయిన మదీయగతిని బొందుదురు' అనెను. ఇట్లు చెప్పి హరి యూరకుండెను. అంత నాభగవంతుఁడు తన తల్లిదండ్రులు చూచుచుండఁగనే తటాలునఁ దనమాయచేత సామాన్యమగు నొక మనుష్యశిశువయ్యెను. పిదప వసుదేవుండును దనపుత్త్రుఁ డయినభగవంతుఁడు తన కానతిచ్చియున్నచొప్పును గావించువాఁడై యాబిడ్డనిఁ గేలనెత్తికొని యాపురిటింటినుండి వెలుపలఁ గొనిపోవ నుంకించెను. ఆసమయమందే నందుని యువిదయగు యశోదకు యోగమాయ చిన్నికూఁతురై జనించెను. అపుడు సకలజనుల బుద్ధులనును బుద్ధిపూర్వకములయిన యింద్రియవ్యాపారములనును యోగమాయ హరించి యుండెను. కాన ద్వారపాలకులును బురజనులును మైమఱచి నిదురించుచుండిరి. మఱియు ద్వారము లన్నింటియందును బెదపెద్దతలుపుల నినుపగడియచీలలను గొలుసులనువైచి గట్టిగా మూసియుండిరి. కాన



1683. వసుదేవుఁడు కృష్ణు నెత్తికొని యమునదాఁటుట.

వానిని గడచిపోవుట యెంతయుఁ గష్టముగానుండెను. అయినను వసుదేవుఁడు చిన్నికృష్ణునిఁ జేత నెత్తికొని రాఁగానే యావాకిళ్లన్నియు సూర్యునికిఁ జీకట్లుంబోలెఁ దమంతటవిచ్చి తెఱచుకొన్నవయ్యె. అపుడు పర్జన్యుఁడు పురజనులు మేలుకోనకుండునట్లు మెల్లమెల్లగా నుఱుముచు వాన గురియుచుండెను. శేషుండును హరిమీఁదుఁగా దనపడగలు విప్పి యావర్షబిందువు లతనిపైఁ బడకుండ వారించుచు వెంటఁ బోవుచుండెను. అపుడు పర్జన్యుఁడు మాటికి వర్షించుచుండెను. కాన యమునానదియందు జలప్రవాహములు లోఁతయి వెల్లివిరిచి కరుళ్లుగొని నురుఁగులు గట్టుచుఁ బాఱుచుండెను. మఱియు నావెల్లువయందు వందలకొలఁదిని యట్లుండియు, సీతాపతియగు రామునికి సముద్రుండునుం బోలె, నావసుదేవునకుఁ ద్రోవపాయ యొసంగెను. వసుదేవుఁడును నందునిమందను జేరి యందు గొల్లలెల్ల యోగమాయచేత మిక్కిలియు నిదురపాలై యొడలెఱుంగకుండుట యెఱింగినవాఁడు గాన జంకుదొలంగి చిన్నికృష్ణుని యశోదశయ్యయందు నొయ్యనునిచి యాయమకన్నకూఁతు నెత్తికొని మరలఁ దన యిలు వచ్చిచేరెను. అట్లుచేరి దేవకిపడుకపయి నాచిన్నిపాప నిడి, మరల నెప్పటివలె నినుపసంకెలలను బాదములందిడుకొని, తలుపుమూసికొని యుండెను. నందునిసుందరి యశోద తనకు బిడ్డపుట్టినదిమాత్రమే తెలియునుగాని కన్నశ్రమచే నలసిసొలసి యుండుటవలనను, నిదుర చొక్కున స్మృతి దూలియుండుట వలనను, నది మగదియో యాఁడుదియో యని యాచిన్నె యెఱుఁగ కుండెను. ఇది మూఁడవ యధ్యాయము.

---

కంసుఁడు కృష్ణుఁడని యోగమాయను జంపఁ బూనఁగా నాదేవి యాకసంబున కెగసి యంతర్ధానము నొందుట. కంసుఁడు దేవకీవసుదేవుల చెఱ విడిపించియనునయించుట.

శుకుఁడు—వసుదేవుఁ డిలుసేరి యెప్పటివలె నుండఁగా నాసమయమునందుఁ బురమునకు లోపలను వెలుపలనుగల ద్వారములన్నియు మునుపటివలెనే మూఁతపడియుండినవి. అంత నాబిడ్డ యాపురని యేడువఁగా నాచప్పుడు విని కారయింటికావలి వారు దిగ్గన మేలుకని లేచిరి. వారు మిక్కిలి వేగమునఁ గంసునికడకుఁ బరువిడి వానితో 'దేవకి నీళ్లాడె రమ్ము ర' మ్మని చెప్పిరి. వాఁడు నెప్పుడు దేవకి గనునాయని దిగులుగొని రేయుంబవలు దానినే యెదురు చూచుచుండెను గదా. వాఁ డది వినఁగానే వానినిజంపుట కదియె తగినతఱియని తలఁచి తల్పమునుండి తొందఱబడ లేచి తత్తఱపడుచుఁ దలవెండ్రుకలువీడ నడుగులు తొట్రిలఁబడఁ గడువేగ పురిటింటికిఁ బరుగిడివచ్చెను. అట్లువచ్చినయాకట్టిఁడితోఁ బుట్టువునుజూచి దేవకీదేవి మిక్కిలియుదీనయై యెంతయు జాలిపుట్టుపలుకుల వానితో 'అన్నా! నామేలు సేయువాఁడవుగదే! నాతోఁబుట్టువవుగదే! చూడుము. ఇది బాలుఁడుగాఁడు. నీకు మేనగోడలు. దీనికి మేలు సేయువాఁడు నీకన్న నెవరు? ఆఁడుఁబడుచిది. తుదిఁబోయి యాఁడుదానిని జంపుదువా ? నీకిది తగదు. అన్నా! ఒక్కని నిరువురనుగాదే! అగ్నిజ్వాలలవలె వెలుఁగుచుండిన పెక్కుకొడుకులను, చిన్నికూనలను, నీవు, వారిపాలి మృత్యువగు నేపాపుడవై యముపురికొలిపెనో కాని, దయమాలి చంపితివిగదే. ఆకొడుల నట్లు చేసినను నీకూఁతునైనను, లేక లేకయు



1685. కంసుఁడు యోగమాయను జంపఁ బూనుట ; అది యాకసంబున కెగసి యంతర్ధానమగుట.

న్నయీయొక్కతినైనను, నాకుదానముసేయుమీ. అన్నా! నీకుఁ జెల్లెలినిగదే. మఱి కొడుకులనెల్లఁ జంపుకొని వెతలు గుడుచుచున్నదాన నయితినే! ఈ వెత లుడుప నీవు శక్తుఁడవుగదే! ఈ దౌర్భాగ్యురాలికిఁ గన్నకొడుకులనెల్లఁ గడపిపుచ్చినను, దుదకు నీకడగొట్టుచూలు నయిన నియ్యాఁడగును జుమీ! చంపకుమీ!' యని బిగ్గఱ మొఱయిడెను. ఇట్లు ముద్దుకూఁతును నక్కున బిగియహత్తించుకొని, రెండుచేతులఁ గౌఁగిలించి యదిమికొని మిక్కిలియు దీనముగాఁ బలవించుచు నెంతో బతిమాలుకొన్నది; కాని, యాక్రూరుఁడు చెల్లెలిని బిట్టదల్చి యాబిడచేతులనుండి బాలికను గొబ్బునఁబట్టి తివిచికొన్నవాఁ డయ్యె. అపుడే పుట్టి కన్నులు దెఱవకున్న యాచిన్న నెత్తురుకందును, ఆచెలియలికూఁతును, వాఁడు పెనఁగులాడి పట్టుకొని తనమేలు దలంచి చెల్లెలనియుఁ జెల్లెలికూఁతురనియు నెయ్యంబించుకయు లేక దిగవిడిచి దానిని బుడమిని ఱాతిపయిని బడఁగొట్టెను. అబ్బాల, విష్ణుని వెంటఁబుట్టిన యాదేవి, కంసునికేలనుండి నేలంబడక యుప్పరంబున కెగసి తోడనే నిజస్వరూపంబుదాల్చి యెనిమిదికరంబుల నాయుధంబులు వెలుంగ నాకాశముననే మెలంగుచుఁ గనుపట్టుచుండెను. మఱియు నాదేవి దివ్యములగు పుష్పమాలికలనుదాల్చి దివ్యవస్త్రము ధరించి మేలయినకలప మలంది రత్నాభరణములఁ గయిసేసి యెంతయుఁ గొమరుచూపుచుండెను. మఱియు విల్లును శూలమును బాణములును బలుకయును వాలును శంఖచక్రములను గదను వరుసగా నెనిమిదికరంబులఁదాల్చి సిద్ధులును జారణులును గంధర్వులును నప్సరసలును గిన్నరులును నురగులును గొప్ప కానుకల నర్పించి తన్నుఁ బొగడు

చూడఁగాఁగడుఁ దేజరిల్లుచుఁ గంసునిఁజూచి 'ఓరీ! మూఢా! నన్నుఁజంపినను నీకేమిప్రయోజనము? ఏమియులేదు సుమీ! నిన్నుఁ దుదముట్టించు నని యశరీరవాణి చెప్పిన నీపూర్వశత్రు వొకానొకచోటఁ బుట్టియున్నాఁడుసుమీ! కాబట్టి దీనులయిన శూనలను రిత్తకురిత్త చంపకుమా' అనెను. ఇట్లు చెప్పి భగవతి యగు నాదేవి యోగమాయ, భూతలమునందుఁ బెక్కునామములుగల యాయాప్రదేశములందు, దుర్గాములగు బహునామములతో వెలయుచుండెను. కంసుఁడు, దేవి చెప్పినది యాలించివిని, యెంతయు విస్మయపడి, యంత దేవకిని వసుదేవునిని సంకెలలు విడిపించి వినయంబును నయంబును గడలుకొన వారితో, 'అక్కటా! చెల్లెలా! అయ్యో! బావా! నేను పాపముచకొడిగట్టి కటికి రక్కసునివలె నెగ్గు లగ్గుచూడక దగ్గఱి నీకన్నకొడుకులను బట్టి పెక్కండ్రను దుదముట్టించితినే! అట్లు పుత్త్రఘాతుఁడ నగు నేను నీబిడ్డలందుఁ గరుణ యణువేని చూపనయితిని. మఱి జ్ఞాతులనికాని సుహృదులనికాని పాటింపక దిగవిడిచితిని. ఇట్టి క్రూరుఁడ నగునే నేలోకములను బొందుదునో? నాకిఁక జడత్వము దప్ప లోకమునుగలుగునా? ఇఁక బ్రహ్మహత్య చేసినవానివలె బ్రతికియుండియుఁ జచ్చినవాఁడనే కదా! తొల్లి దైవము 'దీని యెనిమిదవచూలు నిన్నుఁజాపు' నని చెప్పినది. ఇప్పుడు 'దీనియందుఁగాదు. మఱి యెక్కడనో నీకు మృత్యువు పుట్టియున్న'దని వినఁబడినది. కనుక మనుష్యులుమాత్రమేకాదు; దైవమును దబ్బఱలాడుచున్నది. అకట్టిఁడి కల్లదైవముమాటను బాటిగానమ్మికదా పాపినై యప్పసెలియ లనక, యదికన్నసువులని తలఁపక, వారినెల్లనసువులకుఁ బాపితిని. మీరు మహావివే

కవంతులరుగదే ! కాన కన్నచిన్నిబిడ్డలను దలంచుకొని దుఃఖింపవలదు. తమతమతోంటి కర్మఫలములు గడచి రింతే కాన దుఃఖింపనేల ? ప్రాణులు తమతమకర్మములచొప్పున దైవమునకులోనయి వర్తించుచుందురు. కావున వారెప్పుడును నొక్కెడనే తిరముగాఁగూడియుండరు. ఆయాకర్మముల కనురూపముగా జననమరణాదులం దిరుగుడు పడుచుందురు. భూమియందు దుమ్ములు వచ్చుచును బోవుచునుండునట్లు, భూతములునుగర్మవశమున నొక్కెడఁగూడుచును మరలఁబాయుచు నుండును. ఆదుమ్ములకు రాకపోకలుండియుఁదదాశ్రయమయినభూమి కవిలేకుండునట్లు శరీరములు జన్మమరణాది వికారములు గలిగియుండినను దద్ధారకమై నెలకొని యున్నజీవుఁడు తాను నట్లు మాఱుపాటునొందక యేకరూపుఁడును నిత్యుఁడునై నెలకొని యుండును. (జన్మమరణాద్యవస్థలు గలిగియుండుటయే స్వభావముగాఁగలవిగాన దేహములను గూర్చియు, విక్రియ నొందకుండు నదిగాన యాత్మనుగుఱించియు, శోకింపవలసిన పనిలేదు) ఆత్మకుమాఱుపాటుగలుగదేని 'పుట్టితిని,జచ్చితిని, చంపితి'నని యీప్రతీతులు కలుగుట యెట్లందురేని, దేహము నాత్మయు వేఱువేఱు ధర్మములు గలవియని వానికిఁ గలయీభేదమును నిశ్చయించుకొని యనుష్ఠింపవలయును. అట్లాభేదమును నిశ్చయించుకొని యనుష్ఠింప కుండుటవలననే యాత్మయందు (తెలకింపదుగ) దేహధర్మములు తోఁచుచుండును. కాన దేహముగలుగుటయుఁ బాయుటయు ననెడియీసంసారమును, 'జంపితిని జంపఁబడితి' ననెడిప్రతీతులును నుడుగనేరవు. భద్రులారా ! దేహము నాత్మయు నిట్లు పరస్పరవిలక్షణములై యుండుటంబట్టి

నీకొడుకులు నాచే హతులయినను వారినిగుఱించి మీరు శోకింపవలదు. నేను జంపితిననుటగాని నాచేత మీసుతులుచంపఁబడిరనుట గాని యెక్కడిది? ఒకరిచావునకు మఱొకరు మూలముగానేరరు. సమస్తములయిన జంతువులునుగర్మపరవశమై తాము చేసినకర్మఫలమును(జన్మమరణాదులను)దప్పక పొందుచున్నవి. ఇంతేకాని నేను జంపుట యెక్కడిది? నాచేత నీకొడుకులు చచ్చిరనుట యెక్కడిది? దేహమునకు విలక్షణమై తనయాత్మకుఁ గలిగియున్న స్వరూపమును గనుఁగొననేరనివాఁడు 'నేను జంపితిని, నన్నుఁజంపి'రని యిట్లుదేహమే యాత్మయను భ్రమము వలన దేహగతములయిన యాభాసముల నాత్మయందుఁ దప్పఁ దలఁచుచున్నాఁడు. అట్లు తనయాత్మయం దాభాసమయినట్లు దలంచుచుండునంతవఱకును వాఁడొఱుకదూలి తాను జంపినవాఁడుగాని చంపఁబడినవాఁడుగానియై, తన్మూలకములయినశోకపాపాదులను బొందుచున్నాఁడు; కాన, వాస్తవమునకుఁ జంపువాఁడెవఁడు? చంపఁబడువాఁ డెవఁడు? కాన నేనే మీకొడుకులను జంపితినని తలంపవలదు. అట్లు తలంచినను మీరు సాధుప్రలందును బంధువులందును దోషములను బాటింపక ప్రేమచూపు వారును నగుదురుగాన మీరు నాదుండగమును క్షమింపుఁ'డని కన్నీరు మొగింబునఁ జిప్పిలుచుండ బావయుఁ జెలియలియు నడుగులను బట్టుకొనెను. అంత వాఁడు కన్యయగు యోగమాయ 'వీరిరువురందు దోషములే'దన్న మాటను బాటిగానమ్మి, తన నెయ్యంబు తియ్యంబును నెఱపుచు, దేవకీవసుదేవుల సంకెలలను విడిచిపుచ్చెను. ఇట్లు తనయన్న తాఁజేసినకటికిపని కెంతయు ననుతాపమునొందుటనుజూచి దేవకిమున్నించి రోషముడిగ

విడిచెను. వసుదేవుఁడు నల్లెమన్నించి కినుక డిగఁద్రావి నవ్వుచు
వానితో ‘మహాభాగా ! నీవు చెప్పినది నిజమే; దేహులకు ‘నేను
జంపితిని నన్నుఁ జంపి’ రనెడి యీయహంబుద్ధి యజ్ఞానమూలమైన
దేహాత్మభ్రమముచేఁ గలుగునదే కాని మఱేమిగాదు. ఆయహం
బుద్ధివలననే వీఁడు మిత్త్రుఁడు వీఁడు శత్త్రుఁడని భేదములును గలుగు
చున్నవి. ఇట్లాత్మకంటె వేఱగు దేహమం దాత్మాభిమానముగలిగి
యుండుటవలన నట్టివారు శోకహర్షములును భయద్వేషము
లును లోభమోహ మదములును గలవారయి తనవాఁడు పెఱ
వాఁడని భేదము నేకాంచి యొకరినొకరు పొడుచుకొనుచుందురు;
గాని, కత్తిమొదలఁగున యచేతనపదార్థములచేత దేహాదిరూప
మగు నచిత్తును, జంపువాఁ డీశ్వరుఁడే కాని మఱియొకఁడుగాఁడని
తెలియనేరరు. ఈశ్వరుఁడే వారివారికర్మముల కనుగుణముగా
మెలఁగుచు జన్మమరణాదులు గలిగించుచున్నాఁడుగాని, యొకఁ
డును మఱొకని కపరాధము చేయుట గలుగదు కాన, నాపుత్త్రు
లను జంపితివని తప్పు నీయందు మోపఁదగదు.’ అనెను. ఇట్లు
దేవకీవసుదేవులు మనస్సుకలంక మాని నమ్మికపుట్టుతిన్న నిమా
టలు పలికి వీడుకోలుపడఁగాఁ గంసుఁడు తనగృహమున కరిగెను.
అట్లుపోయి యారేయిగడవఁగానే కంసుఁడు ప్రొద్దునఁ దనమం
త్రులను బిలిపించి వారలకు యోగమాయ చెప్పినదంతయుఁ
దెలిపెను. దైత్యులా మంత్రులును దమపతి చెప్పినదివిని దేవతల
వలని యీసు మునుంగువడ నిది తగును దగదను వివేకమించు
కయులేక వానితో ‘భోజేంద్రా ! యోగమాయ యిట్లు చెప్పె
నేని, పట్టణములందును బల్లెలందును గొల్లమండలందును శిశు
వులను, బదిదినములు గడవనివారిని గడచినవారిని సయితము, పట్టి

చంపుదము. దేవతలో యుద్ధమున్న వెనుదీసి పాఱుచుందురు. మనమిట్లు చేయుదుమేని వారు పలుపాట్లుపడియును మనలనేమి సేయఁగలరు ? యుద్ధమున వెనుకంజ వేయుదురు గాని యందు లకేమో రారేకదా! నీవెనువింటియల్లెత్రాటఁ బుట్టినచప్పుళ్లకే వారియుల్లము లెల్లప్పుడును గడగడ వడఁకుచుండును. త్రాటిచ ప్పుడుకే యింత. నీవు బాణసమూహములనే నిగిడించుచుండఁగా వా రాయమ్ములపరంపరలం గొట్టువడి దిట్టచెడి యుసుఱుదక్కిం చుకొనుట కువ్విళ్లూరుచుఁ బాఱిపోవుటయె బ్రతుకుందెరు వని తలఁచి తమతమనెలవుల దిగవిడిచి నలుగడలఁ బరుగిడిపోయిరి. కొందఱు దేవతలు నీవలన భీతులై చేత నున్నశస్త్రముల విడి చియు, మఱికొందఱు కచ్చెలును సిగలునువీడ నీకు భయపడితి మని పలుకుచును, నంజలిగీలించి నిలుచున్నారు. మఱియు నీవు దేవతలను శస్త్రాస్త్రములను మఱచినవారిని, విరథు లయిన వారిని, భయంబునఁ బ్రణతులైనవారిని, శరణాగతరక్షకుఁ డవు గావునఁ జంపక విడిచితివి. అట్లె, యుద్ధమును విడిచి మఱి యొకప్రయోజనమం దాసక్తు లయినవారిని, బరాఙ్ముఖు లయినవారిని, విలువిఱుగుటచే యుద్ధము సేయకుండు వారు ను, నగుదేవతలనును జంపవు. ఆదేవతల బీరమంతయు నింటి యందే. మఱి యుద్ధముతప్పఁ దక్కినచోటనే వారిబంటుపంత ములు. అట్టివారివలన మనకేమి? ఏమియుఁగలుగదు. సామా న్యులగు దేవతలమాటయటుండనీ; దేవతాశ్రేష్ఠులు హరిహరా దులు లేరా యన్నచో, హరియె నీకుభయపడి యెవరునులేని రహస్యపుఁజోట నొదిఁగినాఁడు. మఱి శివుఁడో హిమవంతము నడవియందు దాఁగినాఁడు. ఇంద్రుఁడో; వానివీర్యము మిక్కిలి

యల్పమని మనకుం దెల్లమేక దా. బ్రహ్మయంటిమా, యెప్పుడును దపము సేసికొనుచుండు వేదశ్రోత్రియుండు. ఇట్టి వీరలవలనంగాని మనకుం గీడేమి కలుగంగలదు? ఏమియు లేదు. అయినను దేవతలు మనకుం బుట్టుపగవారుగావున వారేమి సేయంగలరని యుపేక్షించియుండుట తగదని మేము తలంచుచున్నాము. కాని వారిని మొదలంటం బెకల్చి రూపుమాపుటకు నీ కనువ్రతుల మగుమమ్ము బంపుము. మనుష్యులు తమదేహమునందుం దలసూపిన తెవులును గుదుర్చుకొనక యుపేక్షించిరేని యది నానాంట గిట్టిగాం గుదురుకొని పెరింగి యంతం జికిత్సకు నలవిగాక పోవుచున్నట్లును, యోగులు తమ యింద్రియవర్గమును మొదట నడంపక యుపేక్షించిరేని, పిదప నవి వారికిగ్రహింపశక్యముగాని వగునట్లును, పగవాం డల్పుండని మొదటను పేక్షించినచో వాండు నానాట బలము పెరింగి యంతంగ దల్పను నయితము తరముకాక పోవును. కాన శత్రువెంత యల్పుండయినను దచ్చేపము నిలుపరాదు; మూలముతోం ద్రుంపవలయును. సనాతనంబై వర్ణాశ్రమాది రూపమగు ధర్మ మెవ్వనియందు వర్తించునో, యట్టి విష్ణుండు చుమీ దేవతలకు మూలము. ఆవిష్ణుండు దురూహస్థలముననుండు వాండే; యెట్లు భేదింపవచ్చు ననవలదు. వానికి వేదములును, గోవులును, విప్రులును, తపస్సును, దక్షిణలతోం గూడిన యజ్ఞములును, మూలముచుమీ. రాజా! కాంబట్టి సమస్తోపాయములచేతను బ్రహ్మవాదులును దపస్వులును యజ్ఞశీలురునగు బ్రాహ్మణులనను, హవిస్సులను బిదుకుగోవులను, బట్టి రూపుమాపుదము. బ్రాహ్మణులును, గోవులును, వేదములును, దపస్సును, సత్యమును, దమమును, శమమును, శ్రద్ధయు, దయయుం దితిక్ష

యు, యజ్ఞములును హరికి శరీరములగును. ఆవిష్ణుడు సమస్త దేవతలకును నధ్యక్షుడు. అసురులకు ద్వేషి. వాడు హృదయ గుహాయందు దాగి త్రిమ్మరుచుండువాడు గాన వానిని జక్కగ బట్టి దుదముట్టించుట శక్యముగాదు. దేవత లందఱకును శివునకును బ్రహ్మకును వాడే మూలము. కాబట్టి యాదేవతల నెల్ల వధించుట కుపాయమిది. మనము ఋషులనుబట్టి చంప వలయును. అపుడు ఋషిశరీరు డగువిష్ణుడును హతుడగును; కాన విష్ణువు మూలముగా గలయాదేవతలందఱును జెగినవా రగుదురు' అనిరి. ఇట్లాయసుర యగుకంసుడు దుర్గతిగాన దుర్మంత్రులంగూడి యాలోచించి యమపాశము తన్నావరించి యుండుటవలన బ్రహ్మహింసయె తనకు హితమని తలంచెను. వాడంత లోకమున కుపద్రవము సేయుటయందు బ్రియము గలిగియున్నట్టి రాక్షసులను గామరూపధరులను 'సాధుసమూహములను బాధలు పెట్టుడ' డని యాజ్ఞాపించి నలుదిక్కులకు బంపి యంత గృహముం బ్రవేశించెను. ఆరక్కసులో రాజసప్రకృతులు; మఱి వారి మనస్సును దమస్సుగ్రస్మియుండును. కాన వారు తమకు మృత్యువు దాపరించివచ్చియుండుటచే సజ్జనులకు దుఃఖమును గావించుచుండిరి. మహాత్ములయెడ నపచారము కేవలము మృత్యువును గలిగించుటయె కాదు: ఆయువును, సిరిని, గీర్తిని, బుణ్యమును, బుణ్యలోకములను, గామితములను, ఇదియదియన నేల! సమస్తములయిన శ్రేయములనును బురుషులకు నాశము చేసి పుచ్చుచున్నది. ఇది నాలుగవ యధ్యాయము.

---

## నంద్రవ్రజ వృత్తాంతము.

శుకుఁడు 'నందుఁడు తనకుఁ గొమరుఁడు పుట్టఁగానే, మిక్కిలియు నుప్పొంగి యుదారచిత్తుండు గాన స్నానముచేసి, శుచియై యలంకరించుకొని, వేదవిదులయిన విప్రులను రావించి స్వస్తివాచనికముఁ జదివించి, యాత బిడ్డకు జాతకర్మమును జేయించి యట్లే పితృదేవతార్చనల విధ్యుక్త క్రమంబున జరిపినవాఁ డయ్యెను. మఱియు నతఁడు చక్కఁగా నలంకృతములయిన లక్ష ధేనువులను బ్రాహ్మణులకు దానముచేసెను. రత్నసమూహములను బంగారునాణెములను, బంగారు సరిగవస్త్రములును దక్షిణగాఁ గప్పిన గొప్ప నువ్వులకొండల నేడింటినిని దానముచేసెను. పరమాత్మ నుపాసించుటచేత జీవాత్మ హేయగంధమును లేకుండునట్లు విశుద్ధి నొందురీతిని, కాలముచేతను స్నాన శౌచములచేతను *జాతకర్మాది సంస్కారములచేతను, తపము (మంత్రజపము)చేతను యాగముచేతను, దానములచేతను, సంతుష్టిచేతను, గృహదేహసంతాన దేవతాపశుహిరణ్యవిత్తధాన్యాదులగు ద్రవ్యములు పరిశుద్ధి నొందుచున్నవి. కాన నందుఁ డట్లాచరించినవాఁ డయ్యెను. బ్రాహ్మణులు స్వస్తివచనములను జెప్పిరి. †సూతులను మాగధులును వందులును, గాయకులును బురాణాదులను బాడిరి. భేరులును దుందు

---

* పదిదినముల కాలముచేత గృహమును, స్నానశౌచములచే దేహమును, జాతకర్మాది సంస్కారములచేత నపత్యమును, తపస్సు (మంత్రజపము) చేతను యజ్ఞముచేతను గృహదేవతలును, దానములచేత పశు హిరణ్యధాన్యాదులును, సంతుష్టిచేత మనస్సును, శుద్ధినొందును.

†సూతులుపౌరాణికులు; మాగధులు వంశావలి పాఠకులు; వందులు స్తుతిపాఠకులు; అని భేదము. మహాభేరులును దుందుభులును వాద్యభేదములని తెలియునది.

భులును మాటికి మ్రోఁగినవి. ఇట్లు సమస్త విధములయిన సంతోషాడంబరములచేత వ్రేపల్లెయందు గొల్ల లందఱును దమ యిండ్లవాకిళ్లను ముంగిళ్లను నింటిలోపలి భాగములను ను జక్కఁగా నూడ్చి చందనజలాదులచేఁ గలయంపిచల్లి యుల్లసిలంజేసిరి. వింతవింతలగు ముక్కియములను బతాకలనును గలువడములను సంతటఁగట్టిరి. మఱియు నందంద పూదండలు పొందుపఱిచిరి. వింతవన్నియలఁ జెన్నారు వస్త్రములను నయ్యైయెడలఁ గట్టిరి. చిగురుటాకుల తోరణములు సెల్లకడలఁ బరిణించుచుండెను, మఱి యావులకును నెద్దులకును దూడలకును బసపు నూనియలను బసమీఱఁబూసి వింత లగుగైరికాదిధాతువ్రులచే రంగులు దీర్చి, నెమలిపించియములదండలను గోమరయిన వలువలను బంగారు మాలికలను సింగారించిరి. రాజా! అంత గోపకులు మిక్కిలియు వెలపొడుగయిన వలువలను గట్టి, యాభరణములను గయిసేసి, మేలయిన కంచుకములను దలచీరలను జెలువారుచు, నానావిధము లయినకానుకల నెత్తికొని నలుగడలనుండి గుంపులు గొనివచ్చిరి. గొల్లపూవుంబోఁడులును జిన్నారి ముద్దులపట్టి తమయశోదకుఁబుట్టినాఁడని యుల్లంబులు ముదంబునఁ బల్లవింపఁ బలువిధము లయినసొమ్ముల నిమ్ముగా నెమ్మేను లలంకరించికొని, మేలయిన పుట్టములుగట్టి, వాలుబెళుకుఁగన్నుంగొనలఁ గాటుకలు నీటుగానిడి, మఱియు మైపూఁతలు మొదలగునెన్నియేని చిన్నెలు గావించుకొని, విరిదమ్మివంటి ముద్దునెమ్మొగంబులందు నవకంపుఁ గుంకుముపూవకరువుల పెంపు యబ్బురంబుసిరిసొంపు సంపాదించుచుండ, నడకయుబ్బున నిబ్బరంపుఁబిఱుఁదులు మురువుసూప, గబ్బిచనుగుబ్బల

ల్లలాడఁ, గానుకలుగొని వేగమ యరుగుదెంచిరి. ఆ యెమ్మెలాం డ్రు జక్కఁగా మెఱుంగుపెట్టినరతనాలకమ్మలు చెవులఁ జవుక ళింప, మెడలయందు మేలి బంగారుపదకములును రంగార, సంబరమున విలువగల యంబరంబులు గట్టి, చేతఁ గడియం బులు ఝణఝణమని మొరయ, నెన్నొసటి ముంగురులు తుంపెసలాడ, బలితంపుఁబాలిండ్లఁ బలుహారంబుల మెఱుం గులు దుఱంగలింప, దారియందు నడకవడిఁ జేసి యగ్గలపుఁ గ్రొమ్ముడులం దిమ్ముగాఁ జెదరిన పూదండలనుండి జలజల మనిపూవులు జడిగొనిగురియ,నందునిమందిరంబునకుఁబోయిరి. ఆ పడఁతులు బాలకునిఁ జూచి 'చిన్నియన్నా! మమ్మెపుడును గావరా!' యని పలుకుచు నాబుడుతనికి దీవన లొసఁగుచు, బస పునూనియలను, బుప్పొడులను, సుధాద్రవ్యచూర్ణములను, పె రుఁగు నీటి ముంపులను నొండొరులపైఁ జల్లుకొని వసంతము లాడుచుఁ గృష్ణునిఁగూర్చి పాడుచును జెలంగుచుండిరి. విశ్వే శ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు నందునిమందయం దుదయింపఁగా నమ్మహోత్సవమునందుఁ బలువిధములయిన వాద్యములు చెలం గెను. గోపకులు, మిక్కిలియు నుబ్బులు మనంబులఁ బ్రబ్బికొనఁ బాలు పెరుఁగు నేతులను, నీటిముంపులను నొండొరులపైఁ జల్లు కొనుచు, వెన్నల నొకరి నొకరు పూయుచును, నిల్లింతయు వసంతము లాడిరి. నందుఁడును మిక్కిలియు వన్నెగాంచిన యు దారమనస్కుండు గాన వారలకును సూతవందిమాగధులకు ను, మఱియు నాయావిద్యల నుపజీవించు తక్కినవారలకును వస్త్రములను భూషణములను వలయు గోధనముల నొసంగి మఱియు వారివారికిఁ దగునట్లు వలసిన కామిత పదార్థములను

మనంబున విన్నన లేక యిచ్చి యొంతయు మన్నించినవాఁడ వ్యే. అంత మహాభాగ్యవతి రోహిణీదేవి (నందుని) గృహాధిదై వత మగువిష్ణువు నారాధించు కొఱకును, దనపుత్త్రుని యభ్యుద యము గోరియు, నందుని మందయందు వసించుచు, దివ్యమా ల్యవస్త్రంబులనుహారనూపురాద్యాభరణంబులనునలంకృతయై, నందుఁడును దక్కిన గొల్లలును దద్దయుఁ బెద్దఱికంబునఁ బాటిం చుచుండ మందయందు నిచ్చలు మెలంగుచుండెను. నందుని మందయందు హరి వసించియుండుటవలన నదిమొదలుగా నది సమస్తము లయినవెంపుసొంపులను బొదలుచు, మహోత్సవ ములు మొదలయినయొప్పిదలకునిప్పయై, లక్ష్మికి విహారస్థానమైవిల సిల్లుచుండెను. నందుఁడంత గోకులమును గాచుచుండుటకుఁదగిన గొల్లలను నియమించి, కంసునికి నేఁటేఁటఁ గట్టుకప్పము నిచ్చి వచ్చుటకై మధురాపురమునకుఁ బోయెను.వసుదేవుఁడును దనకుఁ దోఁబుట్టువువంటియైనానందుఁ డక్కడికి వచ్చియున్నాఁడని విని రాజగుకంసునికిఁ గప్పము గట్టినదియుఁ దెలిసి యతఁడు విడిసి యున్నపట్టునకుఁబోయెను. అతనిని జూడఁగా నందుఁడు ప్రాణములు వచ్చిన దేహముంబోలె దిగ్గనలేచి యెదురుచని యొంతయుఁ బ్రీతిగడలుకొనఁ దన కత్యంతప్రియుం డగునతనిని మక్కువ వెల్లువనవయవంబులువిరవిరఁబోవనిరుకరంబులు సాఁచి బిగియఁ గౌఁగిలించుకొనెను.వసుదేవుండు నట్లు పూజితుఁడై సు ఖంబుగాఁ గూర్చుండి, యాదరంబువడసి యానందుని 'ఆరో గ్యమా' యని కుశలప్రశ్నముఁగావించి యంతఁ దనకన్న యిరు వురు కొడుకులయందు బుద్ధి తనంతఁదగులుపడఁగా నల్లన యత నితో 'అన్నా! పెద్దయుఁ గాలము బిడ్డలు లేకయుండి .వయ

స్సును చాలఁగడచి ముదుసలివై యిఁకఁ బుట్టెడి యాశయెల్ల దిగవిడిచి యుండిననీవు బిడ్డలను గనుట మహాభాగ్యవశము చుమీ! పురుషుఁ డీసంసారచక్రమున మెలంగుచుఁ బుత్త్రరూపమున మరలఁ దాను బుట్టుటయు భాగ్యము. నిన్నుఁ జూడఁగలుగుటయు నెంతయు భాగ్యము. కాకేమి! ప్రియులను జూడఁగలుగుట యెంతో యరిదిచుమీ. ఏలన, ప్రవాహము నిండుకొని పాఱుచుండఁగా నందుఁబడి యిట్టటుఁ దేలుచు నానావిధచేష్టల మెలంగుచుండు తెప్ప లొక్కచో మరలఁగూడికొనుట యరిది. అట్లె యీ సంసారప్రవాహమందు నోలలాడు చున్నసుహృదులు నానావిధము లయినతమతమ కర్మములకు లోనై వచ్చి మరల నింపుసొంపార నొకచోటఁ గూడి మాడి మెలఁగుట యెంతో యబ్బురము చుమీ. నీవును నీ చుట్టాలును వసించి యున్నయీ పెద్దవన మిపుడు పశువులకు ననువై తెవుళ్లు లేక యవ్వారిగా జలమును గడ్డియుఁ బొదరులు మొదలయినవియుఁ గలిగి వెలయుచున్నదే కదా! అన్నా! నీ మందయందు,నాకన్న *చిన్నికొడుకు నిన్నే తండ్రిగా నెన్నుచును,దనతల్లింగూడి మీయిరువురబుజ్జవములఁ బొదలుచును సుఖముగా నున్నాఁడే కదా! ధర్మార్థకామములు మూఁడును బురుషుఁడు తన్నే కాక దేహానుబంధు లయినతనవారిని ననుభవించు నట్లుచేయునేని యట్టివానికే యవి యుక్తములును శాస్త్రసమ్మతములు నగును. వాఁడు తానుమాత్రమే యనుభవించుటవలన నాబం

* ఇట కొడు కనఁగా బలరాముఁడనియు వాని తల్లి రోహిణి యనియు వీరరాఘవులు. కృష్ణుఁడని శ్రీధరాదులు. శ్రీధరానుసారముగా నే పోతనయు కృష్ణుఁడనుటఁ దెలియునది.

ధువులు చింతలవంతలఁ జివుకుచుందురేని, యట్టివాని* కా మూటివలన నొక ప్రయోజనమును గలుగనేరదు' అనెను. నందుఁడు వసుదేవునితో 'అయ్యో! నీకు దేవకియందుఁ బుట్టిన పుత్త్రులను బెక్కండ్ర నా కంసుఁడు చంపినాఁడు. తుదకుఁ గడగొట్టుది యగుకూఁతురొక్కతి మిగిలినది. అదియేని నిలిచెనా! ఆకసమున బుస్సున నెగసిపోయెఁ గదా. మనచేత నేమియగును? జనుఁ డదృష్టమునందు మెలఁగుచు, నది కలిగించు చొప్పున సుఖదుఃఖములు నియతములు కావుగావున నదృష్టమునకు మిక్కిలియు లోనయియుండును. వానికట్లు సుఖదుఃఖములు గలుగుచుండుటయు నదృష్టమే. ఇది యెవఁడెఱుఁగునో వాఁడు మోహమునొందక సుఖదుఃఖముల సమముగానే చూచుచుండును' అనెను. వసుదేవుఁడు, 'నీవు రాజునకు సంవత్సరపుఁ బన్నుకట్టితివి. మమ్మును గంటివి. మేమును నిన్నుఁగంటిమి. ఇచటనే పెక్కుదినము లుండవలదు. గోకులమున నుత్పాతములు దోఁచుచున్నవి. పోయిరమ్మా' యనెను. అట్లు వసుదేవుఁడు చెప్పఁగా నందుఁడు మొదలయిన గోపకు లెద్దులం బూన్చినబండ్లు గట్టుకొని వసుదేవుని వీడుకొని వ్రేపల్లెకుం బోయిరి. ఇది యైదవయధ్యాయము.

---

* మంచిసంతానము గలిగియుండియు నిపుడు కంసునిభయమునఁ గుందుచున్న బంధువులకును దనకును నాసంతాన మనుభవించుపస లేనందున నది యప్రయోజకమే యగునని గూఢార్థము (మునిభావప్రకాశిక.)



1699. పూతనాసంహారము.

## పూతనాసంహారము.

శుకుఁడు——నందుఁడు దారియందుఁ బోవునపు డుత్పాతం బులు కొన్నితోఁపఁగా మందయం దేమి కుందు గలిగెనోయని శంకించి వసుదేవుఁడు పలికినమాట పొల్లుగాదని తలపోయుచు, నేకీడును మూడకుండుటకై గృహదైవంబగు హరిని మనంబున శరణుఁజొచ్చినవాఁడయ్యె. కంసుఁడు పూతనయనెడి యొకరక్క సిని కృష్ణునిఁజంపుటకై పంపియుండెను. అది బాలకులను జంపు నట్టి కట్టిఁడి; చూచుట కెంతయు బెట్టిదముగా నుండును. అది పట్టనములందును బల్లెలందును గొల్లల పట్టులందును గల చిన్నికందువులనెల్లఁ జంపుచును బుడమియందెల్లఁ గ్రుమ్మరు చుండెను. కాని చిన్నికృష్ణునికిఁ దానివలన నేకీడును గలుగునా! భక్తులకుఁ బతియగు భగవంతుని గుణశ్రవణకీర్తనాదులను, రాకాసుల నణఁచుమాడునట్టివానిని, జనులెచ్చటఁ దమతమవ్యా పారములుండియును గావింపకుందురో యచ్చటనే యీరాక్ను లుందురుకాని తద్గుణశ్రవణాదులు గావించుజనులున్నచోట నెంతమాత్ర ముండరు. ఇఁక నాభగవంతుఁడు తానె యున్న చోటఁ జెప్పవలయునా? ఆపూతన యొకనాఁ డాకాశగమన మున నందునిమందను డతెయవచ్చి కామచారిణిగాన మాయ చేతఁ దన నిక్కంపురూపును మఱుఁగుపుచ్చి యబ్బురంబయిన యొఁఅపురూపుదాల్చి యందుఁబ్రవేశించెను. ఆపడఁతి కమ్మతావు లు వెల్లివిరియుచున్న మల్లెవిరులనుగ్రొమ్ముడియందు మురువుగాఁ జెరివికొని నిబ్బరంపుఁబిఱుఁదులయు గుబ్బపాలిండ్లయు వ్రేఁ గున సన్నని నెన్నడుము నకనకలు గుడుచుచుండ, మేలయిన వలువగట్టి యిట్టటు నల్లలాడుచున్న బవిరెలు మొదలగు కెంభూ

షణములకాంతిబృందంబులఁ గ్రందుకొని నిద్దంపుఁమెఱుఁగుఁ
గమ్మలు ముద్దునెమ్మొగంబున కొకవింత మురువు నలవరింపఁగా,
నల్లనల్లన వ్రేపల్లెలోనికి వచ్చెను. మిక్కిలి సొగసుగులుకు
తెలిచిఱునవ్వు మొలకలు తళుకొత్తుచుండ, బెళుకు లడరించుచు
న్న పిసాళికడకంటి వాలారుంజూడ్కులచేఁ బల్లె యందలిగొల్లల
మనంబులనెల్ల నువ్వెత్తుగాఁ జూఱలు గొనుచున్న యాయొఱపు
లాఁడిని జూచి,గోపికలు, తామరపువ్వు కేలందాల్చి యాచక్కని
రూపంబునఁదనపతిని గృష్ణునిఁజూడవచ్చిన లక్ష్మీదేవియగునేమో
యని తలంచిరి. ఆపడఁతి యొకబాలగ్రహము. అది యచ్చట
చ్చటఁగలశిశువుల నరయుచు యాదృచ్ఛికముగా నందునియిలు
దఱియవచ్చెను.ఆబాలకృష్ణుండు,దుష్టజనకులాంతకుండు, తల్పం
బునఁబరుండి యనల్పంబగు తన తేజంబును గప్పిపుచ్చుకొని నివు
ఱుగ్రమ్మిననిప్పువలె నుండుటవలనను దనయుబ్బురంపుఁ జెలువున
కుబ్బరపోయిగొల్లగుబ్బలాండ్రు తనకంకిలి పలుకకున్నందునను,
నాసుందరియేజంకును గొంకును లేకయాబిడ్డనిఁబోయిచూచెను.
ఆభగవంతుఁడో సమస్త చరాచరముల బుద్ధులను గనుఁగొను
చుండు సర్వజ్ఞుండు; కానదానిని బాలకులకు మారికాగ్రహమని
యెఱింగి, కనుఱెప్పలు విప్పకయే తాను మహేశ్వరుం డయ్యు
సంకల్పమాత్రముననే చంపఁజాలు సమర్థుండయ్యును నొక
చిన్నిబాలుని పోఁడిమిని విడంబించుచు నించుకయుఁ బలుకక
యూరకుండెను. దుష్టజనప్రాణహరుం డై స్వభావము చేతనే
సకలజగముల బుద్ధిచేష్టితములనెల్లఁ గనుఁగొనుచుండు నానల్ల
నయ్యును దన్నుఁదుద ముట్టించునంతకుండని తెలియక,మూఢుం
డు నిదురించుచున్న సర్పమును రజ్జువనితలఁచి యొడియందిడుకొ

న్నట్లు, (కాలాది పరిచ్ఛేదరహితుండయ్యు, మానుషచేష్ట నను కరించుటంబట్టి పరిచ్ఛిన్నునివలెఁ జూపట్టుచున్నయా)యనంతుని తనయొడియం దెత్తి యుంచుకొనెను. మెత్తనితోలి యొఱలో నున్న మెఱుంగువాలువలెలోన వాఁడియగు మనంబును వెలుపల నింపయిన కులుకుచెయ్వులును గులుకుచుఁ గలికిమిన్నవలెఁ దళుకొత్తుచున్న యాగయాళినిజూచి దాని యగ్గలంపుఁ బ్రామ్మె ఱుంగుమిటారమునకు నోటువడి తల్లులగురోహిణీయశోద లిరువురు నేమియుననక యూరకచూచుచు నిలుచుండిరి. దాని చన్నులందు వేండ్రమై యఱిగించు కొనరాని విషము తీండ్రించుచుండెను. ఆబెడిదురా లాచిన్నిపాపనిఁ దొడలయం దిడికొని యావిషంపుఁజన్ను నాబుడుతనిచిన్నినోరఁ జొనిపి కుడుపసాగెను. భగవంతుఁడును బిట్టుగాఁ దనరెండుచేతులను నాపాలిండ్లనుబట్టి పీడించి రోషము మీఱ దానిప్రాణములతోఁగూడఁ జనుఁబాలును ద్రావెను. ఇట్లు కృష్ణుండు పాలు గుడుచుచునే దాని జీవమర్మములెల్లఁ గలంచి నలంచుచుండఁగా, 'ఇఁకఁ జాలుఁజాలు. చన్ను విడువు' మనుచు బిగ్గఱనఱచుచు, కన్నులు గిఱ్ఱునఁ దిరుగుడువడఁ, గాలుసేతులు మాటికి విలవిలఁ దన్నుకొన, మేనంతయుఁ జెమ్మటవెల్లి మునిఁగి పాఱ, బిట్టుఁగా గూవెట్టుచు నేలం గూలెను. అట్లది బెట్టిదముగాఁ గూయిడఁగా, నాధ్వని యురవడికిఁ, బుడమి కొండలతోడ నదరెను. ఆకసమందు గ్రహములును బెదరెను. దిక్కులును రసాతలమును మాఱు మ్రోఁగెను. మఱియు జనులు పిడుగులు పడెనోయని శంకించుచు మతితప్పి నేలంబడిరి. ఇట్లు బాలకృష్ణుండు పాలిండ్లనుబట్టి నొక్కఁగా, నారక్కసి నిజరూ

షమును దాల్చి నోరు చక్కఁదెఱచికొని కాలుసేతులు చాఁచి యసువులకుఁ బాసి, యాపల్లెయందు వజ్రముచేతఁ గొట్టువడిన వృత్రాసురునివలె గొబ్బునఁగూలెను. దానిదేహ మట్లు గూలునపు డాఱుక్రోసులదవ్వు మేరలో నున్నవ్రాఁకులన్నియు నుగ్గునూఁచ గావించెను. రాజేంద్రా! దానికళేబరమును జూడఁగా నొక మహాద్భుతముగా నుండెను. దాని కోఱపండ్లు నాఁగటియేడి కోలలవలె నిడుదలై తీండ్రించుచుండెను. కొండగుహాయుంబోని నాసికయు, గండశిలలంబోని పాలిండ్లును గలిగి, విరిసియున్న జుంజుఱు పల్ల తలవెండ్రుకలతో నది చూచుటకెంతయు భయంకరముగా నుండెను. మఱియుఁ జీకటినూతులవలె లోఁతులై యున్నకన్నులును, బెద్ద యిసుకదిబ్బలంబోలిన యగ్గలంపుఁ బిఱుఁదులును, నెంతయు వెఱపుఁగొలుపుచుండెను. దాని కాలుసేతులును దొడలును గట్టిన చాఁగుకట్టలవలెను, గడుపింకిన పెనుమడుగువలెను జూపట్టుచుండెను. గొల్లలును గొల్లపడఁతులును నది గోఁజుచుఁ బెట్టిన బిట్టుకూఁతకే మున్ను గుండెలు బ్రద్దలై చెవులు చిల్లులువడియు తలఁజిమ్మదిరుగుచు నుండిరిగాన, యపుడు కూలియున్న దానికళేబరమును జూడఁగానే యెంతయు దిగులు పడిరి. బాలకృష్ణుఁడో యారక్కసిపెన్నురముపైనే వెఱపు మఱపునులేక క్రీడించుచుండుటం జూచి, గోపికలు వేగ డగ్గఱి, యాజఱభి చచ్చుటకును బాలుండు బ్రతుకుటకును నెంతయు సంబరంబు గడలుకొన నాచిన్నిపాపను బట్టి యెత్తికొనిరి. అంత నాగోపికలును యశోదారోహిణులునుగూడి చిన్నికృష్ణునికిఁ గోవాలముచుట్టి రాఁబడిసి మఱియుఁ దక్కినరక్షలు గావించువారై గోరజముఁజల్లి గోమూత్రమునఁ దడిపి, పిదప గోమయం

బున బాలుని పంచాంగములందును గేశవాదులగు పంచాం డునామము లుచ్చరించుచు నలంది రక్షగావించిరి. ఇట్లుసంభ్రమ వశంబున నాచమింపక యెరక్షగావించి, యంతఁగొంతయూఱట గలుగఁగా గోపికలు విశేషముగా రక్షగావించువారై జలం బుల నాచమనంబులుసేసి, యంతఁ దమకు విష్ణుకవచపఠన యోగ్యతయుఁ దద్బీజస్ఫూర్తియుఁ గలుగుకొఱకు మున్నుగాఁ దమ శరీరములందును గరములందునుఁ దక్కినయంగంబులందు ను నొండొండ*అకారము మొదలుక్షకారమువఱకుఁగలమాతృ కాబీజములు న్యాసము గావించుకొని సదప నాకవచమును జపిం చుచు, బాలుని దేహమందును గరములందును దక్కిన యంగ ములందును బీజన్యాసము నిట్లు గావించిరి. 'కృష్ణా! †నీయఁడు గు లజుండును, నీజానువు లణిముండును, నీతొడలు యజ్ఞుం డును, నీకటితటం బచ్యుతుండును, నీజఠరము హయాస్యుం డును, నీహృదయంబును గేశంబులనును, వస్తినిని (మూత్రకో శంబును) నుదరంబును నీశుండును, గంఠం బినుండును, భుజం బుల విష్ణుండును, ముఖ మురుక్రముండును, మూర్ధంబు నీశ్వ రుండును, రక్షింతురు. ముందుఁ జక్రియువెనుక గదాధరుండగు హరియుఁ, బార్శ్వంబుల ధనువుదాల్చి మధుహుండును, నసి దాల్చి యజనుండును, కోణంబుల శంఖధరుం డగునురుగా యుండును; మీఁదు పేంద్రుండును, గ్రిందుఁ దార్క్ష్యుండును, నంతటను హలధరుం డగుపురుషుండును గాతురు. నీయింద్రి

* ఇట ఆకారాదులు మొదటఁగల భగవన్నామములచే ఘటితిమైన విష్ణుకవచమును ననుసంధించి రక్షఁగావించుటఁ దెలియునది.

† ఇట అంఘ్రి మొదలుకొని శిరఃపర్యంతమును అని క్రమము వివక్షితము.

యంబుల హృషీకేశుండును, ప్రాణంబుల నారాయణుండును, చిత్తంబున శ్వేతద్వీపపతియును, మనంబున యోగేశ్వరుండును, బుద్ధిని బృశ్నిగర్భుండును, జిత్తాహంకారములను భగవంతుండైన పరుండును బాలింతురు. నీవు క్రీడించునపుడు గోవిందుఁడును, శయనించునపుడు మాధవుండును, నడచునపుడు వైకుంఠుండును, గూర్చున్నయెడ శ్రియఃపతియుఁ, గుడుచుతఱిని సర్వగ్రహభయంకరుఁడయిన యజ్ఞభుజుండును, బ్రోతురు. డాకినులును యాతుధానులును గూశ్మాండములును బాపగ్రహములును భూతప్రేతపిశాచములును యక్షరాక్షసవినాయకులును, కోటర, రేవతి, జ్యేష్ఠ, పూతన, మాతృకలు మొదలగువారును, దేహప్రాణేంద్రియములకుఁ గీడుఁగావించు నున్మాదములును, నపస్మారములును, స్వప్నదృష్టములగు మహోత్పాతములును, బాలగ్రహములును వృద్ధగ్రహములును, నందఱును నీ విష్ణునామములను బేర్కొన్నచో భయపడి నశింతురు' అనిరి. ఇట్లు గోపికలందఱును మిక్కిలియు మక్కువలు పిక్కటిల్లఁ గృష్ణునకు రక్షగావించిన పిదపఁ దల్లి యశోద బిడ్డనికిఁ జన్నుఁగుడిపి, శయ్యపైఁ బరుండఁబెట్టి జోలపాడుచు నిదురఁబుచ్చెను. అంత నందాదులయిన గోపకులు మథురనుండి వ్రేపల్లెకువచ్చి పూతన కళేబరమునుజూచి మిక్కిలి యాశ్చర్యము నొందిరి. వారొండొరులతో 'వసుదేవుఁడు చెప్పిన యుత్పాతమే తప్పక కనుపట్టినదిగా! ఆ! అతఁడు తొల్లి యొక ఋషియై యుండి యిప్పుడిట్లు పుట్టియుండును, లేక యెవఁడో యొక యోగీశ్వరుఁడే యిట్లు వచ్చియుండును? కాకున్న నిట్లు చెప్పునా?' యని యాడుకొనిరి. అంత నామందలోనివారు పూతన కళేబరము నొక్కొక్క

యవయవముగా వేఱువేఱ గొడ్డండ్లతోఁదుండించి, దూరమునఁ గొనిపోయివైచి, కట్టియలువానిపైఁ బేర్చి దహనముగావించిరి. ఆకళేబరము కృష్ణుఁడంటి యాడుటవలనఁ దటాలునఁ బాపము లెల్లఁదూలి పవిత్రమగుటంజేసి యది పొగిలి కాలుచున్నపుడు దానినుండి పొగ యగరువాసనలు గుబాళించుచు వెడలెను. పూతన యీలోకములందలి బాలుర కెల్లఘాతుకురాలై నెత్తురు ద్రోలుచుండిన కటికి రాక్షసి; అట్టి కట్టిఁడిది హరినిఁజంపుతలంపు ననే చన్నుగుడిపినదయ్యు, నీగతిని బొందినది. ఇఁక నక్కఱ తోడను భక్తితోడను బరమాత్ముండగు శ్రీకృష్ణునకుఁ గన్న తల్లుల చన్నుఁబాలుం బోలె మిక్కిలియుఁ బ్రియంబయినదేది యేని యర్పించునట్టి భక్తజను లెట్టిగతినొందుదురో చెప్పవల యునా ? భక్తుల హృదయసీమలందు నిరవుకొని యుండునదై లోకవందితులగు వారికిని వందనీయమై యున్నపాదారవింద ద్వయముచే భగవంతుఁ డెవ్వతి దేహముపై దూఁగాడి చన్నుగుడిచి ద్రుక్క ద్రావెనో యట్టి యాకటికి రక్కసి సయి తము నిరతిశయానందరూపుఁడగు నాజగన్నాథునే పొందిన దనఁగా నిఁకఁ గన్నబిడ్డఁ డనిగారామునఁ జేఁపువచ్చినతమ చన్నులపాలను గృష్ణునకు నిచ్చలు గుడిపిన యాతల్లులను, తమపొదుగుల పాలవ్వారిగాఁ గృష్ణుఁడు ద్రావిన యాగోవులను గుఱించియేమిచెప్ప? కైవల్యము(మోక్షము)మొదలయినసకల పురుషార్థముల నొసంగుటకై దేవకికిఁ బుత్రుఁడుగా నవతరించిన యాభగవంతుఁడువారికే మొసంగునో చెప్పవలయునా? ఆమగువ లందఱును, చిన్నికృష్ణునియందుఁ గన్నయల్లారుపట్టి యని గట్టి తలంపు నెపుడును గలిగియుండుటచే రాజా ! అజ్ఞానమువలనఁ

గలుగునట్టి సంసారమువారలకు మరలనెన్నఁడును గలుగనేరదు. మధురకుఁబోయి యుండిన నందాదు లయినవారు పూతనమేని పొగ బుగులుకొనుచున్న మేలివాసనలను దవ్వున మూర్కొని 'ఇది యేమి ? ఎక్కడి నుండివచ్చెను ?' యని వింతగదుర. గుజగుజలు పోవుచు దానిని దెలియుటకై వ్రేపల్లెకుఁ బోయిరి. అచటనున్న గోపకులు, పూతనవచ్చుట మొదలయిన వృత్తాంతములనువర్ణించి చెప్పఁగా విని యట్టికట్టిఁడి రాకాసిపూతనచావునకును, కన్నులు దెఱవని చిన్నికూన కుశలముగాఁ బ్రదుకుటకును, గారణము దెలియ నేరక, మిక్కిలియాశ్చర్యపడిరి. దేశాంతరమునుండి మరలి వచ్చిన నందుఁడు మిక్కిలి యానందము బుద్ధియందుఁ గ్రందుకొనఁ దనబిడ్డనిఁ జేతనెత్తికొని శిరంబు మూర్కొని మిక్కిలియు ముదంబునఁ బొదలుచుండెను. పూతనకు ముక్తినొసంగిన యీకృష్ణుని యద్భుతకర్మమును విని యెవఁడు శ్రద్ధనుగాంచునో యామనుజుఁడు గోవిందునిఁ బొందును. ఇది యాఱవయధ్యాయము,



## శకటాసుర భంజనాదులు.

శుకుఁడు——'ఇట్లు జనార్దనుం డగు కృష్ణుండు, 'దుష్టశిక్షణాదిరూపములగు కర్మములను మఱియునితరము లగు బాలచేష్టితములు పెక్కులును గావించుచు గొల్లలకును వారి సుందరులకును నానందము గలిగించుచు, నందునిమందిరమున నానాఁట బెరుఁగుచుండెను.' అనెను. అందులకు రాజు 'భగవంతుఁడయిన యాయీశ్వరుఁడు హరి, యేయే మత్స్యాద్యవతారములందు నేమేమి గావించెనో, యాయాకర్మములు మాకు వీనుల

కింపై మనంబునకు సొంపు సంపాదించుచున్నవి. మఱియుఁ గృష్ణుని చేష్టితములనువిను పురుష మాత్రునికిని, మనస్సునందలి యరుచియు విషయములందలి తృష్ణయు వీడుచున్నవి; అంతః కరణము శుద్ధమగుచున్నది; హరియందు భక్తియు హరిభక్తుల యందుఁ జెలిమియుఁ గలిగించుచున్నది. అట్టి హరిచేష్టితములనే మనోహరమయిన వానిని నీకుఁ జెప్ప నిష్టముగాఁ దోఁచె నేని చెప్పుము. ఇంతేకాక కృష్ణుఁడు మనుష్యావతారమునొంది యాజాతి లక్షణములనే యనుకరించుచు మరియు నేమేమి యద్భుతములను బాలచేష్టితముల నాచరించెనో వానిని సయితము చెప్పుము' అని యడిగెను. శుకుఁడు 'అంత బాలుఁడొదికిలంబడి వెలికిఁదూఁగాడఁ జొచ్చెను. అందులకై యశోద వేడుక సేసి కొడుకునకు జలక మార్పఁదలఁచి యొకనాఁడు బిడ్డని జన్మ నక్షత్రమును గూడియుండఁగా నిరుగుపొరుగు గొల్ల చెలువలనెల్లఁ బిలిచి, వాద్యములును గీతములును జెలంగ బ్రాహ్మణులు పుణ్యాహవాచనము లొనర్పఁ, గొడుకునకు బోర్కుపోసెను. ఆనందుని సుందరి, విప్రులకు నిష్టమృష్టాన్నములను వస్త్రమాల్యములను నభీష్టములయిన గోవులను నొసంగి మిక్కిలియు బూజించి వారలచే బిడ్డనికి స్వస్త్యయనముఁ గావించి, యంత మజ్జనము మొదలయినవి చేయించి పిదప బిడ్డకుఁ గన్నులనిదుర మబ్బునుగాంచి మెల్లన శయ్యాయందిడి నిదురపుచ్చెను.

## శకటాసురభంజనము.

ఉదారచిత్తయగు నాయశోద యాదూఁగాట వేడుకయందు మనస్సు మరిఁగినదై వచ్చిన గొల్లలనెల్లఁ దగుపూజల గారవించుచుండి యాసంభ్రమమున బిడ్డఁడొఁకొని యేడువఁగానది

వినఁదయ్యెను. ఆపాపఁడును జన్ను గుడువఁగోరి యిట్టట్టు నీల్గి చెలువయిన చిన్ని యడుగులను మీఁదికి విదిల్చెను. అప్పుడున్నట్టుండి యాకసంబుననుండి యొక బండి బాలునిపయిఁబడ వచ్చుచుండెను. దానిక్రింద వ్రేలుచున్న తొట్లయందుఁ బరుండియున్న చిన్నిపాపని లేఁజిగురుటాకులుంబోలె మృదువులయిన చిన్నారి యడుగులతాఁపు వడఁగానే యది దొరగల్లువడి తల్లక్రిందులయ్యెను. అపుడు దాని కన్నులును గమ్మినవ్రాఁకును నొగయును దాఱుమాఱయ్యెను. మఱియు నందుఁ బలువిధములయిన రసములు నించియున్న కంచు పిత్తళి మొదలగు పాత్రములు నుగ్గునూఁచ మయ్యె. ఈవింతను యశోదయుఁ దక్కిన గొల్లచెలువలును మఱి యాదూఁగాట వేడుకకై పేరంటము వచ్చినవారును నందుఁడు మొదలగువారును మిక్కిలి యద్భుతముగాఁ గనఁబడుచుండుటఁ జూచి కారణ మెఱియని తెలియక మనంబులఁ గలంగి 'ఈబండి యెట్లు తనంతట నిట్లు తలక్రిందు లయినదో' యని యొండొరులతో గుజగుజలు వోవుచు నేమియుఁదోఁపక చింతించుచుఁ దబ్బిబ్బున నుబ్బరవోయి యీబిడ్డనికి మూఁడిన బెడఁదకు వెతలఁగుడుచుచు నాబండి చుట్టును బలసికొనియుండిరి. ఇట్లాబండిగాకకును నది యొడ్డగెడవయి పడుటకును గతమిది యని మఱి చుట్టుఁ దేటపడకయున్న యాగోపకులను గోపికలనునుజూచి యాయెడ నాడుచుండిన బాలకులు గొంద అపుడు వారితో 'ఈబిడ్డఁ డేడ్చుచు నడుగు విదిల్చి దీనిని దన్ని గూల్చెను. ఇందులకు సందేహము లే' దనిరి; కాని నందాదు లాబాలుర మాటలను 'బాలకులకు వీరికేమి తెలియు' నని పాటిగా నమ్మరయిరి. ఆయబ్బురపు



1708. శకటాసుర భంజనము.

వింతపాపనికిఁ గల యింతింతనరానిబలమును వారెంతయని యెఱుఁగరుగదా. అంత యశోదవాపోవుచున్న యాచిన్ని పాపని నెత్తికొని బాలగ్రహము సోఁకినదని శంకించి విప్రులను బిలిపించి మంత్రసూక్తములచేఁ బుడుతనికి స్వస్త్యయనమును గావించి, యంతఁ జన్నుఁగుడిపెను. పిదప బలవంతులగు గోపకులు చేరి యాబండిని దాని పరికరములను మునుపటివలెఁ జక్కఁగా నమర్చిరి. విప్రులు గ్రహాదిచేష్టచే నాబండి యట్లయినదను తలంపున గ్రహాది హోమముఁగావించి దానిని పెరుఁగుచేతను నక్షతలచేతను దర్భలచేతను నుదకములచేతను నర్చించిరి. అంత నందగోపాదు లెచ్చరిక లచ్చువడఁ దమలో 'అసూయయు, అనృతమును, *దంభమును, ఈర్ష్యయు, హింసయు, మానమును, దిగవిడిచినవారై 'సత్యశీలు రగునట్టివారలు చేయుదీవనలు, విఫలములు గానేరవని' తలంచి బాలకునిఁ గొంపోయి ద్విజోత్తముల చేతను ఋగ్యజుస్సామమంత్రముల సంస్కృతములై, పవిత్రము లయిన యోషధులతోఁ గూడియున్న జలములచేత నభిషేకము గావించి స్వస్తివాచనికముఁ జేయించి, యంత నుల్లంబులు తెప్పిరిల్ల నగ్నులను వేల్పించి, ద్విజాతులకు షడ్రసోపేతమయిన యన్నములను బెట్టిరి. గుణములన్నియుఁ గలిగి, వస్త్రములచేతను బుష్పదామములచేతను బంగారు మాలికలచేతను నలంకృతములై యున్న గోవులను నందుఁడు కొడుకు నభ్యుదయమునుగోరి, యాద్విజులకు నొసంగెను. మంత్రవిదులయిన యాద్విజులును సమాహితులై యాశీర్వాదముల నొసంగిరి. ఆవిప్రులపు డొసంగిన యాశీర్వాదము లొకానొకప్పుడును నిష్ఫల

* దంభ మనఁగా వంచనము. మాన మనఁగా అహంకారము.

ములు గానేర వనుట నిక్కము. ఒకనాఁడు యశోద తన తొడ

—••◆◆తృణావర్తుని కథ.◆◆••—

పయిని బాపఁడెక్కి కూర్చుండి యంత నొక కొండశిఖరమువలె నెంతయు బరువుకాఁగా నామగువ యాబుడుతనిఁ దాల్పనించు కయు*నోపదయ్యె. ఆగొల్లముగుద యాబిడ్డని దొడ్డబరువున నెంతయుఁబీడితయై మిక్కిలి రిత్తవడి వానినిఁ గ్రిందనిడి యేమో యుత్పాతమిది యని శంకించి పరమపురుషునిమనంబున ధ్యానించుకొని యంత నెప్పటి యింటిపనులయందు మెలంగుచుండెను. తృణావర్తుం డనుదైత్యుఁ డొకఁడు గలఁడు. వాఁడు కంసునిభృత్యుఁడు. వాఁ డాకంసునిపంపున సుడిగాలి రూపమును గయికొని, గోకులమునంతయుఁ గ్రమ్ముకొని దుమ్ములం గన్నులం గుప్పించుచు, మిక్కిలియు బెట్టిదమయిన చప్పుళ్లచేఁ బది దిక్కులనుబూరించుచును నిట్లు సుడియుచువచ్చి యచ్చటఁగూర్చుండి యున్నబిడ్డని జడ్డనఁనెత్తికొని యుప్పరంబున కెగసిపోయెను. వ్రేపల్లెయంతయు ముహూర్తముసేపుదుమ్మును జిమ్మచీఁకటియుఁ గ్రమ్మియుండెను. ఆసమయంబున యశోద తనబిడ్డని మున్నుపెట్టినచోటఁ గానదయ్యె. యశోదయననేల! అందెవ్వఁడు గాని తృణావర్తుఁడు నిగిడించుచున్నమొరపరాలజడియందు నుండి, మతియెంతయు సుడిసి పరునిని, దుదకుఁ దన్నును జూడ నేరఁడయ్యె. ఇట్లాతల్లి తీవ్రమయినసురగాడ్పు గురియుచున్నదుమ్ములజడియందుఁ గన్నకొడుకు పోయినజాడఁ దెలియ నేరక, కన్నక

* తృణావర్తునివలనఁ దన తల్లికి మరణము గలుగకుండుటకును వధ మును గావించుటకును, దల్లి తొడనుండి దిగుటకై కృష్ణుఁ డట్లు బరువయ్యె నని తెలియునది.

దుపుగాన మిక్కిలియు జాలిపుట్టునట్లు తనపట్టిని దలంచుకో నుచుఁ, బల్లటిలుచు, హాయని నేలంబడి దూడమడిసిన యావుం బోలె దుఃఖించెను. అంత నాదుమ్ములజడి కొంతయురవడి యుడుగఁగా,నాయశోద బిడ్డనిఁ దలంచుకొని యేడ్చుచున్నచప్పుడు విని యిరుగుపొరుగు వ్రేఁతలందఱును మనంబుల నెంతయుఁబొక్కుచు, మొగంబులు కన్నీటియందుః మునుంగ, నందులకువచ్చి నందసూనునిఁ జిన్నికృష్ణునిఁగానక తామును రోదనము సేయ సాగిరి. తృణావర్తుఁడు సురగరువలిరూపముదాల్చి కృష్ణునెత్తి కొని పయికి బిరబిరఁబోన నుంకించెనుగాని యాకడిఁదిబిడ్డని బరువున నురవడిదఱిఁగి యెట్లో యాకాశమును జేరెను. కాని, యాబిడ్డఁడు దొడ్డబరువై భరింపరాకుండుటచే నవ్వల నెగయ లేక సుడివడుచుండెను. వాఁడు తనకంటె నాబాలకుఁడు మిక్కిలియు వ్రేఁగయి యుండుటవలన 'వీడు బిడ్డఁడా! దొడ్డఱాయి కాఁబోలు' నని తలంచుచు నాయబ్బురపు పాపఁడు తనమెడ నిఱియఁబట్టుకొని యుండుటచే నాపట్టును విడిపించుకొనఁజాలక తూలుచుండెను. అట్లు హరి తనమెడను బిగియఁబట్టుకొనుటచే నాయసుర కాలుసేయిమెదల్పనైనను లేక, చేష్టలుడిగి కనుగ్రుడ్లువెలికుఱుకఁ, బలుకు కుత్తుకనుండిరాక తడఁబడ,నసువులువీడి బాలునితోడ వ్రేపల్లెయందుఁ గ్రిందఁబడెను. అట్లారక్కసుఁ డాకాశముననుండి పుడమి నొకపెనుశిలపయింబడి యవయవములెల్ల నుగ్గునూఁచమై శివునిబాణముచేఁ దుత్తుమురయి కూలినపురముంబోలె నుండఁగా,నా జెడిదునిఁ బలవించుచున్న యాచెలులెల్ల గుంపులుగూడి చూచిరి. అపు డారక్కసుని ఱొమ్మున వ్రేలుచున్న చిన్నికృష్ణునిఁజూచి యాపడఁతులెంతయు

నాశ్చర్యపడి వానినెత్తికొని తల్లికినొసంగిరి. ఇట్లు రక్కసుఁ డా కసమునకుఁ గొంపోయి చంపఁజూచియు మృత్యువువాఁతనుండి విడివడి కుశలంబువెంపున సొంపారుచున్న యా చిన్నికొమరుని నందుఁడు మొదలయిన గోపకులును గోపికలును మరలఁబడసి యెంతయు సంతోషంబు నొందినవారయిరి.అంత గొల్లలందఱు గుంపులుగొని యొండొరులతో గుజగుజలువ్రొవుచు 'ఔరా! ఈపాపఁడు రక్కసునిచేతికిఁ జిక్కియు నెట్లుతప్పించుకొని మరల మనకుఁదక్కినాఁడే! ఏమాశ్చర్యమిది?' యనిరి.అందుఁగొందఱు 'ఇందేమి వింత! క్రూరుఁ డయినఖలుఁడు తనపాపముచేత నే హతుఁడగుచున్నాఁడు. సాధువగువాఁడో యందఱియెడ సమత్వ మునెఱపి భయమునుండి విడివడుచున్నాఁడు. ఇది సహజమే కదా?' యనిరి. మఱికొందఱు 'మనము పూర్వజన్మంబులనేమి తపమాచరించితిమో! భగవంతు నెంతపూజించితిమో! తటా కాదు లెక్కడఁ గట్టించితిమో! కావుననే యీబాలుఁడు మృత్యువుబారిం బడియు విడివడి తనబంధువుల యుల్లములు పల్లవింపఁజేయుచు భాగ్యవశమున మరల మన కబ్బినాఁడు. మఱియొకవిధమున నిట్టిదియుఁ గలుగునా?' యనిరి. నందుఁడిట్లు మందచుట్టుఁబట్ల నున్న పెద్దవనమునందు నిట్టి యద్భుతములు పెక్కింటినిజూచి యెంతయు వింతపడి వసుదేవుఁడు మున్నాడిన

**{ యశోద చన్నుఁగుడుచునపు డావులించిన కృష్ణునినోర విశ్వరూపమును జూచుట. }**

మాటలు మరల మనంబునఁ దలంచుకొనెను. ఒకనాఁడు యశోద కొడుకునెత్తుకొని యొడియం దిడికొని, ఆబిడ్డనియందలి మక్కువ యెంతయుఁ బిక్కటిల్ల నెయ్యంబు తియ్యంబు సొం

గారుటయుఁ జన్నులుచేఁపురాఁగా బిడ్డనికిఁ జన్నుఁగుడిపెను. అట్లాబిడ తనకొడుకు చన్నుఁగుడిచినపిదపఁ దెలినవ్వు దొలఁకాడు నతని చిన్నిముద్దునెమ్మొగమును నల్లల్లఁ బుడుకుచు నతఁడావులింపఁగా నతనినోర జగమునంతయుఁ జూచెను. ఆజగమునం దాకాశమును రోదసియు శుక్రాంగారకాది జ్యోతిశ్చక్రమును, దిక్కులును, సూర్య చంద్రాగ్నులును, వాయువును, సముద్రములును, పర్వతములును,నదులును,వనములును,స్థావర జంగమాత్మకము లయినసమస్తభూతములనును జూచినదయ్యె. రాజా ! అట్లు జగమునంతయుఁ జూచి తోడనే వడఁకు పుట్టఁగా లేఁడిపిల్లలంబోనిబెళుకుఁగన్నుంగవ గలయాచెలువ కన్నుఁగవ మూసికొని యెంతయుఁ జోద్యపడెను.ఇది యేడవయధ్యాయము.

రామకృష్ణులకు గర్గుఁడు జాతకర్మాది సంస్కారములు చేయుట.విశ్వరూపదర్శన మృద్భక్షణాదులు.

శ్రీశుకుఁడు:—రాజా ! మహాతపస్సంపన్నుఁడగు గర్గుఁడు యదువులకుఁ బురోహితుఁడు. అతఁడు వసుదేవునిపంపున నొకనాఁడు నందునిమందకు వచ్చెను. నందుఁ డతనిని జూడఁగానే మిక్కిలియు సంతోషము గడలుకొనఁగా నంజలిగీలించి లేచి యెదురుచని యతనిని భగవంతుఁడనుబుద్ధిని బ్రణామము లాచరించి యెంతయుఁ బూజించెను. అతనిని సుఖాసీనునిఁ గావించి యతిథి సత్కారము లొనర్చి తియ్యనిపలుకుల నభినందింపఁ జేయుచు నందుఁడు “బ్రాహ్మణోత్తమా! నీకన్నియు నిండియున్నవి; బ్రహ్మానందానుభవ పరిపూర్ణుండవు. నీకపూర్వమయిన దేమి

చేయఁగలము. ఏమియులేదు. 'అన్నియు నిండినవాఁడనేని మీబోఁటిధనికులయిండ్లకేల వచ్చితి' నందువా ? మిముబోఁటి మహాత్ములు తమయాశ్రమములను విడిచివచ్చుట విషయాసంగముచే మనంబులు విన్ననై యుండు మాబోఁటిగృహస్థు లగు మనుష్యుల పరమశ్రేయముకొఱకేకాని స్వార్థమునకుఁ గాదు. మహాత్మా! అది యెందును వేఱొకదానికిఁ గానేరదుసుమీ. ఇంద్రియములను గడచినజ్ఞానమును బడయుటకు సాధనమయిన జ్యోతిశ్శాస్త్రమునే నీయంతట నీవు రచించితివి. దానిచేతనే పురుషుఁడు జరుగునదియు నిఁక జరుగఁగలదియుఁ దెలియుచున్నాఁడు. నీ విట్లు జ్యోతిశ్శాస్త్రకర్తవు. మఱి మంత్రవిధులయందు మిన్నవు. కావున నీబాలు రిరువురకును జాతకర్మాది సంస్కారములుసేయ నెంతయుఁదగుదువు.'నేను మీకుఁ గురుఁడను గానకు. బ్రాహ్మణుఁడు స్వభావముచేత నెల్లవారికిఁ గురుఁడుసుమీ'' యనెను.

గర్గుఁడు;—''నేను యదువుల కాచార్యుఁడనని భూమియందంతటను బ్రసిద్ధి గలిగియున్నది. అట్టినేను నీకొడుకునకు సంస్కారము సేసితేని, పాపమతి యగు కంసుఁడు, వీనిని దేవకి కొడుకని తలంచును. 'నీవు యదుకులాచార్యుఁడ వయిన వీని నెవఁడో యదుకుమారుఁడని తలంచునేకాని వసుదేవుని కొడుకనియు,అందును దేవకియందుఁ బుట్టినవాఁడనియు నెట్లు తలంచునందు'వేని వినుము. నీకును వసుదేవునికి మిక్కిలియుఁ జెలిమి గలదేకదా ! ఆకాశవాణి 'దేవకికి నెనిమిదవచూలు స్త్రీగా నేరదు;పురుషుఁడే కావలయు'నన్నది. దేవకిఁగన్న యాడుకూఁతురు చెప్పినమాటయు విని యున్నాఁడు. కంసుఁ డామాటనుదలంచు

కొని వసుదేవుఁడు నావలన భయమునఁ దనకొడుకును దన మిత్రుఁ డగునందునింట దాఁచియుంచినాఁడని శంకపడి యీ బుడుతనిఁ దెప్పునఁబట్టి చంపును. తుద కిది మాకెంతయు నను చిత మగుచున్నది చుమీ' యనెను.

నందుఁడు 'అట్లేని, నీ వీపల్లెయందు నావా రయినగొల్లలకు సయితము కనఁబడక రహస్యముగా నీ బిడ్డలకు స్వస్తివాచనిక ముచేసి ద్విజులకుంబోలె తూర్యవాద్యములు లేకయె సంస్కారములు గావింపుము' అని మిక్కిలియు వేఁడుకొనెను. ఆబ్రాహ్మణునికి మనసులో నట్లు చేయవలయు ననియొకదా కోరికి. దానినే నందుఁడును బ్రార్థింపఁగా, నమ్ముని యీ యిరువురు బాలుర కును రహస్యమున గూఢుఁడై నామకరణము గావించెను. అం దు మొదట రోహిణికొడుకునకు 'ఈరోహిణీ పుత్త్రుఁడు తన సుగుణములచే సుహృదులనెల్ల రమింపఁజేయుచుండును గాన రా ముఁడని పిలువఁబడును. మఱి బలము మిక్కిలి గలిగి యుండుటచే బలుఁడనియు జనులు తెలియుదురు. యదువులను వేఱుపడనీక యైకమత్యమునకుఁ దెచ్చుటచే*సంకర్షణుఁడనియుజనులు పిలువఁ గోరుదురు. †మఱి యీ రెండవబాలుఁడు ప్రతియుగము దేహ

---

* సంకర్షణః సమ్యక్కర్షతి ఆకర్షతి వైముఖ్యనివర్తనే నైకతాం న యతీతి సంకర్షణః అని వ్యుత్పత్తి. గర్భసంకర్షణాత్సంకర్షణః అనియు, సంకర్షణాఖ్యస్య అనంతస్య అంశత్వాత్సంకర్షణః అనియు వ్యుత్పత్తులు తెలియునది.

† జీవుఁడు ప్రతియుగమున జన్మములొందుట సహజముగాన నాబాలుడు పూర్వ యుగములందు శుక్లాదివర్ణశరీరుఁడై జన్మించినాఁడని ముని దివ్యదృష్టి చేతఁ దెలిసి చెప్పినట్లుగా నందునికిఁ బైకిఁ దోఁచునట్లును వాస్తవమునకు

ములు దాల్చునపుడు,శుక్లము, రక్తము, పీతమను మూఁడువర్ణములుగలిగియుండెను. ఇపుఁడీ యుగమునఁ గృష్ణత్వము నొందెను. *వీఁడు తొల్లియొకప్పుడువసుదేవునకుఁ బుత్త్రుఁడై పుట్టినాఁడు గనుక నీశ్రీమంతుని వాసుదేవుఁడని యభిజ్ఞులు వ్యవహరింతురు.†నీకొడుకునకువీనికినామములునురూపములును పెక్కులుగలవు.అదియతని యాయాగుణములకుఁ గార్యములకు ననురూపములుగానుండును. అది మాబోఁటులకుఁ దెలియునుగాని మీబోఁటులకుఁ దెలియవు. ఈబిడ్డఁడు మీకు మిక్కిలియు శ్రేయమునొడఁగూర్పఁగలఁడు; మఱియు గోపకులకును గోకులమున కంతయును నానందకరుఁడు సుమీ! మీ రీబుడుతనివలన సమస్తములయిన దుఃఖములను దరింపఁగలరు. వ్రజపతీ! తొల్లి యరాజకమైయుండినపుడు దొంగలు సాధుజనములనుబట్టి పీడింపఁగా నపుడు మీపుత్త్రుఁడయినవీఁడు పూర్వజన్మమున వారికిఁ బెంపు సొంపును గలిగి రక్షించినందున వారు చెలరేఁగి ‡యాదస్యులనెల్ల జయిం

---

భగవంతుని యుగముల వర్ణములు చెప్పినట్లును గర్గుఁడు చెప్పుట దెలియునది. అయినను 'కృషిర్భూవాచకశ్శబ్దో ణశ్చ నిర్వృతివాచకః। తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే' అని కృష్ణ శబ్దమునకు మఱియొక వ్యుత్పత్తి.

* ముని దివ్యదృష్టి గలవాఁడు గావున బూర్వజన్మమందు బాలుఁడు వసుదేవునకుఁ బుట్టెనని చెప్పినట్లు నందునికిఁ దోఁపఁజెప్పెను. వాస్తవమును దెలిసియుఁ జెప్పెను.

† ఇట భగవంతుని నానారూపములు నామములు గలిగియుండుటననుసంధించి పైకి జన్మబాహుళ్యముచేత జీవునకుఁగలవిగాఁజెప్పినాఁడని తెలియునది.

‡ ఇట 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' అని భగవంతుని గుఱించిన

చిరి. *మహాభాగా! మానవు లెవ్వ రితనియందుఁ బ్రీతినిగావిం తురో, వారిని విష్ణుపక్షమువారిని నసురులుంబోలె, శత్రువులు క్రిందుపఱుపఁ జాలరు. కావున సిరిచేతను, గీర్తిచేతను, ప్రభావముచేతను, దక్కిన గుణములచేతను, నందుని కొమరుఁ డయిన యీబిడ్డఁడు నారాయణునకు సమానుఁడగును' అనెను. ఇట్లు గర్గుఁడు తనకుఁ దెలిపి నిజగృహమునకుఁ బోవఁగా నందుఁ డెంతయు ముదంబునొంది తన యభీష్టార్థములన్నియు సమకూ డినట్లు తలంచినవాఁ డయ్యెను. నాయనా! కాలము కొంతచ

విశ్వరూప ప్రదర్శనము.

నెను. అపుడు రామకృష్ణు లల్లల్ల ముద్దులుగులుక మ్రోఁకరి ల్లుచును జేతులూఁదుచును బుడమిపయి నడయాడుచుఁ గ్రీడిం పఁదొడఁగిరి. వార లాదియల చిఱుగంటల చప్పుళ్లు బోరుకొన ముద్దులు మూటఁగట్టుచున్న తమచిన్నియడుగుఁదమ్ములను మం దయందు ఱొంపిగలపట్టులయందు మెల్లమెల్లన నీడ్చుకొనుచునో య్యో మాటిమాటికి దూఁగాడుచుందురు. మఱి యెవరేని గొల్ల లిటు నటు పోవుచుండిరేని వారిచప్పుడున కెంతయు మెచ్చి యొకటి రెండడుగులు వారి వెంటంబడి పోవుదురు. అంత వారె

---

విషయమును స్మరించునది. ఇప్పుడును సాధు పరిత్రాణమునకే పుట్టినాఁడని భావము స్ఫురించుచున్నది.

* ఇట శత్రువులనఁగా ప్రకృతి సంబంధప్రయుక్తము లయినకామ క్రోధాదులనియు, నితనియందు భక్తిగలవా రాక్రోధాదులను జయించి ముక్తి నొందుదురనియు,విష్ణుపక్షమువారనుటచే నితండు సాక్షాద్విష్ణువనియు నంద్రా దులగుమీరు విష్ణుపక్షము వారయిన దేవతలనియుఁ గంసాదు లసురులనియు నభిప్రాయము సూచితమగుటఁ దెలియనగు.

త్తుకొనరాఁగా నేమియుఁ దెలియని వారివలె మిక్కిలి వెఱపు నొంది యంత ననుఁగుదల్లులున్న కడకుఁ దాటిపోయి దాఁగికొందురు. ఆముద్దుబిడ్డ లట్లు కదియరాఁగా నాతల్లు లెంతయు గారాము పొదలుటచేఁ జన్నులుచేఁపఁగా దమ రెండు చేతులను జాఁచి దుమ్ముల బ్రుంగియుండం బైయున్నయా మేనులం బిగియఁ గౌఁగిలించికొని వారి నోడియం దిడికొని చన్నుఁ గుడుపుదురు. వా రట్లు పాలుగుడుచుచుండునపుడు, మృదువయిన చిన్ని లేఁతనవ్వు దొలఁకుచు, మొలచుచున్న చిఱుపండ్లతోఁ గూడియున్నవారి చిన్నారి నెమ్మొగములను గన్నారఁ జూచి యెంతయు నుప్పొంగుచుందురు. మఱియు నాకుమారులు ముద్దియలకుఁ దద్దయును గనుఁబండువులు గూర్చు నవకంపుఁజెయ్వులు సేయుచు లేఁదూడల తోఁకలను బట్టికొని యిటునటు నదియీడ్చుకొని పోవుచుండఁగా విడువక వారి వెంటంబడి పోవునపుడు నా మందయందుఁగల సుందరు లావేడుకను జూచుచుఁ బకపక నవ్వుచు నింటి పనులు సయితము మఱచి సంతసంబునఁ దెప్పలు దేలుచుందురు. ఇట్లు తమ చిన్నారికొమరు లాటలవెల్లున మరిగి యించుకసేపును గాలుసేయి నిలువక యిటునటుఁదాఁటుచుఁ బాఱుచు నుండుటవలన జింకలు మొదలగుకొమ్ములమెకముల వలనను, కుక్కలు మొదలగు గోఱలవానివలనను, నెమళ్లు మొదలగు పిట్టలవలనను, పాముఁలవలనను, జలమువలనను, నగ్నివలనను, ముండ్లవలనను వారిని బోనీయక వారించుచుండుటకును నింటి పనులు సేసికొనుచుండుటకును వారితల్లులకు నొక్కటి జతపడదయ్యె. రెండును నేకకాలమున నెట్లు పొసఁగును? కాన వారికి మన సెంతయుఁ గుదురు తప్పి తుకతుకపడుచుండెను.

రాజర్షి ! అంతఁ గొంతకాలముచనఁగా వ్రేపల్లెయందు బలరా ముఁడును గృష్ణుఁడును, నొకప్పుడు మోఁకాళ్ల నీడ్చుకొని దూఁగాడుచును, నొకప్పుడు మెల్లగానడుగులపై నిలిచియల్లల్లనడచుచును, దిగ్గనచిఱుగంతులువైచుచు, నుండిరి. అంత భగవంతుఁడగుకృష్ణుఁడు తనయీడువారయిన గోపబాలురను బలరామునిఁగూడికొని పెక్కులు క్రీడలాడుచు వ్రేపల్లె సిరుల కెంతయు ముదము గావించెను. అంత గొల్లచెలువలు కృష్ణుఁడు పిన్నతనమునుబట్టి చెన్నయ్యు సయింపరాని దుడుకులు సేయుటను జూచి యోఁగలేక యందఱునుగూడివచ్చి యశోదకు నాదుడుకులను వినిపించువారై 'అమ్మా! నీకొడుకు వేళగానపుడు, దూడలను త్రాళ్లువిడిచి పుచ్చి యందులకు గొల్లలు 'వలదురా' యని బిగ్గఱ మొఱయిడఁగా జూచి పకపక నవ్వుచున్నాఁడు. మఱి పాలును బెరుఁగును దియ్యనివానిని మమ్మడుగకయె యెట్లో దొంగిలి తినుచున్నాఁడు. మఱియు నపహరించుటకుఁ బెక్కులుపాయములు పన్ని వానిని దొంగిలి తాను గడుపారఁ గుడుచుటయె చాలక మిగిలిన వానిని గోఁతులకు బాలు పుచ్చుచున్నాఁడు. అందే దేని కుత్తుకబంటియై తనివినొంది తినకపోయెనేని మిగిలిన వెన్నయిన మాకు దక్కనియ్యరాదా ! అట్లు సేయక యావెన్న తోఁగుండను బగులఁగొట్టి యంతయు నేలపాలు సేయుచున్నాఁడు. మఱి వెన్న పాలు దొరకక పోయెనా, మా యింటివారిపైఁ గినిసిపడుచుఁ దొట్లను నుయ్యేలలను బరుండి నిదురించుచున్న బిడ్డలను నావురని పట్టి యేడ్పించి యంతట నుఱుకుచున్నాఁడు. పాలు పెరుఁగు కుండలను వానిచేతి కందక పొడువునఁ బెట్టితిమా, పీటల నొకటిపై నొకటిగా నిడియో, ఱోలు

దిరుగవేసియో, మఱియేవేని పన్నియో, దానినిబట్టి యెత్తుకొను నుపాయము చేయక విడువఁడు. మఱి యుట్లయందలి కుండలలో బాలు పెరుఁగు లున్నసడి యెట్లోపసివట్టి యది పడయునుపాయములను దెలిసినవాఁడై వాని క్రిందఁ దూఁటులొనరించి పాలు వెన్నలఁ జేరలఁబట్టి త్రావుచుండును. మఱియు గోపికలు తమ యింటిపనులయందు మనస్సులు మిక్కిలి మరగియుండు తఱినిజూచి తనకు వెలిచి చీఁకటింట నేవేని పదిలపఱచియున్న ను,చీఁకటియందున్న వస్తువులను బ్రకాశింపఁజేయు నట్టిమెఱుఁగు లడరించుమేలయినమణులు దాపినసొమ్ములను దనమేనఁ దాల్చి యట్టిగదులందుఁ జొరఁబడి వలయువాని నెత్తికొని పోవును. ఇట్టి దుడుకులనెత్తిచెప్పి 'యోరీ దొంగవురా!'యంటిమా 'ఓసీ! నీవే దొంగవే! 'నేనింటి సొంతగాఁడను' అని బింకము లెత్తి దిట్టగాఁ బలుకుచున్నాఁడు. మఱియు మా పూజాగృహములఁ జొచ్చి 'వలదురా' యనుచుండఁగనే వానిపయి మూత్రాదులువిడిచి యెంగిలి సేయుచున్నాఁడు. ఇట్లు పెక్కు దొంగలించుట కుపాయములు పన్ని యన్నిపనులు చేసి తీర్చి యిపుడునీకడ నేమియుఁ జేసియెఱుఁగని గోలవలె నున్నాఁడుగదే' యనిరి. ఇట్లు చెలువలు చెప్పుచుండఁగాఁ గృష్ణుం డందులకు దిగులుగొన్నట్లు వెఱపును నడఁకువయును బెంపుసొంపారు ముద్దుమొగముతో వారికిఁ గనుపట్టుచుండెను. వారతని దుండగములన్నియుఁ జెప్పఁగా యశోద యందుల కూరక మొగమున నవ్వు దొలంకుచుండినదిగాని తన పట్టి నించుకయు బెదరింప నోఁపినదిగాదయ్యె. (ఒకప్పుడు కృష్ణుఁడు పెక్కురూపముల పెక్కుగోపికల యిండ్లలోఁ జొరఁబడియుండెను. అప్పు డా

గోపికలు తమతమయింట నున్నయాయాకృష్ణుని వేఱువేఱఁ బట్టుకొని యందఱు నొక్కచోటఁ బెట్టి నతని తప్పును యశోదకుఁ జెప్పుటకు నొకప్పుడే బయలుదేఱి పోవఁగా నచ్చట యశోద కడను నాకృష్ణుఁడే యుండెను. తాము పట్టుకొనివచ్చిన యాయా కృష్ణుఁడో కనఁబడఁడయ్యె. అంత వారంద ఱగ్గలంబుగ సిగ్గులు నెక్కొన నేమియుఁ బలుకక తమ యిండ్లకు మరలి పోయిరి.)
ఒకనాఁడు రాముఁడు మొదలయిన గొల్లపిల్లవార లాడుకొను చుండిరి. అప్పుడు వారు 'కృష్ణుఁడు మన్నుదినె'నని నతని తల్లి యగుయశోదతోఁ బోయి చెప్పిరి. ఆ చెలువ చిన్నికృష్ణుని మేలుగోరి యట్లు చేయకుండునట్లు వారించునదై యతనిని జేతం బట్టుకొని, దిగులు గదిరి బెదరుఁగన్నులతోఁ దన్నుఁ జూచు చున్న యాచిన్నికుఱ్ఱనితో 'పలుగాకీ ! నీవు మన్నెందులకు రహస్యముగాఁ దింటివి? నీతోడివార లయినయీపిల్లవాండ్రంద ఱును నీయన్న యీరాముఁడును నీవు తింటివని చెప్పుచున్నారే' యని గద్దించి యడిగెను. అందులకుఁ గృష్ణుఁడు 'అమ్మా ! నేను మన్ను దిననేలేదు. వీ రందఱును వట్టి కల్లలాడుచున్నారు. వారి మాటలు నిజమని తలంచితివేని నీవే నానోరు వాసన చూడుము' అనెను. యశోద 'అట్లేని నోరు తెఱవు' మని చెప్పఁగా నాభగవంతుఁడు హరియు, నోరు తెఱచి చూపె ను. అతఁడు క్రీడార్థ మట్లు మనుష్యబాలకుం డయినవాఁడే కాన యతని యైశ్వరత్వ మిసుమంతయుఁ గుంటువడెనా ?
(ఆయమ యాబిడ్డని ముఖమందు స్థావరజంగమాత్మకమగువిశ్వ మునంతయుఁ జూచెను. అంతరాకాశమును దిక్కులును బర్వత ద్వీప.సముద్రములతోఁ గూడినభూగోళమును, ప్రవహావాయువు,

వైద్యుతంబయిన యగ్నియుఁ జంద్రుఁడును నక్షత్రములు నను వీనితోఁగూడిన జ్యోతిశ్చక్రమును, ఆవరణజలమును, సూర్యాది జ్యోతులును, ఆకాశమును, స్వర్గలోకమును, అతలాదులును, సాత్త్వికాహంకారకార్యములయిన శ్రోత్రము మొదలయిన పదియింద్రియములును, మనస్సును దామసములగు శబ్దాది తన్మాత్రలయిదును, సత్త్వరజస్తమస్సులను మూఁడుగుణము లును జూపట్టెను. ఇట్లు జీవులును దదుత్పత్తినిమిత్తం(గుణ క్షోభకం)బగు కాలమును, బరిణామహేతువగు స్వభావమును, జన్మహేతువగు కర్మమును, వాసనయును, నను నిత్తెఱంగులచే నానా శరీరభేదములు గలిగి విచిత్రమయి యున్నయాజగత్తునం తయును,దనకొడుకును, వ్రేపల్లెను,దన్నును,నిట్లుసమస్తజగత్తును దనచిన్నికొడుకు నోరుదెఱవఁగా నతనిదేహములో నుండుటను జూచి శంకనొందినదై "ఏమిది! ఈ చిన్నినిసువునోర విశ్వమం తయుఁ గనుపట్టుచున్నదే! ఇదిస్వప్నమా! మేలుకొనియున్నానే. స్వప్నమెక్కడిది! దేవమాయయో! అట్లేని ఘటపటాదుల నన్నియు నేలచూడకున్నది? లేక నాబుద్ధి తబ్బిబ్బుపడెనా? అట్లేని మరల మరలఁ జూచినను, మునుపటివలెనే కనఁబడుట యెట్లు? కాదేని నాబిడ్డఁడయినవీనికి నచింత్యంబై స్వాభావిక మైయున్న*పరమాత్మయోగ మిందులకు మూలమా? బుద్ధిచే తను మనోవ్యాపారముచేతను వాక్కుచేతనుగలరూపుననిట్టిదట్టి దని వితర్కింపరానిదై యున్నయీవిశ్వమున కెద్దియాధారమో, దేనివలనఁ బుట్టుచున్నదో, యెందు నడఁగుచున్నదో, యిట్టిదట్టి

---

*పరమాత్మలక్షణమగు కుక్షిస్థసమస్తవిశ్వత్వాది కల్యాణగుణ యోగము చేత నయినదియా? యని యర్థము.

దని యూహింపరానిదై ముముక్షుప్రాప్యమైన పదంబగు నాపరమాత్మస్వరూపమునకుం బ్రణమిల్లినదానను. 'నాకీనందుఁడు పెనిమిటి, వీఁడు నాకొడుకు, ఈగోపకులును గోధనములును గోపికలును నాయవి. మందకధిపతియగు నందుని సమస్త ద్రవ్యమునకు రక్షకురాలను నేను' అని యిట్లు నేను నాదియనెడి యహంమతిరూపమయిన యీచెడుబుద్ధి యెవనిమాయ (సంకల్పము)చేతఁ గలిగినదో యాభగవంతుఁడు నాకుదిక్కు. (నాకుబుద్ధి నివర్తింపఁజేయు నుపాయము)" అని వితర్కించెను. ఇట్లు గోపికకృష్ణుని యథార్థస్వరూపము నెఱింగినంతనే యాయీశ్వరుఁడును వైష్ణవంబగు తనమాయను నిగిడించెను. అంత నాకాంత యీశ్వరుం డనుమతి విగవిడిచి కన్నకొడుకని నెయ్యమతియ్యము నెఱపసాగెను. ఆచెలువ తోడనే పుత్త్రునియందుఁ బరమాత్ముం డను తనతొంటిస్మృతి దూలఁగా, బిడ్డనిఁ దొడపై నెక్కించుకొనిమునుపటివలె నెమ్మనంబున నెయ్యముప్పొంగి చెలంగుచుండెను. మూఁడు వేదములచేతను నుపనిషత్తులచేతను సాంఖ్య (జ్ఞాన) యోగ(కర్మ)ములచేతను దదనుగృహీతమైన భక్తియోగము చేతను, పాంచరాత్ర సంహితలచేతను బరవ్యూహ విభవార్చారూపముల నెవ్వనిమాహాత్మ్యము నుపగానముచేయంబడునో యట్టిహరిని నాపడఁతి దనకన్నబిడ్డనిఁగాఁ దలంచినఁదయ్యొ.

రాజు 'బ్రహ్మణోత్తమా! మహాఫలముతోఁగూడిన యిట్టి మేలును బొందుటకై నందుఁడు తొల్లి యేమిచేసెను? హరికిఁ జన్నులుగుడుపునట్టి తల్లిగా నుండుమహాభాగ్యమునకు నోఁచిన యాయశోదయు మున్నేమి పుణ్యముచేసినది? ఆకృష్ణుని యుదారములగు బాలచేష్టితములను విన్నను వాకొన్నను జనుల పాప

ములనెల్ల నపహరించునట్టి వానిని,నారదాదికవులెప్పుడును విడు వక పాడుచుండునట్టివానిని, కడుపునమోచి కన్న యాతల్లిదండ్రులు దేవకీవసుదేవు లనుభవింప రయిరేల'? యని యడిగెను. శుకుఁడు 'ద్రోణుండనువాఁడు వసువులందు ముఖ్యుఁడు. అతని భార్య ధర. వారినిద్దఱను బ్రహ్మ భూమియందుఁ బుట్టుడని పంపఁగా నాపంపుసేయువారై వారద్దేవునితో 'మే మిరువురము భూమియందుఁ బుట్టియున్నపుడు మాకు మహాదేవుఁడును విశ్వేశ్వరుండును నగుహరియందుఁ బరమం బయిన భక్తిగలుగు నట్లనుగ్రహింపవలయును. అట్టిభక్తివలన దుస్తరంబును సంసృతి నిమిత్తంబును నగుపాపంబు దరింపవచ్చునుగదే' యనివేఁడుకొనిరి. ఆబ్రహ్మయు 'అట్లే యగుఁగాక'యని చెప్పెను. ఆపూజ్యుం డగు ద్రోణుఁడే యీనందుఁడై మందయందుఁ బుట్టెను. ఆధరయు యశోదయయ్యెను. అంత నామందయందలి గోపగోపీజనులలోపల నాదంపతులగు నందయశోదల కిరువురకును బుత్రుండయి పుట్టినభగవంతుఁడగుహరియందుఁబ్రేమ పంబగు భక్తి యుత్పత్తిల్లెను. విభుండు కృష్ణుండు*బ్రహ్మయాజ్ఞను సత్యముగా వించువాఁడై వ్రేపల్లెయందు రామునితోడఁబుట్టి వసించియుండి తన యద్భుతరంపులీలలచేత వారి నలరించుచుండెను. ఇది యెనిమిదవ యధ్యాయము.

---

### యశోద కృష్ణుని ఱోటియందుఁ గట్టుట.

ఒకనాఁడు యశోద తనయింటఁ గలపనికత్తియ లందఱును

---

* బ్రహ్మ యాదేశమే నందయశోదలకట్టి శ్రేయముగలుగుటకును, దేవకీవసుదేవులకు కృష్ణబాల్యలీలానుభవముగలుగకపోవుటకును మూలమని తెలియునది.

వేలువేలు పనులయందు నియమించియుండెను; కాన పెరుఁగు చిలుకుట కొక్కతియు లేనందునఁ దానే చిలుకఁదొడంగెను. అట్లు పెరుఁగు చిలుకునపుడు చిన్నికృష్ణుని బాలచరితములనుగుఱించి కవులు రచించియున్న యాయాపాటలనెల్లఁ దలంచుకొనిపాడు చునుండెను. అపు డాపువుఁబోఁడి విరివియైనకటితటమున మురువైన వెలిపట్టుచీరగట్టి దానిపై మొలనూలువైచి బిగించియుండెను. సొగసుంగనుబొమలు గలయాకొమ్మ చిలుకునపుడు నెమ్మేనుదీవియ యిట్టట్టు నల్లలాడ, బిడ్డనియెడ నెయ్యమునఁ జన్నుఁదోయిచేఁపుచుండ, నాకత్రాళ్లను బట్టిలాగుచుండుటచే సందిటియందును జేతులయందును గలకడియములు గల్లుగల్లుమని మొరయఁ, గమ్మలు చెక్కులయందు నల్లలాడుచు ధగధగమెఱుంగులీన, నెమ్మొగంబును జెమ్మటనీటఁదొప్పఁదోగఁ, గొప్పునందుఁ జెఱివినజాజిపువ్వులు జలజలనురుల, పెరుఁగు తఱచుచుండెను. అపుడు కృష్ణుఁ డాఁకొని చన్నుఁగుడువంగోరుచుఁ దనగన్నతల్లి పెరుఁగు చిలుకుచుండఁగా నల్లన దగ్గఱిల్లి కవ్వమును బట్టుకొని చిలుకనీయక వారించెను. అదియు నాతల్లికి నెంతో సంతసముగానుండెను. యశోద చిలునవ్వుదొలఁక బిడ్డని ముద్దునెమ్మొగమును బుడుకుచు నెయ్యమునఁ జన్నులు పాలుపొంగారఁ బిడ్డనిఁ దొడపయినిడికొని చన్నుఁ గుడుపుచుండెను. ఇంతలోఁ బొయ్యిమీఁదనుంచిన పాలుపొంగారుచుండుట దెలసిదానిని దించివత్తునని చన్నుఁ గడుపారఁగుడువకున్న చిన్నికొమరునిఁ గ్రిందవిడిచి వేగమునంబోయెను. అందుల కాబాలుఁడు మిక్కిలియుఁ గోపమునొంది తన యెఱ్ఱనిచిగురు పెదవినిఁ బంటఁగొఱుకుచుఁ గల్లకన్నీరుకాఱుచుండ వాఁడిఱాతి నొకటింగొని పెరుఁగు చిలుకు

కుండను బఱ్ఱియలుగావించెను. అంతటితో విడువక యింటిలోని కిఁజొచ్చి యందున్న పచ్చివెన్ననంతయుఁ దినెను. ఆగొల్లచెలువ పాలు చక్కఁగాఁ గాఁగినవెనుకఁ బ్రొయ్యినుండి దింపి మరల నచ్చటికివచ్చి పఱిలయియున్న పెరుఁగుకుండను జూచి యదితన కొడుకు దుడుకుపని యని నవ్వెను.కాని కొడుకో యెక్కడఁ గనఁబడఁడయ్యె. బిడ్డఁ డెక్కడఁబోయెనో యని లోపలి కరిగి

## యమలార్జున భంజనము.

చూరయఁగా నందొక్కెడ ఱోలుదిరుగవేసి దానిపయినెక్కి నిలుచుకొని కుండయందలి వెన్న నెత్తి యొకకోఁతికి విచ్చలవిడిఁ దెలినవ్వుమొలకొత్తుచుండ నిచ్చుచుఁ దన దొంగతనమున కెవ్వరువత్తురోయని జంకుచూపులు నలుగడల నిగిడించుచు నున్న కృష్ణునిఁజూచెను.అట్లు చూచి చప్పుడు సేయక మెల్లమెల్లగా సెలగోల యెత్తికొని వానిపిఱుందఁదఱియ వచ్చెను. అంత నా బాలుఁడు యశోద కోలపట్టికొని వచ్చుటనుజూచి వేగిరపడి ఱోలినుండి క్రిందికి దూఁకి బెదరినవానివలె దిగ్గనఁ బాఱిపోయెను. ఆగొల్లచెలువయు, యోగులు తపఃప్రేరితంబులయిన మనంబులచే నెవ్వనిని జొర నలవిగాకుందురో, యట్టి పరమపురుషుని వెంటఁ బరువిడఁ జొచ్చెను. ఇట్లు తల్లి పరుగిడుటంజేసి యసియాడుచున్న బలితంపుఁ బిఱుందుల పెనువ్రేఁగున నడతొట్రిలంబడఁగా, సన్నని నెన్నడుము జవ్వాడఁగాఁ, గొప్పముడి ప్రిదిలి యందుఁ జెరివిన పూవులు వెంట రాలుచురాఁగా, వేగమునఁబాఱి యా బాలునిఁ బట్టుకొనెను. ఇట్లు తప్పుగావించి యూరక యేడ్చుచుఁ, గన్నుల యందలి కాటుక నలుగడలఁబొలయునట్లు చేతితో నులుముకొనుచు, భయంబునఁ గన్నులు సుడివడ, నేప్రక్క వచ్చునో

యని పయికిఁ జూడ్కుల నిగిడించుచు నున్నయాచిన్నికృష్ణునిఁ బాఱి చేతఁబట్టికొని, బెదరించుచుఁ గొట్టఁదలంచెను. కాని యందులకు బిడ్డఁ డెంతయు దిగులుగొన్నాఁడని తలంచి కన్న కడుపుగాన బిడ్డని యందలి మక్కువ పిక్కటిల్లఁ జేతనున్నకోల దిగవైచి బాలుని ప్రభావమును జక్కఁ దెలియని ముద్దరాలుగాన త్రాటిచేత వానిని గట్టఁ దలంచెనఁట! ఎవ్వనిఁ వెలియులోనును మొదలును దుదియులేవో, జగము తుదియు మొదలును వెలియునులోనును దానై వ్యాపించి యుండువాఁ ను, జగమేతానై యుండువాఁడు నెవ్వఁడో, యట్టి సర్వజగచ్ఛ కుఁడును సర్వ వ్యాపియు నగునధోక్షజుని హరిని నవ్యక్తుసిఁ నిన్న కొడుకని తలఁచి యాగొల్లమగువ సామాన్యుఁడగు లునివలె ఱోలి యందు నొక త్రాడుదెచ్చి బంధించినదయ్యె. ట్లు తనబిడ్డఁడు తప్పు చేసినందుల కాత్రాటిని వాని నడుము గట్టఁగా నది రెండంగుళములు కొఱఁతపడెను. అంత నా మఱియొక త్రాటిని దానితో ముడివేసెనుగాని యదియు జాలక తక్కువ పడెను. దానితో వేఱొక దారమును గూ నుగాని యదియు మునుపటివలె రెండంగుళములే వెలితిచూ ను మఱి యేయే దారమునుదెచ్చి ముడివేసి చుట్టు పెనఁచినను ట్లే కడమపడు చుండెను. ఇట్లు యశోద తనయింటిలోపల త్రాళ్లనన్నిం టినిదెచ్చిముడివేసిన నవి యాకుఱ్ఱని కడుపుచు రిగిరావయ్యె అపు డాయమ తక్కినగోపిక లెల్ల నాశ్చర్య చుండఁ దానును నవ్వుచు నాశ్చర్యపరవశయయ్యెను. అట్లు ల్లి మేనంతయుఁ జెమ్మటవెల్లువ మునుంగఁబాఱ, కొప్పును విరిసరులుజాఱ, మిక్కిలి శ్రమపడుచుండుటను జూచి కృష్ణుఁ రుణఁజేసి తల్లి

కట్టునకు లోఁబడెను. నాయనా! బ్రహ్మాదులయిన యీశ్వరులును వారు పాలించు నీజగమును నెవ్వనికి లోనయివర్తించుచుందునో, యట్టి స్వతంత్రుఁడగు పరమపురుషుండు కృష్ణుఁడు తాను భక్తులకుమాత్రము పరతంత్రుఁడగుటను నిట్లు చూపినవాఁడయ్యెను. గోపిక యగుయశోద మోక్షప్రదుం డగుభగవంతునివలనఁ బొందినయట్టియీప్రసాదమును, బ్రహ్మగాని రుద్రుఁడుగాని విష్ణునివక్షఃస్థలమునందే వసించియుండు లక్ష్మిగాని పడసినవారు గారు. భక్తిగలవారై భవసముద్రమును దన్నుఁ దెప్పఁగాఁగొని తరించునట్టి జ్ఞానులకు సుఖము నొసంగునట్లు, గొల్ల చెలువకొమరుఁ డయినభగవంతుఁడు తక్కిన దేహులకు సుఖప్రదుఁడు గానేరఁడు. అంతఁ దల్లి యశోద గృహకృత్యములందు మరిగియుండఁగా, కుబేరునికొడుకు లయిననలకూబరమణిగ్రీవు లనెడియిరువురు యక్షులు తొల్లి శ్రీమంతులయియుండి మదంబునఁ గన్నుగానకుండినందున నారదుని శాపముచేత మద్దిచెట్లయి యుండఁగాఁ జూచెను. ఇది తొమ్మిదవయధ్యాయము.

---

## యమలార్జునభంజనము.

రాజు—'మహాత్మా! ఆయక్షు లిరువు రేమి నింద్యమగు కార్యము చేసినందులకు దేవర్షి వారియెడఁ గుపితుఁడయ్యెను? ఆశాపమునకుఁ గలకారణమునంతయు నాకు వివరించి చెప్పు' మని యడిగెను.

శ్రీశుకుఁడు—కుబేరునికి నలకూబరమణిగ్రీవు లనెడి యిరువురు కుమారులు గలరు. వారు శివునకు ననుచరులై కొలుచుచుండిరి. వారు రాపెంపున మిక్కిలియు విఱ్ఱవీఁగి మదముచేఁ బద

టమునొంది కైలాసమున మందాకిని పొంతఁ జెన్నుగాఁ బూచి యున్న యొక రమణీయమయిన యుపవనమందు వారుణియను మద్యముఁ ద్రావి యామత్తుచేఁ గన్నులు దిరుగుడుపడుచుండఁగాఁ, దమవెంటఁ బూవుంబోఁడులు నింపారుపాటలు పాడుచు ననుసరింప, నిందందు సంచరించుచుండిరి. వారు గంగానదియందు రంగారుచున్న తామరపువ్వులంపరలఁ జొంపములందుఁ జొచ్చి యెలప్రాయంపుగుబ్బలాండ్రఁ గూడి యాఁడుగజముల తోడ మదపుటేనుంగులుంబోలెఁ గ్రీడించుచుండిరి. కౌరవా! అంత దైవయోగమున దేవర్షి యగు నారదుఁ డక్కడికివచ్చి యాయక్షు లిరువురనుజూచి వారు మదాంధులై మయిమఱచి యున్నారని తెలిసికొనెను. అమ్మునినిజూచి వారిముద్దియలు దిగంబరలై యున్న కతంబునఁ దద్దయు సిగ్గుపడి యమ్ముని శపించునని జంకి, వేగమున వలువలు గట్టికొనిరి. ఆయక్షు లిద్దఱును వివస్త్రులై యుండిరేకాని యట్లు సేయరయిరి. అట్లు కుబేరుని కొడుకులు సిరిమత్తునఁ గన్నుఁగానకయు నటమీఁద మద్యము ద్రావుటచే మఱింత మైమఱచియు నుండుటను జూచి వారి కామదాంధత్వము నుడిపి యనుగ్రహించుకొఱకు శాపమొసంగువాఁడై యిట్లొక గీతము పాడెను. 'ప్రియములయినవానిని సేవించుచుండు పురుషునికి సంపత్తివలనఁ గలుగు మదమెట్లో యట్లు తక్కిన యాభిజాత్యము మొదలగునవి యెవ్వియు నంతగా బుద్ధిని దూలింపవు; మఱియు రజోగుణకార్యములగు కామక్రోధాదులను గలిగింపను జాలవు. ఆసంపత్తివలని మదము గలచోటనే, స్త్రీ జూదము మొదలయిన వ్యసనములు గదిసియుండును. మఱియు నెచట సిరిమదము

గలిసియుండునో? యచట నీదేహమునకు జరామరణములు లే వనియుం దలంచుచు, నందువలననే నింద్రియములను జయింప లేక, దానివలన దయమాలి పశువులనుబట్టి చంపుచుందురు. నరదేవుఁడు భూదేవుఁడు స్వర్దేవుఁడని దేవసంజ్ఞలచేఁ బిలువఁ బడిన దేహము ప్రారబ్ధకర్మము ముగియఁగానే తుదిని క్రిము లగుచున్నది; దహింపఁగా బూడిద యగుచున్నది; కుక్కలు మొదలగునవి దినఁగా విష్ఠ యగుచున్నది. ఇట్టి దేహము కోసము భూతములకు ద్రోహము సేయుటవలన నరకమె కలుగును. నరకా వహమయినయట్టి భూతద్రోహము సేయువానికి హితము లెట్లు దెలియఁగూడును? 'దేహమును గిట్టినపిదప నెట్లయినను బిలుతు రుగాక. బ్రతికియుండునపుడు తనకులోనయి తనసొమ్ముగానుండు టచే దానిసుఖముకొఱకుఁ బాటుబడవలసిన దేకదా?' యన్న చో, అట్లుకాదు. *దేహము గిట్టినపుడు నగ్గికో లేక కుక్కకో సొమ్మగుచున్నదికదా. అట్లైయది బ్రతికియుండునపుడు నెవ రికి సొమ్మగును? అన్నముపెట్టి పోషించువానికా? గర్భాధా నము చేసినతండ్రికా? లేక కన్నతల్లికా? తల్లినిగన్నతండ్రికా? లేక ధనమిచ్చి తీసికొన్నవానికా? లేక బలవంతముగాఁ బట్టి లోఁ బఱచుకొన్నవానికా? బ్రతికియున్నపుడు సయితము గిట్టినప్పటి వలెనె యది యొక్కరికిని సొంతముగాదు. ఇట్లొక్కరికే నిలు కడగా సొమ్మయియుండక, ప్రకృతియందుఁబుట్టి ప్రకృతియందు లయించునట్టి యీదేహమునే తన్నుగాఁ దలంచుకొను దేహా

* ఇట దేహమునకు మృతికిఁ బిదప నగ్గికిని గుక్కకును బాలగుటయు, బ్రతికియున్నపుడు మాతృపిత్రాదులకుఁ బాలగుటయు విభజించి చెప్పఁబడినది. ఎవరికిని దేనికిని సొమ్ముగానందున నట్టిదానివిషయమై యింతమద మగూడదనుట.

త్మాభిమానులగు మూఢులుతప్ప దేహము నిట్టిదని తెలిసినవాఁ డెవఁడు జంతువులను హింసించును ? సంపదచే మదించియున్న దుర్జనునికిఁ గన్నులు తెలియవు. అట్టివానికిఁ గన్నులు తెలియుటకు దారిద్ర్యమే మేలయినకాటుకమందు. ఏలన దరిద్రుఁడగు వాఁ డెంతయుఁ దన్నుఁజూచునట్లె తక్కినప్రాణులను జూచుచున్నాఁడు. కాన వానికి ద్రోహము సేయఁడు. కాలియడుగునందు ముల్లుగ్రుచ్చుకొన్నవాఁడు, లోని సుఖదుఃఖాదులవలన ముఖమున వికాసము ముడుఁగుట మొదలయిన నిమిత్తములంబట్టి తక్కినప్రాణులను దన్నుఁబోలెనే మనంబునఁ దలంచుచు వారికి నట్టివ్యథ గలుగుట కెంతమాత్ర మొల్లకుండును. అట్లె యడుగున ముల్లు గ్రుచ్చుకొనినవాఁడు నొల్లకుండుట గలుగదు గదా! అట్లు దారిద్ర్యదుఃఖము తెలిసినవాఁడు తక్కినజీవులకు దుఃఖము గలుగనొల్లఁడు. మఱియు దరిద్రుఁడు నేననెడికావరమునువిడిచి, కులము విద్య మొదలయినవానివలన గలుగు పొతరములన్నిటినుండి విడివడి, తనప్రయత్నములేకయే తనయొడలువంచి కష్టపడుచున్నాఁడు. ఆకష్టపాటే వానికిఁదుది నుత్కృష్టమైన తపంబగుచున్నది. ఇట్లు దారిద్ర్యము క్రమముగ ముక్తిసాధనము నగుచున్నది. దరిద్రుఁడగువాఁ డన్నమున కువ్విళ్లూరుచు నదిలేనందున నాఁకటిచే దేహము చిక్కిస్రుక్కుచుండును. కాన వానితోఁడ వానియింద్రియములును బరులహింసించుటయు నెండి సురుఁగుచున్నవి. కాబట్టి, హింసయు వీడిపోవుచున్నది. ఇట్టి దరిద్రునితోడనే సమదర్శనులగు సాధువులు పొత్తు సేయుదురు. 'వాని కింద్రియము లెండి సురిఁగినను విషయతృష్ణ సురుఁగకుండునుగాన శ్రీమదాంధునికంటె వాఁడేమి హెచ్చు' అని

యడుగవచ్చును. కాని, యాసజ్జనులతోడి పొత్తు వారి కావిషయతృష్ణను నాశముసేయుచున్నది (కాన నదియె వానియందలి విశేషము.) విషయతృష్ణ నశించుటవలన వాఁడు వెంటనే ప్రకృతిసంబంధరూప మయినయశుచిని వీడుచున్నాఁడు. ధనమేకదా యెవ్వరికి నపేక్షితమయినది. కాన దారిద్ర్యము హెచ్చగునా యనవలదు. సాధువులు ముకుందుని చరణారవిందములే పరమపురుషార్థముగాఁ గోరుచు నందఱయెడలను సమదృష్టి గలిగి యుందురు. ఇట్టివారికి మైమఱపించునవై యనర్థమూలంబగు మదమునకుఁ గారణములగుటచే దుష్టములైనవి కావున దుష్టుల కాశ్రయమయియుండు ధనము లుపేక్షణీయములే కాక వానికి వానితోడఁ బనేమి? సంపత్తివలని మత్తుడఁపుటయే పురుషార్థమునకు మూలముగాన వారుణమధువు ద్రావి మత్తిల్లి సంపత్తివలనిమదముచేతఁ గన్నుఁగానక యింద్రియములను సడంపలేక యిందుముఖులకు లోనయి యున్నయీపడుచువాండ్రిరువురకు నజ్ఞానమువలన మదమును దూలించుచున్నాను. వీరు లోకపాలుఁడగు కుబేరునిపుత్త్రులై యుండియు నజ్ఞానమెంతయుఁ బర్వి మిక్కిలియు దుర్మదులై తాము పుట్టము లేకుండుటయుఁ దెలియకున్నారు. కాఁబట్టి వీరికిఁ బుట్టముగట్టని స్థావరములగు వృక్షముల జన్మము తగియున్నది. ఇట్లు వృక్షజన్మమునొందరేని యింతకమునుపువలె శ్రీమదాంధులై యుండకుందురు. మఱియు నట్లు స్థావరములై యుండినను నాప్రసాదమువలనఁ బూర్వజన్మస్మృతి వీరికిఁ గలిగియుండును. అట్లైన నాయనుగ్రహమువలననే నూఱుదివ్యసంవత్సరముల కడపట వసుదేవపుత్త్రుండయినభగవంతుని సాన్నిధ్యమునుబడసి యావృక్షత్వము గడచి

పోఁగా, మరలఁ దమ యెప్పటిలోకమును (దేవత్వము) ను బొంది వాసుదేవునియందు, నమందభక్తి నొంది వెలయుచుం డుఁడు" అని యా దేవర్షి యగునారదుండు పలికి యంత నారా యణాశ్రమమునకుఁ బోయెను. నలకూబరమణిగ్రీవులును నట్లె సంగడిమద్దులయిరి. ఆఋషి యగునారదుండు భాగవతులం దెల్ల ముఖ్యుండుగాన హరియగు కృష్ణుం డతఁ డాడినపల్కు నిజము గావింపఁ దలంచి యామద్దికిఁ జని యున్నయెడకు మెల్లమెల్లగా ఱోలీడ్చుకొనుచుఁ బోయెను. ఆభగవంతుఁడు 'దేవర్షి నార దుఁడు నాకు మిక్కిలియుఁ బ్రియుఁడు. కాఁబట్టి ధనదునికొడుకు లయిన యీయమడమద్దులను గూల్చి మహాత్ముం డామునిపా డినగీతమును నేను సాధించెద' నని యీసంగడిమద్దులనడు మఁ బోయెను. అపుఁ డతఁడు దానినడుమఁ జొరఁగానే యీ ఱోలు నారెంటికడ్డముగాఁ బడెను. బాలుండగు కృష్ణుఁడు ఱోలు తనతోడ నీడుచుకొనుచు నాసంగడియడ్డమైనందునఁ బట్టి నెపుచు టయు నామద్దులు తటాలున వేళ్లమొదళులు పెకలి యాపరమ పురుషుని విక్రమమున బోదియలును గొమ్మలును నాకులును జిగుళ్లును నిట్టటు మిక్కిలి చెల్లచెదరై యల్లలాడుచుండ బిట్టు చప్పుడుసేయుచు గొబ్బున నేలఁ ద్రెళ్లెను అపు డాచెట్లయందుండి యగ్ని నిజమూర్తితోఁ బయికిఁ బొడమి వచ్చిన ట్లిరువురు సిద్ధపురు షులు మిక్కుటమయిన దేహకాంతులచే దిక్కులను వెలిఁగిం చుచును బొడతెంచి తొంటిరజఃకార్యములగు మదము లించు కయు లేక నిర్మలులై యఖిలలోకనాథుం డగుకృష్ణునకుఁ బ్రణా మిల్లి యంజలిఁ గీలించి యి ట్లని స్తుతించిరి.

## శాపవిముక్తులై నలకూబరమణిగ్రీవులు శ్రీకృష్ణుని స్తుతించుట.

కృష్ణకృష్ణా! నీవు కేవల గోపాలుఁడవుగావు. అచింత్యప్రభావుండగు మహాయోగివి. జగత్కారణభూతుండయి యాద్యుఁడగు పరమపురుషుఁడవు. నామరూపములచేత వ్యక్తంబును నవ్యక్తంబు నయినయీవిశ్వము, సర్వశక్తిత్వాది కల్యాణగుణములచేత బృహత్త్వము గాంచినబ్రహ్మంబ వగునీకు శరీరమని వేదాంతులు తెలియుదురు. ఇట్లు నీవు జగంబున కుపాదానభూతుండవు. మఱియు సమస్తక్షేత్రజ్ఞుల దేహములకును బ్రాణములకును నాత్మలకును నింద్రియములకును సర్వజ్ఞత్వాది గుణములఁ బొలిమిచె లోపలఁ బ్రవేశించి నియమించువాఁడవునీవైకకాండవే. కాన జగమునకు నిమిత్తకారణమ వగుదువు. నీవే * కాలమవు. అవతారదశలయందు షాడ్గుణ్యపూర్తి గలిగియుండు భగవంతుఁడవు. అన్నింటికిం గారణంబవయ్యును దద్దోషములం జెడకుండు నవ్యయుండవు; మఱి విష్ణుండవు, ఈశ్వరుండవు నీవు మహత్తవు. సత్త్వరజస్తమోమయం బగు ప్రకృతివి. నీవే జీవుఁడవు. దేహము మొదలుకొని జీవపర్యంతము నధిష్ఠించి యుందువు. సమస్తశరీరములయు బుద్ధి పర్యంతములయిన యింద్రియములయు వ్యాపారములను నొక్కమ్మడిఁ దెలియుచుందువు. ప్రకృతిగుణపరిణామరూపము లయినశబ్దాదులు తమ్ము గ్రహించునట్టి శ్రోత్రాదులను దాము గ్రహింపఁజాలని యట్లు, నీచేత గ్రహింపఁబడుచున్నవయ్యు నిన్ను గ్రహింపనేరవు. ఏలనఁగా యోగవి

---

* కాలాదులు భగవచ్ఛరీరము లగుటచేతను భగవంతుఁడు తత్కారణమగుటచేతను సామానాధికరణ్యముచే భగవంతుఁడుగాఁ జెప్పఁబడుచున్నవి.

శుద్ధమనస్కులగువారుతప్ప గుణకార్యములగు నింద్రియముల నా
వరించియుండువాఁ డెవ్వఁడు, గుణములకుఁ బూర్వమె తత్కారణ
భూతుఁడుగను బ్రకాశకుండుగను సిద్ధుండయి యున్ననిన్నుఁ
దెలియనేర్చును? ఇట్లు షడ్గుణపరిపూర్ణుఁడ వగుభగవంతుఁడవ
య్యు సాధుపరిత్రాణముకొఱకు వసుదేవునికిఁ బుత్త్రుఁడవై యవ
తరించిన సర్వకర్తవు. స్వప్రకాశకములగు గుణములచేత జీవులకు
మఱుఁగి దురవబోధంబయి యున్నమహిమగలిగి స్వరూపగుణ
ములచే బృహత్త్వము గలిగిన బ్రహ్మంబ వగు నీకు నమస్కారము.
ఆయా ప్రాణులు మనుష్యాదిశరీరములు పెక్కింటిని గర్మమూల
మున నొందుచున్నను వానియందు నీవొక్కండవు గర్మకృత
మగుశరీరము లేకుందువు. ఇట్టి నీ వా ప్రాణులనడుమ నవతారము
లెత్తినపుడు తక్కిన దేహాలకు సంభవింపఁదగనివియు, అతిశయ
మందు సాటిలేనివియు నైయుండు నాయా ప్రభావములచే నీ
యవతారము లట్టివియనియుఁ దనంతటఁ దెలియంబడుచున్నవి.
ఇట్టినీవు లోకమున నుత్పత్తియు నభ్యుదయమును గలిగించు
కొఱకు మంగళములకెల్లఁ బ్రదాతవుగాను యిపుడు నీయంశమగు
బలరామునితోడ నవతరించినవాఁడవైతివి. పరమకల్యాణా!
నీకు నమస్కారము విశ్వమంగళా! నీకుదండము. శాంతునకు
వాసుదేవునకు యదుపతికి నమస్కారము. నిరతిశయానంద
పరిపూర్ణా! మమ్ము నీదాసులకు దాసులుగానుండునట్లను గ్రహిం
పుము. ఇన్నేల కోరెద మన నీదాసుఁ డగునారదమహర్షి యను
గ్రహమువలనఁ గదా భగవంతుఁడవగు నీదర్శనము మాకు దొర
కొన్నది. కాన నీదాసదాస్యమే మాకుఁగావలయును. మావాక్కు
నీగుణములను ముచ్చటించుటయందు, కర్ణములు నీకథలు

వినుటయందును హస్తములు నీపూజసేయుటయందును మనస్సు నీపాదములను స్మరించుటయందును, శిరస్సు జగన్నివాసుండ వగు నీకు మ్రొక్కుటయందును, చూపు నీమూర్తు లయినసజ్జనులను సందర్శించుటయందును, నెలకొని యుండుఁగాత' మని స్తుతించిరి. ఇట్లు గోకులేశ్వరుం డయినభగవంతుఁడు త్రాటిచేత ఱోలం గట్టువడియుండి, యాయిరువు రిట్లు తన్ను మిక్కిలియుఁ గీర్తింపఁగా, నాయక్షులతో నవ్వుచు 'మీకు సంపద మదముచేఁ గన్నుఁగానక యుండఁగా, నారదమహర్షి కరుణాత్ముండుగావున 'ప్రియములు ఁగనవి గోరువానికి' నిత్యాదివచనములచేత మీకు సిరిదొలంగున ట్లనుగ్రహించినాఁడని ముందే నే నెఱుంగుదును. నాయందుఁ దమచిత్తముల సమర్పించి తక్కిన జంతువులన్నిటి యెడ సమచిత్తులై యుండు సాధువులకు, ప్రొద్దుపొడుచుటతోఁ గన్నుల చీకటిబంధము తీఱునట్లే, నాదర్శనము గలుగుటతోడనే సంసారబంధము తీఱుచున్నది. నలకూబరా! నన్నే యన్నిటి కంటె నెక్కుడుగాఁ గలిగి మీమీ గృహములకుఁ బొండు. మీ యిరువురకు సంసారనాశకమై మిక్కిలియు నభీష్టంబై యొప్పు ప్రీతిభావము నాయందుఁగలిగియె యున్నది' యనెను. ఇట్లు కృష్ణుఁడుచెప్పఁగా నాయక్షులిరువురును ఱోలఁగట్టువడియె యున్నయాదిట్టకుఁ బ్రదక్షిణముచేసి మరలమరల మ్రొక్కుచు నతనివలన సెలవుగయికొని యుత్తరదిశకుం బోయినవారయిరి. ఇది పదియవయధ్యాయము.

---

## కృష్ణుని బాలక్రీడాదులు.

శుకుఁడు — నందుఁడు మొద లయినగోపకులు చెట్లు గొబ్బునఁ గ్రుళ్లిపడిన చప్పుడు విని పిడుగుపడిన దేమో యని శంకించి యచటికిఁ బరుగిడివచ్చి, యయ్యెడ నొగడిమద్దులు రెండును బుడమిపయిని గూలియుండఁగాఁ జూచిరి. వారు త్రాటంగట్టబడి ఱోలీడ్చుచున్న చిన్నికృష్ణుఁడే యవిగూలుటకుఁ గారణమని యెఱుంగనేరక యూరక తత్తఱపడుచుఁ దమలో 'నిది యెవని పని? ఎందులకు? ఏమాశ్చర్యము! ఇది యొకయుత్పాతముగా నున్నది' యని దిగులునొందినవారయిరి. అంత నయ్యెడ నాడు చుండిన బాలురు కొందఱు 'ఈకృష్ణుఁడు ఱోలు లడ్డముగా నీడ్చుకొనుచు నీచెట్లనడుమఁ దివిచి వీనిని గూల్చినాఁడు. మఱియు చెట్లలోనుండి దివ్యపురుషు లిద్దఱు పొడసూపఁగాఁ జూచితిమి' అనిరి. కాని యాజనులలో కొందఱు 'ఇది పొసఁగనిది' యని వారిమాటను గయికొనరయిరి. మఱికొందఱు బాలుఁడా చెట్లను గూల్చునాయని మనంబుల సందియపడసాగిరి. నందుఁడు తన చిన్నికొమరునిఁ ద్రాటంగట్టి యుంచుటయు వాఁడు ఱోలి నీడ్చుటయునుజూచి మొగంబున నవ్వునివ్వటిల్ల వానిని విడిచిపుచ్చెను. నందుఁడిట్లు కట్లువిడిచిపుచ్చి 'నాయనా! పండ్లమ్ముచున్నారు తీసికోరా!' యనఁగా కృష్ణుఁడు తల్లికడకుఁబోయి 'అమ్మా! పండ్లు కావలెనే! నాకిసియని' తాను సర్వఫలములనొసంగువాఁడయ్యు నాఫలములకోసము చేరెడు ధాన్యమును దోసిటనెత్తికొని పండ్లుగొనుటకుఁ బోయెను. పండ్లమ్మునదియు నాబిడ్డఁడు దోసిటనుండి ధాన్యము పోయఁగా నవి యాబుడుతని రెండుచేతులను బండ్లచే నింపెను.తోడనే ధాన్యముపోసిన కుండయుం

తయు రత్నములచే నిండి గంతరించుచుండెను. గొల్లచెలువలు 'నాయనా! కొంచె మాడుము చూతు'మని దట్టించి పురికొలుపఁగా, వారియం దొక రీతి యేదేని పాడుచుండఁగా కొయ్యబొమ్మవలె వారికి వశుఁడై యేమియుఁ దెలియని గోలయగుచిన్నిబాలునివలె భగవంతుఁ డాడుచుండును. కొందఱేదేని తెమ్మని యాజ్ఞాపింపగా, బీఁటలు, కుంచెమొదలగు కొలుచుసాధనములు, పాదుకలు మొదలగువానిని దేవ సమర్థుఁడు గానివలె నటించుచు మోచి తెచ్చును. మఱియుఁ దనవారికి మిక్కిలియు సంతోషము గలిగించుకొఱకుఁ జేతులు విప్పి యాడుచుండును. భగవంతుఁడిట్లు తన వైభవమును దెలిసినవారికిఁ దాను భక్తులకు వశుండై యుండుటను దెలుపుకొఱకు నిట్టి బాలచేష్టితములచేత గొల్లపల్లె యందలివారికెల్ల నుల్లాసముఁ గూర్చుచుండెను. కృష్ణుఁడిట్లు మద్దులను గూల్చి యవ్వలి యమునానదీతీరమునకు నాటలాడుకొనుటకుఁ బోయి యుండఁగాఁ దల్లి 'నాయనా! ర'మ్మని పిలిచెను. పుత్త్రులు రామకృష్ణు [illegible] నట్లు తల్లి పిలుచుచున్నను నాటలయందు మఱిగియుండుటవలన రారయిరి. అపుడు, రోహిణి కన్నబిడ్డనియందలి గారాము గలదిగాన వారిని దోడ్కొనివచ్చుటకు యశోదను బంపెను. ఆ కృష్ణుఁడు భోజనాదులు కడచినపిదపఁగూడ నందులకు రాక మితిమీఱి తనయన్నతోఁ గూడ నాడుచుండుటను జూచి యశోద బిడ్డయందలి నెయ్యముపొంగారి చన్నులఁ బాలు సేఁపుచుండఁగాఁ గృష్ణునిబిలుచుచు 'కృష్ణా! కృష్ణా! తామర రేకులవంటి కన్నుల చిన్నియన్నా! రారా! చన్నుఁగుడువరా! నాకన్నయ్యా! ఆటలుచాలు. ఆఁకలికి సోలియున్నావు. కాన కుడువఁ

దగును. నాయనా! బలరామా! కులనందనా! వేగ రారా! నీ తమ్మునితోడ వేవేగ రమ్ము. పుత్త్రకా! ప్రొద్దుపొడిచినపుడు బువ్వ కుడిచితివి ఇంతే; ఇంతవఱకు ఆటలాడియాడి యలసిసొలసియున్నావు. దాశార్హుండగు వ్రజపతి నందుండు తాను గుడువంబోవు వాండై మీ కెదురుచూచుచున్నాండు. రారమ్ము. మాయిద్దఱకుం బ్రియముగూర్పుము' అని తక్కినగొల్లపిల్లవాండ్రను జూచి 'బాలకులారా! మీమీయిండ్లకుం బొండు. కన్నయ్యా! నీమేనంతయు దుమ్ము గ్రమ్మియున్నదిగదరా! రా! బారు రాడుము. నీవు నేఁడు పుట్టిన నక్షత్రము. కనుక స్నానము చేసి విప్రులకు గోవులు దానము సేయుము. చూడుచూడు! అదిగో! నీయీడుబాలురను వారితల్లులు జలకమార్చి చక్కఁగా నలంకరించి యున్నారు. నీవు నట్లే జలకమాడి చక్కఁగా నలంకరించికొని బువ్వఁగుడిచి యంత వేడుకగా నాడికొనుము' అనెను. ఇట్లు యశోద బ్రహ్మాది దేవతలకెల్లను దలమిన్న యైనయా వెన్నునిం దనకన్నబిడ్డనిఁగాఁ దలఁచి నెయ్యంబు తియ్యంబునం బెంపొనగు బుద్ధిని, నాయిద్దఱిం జిన్నికృష్ణుని రాముని జేతఁ గల్గఁ బట్టి పిలుచుకొని యింటికిఁవచ్చి వారికి వలయు మంగళకార్యములను గావించినయ్యె. అంత నందుఁడు మొదలుగాఁ గల గోపవృద్ధులాపెద్దవనమందు పూతనాదులచేనైన గొప్పయుత్పాతములను అనుభవించియుండుట నొక్కటిగా సభగూడి గోకులమునకు హితకృత్యము నాలోచింపసాగిరి.

## నందాదులు బృందావనమునకుఁ బయనమగుట.

అంత గొల్లలయందు జ్ఞానంబునను వయస్సునను బెద్దయగు నుపనందుఁడను గొల్లఁడొకఁడు గలఁడు. వాఁడయ్యోదేశకాలములకుఁ దగినకర్తవ్యములను దెలిసినవాఁడు; మఱి రామకృష్ణుల

కెల్లపుడును బ్రియము సేయుచుండువాఁడు. వాఁడు తక్కిన నందా దులను జూచి 'మనము గోకులమునకు హితమునుగోరి యిచ్చట నుండి వెడలిపోవలయును. ఇచ్చటఁ బ్రజలకు నాశమునకు హేతువులయిన పెద్దయుత్పాతము లనేకములు వచ్చుచున్నవి. మన బిడ్డఁడు వీఁడు బాలఘాతుకియగు నారాకాసివలననుండి యెట్లో దైవవశమున విడివడ్డవాఁడయ్యె. మఱి హరి యనుగ్రహము వలన నాశకటమును వీనిపైఁబడక తప్పినది; మఱియు సుడిగాడ్పు వీనినిం బక్షులకుం బట్టయినమింటినట్టనడిమికిఁ గొంపోయినది. పయినుండి పెనుబండఱాతిపయిని వీఁడుపడియు దేవతలును నీశ్వరుండును వీనినిఁ గాచిపుచ్చిరి. మన యీబిడ్డఁడుగాని మఱి తక్కినబిడ్డఁడెవ్వఁడుగాని యీమ్రాఁకులు గూలునపుడు వాని నడుమఁ జిక్కి చావక దక్కుటం జేసి మనకు నచ్యుతుండు రక్షణము చేసినాఁడని తెలియుచున్నది. మఱి యిచ్చట నుత్పాతముల వలన మనకేమియు ననర్థము గలిగి పీడింపక మునుపే మనము మన యనుచరులతోడ బాలురనుదోఁకొని మఱియొకచోటికిఁ బోదము. బృందావన మని యొకవనముగలదు గదా! అందుఁ జుట్టుపట్లను గ్రొత్తలగు వనములు పెక్కులుగలవు; మఱి పశువుల కెంతయు హితముగానుండును. అది గోపకులకును గోపికలకును గోవులకును సేవింపఁదగినదై యుండును. మఱియు నందు మిక్కిలి మంచిజలమును దృణములును పొదరుజొంపములును బొంపిరి పోవుచుండును. కాన యక్కడికి నేఁడే పయనమై పోదము. శకటములను బూన్పుఁడు జాగువలదు. మీకిష్టమేని గోధనములు ముందుగా నచ్చటికిఁ బోవుఁగాక' యనెను. గోపకు లా యుపనందుఁడు చెప్పినదివిని యందఱు నేకమనంబునఁ గయికొని

బాగుబాగని పలికి తమతమ బండ్లగములను బన్నించి తమతమ పరికరములనెల్ల వానియం దెక్కించి బయలువెడలిరి. గోపాలురు వృద్ధులను బాలురను స్త్రీలనను దక్కిన సమస్తములయిన యుపకరణములను బండ్లయం దెక్కించి యెచ్చరికలు పిచ్చలింప విండ్లు కేలఁ గయికొని గోసమూహములను మున్నిడికొని కొమ్ములనూఁదుచు వాద్యఘోషములు చెలంగుచుండఁ దమతమబలంగములతోడ వెడలిపోయిరి. గోపికలును, జన్నుఁగవలందుఁ గ్రొత్తగా నలందినకుంకుమపూఁతల క్రొమ్మెఱుంగులు దులుంగలించుచుండ, మేలయిన పుట్టములుగట్టి, మెడలయందు బంగారుపతకములు వెలయ, సంతసంబు మనంబుల దొంతరలు గొనఁ, దియ్యనిమెలుంగులఁ జిన్నికృష్ణుని లీలలను బాడుచు రథములెక్కిపోయిరి. యశోదారోహిణు లిరువురు నట్టె యొక బండియందుఁ గృష్ణునితోడను బలరామునితోడను నెక్కి వారి ముద్దుముచ్చటలు వీనుల పండువులుగా వినుచు నెంతేయు విలసిల్లుచుండిరి. ఇట్లు వారందఱును సమస్తకాలములను సుఖావహమైయున్న బృందావనమును బ్రవేశించి యందు బండ్లగుంపులను జట్టు నర్ధచంద్రాకారముగా విడియించి దానిని దమకు మందపట్టు గావించుకొనిరి. ఆబృందావనమును దానికడనున్న గోవర్ధనపర్వతమును యమునానది యిసుకదిన్నియలనును జూడఁగా రామకృష్ణులకు నెంతో సంతోషము పొదవినదయ్యె. ఇట్లా యిరువురు చిన్నిబాలురను దీపారు తొకతొక పలుకుల ముద్దులు గులుకుచును దమపసియాటపాటలచేతను మందలోని వారికందఱకును బ్రియంబు గూర్చుచుండిరి. అంత వారు కౌమారవయస్సు రాఁగా దూడలను మేపువారయిరి. మందయున్న చోటికి దాప

యినపల్లెయందు గొల్లపిల్లవాండ్రను గూడికొని, పలువిధము లయిన క్రీడాపరికరముల నలంకరించికొని దూడలను మేపుచుండిరి. వారొక్కచోట వేణువుల నూదుచుందురు. ఒక్కచోట బిల్వాదులనుగొని యొండొరులపై నైచుచుందురు. మఱియొకచో నందియలు చిఱుగజ్జెలు గల్లుగల్లన నడుగులచేఁ దాటించుదురు. మఱి గొందఱు గొల్లబాలురు పోఁకాళ్లను జేతులను గ్రిందనూని నల్లని కంబళ్లనుగప్పికొని కల్లయెద్దులవలె నటించుచు అంకెలిడఁగాఁ దాము నాయెద్దులవలెనె యనుకరించుచు అంకెలు వైచుచును నొండొరులతోఁ గుమ్ములాడుచుందురు. మఱియొకచో హంసలు నెమళ్లు మొదలయినవాని యెలుంగుల ననుకరించి కూయుచు నిట్లు సామాన్యులయిన బాలురవలెఁ దిరుగులాడుచుండిరి.

## —•••— వత్సాసురవధము. —•••—

ఒకనాఁడు రామకృష్ణులిరువురును యమునాతీరమందుఁ దమ తమ యీడుబాలురంగూడి దూడలను మేపుచుండిరి. అపుడు వారిని జంపుతలంపున నొక దైత్యుఁడు దూడరూపమున నయ్యెడకు వచ్చెను. కృష్ణుఁడు దూడకిదుపుల నడుమ వచ్చియున్న యావత్సాసురునిఁజూచి బలరామునికి వానిని జూపుచుఁ దానేమియు నెఱుంగనివానివలె మెల్లగా వానికడకుఁ దఱియవచ్చెను. అట్లు తారసించి వచ్చి వానివెనుకకాళ్లను దోఁకను నొక్కటిగానొడిసిపట్టికొని గిరంగిరంద్రిప్పి వెలఁగమ్రానిపయినివ్రేసి చదియఁగొట్టెను. ఆయసురయు నసువులువీడి యా పువిడిచి తన యెప్పటిపెనుకాయముతో నావెలఁగమ్రానులపయిఁ బడఁగా వానిమొన లావెనువ్రేఁగునకు నాఁగలేక కూలుటయు వానితో




1743. బకాసుర వధ.

డఁ దానును నేలంగూలెను. వానినిఁజూచి బాలు రెంతయువింత పడి 'బాగుబా'గని కొనియాడిరి. ఉప్పరంబున దేవతలును నెంత యు సంతుష్టులై పువ్వులను జడిగొనఁ గృష్ణునిపైఁ గురియించిరి.

—బకాసురవధము—

అట్లు సర్వలోకములకుఁ దామొక్కరే పరిపాలకులై యుండి యు నారామకృష్ణాదులు దూడలకాపరులై చలిదియన్నముల నెత్తికొని దూడలను మేపుచును ద్రిమ్మరుచుండిరి. గొల్లబాలు రును దమతమ లేఁగల కదుపులను మేపుచు నొకనాఁడు మడుఁగు చెంతకుఁబోయి, దూడలను నీరుద్రావించి, దాము జలములను గ్రోలిరి ఆబాలు రచ్చటఁ బెద్దజంతు వొకటి వజ్రాయుధముచేఁ గొట్టుబడి కూలినపర్వతశిఖరమువలె నుండఁగాఁ జూచిరి. అది బకుఁ డనుపేరుగల యొక మహాసురుఁడు. వాఁడు బకరూపమును దాల్చి తోడఁబడవచ్చి కృష్ణునిఁ దనవాఁడిముక్కునఁ బట్టికొని బలంబు మెఱసి మ్రింగెను. అట్లా పెద్దకొంగ గృష్ణునిఁబట్టి మ్రింగు టనుజూచి, బలరామాదు లయినబాలురందఱును బ్రాణములు లేని యింద్రియములవలె నెఱుకలు దూలినవారయిరి. జగం బులకెల్లఁ దండ్రి యగు బ్రహ్మకును దండ్రియయ్యుఁ గేవలలీలకై యొక గొల్లబిడ్డఁడయి యవతరించియున్నయాదొడ్డవాఁ డా కొంగదౌడలమూలలందు మ్రింగుడుపడక యగ్నివలె నెరి యించుచుండఁగా నాకొంగయు వానిని మ్రింగలేక గ్రక్కున వెలికిఁ గ్రక్కి యేగంటువడక యున్నయాబలుడంటను రోసం బినుమడింప చంచువు మొనతోఁ బొడిచి గెంటించు తలంపునఁ మరలఁ బయినిదలపడెను. అట్లు పయింబడి వచ్చుచున్న యా కొంగను హుంకారమున నదల్చి వారించి బాలురందఱును

జూచుచుండఁగాఁ దన రెండుచేతులచే నవలీలగా వాని చంచువును బట్టి సజ్జనులకుఁ దక్కఁగు నయాచక్కటి వీరణంపు గడ్డినింబోలెఁ; దేవతలకు ముదంబు పొదల, రెండుగఁ జీల్చినవాఁడయ్యె. అట్లు బకునిఁ బిలుకమార్చినయా చిన్నికృష్ణుని, పయి నున్న దేవలోకవాసులగు జనులు (దేవతలు) నందనవనమందలి మల్లికాది కుసుమబృందములను మీఁద నవ్వారిగాఁ జల్లుచు భేరులును శంఖములును జెలంగించుచు నెంతేయు స్తోత్రములుచేసిరి. ఆయబ్బురము నుజూచి గొల్లబాలురెల్ల మిక్కిలి వెఱఁగుపడిరి. అట్లు బకునినోరినుండి తప్పించుకొని తనయెప్పటిచోటునకు మరలి వచ్చిన చిన్నికృష్ణునిఁ బడసి రాముఁడు మొదలగువారు, ప్రాణమునుబడసిన యింద్రియగణమువలె నెఱుకలువడసి యతనిని బిగ్గఁ గాఁగిలించికొని యెంతేయు మనంబుల నూఱటలు గుఱికొన నందందు మెలయుచున్న లేఁగలను గుమిగూర్చుకొని మందకు బోయి చిన్నికృష్ణుఁడు చేసిన యాకృత్యమును బ్రశంసించిరి. గోపకులును గోపికలును నదియంతయు విని మిక్కిలి యాశ్చర్యమున మునింగి ప్రియంబులచే నాదరంబులు పొంగార లోకాంతరగతుఁడయి మరలవచ్చిన వానింబోలెఁ, గన్నంగవల నమృతముఁ గ్రోలినట్లు, తనువులుదయివాఱఁ, దుకతుకలు మితిమీఱ వచ్చిచూచిరి. అంత నందాదులు 'ఆహా! ఏమందుము. మన యీబిడ్డనికి మృత్యుకారకులు పెక్కులు గలిగిరి. అయినను వారికే దుఃఖముకలిగినదికాని మఱేమికాదు. ఇది యుక్తమే కదా! జన్మాంతరమున నెవరికి భయముకలిగించిరో వారివలన నిపుడు భయమునొందుదురే కదా! వీరందఱును జూచుటకే మెంతో భయంకరులుగా నుండియు బాలునినించుకయుఁ [illegible]

ఉపఁజాలరయిరి. మఱి బాలుని రూపుమాపుతలంపునఁ దారసిల్లి తారే యగ్గియుం దుఱికినమిడుతలవలెఁ గెడసిరి. ఔరా! బ్రహ్మ వేత్తలాడుపలుకు లోకప్పుడును బొల్లుగావుగదా. పూజ్యుఁడౌ గర్గుఁడు 'వీఁడు నారాయణసముఁ'డని యపుడు చెప్పినవిధమే మనకిపు డనుభవసిద్ధమైనది' అని యిట్లు రామ కృష్ణుల ముచ్చట లనే ముదంబునఁ జెప్పికొనుచు రమించుచునుండిరి; గానిసంసార దుఃఖము నించుకయుఁ బొందరయిరి. ఇట్లా గామకృష్ణులు, ఇండ్లుగట్టుట, వంతెనలురచించుట, కోఁతులవలెఁ బైకెగురుట మొదలయినపడుచుఁదనపు నాటపాటలచేత గోపహారమును గోకులమునందుఁ గడపుచ్చినవా రయిరి. ఇది పదునొకండవ యధ్యాయము.

---

## అఘాసుర వధము.

ఒకనాఁడు కృష్ణుఁడు ప్రొద్దున లేచి తినయీడువారయినగొల్ల పిల్లవాండ్రను దూడలను మేపువారిని మేలుకొలిపికొని వన మునందే చల్దులు గుడువవలయు నని మనస్సునగొని దూడలను ముందు దోలుకొనుచు, సొగసు లయినకొమ్ముల నూఁదుచును, మందనుండి ముదంబులు పొదల బయలు వెడలిరి. వారు తమ తమ లేఁగలను లెక్కలేని కృష్ణుని లేఁగకదుపులతో గుంపుకూ ర్చుకొని, మేపుచుఁ బసిబిడ్డలయాటలపాటల నందందు మీఱ టుగా విహరించుచుండిరి. వారు గాజుకడియములు గురువెంద పేరులు రతనాలసొమ్ములు, బంగారుపతకములు మొదలయిన వానిచే నలంకృతులై యుండియుఁ బండ్లచేతను జిగురులయుఁ బూవులయు గుత్తులచేతను గైరికధాతువులచేతను మీఁదు

మిక్కిలి యలంకరించుకొన్నవా రయిరి. గోపబాలు రొండొ రుల చలిదిచిక్కములను గొమ్ములను బిల్లంగోవులు మొదలగు వానిని నపహరించి దాఁతురు. అ ట్లేమఱినసొంతగాండ్రు దానిని దెలిసికొనుట కాదాపున నుండిరేని వారికడ దానిని జిమ్మి విసరివేయుదురు. అట్లు విసరివేసియు నా సొంతగాండ్రు దూరముననుండిరేని వారుదానిని వచ్చి యెత్తికొనకుండునట్లు మరలఁ దామే వాని నెత్తికొందురు. కృష్ణుఁడు వనమునకుంగల రామణీయకమును జూచుటకై కడుదవ్వు పోయియుండెనేని, 'నేను ముందుముట్టెదను' 'నేను ముందుముట్టెదను' అని పంతము లాడుకొని గొల్లబాలురు కృష్ణునిముట్టి యుల్లాసంబున నాడు చుందురు. వారిలోఁ గొందఱు వేణువులూఁదుచును, గొందఱు కొమ్ములను బూరించుచు నుందురు. కొందఱు ఝుంఝుమ్మనిపాడు తుమ్మెదలతోడఁ బాటలు పాడుదురు. కొందఱు కోయిలల రవళితోఁ బాటిగాఁ గూత లిడుదురు. కొందఱు పయినెగు రుచున్న పిట్టలచట్టుపలనీడలతోఁగూడఁ బరుగిడుచుందురు. కొం ద అంచకొదమల వెంటంబడి పోవుచుందురు. మఱి కొందఱు కొక్కెరలతోడఁ గూర్చుందురు. కొందఱు నెమిళ్లతోడ నాడుచుందురు. మఱికొందఱు చెట్లకొమ్మలక్రింద వ్రేలాడు చున్న కోఁతులవాలములనుబట్టి యీడ్చుచును, ఆకోతులతోఁ గూడ హ్రూఁకుల నెక్కుచును, వానితోఁ బాటిగా వెక్కిరించు చును, నా చెట్లయందు వానివలెనే కొమ్మనుండి కొమ్మకు గంతులు వైచుచు నుందురు. మఱికొందఱు కప్పలతో సరిగాఁగుప్పిగంతు లిడుచు, యమునానదిజలంబులంబడి దొప్పఁదోఁగుచు, నం దలి యొండొరుల నీడలంగని పకపక నవ్వుచును, బ్రతిధ్వనులను

దిట్టుచును నుందురు. బ్రహ్మానందానుభవము వలనఁ బ్రీతుఁలై దాస్యము నొందిన సాధువులకుఁ బరదైవతం బయ్యుఁ బ్రకృతిబద్ధులయినవారికి మనుజబాలకుఁడై వెలయుచున్న యాచిన్నికృష్ణునిఁ గూడి యాగొల్లబాలురు తొంటిబామములందుఁ బుణ్యములను గుప్పలుగాఁ జేసియున్న ధన్యులుగావునఁ నిచ్చలుఁగూడి క్రీడించుచుండిరి. బహుజన్మములు కాయశోషణాదికము లగుఁ వ్రతములను సలిపి మనంబులందలి కల్మషములనెల్ల వీడియుండు మహాయోగులకును నెవ్వనిపాదారవిందములధూళి పడయఁ దరముగాకుండునో యట్టి పురుషుఁడు చక్కఁగా నే గొల్లలకన్నులకు గోచరుఁడై వర్తించుచుండెననఁగా, నౌరా! మందలోనివారల భాగ్యాతిశయ మే మని వర్ణింపనచ్చును! అప్పు డఘుఁడని యొక మహాసురుఁడుండెను. దేవతలమృతముఁద్రావినందున మరణభయము లేనివారయ్యె, నఘాసురునిఁజూచి 'మరణభయము లేని మన లను సయితము వీఁడు చంపఁజాలునే. వీనిబారిఁదప్పి మన బ్రతుకు లెప్పుడు కుదుటఁబడునోకదా!' యని ప్రతిదినము నువ్విళ్లూరుచు వానిముగియిక నే యెదురు చూచుచుందురు. వాఁడు బకునికిని బకికిని దమ్ముఁడు; కంసునిపంపునవచ్చియాగొల్లబాలురను, వారియందుమిన్నయై యున్నచిన్నికృష్ణునిని,గాంచి వారెంతెయుసొంపుగా నాటలాడుచుండుటకు నిం చుకయుఁ జూపోపనేరక రామకృష్ణుల నిరువురను దేఱిచూచి 'ఈ యిద్దఱిలో వీఁడే నాయన్నను జంపినవాఁడు. వీనిని బలరామునితోను గొల్లబలంగముతోను జంపి పుచ్చెదను. వీరినిజంపి నాచుట్టమగు బకునికిఁ దిలోదకములుగా నొసంగి తృప్తిగావించితి నేని యపుడు వ్రేపల్లెయందలి గొల్లలెల్ల దుదముట్టిన ట్లేయగుదురు. ప్రాణములు పోయినపిదప వట్టిబొం

దులుసిలుపనే యోపపుగాన వానినిగుఱించి చింతయేమున్నది. లోకమునందుఁ బ్రాణులకుఁ గన్నబిడ్డలేకదా ప్రాణములు. అట్టి బిడ్డలు నశింపఁగా వారితలిదండ్రులు నష్టప్రాయులే యగుదురు గదా!' యని యిట్లు నిశ్చయించుకొని యాఖలుఁడు యోజనము నిడుపును బెద్దకొండంతబలుపును గలదై మిక్కిలియుఁ బెద్దది యగుచు నద్భుతముగాఁ బొడకట్టు చున్నయొకకొండ చిలువ రూపమును గయికొని యాకృష్ణునిఁబట్టి మ్రింగుతలఁపుననపుడు గుహవలె విప్పయి యున్నదెప్పరంపువాతిని దెఱచుకొని దారి యందుఁ బరుండియుండెను. ఆయజగరమునకుఁ గ్రిందిపెదవి భూమిపయిని వ్రేలుచుండెను. పయిపెదవి మబ్బులయందుగుబ్బ తిలుచుండెను. దాని పెదవిసెలవులు పర్వతిగుహల వలెను, కోఱలు కొండకొమ్ములవలెను నుండెను. దానివాయిలోపలఁ జీకట్లు దట్టముగాఁ గారుకొనుచుండెను. దానినాలుకనిడివిగాఁ జాఁగియున్నదారివలెను, ఊర్పు బిరుసయినబోరుగాడ్పువలెను, చూపు కారుచిచ్చువలె వేండ్రముగను, దీండ్రించు చుండెను. వాస్తవమున కది నోఱుదెఱచుకొని కొండచిలువగా నుండియు నాబాలురు దానిని బృందావనలక్ష్మియే యని తెప్పఁదలఁచినేడు కరు నోరుదెఱచికొని యున్నకొండచిలువతోఁ బాటిగా దాని నుత్ప్రేక్షింపసాగిరి. 'ఔరా! మిత్రములారా! మన ముంగల మిక్కిలి విచిత్రముగానున్న యీవస్తు వొకజంతువువలెఁ బయికిఁ దోఁచుచున్నది. అందును మనలనుబట్టి మ్రింగుటకు తెఱచు కొనియున్న పామునోరివలె నుండలేదా? లేక యట్లుకాదా? చూడుఁడు. సత్యమున కిది పామునోరివలెనే యున్నది. సూర్య కిరణములచే నెఱ్ఱవాఱిన యామేఘము దాని పయిపెదవివలె

నున్నది చూడుము. ఆమేఘము ప్రతిబింబించుటచేత నెత్తి నయిన నదీతీరము, దాని క్రిందిపెదవివలె నున్నది. కుడియెడ మలయం దున్న రెండుకొండలయందలి బిలములును దాని రెండు సెలవులనును, పొడవులయినయీకొండ శిఖరములవరు సలు దానికోఱలనును బురుడించుచున్నవి చూడుము. మిక్కిలి యుం బలుపయి నిడివిగాఁ జాఁగియున్నయీమార్గము, దాని నాలుకతోఁ బ్రతిభటించుచున్నది. ఈకొండ శిఖరములనడుమ నున్నచీఁకటి కారుక్రమ్ముచున్న దాని నోరినడిమిభాగమునుమచ్చ రించుచున్నది. దావాగ్నిచేఁ గ్రాఁగి బిరుసై విసరుచున్న యీ గాలి దానియూర్పువలె వెలయుచున్నది. చూడుము. ఆదావా గ్నిచేఁ గాలినజంతువులదుర్గంధ మాసర్పములోని మాంసపు గంధమువలెనున్నదిచూడు'మనిరి. ఇట్లు సత్యముగానే యజగరం బయినదానిని నజగరముం బోలినదానినిగా నుత్ప్రేక్షించి, 'దూడలును దూడకాపరులందఱును దీనియందుఁ జొరఁబడుఁడు. ఇది మనలనుమ్రింగఁ నాయేమి? ఇట్లేమ్రింగు నేనిబకాసురునివలె క్షణములో మన యీకృష్ణుఁడు పట్టి చంపివుచ్చునుబో' యని బకారియగు కృష్ణుని తళుకొత్తుచున్న నెమ్మొగము నుజూచిబిట్టు గానవ్వుచును జప్పట్లుచఱచుచును బోయిరి. ఇట్లాబాలురు కొండ చిలువ యని కలరూపును దెలియక దానినిగుఱించి యొకరితో నొకరు లేనిపోనిపలుకు లాడుట విని కృష్ణుండు 'కట్టా! నిజ మొక్కటిగానుండ వీరునుఱొక్కటిగాఁ గొనిరే'యని చింతించి యాభగవంతుండు సమస్తభూతముల హృదయములందును నెల కొని యుండువాఁడుగాన దానిని రాక్షసుండని యెఱింగి తన లేఁగలను లేఁగకాపరులను నందుఁ జొరకుండునట్లు, వారింప

మనంబున నెంచెను. కాని యంతకుమునుపే యాబాలురును దూడలతోడ నాయసురుని యుదరములోనికిఁ జొచ్చిరి. కేవల మట్లు చొచ్చిరే కాని రాక్షసునిచేత జీర్ణితులు కాకుండిరి. ఏలన నారాక్షసుఁడు తనగాదిలియన్న యగుబకునిఁ జంపినది తలంచుకొని, యాబకారి యగుకృష్ణుండును దనలోఁ జొరవలయునని యెదురుచూచుచుండెను. కాన లోనఁ జొచ్చినవారి నఱిగించుకొనకుండెను. కృష్ణుఁడట్లు తనకంటె వేఱుదిక్కులేనివారై తన చేతులప్రాపును దిగవిడిచి దీనులై ప్రారబ్ధబలమున మృత్యువు జఠరాగ్నికి నెరవైయున్న యాబాలురనుజూచి యెంతయుఁ విస్మితుఁడై సకలమునకునభయప్రదుండుగావునఁ గరుణ పిరిగొనఁగాఁ దనలో 'ఖలుండగువీఁడు తుదముట్టవలయును. సాధువులగు వీరు బ్రతుకవలయును. ఈరెండను నేకకాలమున నెట్లు సేయఁగూడును ? ఈ యిక్కట్టునఁ జేయఁదగిన కార్యమెద్ది? ' యనియెంతయు నాలోచించి సమస్తమును గనుఁగొనుచుండువాఁడు గాన కర్జమిదియని తెలిసికొని యాశ్రితార్తిహరుండుగాన దానును నాపాపతుండమును జొచ్చినవాఁడయ్యెను. అప్పుడు మబ్బుల మాటున నున్న దేవతలదిచూచి'హాహా!' యని యాక్రోశించిరి. అఘాసురుని బంధువులగు కంసాదులగురాక్షసులుబ్బునఁ జెలంగిరి. దేవతలట్లు హాహాకారములు సేయుట విని భగవంతుఁడు కృష్ణుడు తానించుకయుఁ గొంటువడకయే లేఁగలతోడను బాలురతోడనుగూడఁ దన్ను నుగ్గుఁగావింపఁ దివురుచున్న యా యసురకుత్తుకయందుఁదొడింబడ విరివిగాఁ బెరుఁగి సాగెను. అంత మిక్కిలియుఁ బెనుకాయము గలయారక్కసుని నాసారంధ్ర మార్గమును గృష్ణుఁడడ్డగింపఁగా, ప్రాణ్లు వెలికుఱుక వాఁడిటునటు



1751. అఘాసుర వధ.

పొరలుచుఁ దత్తఱిలుచుండెను. వానిదేహములోపల వాయువు నిండుకొని బయలువడఁ దెఱపిలేక యడ్డువడఁగా నది యసుర యొడలను భేదించుకొని బయటికి వెడలసాగెను. ఆవాయువు బయలువెడలుటతోఁగూడనే ప్రాణములన్నియును వెలువడెను. అప్పుడు పరలోకగతప్రాయులైన దూడకాపరులను దూడలనును, నమృతముగురియు తనచల్లనిచూపుచే లేపికొని వారలతోడ భగవంతుఁ డాముకుందుఁ డా పామునోటనుండి మరల బయలువెడలెను. మిక్కిలి బలుపయినయా పెనుపాపదేహము నుండి యద్భుతం బయినయొక పెద్దజ్యోతి పయికి లేచి, తన కాంతులచే దశదిశలను వెలిఁగించుచు, నాకాశంబున నెలకొని యుండి యీశ్వరుం డగుకృష్ణుఁ డా దేహమునుండి వెడలివచ్చుట నెదురుచూచుచుండి యతఁడు వెలువడఁగానే దేవతలు చూచుచుండఁగా నతనియందుఁ బ్రవేశించెను. అంత దేవతలు తమ కార్యం బగునాయసురవధమును గావించి పుచ్చినందులకుఁ గృష్ణునిఁ బువ్వులచేత నెంతయుఁ బూజించిరి. అప్సరసలు నర్తనములచేతను, గంధర్వాదులు గీతములచేత, వాద్యగాండ్రు వాద్యములచేతను, విప్రులు స్తోత్రములచేతను, భృత్యగణములు జయజయధ్వనులచేతను, గృష్ణునెంతయుఁ బూజించిరి. బ్రహ్మయు నద్భుతము లయినగంధర్వాదుల స్తోత్రములును, మే లయినవాద్యములు గీతములు జయధ్వనులు మొదలుగాఁ గలపెక్కులు మంగళాశాసనధ్వనులును, దనస్థానమునకు సమీపమున పీతేరఁగా, విని తోడనే తరలి యక్కడకువచ్చి యీశ్వరుం డగుకృష్ణునిమహిమను జూచి యాశ్చర్యమునొందెను. అంత బృందావనంబునం దద్భుతమై యుండిన యాయజ

గరచర్మ మెండి గొల్లబాలురకుఁ బెద్దకాలము క్రీడాబిలమై యుండెను. ఇదియొకాదు చిత్రము. పరావరులగు బ్రహ్మాదులకును బరుండును సర్వస్రష్టయు నయ్యు లీలచేతఁ గపటమనుష్యబాలకుం డయినకృష్ణుని స్పృశించినమాత్రమునఁ బాపములన్నియువీడి యఘాసురుఁడు సైతము దుర్జనులకుఁ బొందరానిదయిన భగవత్సాయుజ్యముఁ బొందినాఁడు గదా. ఇదియె యతివిచిత్రము. అయిన నిది యొక హెచ్చుగాదు. ఎవ్వని యవయవప్రకృతియైన యర్చామూర్తిని మనోమయమగుదానిని ధ్యానముచే హృదయమునం దుంచుకొనఁగా భాగవతగతియగు ముక్తినిచ్చునో యట్టి నిత్యనిరతిశయానందజ్ఞానరూపుఁడును ప్రాకృతగుణరహితుండును, నిస్సమాభ్యధికుండు నగుభగవంతుని సాక్షాన్మూర్తినే లోపలనుంచుకొనఁగా నతఁడు భాగవతగతి నిచ్చునని వేఱె చెప్పవలయునా? మఱియు నొక చిత్రము జరిగెను. కృష్ణుఁడు గావించినయీకృత్య మతనికౌమారమందు (ఐదవయేఁటియందు) జరిగినది. గొల్లబాలురు దానినప్పుడే చూచిరి; కాని యతనిపౌగండము (ఆఱవయేఁడు) వచ్చినపుడు, అపుడే తాముచూచినట్లు మందవారికిఁ జెప్పిరి. ఔరా! ఒకకాలమున జరిగినదానిని మఱొకప్పుడు జరిగినదిగా గొల్ల లనుసంధించునట్లుచేసిన భగవన్మహిమాతిశయ మేమనిచెప్ప! ఇది పండ్రెండవ యధ్యాయము.

---

## వత్సాపహారము.

సూతుఁడు:—శౌనకాదులంజూచి 'బ్రాహ్మణోత్తములారా! యాదవదేవుం డగు శ్రీకృష్ణుఁడు మనిచి పుచ్చినపరీక్షిత్తు తన

భర్తయగు నతనిచరిత్రము నిట్లు విని యతనియందు మనం బడంగి సెలవీన, కౌమారమందలి దానినే పౌగండమందుఁ జెప్పి రన్న విషయమును బుణ్యావహ మయినదానినిఁగూర్చి మరల శుకుని నిట్లడిగెను. 'బ్రాహ్మణోత్తమా! కౌమారమందు హరిచేసినదానిని బాలురు పౌగండమందుఁ దెలిసి చెప్పిరంటివి. మునుపోక కాలమున జరిగినదాని నప్పుడు జరిగినదిగాఁ జెప్పుట చొప్పడుట యెట్లు? ఇది కారణములేక కలుగనేరదు. కాన మహాయోగీ! గురూ! దీనినిజెప్పుము. దీనిని వినుట కెంతయు నాకుఁ గుతుకముగా నున్నది. ఇది హరిమాయ యగునేకాని మఱియొకవిధము గానేరదనుట నిజము. గురూ! మేము పాపిష్ఠుల మగుక్షత్రియులమయ్యు నీవలన మాటికిఁ బుణ్యంబయిన కృష్ణకథామృతమును గ్రోలుచున్నారము గాన లోకమునందు మేము మిక్కిలియు ధన్యులము సుమీ!' యనెను.

సూతుఁడు:—ఇట్లు పరిక్షిత్తు లెస్సగానడుగుటయు శుకుఁడు భగవంతుని యపరిచ్ఛిన్నవైభవముతలంపునకురాఁగానే సకలేంద్రియములను సద్దేవునియందు లయించినందునఁ గొంతసేపే మియుఁ బలుకకుండి యెట్టకేలకుఁ దెప్పిఱి వెలుపలఁ జూడ్కి నిగిడ్చి భాగవతోత్తములందు నుత్తముఁడయిన యాతనితో నిట్లనియె. 'మహాభాగా! భాగవతోత్తమా! నీ వీశ్వరుం డగు కృష్ణునికథను మాటిమాటికి వినుచున్నను మరల నవి క్రొత్తగా వించుచున్నవి. కాన నీవడిగిన దెంతయు లెస్స. సారగ్రాహులగు సాధువు లెప్పుడును నచ్యుతుని ముచ్చటలే నోరఁజెప్పుచును జెవులవినుచును మనంబులఁ జింతించుచును నుందురు. అట్లుండి నను వారల కచ్యుతునిముచ్చట, కామిని ముచ్చటలు కాము

కులకుంబోలెఁ, బ్రతిక్షణమును గ్రొత్తగ్రొత్త దానివలెనే కను పట్టుచుండును. ఇది వారికి స్వభావముసుమీ. రాజా! ఆలించి వినుము. నీ వడుగునది గోప్యమయినను దాఁపక నీకుఁ జెప్పెదను. గురువులు తమకు మిక్కిలి గారాబమైన శిష్యునకు గోప్యము నైనను జెప్పెదరు సుమీ. అంత భగవంతుఁడా హరి లేఁగలను వానిని మేపు బాలురనును మృత్యువుంబోలిన యఘాసురుని నోటివలననుండి విడిపించి రక్షించి యాతని నందఱను నొకసరస్సుకడ నున్నయిసుకదిన్నియకుఁ దోడుకొని పోయి, వారితో 'నెచ్చెలులారా! ఆహా! ఆయిసుకదిన్నయను జూచితిరా! అది యెంతో రమణీయముగా నున్నది. అందు, మెత్తనైన యచ్చంపుఁదెలియిసుక మిసమిసలాడుచున్నది. కనుక మనకు వలసినన్ని యాటలపాంపంతయు నందుఁ బొందవచ్చును. అందుఁ జక్కఁగా విరిసియున్న తామరతంపరల కమ్మతావులకు లోనై తుమ్మెదపిండుపులును బలుతెఱంగుల పులుఁగులును నరుదెంచి జలమునందుఁ బెక్కువగలఁ జేయురవళులకుఁ బ్రతిధ్వను లిచ్చుచున్న వృక్షసమూహములుఁ జుట్టు నెరసిబెరసి యున్నవి. చూడుఁడు ప్రొద్దుచాల యెక్కి పట్టపగ లయినది. ఇది భోజనమునకు వేళ. మీరు నాఁకటిచేత నకనకలాడుచున్నారు. కాన యిచ్చట మనమందఱము చల్దు లారగింతము. లేఁగలు దాపుననే నీరుద్రావి యల్లల్లఁగడ్డి మేయుచునుండుఁగాక' యనెను. ఆబాలురందఱును నల్లెయని లేఁగలనెల్ల నీరు కడుపులునిండఁ ద్రావించి పచ్చనిపచ్చికబయళులఁ గట్టి, తమతమచల్దిచిక్కంబులు విప్పి మనంబుల నుల్లాసంబులు గుప్పలుగొనఁ గృష్ణునితోడఁగుడువఁ దొడఁగిరి. ఆయడవియందు గొల్లబాలురు కృష్ణునిచుట్టును దిరిగి

రా గుండ్రని వరుసలుగాఁ గూర్చుండి కన్నుంగవలు దేఱకొన విచ్చి మెచ్చులుగులుకువెన్నునిదిక్కు మొగంబులు ద్రిప్పి కూర్చుండి, తామరపూవున దుద్దునుజుట్టి వరుసలు దీఱియున్న ఱేకులగుంపులుంబోలె నెంతయు సొంపుగులుకుచుండిరి. కొందఱు పూరేకులచేతను, మఱికొందఱు ముదురుఁ జిగురుటాకులచేతను, వేఱు కొందఱు లేఁజిగురు మొలకలచేతను, నింకనుగొందఱు పండ్లు, కావళ్లు, చెట్లుపట్టలు, ఱాలు మొదలగువానిచేతను గంచములు గావించుకొని యందుఁ దమతమచద్దులం గుడిచిరి. ఆబాలురందఱును దమతమతినుబండముల రుచిని వేఱువేఱ నొండొరులకుఁ జూపుచును బకపకనవ్వుచును నవ్వించుచును గృష్ణునింగూడి యన్నములంగుడిచిరి. యజ్ఞములందు హవిర్భాగములం గుడుచువాఁడయ్యు నా భగవంతుఁడు బాలకేళిం జేసి కడుపున దిండుగట్టినపుట్టములోపలఁ బిల్లంగ్రోవిని జెరివి, డాచంకయందు బుజ్జటకొమ్మును బెత్తమును జాఱి రాకుండున ట్లిఱికి, డాచేతియందుఁ మీఁగడపెరుఁగు జిడ్డు మిసమిసదేఱుచున్నచలిదిముద్ద నిడికొని, యందులకు నంజుకొనుటకై వలయు బిల్వ మామిడి మొదలగు పండ్లను నూరుగాయలను వ్రేళ్లసందుల యందుఁ జొనిపికొని, తనచుట్టును జెలికాండ్రు బలసియుండ వారి నడుమఁగూర్చుండి, సరసంపుఁ బలుకులచే నందఱ నవ్వించుచు స్వర్గమునుండి దేవతలు చూచుచుండఁ జలిదిగుడిచెను. ఇట్లు దూడలకాపరు లయినయాబాలురందఱును గృష్ణునియందు మనంబులెల్ల మరిగి చద్దులు గుడుచుచుండఁగా నాయేమఱిపాటున లేఁగలు పచ్చనిపచ్చికజొంపములకుఁ బేరాస లెసఁగ నడవిలోనికిఁ జాలదవ్వుఁజొచ్చి పోయినవయ్యె. అంతనాబాలురు వానినిగానక

భయమునఁగలఁతగొని యుండుటనుజూచి కృష్ణుఁడు వారి వెఱపు దిగఁద్రావుచు 'మిత్రములారా! మీరు కుడుపును కుడువలయు; కుడుచుచుండుఁడు. నేనుబోయి దూడలను మరల్చి తెచ్చెదను' అని చెప్పి చేతియందుఁ జలిది ముద్దదద్దయు మిఱారింపఁ గొండలయందును వాని చఱియలయందును బొదరులందును, బిలములందును దనక్రేపులను వెదకుచుం బోయెను. తామరచూలి యగు బ్రహ్మ, మున్ను భగవంతుఁ డఘాసురునిబారినుండి దూడలను బాలురను విడిచిపుచ్చఁగా, నాకాశమునఁ దాను నెలకొనియుండి చూచి మిక్కిలియు విస్మయము నొందెను. కానఁ దాను మాయాబాలకుండయిన యీశ్వరుని చక్కనిమహిమలు మఱియు నేవి గలవో చూడఁగోరి, యాక్రేపులనును బాలురను నక్కడనుండికొనిపోయి మఱియొక చోట దాఁచెను. కృష్ణుం డట్లు పోయిపోయి దూడలనుగానక, మరలి యెప్పటికొలంకుకడ నిసుకదిన్నియకు వచ్చి యందు దూడకాపరులనుం గానక, యారెంటిని వనమందు నన్నియెడలను వెదకుచుఁ దిరిగెను. కాని యడవిలో నెంతదవ్వు చొచ్చి వెదకియు, నొక్కయెడనేని దూడలును వాని పరులును నున్నజాడను దెలియఁడయ్యె. అపుడు విశ్వమునుగనుఁగొను వాఁడుగాన కృష్ణుఁడు 'ఇదియంతయు బ్రహ్మచేసినపని' యనితోడనే తెలిసికొనెను. పిదప నాకృష్ణుం డాక్రేపులయుఁ గాపరులయుఁ దల్లులకును, బ్రహ్మకును, బ్రీతిఁ గలిగించుటకై విశ్వదృశుఁడగు నీశ్వరుండుగావునఁ దన్నే యాదూడలను బాలురను రెంటినిఁగాఁ జేసికొనెను. మఱి యాభగవంతుఁడు కృష్ణుండు సమస్తప్రాణి స్వరూపుండుగాన దూడలకును బాలురకును గలయాయాకుఱుచ దేహములను, నాయాకొలఁదులు గలచేతులుకాళ్లు మొదలగు

నవయవములును, వారివారికట్టలును, గోష్ఠములును, బిల్లంగ్రోవు లును, దళములును, గావళ్లును, వారివారి సొమ్ములును, వస్త్రము లును, శీలములును, గుణములును నామములును, రూపములును, వయస్సులును, వారి విహారములు మొదలయిన వాని విధములును నన్నియుఁ దాల్చి 'సర్వంవిష్ణుమయంజగత్త'ను వాక్యమునకర్థమె యీమూర్తిఁ దాల్చి ప్రత్యక్షముగాఁ గనుపట్టుచున్నదో యన మిక్కిలియు వెలింగెను. ఇట్లు సర్వస్వరూపుండగు హరి లేఁగలు తానై, తానే యగు కాపరులు తన్నుఁ బిలిచి కొలుచుచుండఁగా, నన్నిటిని బరిపాలించువాఁడును దానేయగుచు, విహారక్రీడలను విహరించువారును దానై క్రీడించుచు, నిట్లన్నియుఁ దానై మం దను బ్రవేశించెను. అంతియకాక యాయాదూడలను వేఱు వేఱఁ గొనిపోయి, యాయా కొట్టములయందుఁజొచ్చి, యాయా దానికాపరియుఁదానై, యాయాకాపరులయింటను దానేప్రవే శించినవాఁడయ్యె. ఆయాబాలురతల్లులును, వారిపిల్లంగ్రోవుల రవళివినఁగానే సంబరమునఁ దమకన్నయ్యలు వచ్చిరని తోడ్తోఁబడ లేచి వారినిదమబిడ్డలుగాఁ దలంచుచునాపరబ్రహ్మము నే మెయి యానందమునఁ బొంగార రెండుచేతులు బారనాచి యెత్తికొని బిగియఁ గౌఁగిలించుచు మక్కువలు పిక్కటిల్లుచన్నులఁ జేఁపు లేపుచూప, నమృతమునవలెఁ దియ్యనై యాసవమువలెఁ జొ క్కించుపాలను వారికిఁ గుడిపిరి. రాజా! కృష్ణుండిట్లాయా జాములయందు నియతములైన యాయా కృత్యముల క్రమ మునుబట్టి పగటి నాలుగుజాములనుగడపి సందెజాము రాఁగా సొబగయిన తనచెయ్వులచేఁ దల్లులు మొదలయినవారిని సొగ యించుచుండుటయు వారును బిడ్డనికి నలుంగిడి, జలకమార్చి, కుం

కుమచందనము మొదలగు మైపూఁతలలంది, సొమ్ములు గయిసేసి కాఁపుబొట్టిడి, కన్నుంగవఁ గాటుకనీటుగాఁదీర్చి, మఱియుఁదక్కిన సంస్కారములుచేసి యెంతయుఁబుజ్జగించుచుందురు. గోవులంతఁ గొట్టములను జేరి వేగిరముగా హుంకారధ్వనులచేఁ దమతమ కోడెదూడలను బిలువఁగా నవి వచ్చి గూడుకొనుటయు వానిని మాటికి నాకుచుఁ బొదుఁగులందుఁ గాఱుచున్నపాలను గుడి పెను. గోవులకును గోపికలకును దూడలును బాలురునైయున్న యీకృష్ణునియందును, బుజ్జగించుట మొదలయిన తల్లివగలుము నుపటివలెనే యుండెను. కాని మిక్కుటమయినమక్కువయొక్క టిమాత్రమిపు డెక్కుడుగా నుండెను. వీనియందుఁ గృష్ణునకుఁగల బిడ్డవగలన్నియు మునుపటివలెనే యుండెనుగాని 'నాతల్లియిది దీనికొడుకునే' ననెడి యీమాయానటనముమాత్రమే యిపుడు విశేషముగా నుండెను. మందయందలి గొల్లలును యశోదపట్టి యగు కృష్ణునందుఁ దమపుత్త్రులకంటె నెక్కుడు మక్కువపెంపు మునుపే కొనలుసాగుచు పెరిఁగియుండెను. ఇప్పుడు, తమబిడ్డలు నిజమున కాకృష్ణుఁడేయగుటంబట్టి, వారియందు నయితము సంవత్సరమువఱకుఁ బూఁటపూఁటకుఁ దమమక్కువ మెల్లగాఁ గొలఁదికి మీఱి పెరుఁగుచుండెను. ఇట్లు దూడలనియు వాని మేపరులనియు నెపముగొని తన్నే తాను బాలించుచుఁ దాను ను దూడలమేపరియై, కృష్ణుఁడు వనమందును మందయందును నొకసంవత్సరము క్రీడించినవాఁడయ్యె. ఆసంవత్సరమున కయి దాఱు దినములు తక్కువగానుండఁగా నొకనాఁడుబలరాముఁడు దూడలనుదోలుకొని వనమునకుఁ బోయెను. అపుడు మిక్కిలి దవ్వుగ గోవర్ధనపర్వతపు శిఖరమందుగడ్డిమేయుచుండిన గోవులు

మందకుదాపున మేయుచున్నదూడలను జూచెను. అట్లాగోసమూహము దూడలను జూడఁగానే వానియందలి నెయ్యమునకు లోనై తమతమ యొడళ్లు మఱచి పరుగెత్తువేగమున ముందఱిపిఱిందికాళ్లు నాలుగును గూడికొని రెండుకాళ్లుఁబోలెఁజూపట్ట, మెడలు మూఁపురములకు మలంచి, మోగిలును దోఁకలును బయికెత్తి, హుంకారములు సేయుచుఁ, బాలుచల్లిగొనికాఱుచుండఁగా, గోపకులెంత నిలువరించినను సయింపక దోఁసిపుచ్చి, మార్గము మిక్కిలి నడవఁగూడకున్నను గడచి మందసమీపమునకు రివ్వున బాఱివచ్చెను. ఆయావులు మఱల దూడల నీనియున్నను, దొంటిదూడలయందు మక్కువలు వీడక వాని యవయవములు నాకుచుఁ బొదుఁగులందుఁ జేఁపినపాలను గుడిపెను. వానిని గాచుచుండినగోపకు లాగోవులను నిలువరించుటకై పడిన ప్రయాసమంతయు వ్యర్థమగుటచే లజ్జయు మిక్కుటమయినకినుకయు నుల్లంబుల మల్లడిగొన దుర్గమమయిన మార్గమువలన వెతలుగుడుచుచు, వచ్చి, గోవులను గ్రేపులను గూడియున్నతమ పుత్త్రులను జూచిరి. ఇట్లు లజ్జతోను గోపముతోను వెతలతోను గూడి, యాబాలురను సయితము కొట్టుటకు వచ్చినవారయ్యు వారిని జూడఁగానే ప్రేమరసముప్పొంగి యుల్లంబులందు వెల్లిగొని ముంపఁగాఁ గోపములను వీడి, యనురాగములు పెచ్చుపెరుఁగ నాచిన్నిబాలురను బారసాచి గ్రుచ్చియెత్తికొని కౌఁగిలించి యాదలలు మూరుకొని యెంతయు ముదంబునఁ బొదలుచుండిరి. అంతగోపకులును గోవులును దమదమ బిడ్డలను కౌగిలించుకొనుటచేత నెంతయుమనంబుల నూఱటలొంది మిక్కిలియుఁ గష్టమున నెట్టకేలకు నల్లల్లన

వారినివదలి వారినే తలంచుకొనిపోవ నోపక కన్నులనీరుచిప్పిలు చుండ వెడలిపోయిరి. అట్లు మందయందలి గోవులుగోపికలు మొదలగువారికిఁ జన్నుగుడుపు విడిచినబిడ్డలయందును, మిక్కుటమయిన ప్రేమయును నుత్కంఠయును బెంపారుచుండుటను బ్రతిక్షణమును జూచి యందులకు హేతువు దెలియక తనలోఁ దాను 'గొల్లపల్లియ యందలివారికిని నాకును వాసుదేవుని యందుఁ బ్రేమ మెప్పుడును గలిగియుండును. అఖిలాత్ముం డగుటచే నతనియం దట్లుండుట యుక్తమే. కాని వారికిని నాకును వాసుదేవునియందు ముందుఁగలయట్లుంబోలె గొల్లబాలురయందును నపూర్వంబగు ప్రేమపెచ్చు పెరుఁగుచున్నదే! ఈయద్భుతమేమి? కారణమెద్దియో? ఎక్కడిదీమాయ? ఇది దేవతలచేతఁ బ్రయుక్తమైనదా? లేక మనుష్యులచేతనైనదా? కాక యసురమాయయో? నాకు నాదుభర్తయైనశ్రీకృష్ణుని మాయయనియె తోఁచుచున్నది. మఱియొక్కరి మాయ యిట్లు సకలజనములను మోహపెట్టఁజాలదుగదా!' యనియిట్లు చింతించి యంతట దూడలను దనతోడిబాలురను దివ్యజ్ఞానమయంబగు దృష్టినిజూచి యందఱును వైకుంఠుఁ డగుకృష్ణుఁడేయగుటనుగాంచినవాఁడయ్యె. అంత నతఁడు కృష్ణునిఁ జూచి ' ఈశా! మనము కాచుచున్న దూడలు ఋషుల యంశములు. దూడకాపరులు దేవతలయంశములని యిదియింతవఱకు నాకుఁ దెలియును. ఇప్పుడో యివి ఋషులుగాఁగాని వీరు దేవతలుగాఁ గానితోఁపకున్నారు. దూడలనియు బాలురనియు నిట్లు రెండుదెఱఁగుల వేఱువేఱనుండినట్లు నాకుఁ బయికిఁ దెలియుచున్నను నన్నియు నీవొక్కఁడవుగానే నాకు వెలుంగుచున్నావు. సర్వాం

బు నగునీ విట్లు వేఱువేఱ వర్తించుట యెట్లు? చెప్పుము' అని యడుగఁగాఁ బ్రభుం డగుకృష్ణుండు సంక్షేపమునఁ గలవిషయమును చెప్ప నా బలుండు తెలిసికొనెను. బ్రహ్మయుఁ దన యెప్పటి కొలువునకుఁ బోవఁగా, నందుఁ దన సింహాసనమున విష్ణుండు తన నలుమోములరూపు దాల్చి యాసీనుండై యుండెను. ద్వారపాలురతనినే బ్రహ్మయని తలఁచి వచ్చిననిక్కపుబ్రహ్మనుజూచి 'పరమేష్ఠిసింహాసన మధిష్ఠించియే యున్నాఁడు. నీవెవ్వఁడవు? క్రొత్తగావచ్చితివి' అని తిరస్కరింపఁగా నవమానితుండై మరలెను. అట్లు బ్రహ్మ వత్సబాలురను దాఁచిమరలవచ్చునంతలో నొకసంవత్సర మయ్యెను. అది యాబ్రహ్మకుఁ దనకాలమానముచొప్పున నొకత్రుటికాల మయ్యె. ఆత్రుటికాలమునకు నతఁడు తొంటివలెనే మరలిరాఁగాఁ గృష్ణుఁడు రామునితోడ సంవత్సరపర్యంతము క్రీడించుచుండుటను గాంచెను. అంత బ్రహ్మ యాశ్చర్యమునొంది తనలో 'మందయందు బాలు రెందఱు గలరో దూడ లెన్నియున్నవో యన్నియును నామాయ యనెడుశయ్యను బరుండియే యున్నవి కాని యింతవఱకును వారు నవియు మేలుకొన్నవిగావు? వీరెవ్వరో వేఱుగనున్నారే! ఎక్కడివారు? నా మాయచేతమోహితులై నేను గొంపోయి దాఁచినవారెందఱో యందఱే నిరుఁడు మొదలుగా నీయేఁడు పెట్టినంతవఱకు నొక సంవత్సరము కృష్ణునితోడఁ గ్రీడించుచుఁ జూపట్టుచున్నారు' అని దూడలుగను బాలురుగను నిరుదెగల భిన్నులై యున్న వారినిగూర్చి 'వారే వీరలా? లేక వేఱా? వేఱైనచో నెందలి వారు? ఎక్కడనుండివచ్చిరి?' అని యిట్లు చాలసేపాలోచించెను; కాని యాబ్రహ్మ సచ్ఛబ్దవాచ్యుండును బరబ్రహ్మమునగుకృష్ణుఁడే

వీరెల్ల నగుదురని యేవిధమునను దెలిసికొనశక్తుఁడు గాకపోయె ను. తనంతట నేమోహమునకును లోను గాక విశ్వమునంతయు మోహింపఁ జేయుచుండు బలువిన్నాణి యగువిష్ణుని నిట్లు బ్రహ్మ మోహపెట్ట నుంకించెను గాని, తుదకుఁ దన (తన్ను శరీరముగాఁ గల పరమాత్ముని) మాయచేతఁ దానే మోహితుఁ డయ్యెను. కటికిచీఁకటి రాత్రియందు, మంచుబొట్టు (కమ్ముదల) వలని చీఁకటి వేఱుగాఁ గనుపట్టనేరక యందే యెట్లు లయించునో, పట్టపగలింటియందు మిడుఁగురుఁబుర్వుమినుకు లెట్లు మెఱయనేరదో, యట్లె, విశ్వమోహనుఁ డయినమహాపురుషునియందుఁ బురుషుఁడు మాయపన్నుటకుఁ బూనినచో వాని యేవంపుమాయ లించుకయుఁ గొఱగావు. కొఱగాక పోవుటయేకాక వానియుండలి సామర్థ్యమును దూలించును. అంత బ్రహ్మ చూచుచుండఁగానే యాక్రేపులును మేపరులగు బాలురు నందఱును దత్క్షణమే నీల మేఘశ్యాములును, పీతాంబరపరిధానులును, జతుర్భుజులును, శంఖచక్రగదా పద్మహస్తులును, కిరీటకుండల హారవనమాలికా విరాజమానులును, నై కనుపట్టిరి. మఱియు వారి భుజములందు శ్రీవత్సపుఁగాంతులచేఁ దులకించుచుండు బాహుపురులును, జేతులయందు రత్నమయములై సంకుపులవలె వ్రత్రువలయి యున్న కంకణములును రాణించుచుండెను. మఱియు శ్రీవత్సాంకితవక్షులును గౌస్తుభవిభాసితకంఠులును గటకనూపుర కటిసూత్రాంగుళీయకాది నానాభూషణభూషితులును నై చూపట్టిరి. వారి నెమ్మేనులం దాపాదమస్తకము సకలావయవములందును బహుజన్మార్జితము లయినభూరి పుణ్యములుంబోలె మెత్త నగుక్రొత్త తులసీదళంపుసరములు పురణించుచుండెను. వారియందు వెన్నె

లలవలెఁ జెన్నారుచున్న తెల్లని నవ్వులు నివ్వటిలుచుండఁగా నిజభక్తులమనోరథములను బాలించుటకై *సత్త్వగుణముఁదాల్చియున్నారోయనునట్లును, కెంపారుచున్న వారికడకంటిచూడ్కులను జూడఁగా నాశ్రితాభీష్టములను సృజించుటకై రజోగుణము గయికొనియున్నారో యనునట్లును, జూపట్టుచుండిరి. బ్రహ్మయగు తాను మొదలుగా గడ్డిపఱకవఱకుఁ గలచరాచరములన్నియు నవ్యయమూర్తులఁదాల్చి నృత్తములు గీతములు వాద్యములు మొదలగుననేకార్హపూజనములతో వేఱువేఱ వారినుపాసించుచుండిరి. అణిమాది విభూతులు ప్రకృతి మొదలయిన కార్యోపయోగినులగుశక్తులును, మహత్తు మొదలయిన యిరువదినాలుగు తత్త్వములును వారినిఁబరివేష్టించి యుండెను. నిమేషాదిరూపమై గుణక్షోభహేతు వగుకాలమును, బరిణామహేతు వగుస్వభావమును, నుద్బోధహేతు వగుసంస్కారమును, కర్మహేతు వగుకామమును, తత్తద్దేహ ప్రాప్తిహేతు వగుకర్మమును, జ్ఞానవిక్షేపమోహహేతువు లగుసత్త్వాదిగుణములును మొదలగునవి భగవంతుని మహత్త్వముచేతఁ దమతమ మహిమలు డిందువడ, మూర్తిమంతములై వారిని గొలుచుచుండెను. మఱియు వారు కేవల సత్యజ్ఞానానందరసైకస్వరూపులై, యాత్మజ్ఞానమేకన్నులుగాఁగలవారికిని దెలియఁదరముకానిమాహాత్మ్యంబున వెలయుచుండిరి. ఇట్లు చతుర్ముఖుండు పత్సవత్స

* సత్త్వముతెల్లనై పాలకమగును. రజస్సు ఎఱ్ఱనై సృష్టికార్యకరమగును. ఆ రెంటిని నవ్వులయందును గడకంటి చూడ్కులయందును నధ్యవసించుటను తెలియునది. తెలినవ్వులచేఁ బాలించునట్లును గడకంటికటాక్షములచే పూరించునట్లును భావము.

పాలకులందఱును, నెవ్వని వెలుంగుచేత చరాచరాత్మక మయిన యీజగమంతయు వెలుంగుచున్నదో యట్టి పరబ్రహ్మమే యై మఱి యొకటిగాకుండుట నొకపరి చూచెను. అంత నాబ్రహ్మ దెప్ప రమయిన యాశ్చర్యముచేతఁ జూపు మగిడ్చికొని యవ్వారి తేజంబుచేతఁ దన యేకాదశేంద్రియములును స్తిమితములై యుండ, నా గొల్లపల్లె నధిష్ఠించి యుండుపురదేవతముంగల నాడుకొనుట కయినఁనలువమోములబంగరుబొమ్మయో యను నట్లు కదలక మెదలక మౌనపడి యుండెను. ఇట్లు పరిమిత సుఖరూపుఁ డగుజీవునివలెఁగాక స్వయంప్రకాశంబును నపరి మితసుఖాత్మకంబునై, ప్రకృతికి విలక్షణమైన డగుటవలన నిట్టి దట్టి దనరాక, ప్రత్యక్షానుమాన ప్రమాణముల కగోచరమై, ప్రకృతిపురుషాది స్వరూపస్వభావములు గలది గానిదని వేదశి రంబు లగునుపనిషత్తులచేతఁ దెలియంబడినదై, యొప్పు తన మహిమాస్వరూపమును సరస్వతీనాథుం డగుబ్రహ్మయుఁ గనుఁ గొనుటకు నశక్తుఁడై యే మిదియని తబ్బిబ్బుపడుచుండఁగా, సర్వాధికుండును గర్మాధీనోత్పత్తి రహితుండు నగుభగవంతుఁడా బ్రహ్మ యున్న స్థితిని దోడనే తెలిసికొని మునుపటివలె దూడలు గను బాలురుగను దన్నుం జూపుటకై తన యసాధారణరూప మును గప్పిపుచ్చు మాయ యను తెరను నతనిపైఁ గప్పినవాఁడ య్యె. అంత నాబ్రహ్మ తనయింద్రియములు మగల వెలికి నిగు డఁగా మృతుం డగువాఁడు లేచినట్లు మిక్కిలి మాయం గప్పంబడి లేచి తెప్పిఱి తెలివినొందియెట్లో కన్నుఁగవ యల్లనల్లన నెట్టకేలకు విచ్చి తన్నును దక్కినజగమును (తొంటివలె నంతయు భగవ ద్రూపములుగాఁగాక) గలరూపుగాఁ గాంచినవాఁడయ్యె. అపుడే

నలు ప్రక్కలను దిక్కులందగలయం జూచుచు, జనులు వెక్కు రుపజీవించునట్టి పలువృక్షములు నెరసి బెరసి నలుగడల నిం పు పెంపారు చున్న బృందావనమును దనయెదుట నుండఁగాఁ గాంచెను. ఆబృందావనమందుఁ గలమనుష్యులకును సింహా దులయిన మృగములు మొదలగువానికిని స్వభావముచేత వై రము దుర్వారమయ్యును, అన్నియు మిత్రములవలె నొండొరు లను గూడిమాడియుండినవి. ఏలన నందు భగవంతుఁడు వసించి యుండుటవలనఁ గ్రోధము లోభము మొదలయినవియెల్లఁ బలా యితములై యుండెను. అందు బ్రహ్మ,గొల్లపిల్లవానివలె నటనము నుగయికొని,తనయీడు మఱియొకటిలేక యనంతమై యపరిచ్ఛి న్నజ్ఞానస్వరూపమైయున్నకృష్ణాఖ్య మగుపరబ్రహ్మము తొం టివలెఁ జేతఁ జలిదిముద్ద యిడికొని చెలికాండ్రను దూడల నలు గడల వెదకుచుఁ దిరుగుచుండఁగాఁ జూచెను. అట్లు చూడఁ గానే యతఁడు తన వాహనమునుండి తెప్పునదిగి పుడమిపయిని బంగరుకఱ్ఱవలెఁ దన దేహమును గొబ్బునవైచి, తన నాలుగు కిరీటములకొనలు నతని పాదయుగళమునుసోఁకఁజాఁగిలిమ్రొక్కి యానందాశ్రువులనెడి మేలిజలములచే నతని యడుగుల కభిషే కము గావించెను. అద్దేవుఁడు కృష్ణుని యడుగులపైఁ జాలసేపు మాటిమాటికిఁ బడుచును, మాటిమాటికి లేచుచును మున్ను గన్నారఁ జూచినయతనిమహత్త్వమును మరల మరలఁ దలఁచు కొనుచు నడుగులపయిని బడియుండెను. అతఁడు మెల్లగా లేచి కన్నులు దుడుచుకొని ముకుందుని మొగమెత్తిచూచి మరల మెడవంచి వినయము గడలుకొన వడవడ నడంకుచుఁ గేలు

మోడిచి డగ్గుత్తికవడు పలుకుల నిట్లని స్తుతించెను. ఇది పదు మూఁడవయధ్యాయము.

---

### బ్రహ్మకృతస్తోత్రము.

బ్రహ్మ 'ఈడ్యా! నల్లని మబ్బువంటి నెమ్మేనుగలిగి, మెఱుపువంటి యంబరముగట్టి, చెవియందుఁ జెఱివిన గురివెందగుత్తులును దలపూవుగా నిడిననెమిలిపురియును మొగంబున కందగింప, నడవిపూవులదండ లఱుతఁదాల్చి, చలిదిముద్దయు బెత్తమును బుఱ్ఱలగొమ్మును బిల్లంగోవియుఁ దనకుఁజిన్నెలై చెన్నుమీఱ, మెత్తనియడుగుల బెడఁగార, గొల్లఱేఁడగునందునికడుపు చల్లఁగాఁ బుట్టినపట్టికి నీకు నమస్కరించుచున్నాను. దేవా! నాయందలి యనుగ్రహముచేత భూభారము నివర్తింపుమన్న నా ప్రార్థనమును సఫలముచేయుటకై నీవు గయికొన్నదియుఁ, గర్మముచేతఁగాక నీయిచ్చచేత నీకు వచ్చినదియు, భూతములకూడికచేత నయినదిగాక శుద్ధసత్త్వమయం బయినదియు, నగునీయీ గొల్లమేని మహిమను, బ్రహ్మనయ్యును నంతరింద్రియమగు మనస్సుచేత నయితము నిశ్చయించుట నా కెంతమాత్రము శక్యము గాకున్నదే! ఇఁకఁ బరమాత్ముండైన నీదునను కూల జ్ఞానస్వరూపం బగు సౌహార్ద్రపమును నిట్టిదని నిశ్చయించుటను గుఱించి చెప్పనేల? (ప్రకృతి వియుక్త ప్రత్యగాత్మోపాసనరూప మగు) జ్ఞానయోగమున మిక్కిలియుఁ బాటుపడుటను దిగవిడిచి, నిన్నే శరణొంది, ప్రపన్నులయ్యుఁ దమతమ వర్ణాశ్రమానురూపము లగు ధర్మములను నీ యాజ్ఞారూపములగుటం బట్టి తప్పక యాచరించుచు, సజ్జనులు మనోవాక్కాయము

లనెడి త్రికరణములచేతను బ్రకటించునట్టినీదుకథలను జెప్పులారఁ గ్రోలుచుండుటయె ధారకముగాఁగలిగి, ముల్లోకములందుఁ గల యితరవిషయములం దాసక్తిలేక యుండునట్టి ప్రపన్నులు నీ వశితుండవయ్యు నిన్నుఁ దఱచుగా * జయింతురు. నీభక్తి నీమాయను దాఁటించి నిరతిశయాపరిచ్ఛిన్నానందరూపప్రాప్తియగు శ్రేయమును బిదుకునట్టిది. అట్టి ముక్తిసాధనమగుభక్తిని (వానికనుగ్రాహకమయిన జ్ఞానయోగమునను) దిగవిడిచి, కేవలప్రత్యగాత్మానుభవరూప మగుకైవల్యమును బడయుకొఱకుఁ గష్టపడుచుండునట్టి వారికి, గింజలులేని వట్టిపెద్దపొల్లులను దంచువారికిఁబోలె, వట్టిక్లేశము మాత్రమే గలుగును గాని మఱియొక ఫలము గలుగదు. భక్తిచే ముక్తినొందినవాఁ డెవఁడేని గలఁడా? యందువేని వినుము. విపులానందరూపా! లోకమందు భక్తియోగమున కుపకారక మయినయాత్మయాథాత్మ్య (జ్ఞాన) యోగమును గయికొన్నవారు తమతమ వర్ణాశ్రమానురూపము లయిన యనుష్ఠానకర్మములను నీయందు సమర్పించి నిజసత్కర్మములచేత నిష్పన్నంబైనదియు నీకథలను విని విని ప్రత్యక్షరూపము నొందింపఁబడినదియు నగుభక్తిచేతనీస్వరూపస్వభావములను గలరూపునఁ గనుఁగొని, అచ్యుతా! వెక్కంద్ర పరమం బగు గతిని (ముక్తిని)బొంది యున్నారు. భూమా! ప్రాకృతగుణరహితుండ వగునీదు మహిమను నమలాంతరాత్ములయిన సనకాదులకును మాబోంట్లకును దెలియుట

---

* ఇట జ్ఞానయోగము ప్రయాసమాత్ర ఫలమనియు గాన దానిని విడిచి భగవంతుని వశీకరించుకొనుటకు శరణాగతియే సాధనముగాఁ దలంపవలయు ననియుఁ దెలియునది.

కెంతమాత్ర మనువుగాదనుట నిజమే; అయినను దానినిట్లు తెలియవచ్చును. అనఁగా నది ప్రకృతివలె స్వరూపమునందుఁగాని పురుషునివలె స్వభావమునందుఁగాని వికారమొందునది గాదు. మఱియు జీవుని ధర్మభూతజ్ఞానమునకుసంకోచవికాసరూపవికారమును గలిగించు మూలము కర్మముచేతనైన రూపవత్త్వము అనఁగా శరీరసంయోగవియోగమె. నీస్వరూపమున కట్టి వికారములేనందున దానికి మూల మగుకర్మాయత్త శరీరసంయోగవియోగములును లేకుండును. మఱియు జీవుఁడు దన యాథాత్మ్యమునను భవింపలేనందునవానికి రూపవత్త్వము గలుగుచున్నది. నీకట్లు రూపవత్త్వములేనందున, స్వయాథాత్మ్యానుభవము గలదగుచున్నది. నీస్వరూప మిట్టిదగుటవలన నది యితరులకు సాధారణమైనదిగాదు. కాన,నితరుల కిట్టిదని తెలియరాక తనంత దనకుమాత్రమే తెలియఁగూడినదై యున్నది. ఇది యిట్లుపరిచ్ఛిన్నత్వాదులు గలదిగాఁ దెలియఁగూడును గాని మఱియొక విధమున (ననఁగా పరిచ్ఛిన్నత్వాదులుగలదిగాఁ) దెలియ నెంతమాత్ర మర్హముగాదు. పెద్దయుఁ గాలమునకయినను భూమియందు దుమ్ము నలుసులను, ఆకసమందలి మంచుకణములను దివియందలి నక్షత్రాదికిరణముల పరమాణువులను విశేషించి లెక్కవెట్టునంత బుద్ధికుశలు రయినను నెవ్వరు సమస్తకల్యాణగుణములకుఁబట్టయిననీదు కల్యాణగుణములనుగాని, నీపరత్వమందలి వేకాక యీ జగమునకు మేలునకై యవతరించినప్పటి నీవిభవంబుగుణములనుగాని, గణించుటకుఁ జాలిరి? ఎవ్వరును లేరు. ఇట్లు నీమహిమ యెంతమాత్రమును దెలిసికొననివారై యుండుటవలనఁ బ్రవృత్తిచేఁ దక్క నీమాయను దాఁటఁగూడ

కున్నందునఁ, బురుషుఁ డెవఁడు కేవలము మనోవాక్కాయములచేత నిన్ను శరణొంది (ప్రపత్తిచేసి), యపరాధముల నించుకయుఁ బాటింపక కనికరింపఁజూచునట్టి నీకృపయె యపరాధులగు ప్రపన్నులకును నుత్తారకమయిన దని తలంచుచు,తన కర్మములచేఁ గడించిన * సుఖదుఃఖాది ప్రారబ్ధఫలములను మాత్రమే యనుభవించుచును జీవించుచుండునో, వాఁడుము క్తిపదమునందు నీదునిత్యముక్తులతోడ నీస్వరూపానుభవరూపమయిన దాయమునకుఁ బాలికాఁపగుచున్నాఁడు. ఈశా! చూడు, నా దౌర్జన్యమును! మాయలకును (ఆశ్చర్యశక్తియుక్తులకంటెను) మాయివై (అధికాశ్చర్యశక్తియుక్తుఁడవై) అపరిచ్ఛేద్యస్వరూపస్వభావముల కలిమింబట్టి యనంతుఁడవై యున్న పరమాత్మవగు నీయందు నామాయను బఱపి గప్పి, నాసామర్థ్యమును జూడఁగోరితినే. ఇట్లు నీపట్లఁజేయునేను నీ యందెంత మాత్రము? అగ్గియందుఁబుట్టిన మిడుఁగుఱుం తేక దా!అచ్యుతా! నేను రజోగుణమునందుఁ బుట్టినవాఁడను. నీ మహిమ నాకుఁ దెలియదయ్యె. కాన నీకంటె వేఱుగా నే నొకయీశుండ నని తప్పఁదలంచికొని బ్రహ్మ ననెడికావరంపుఁజీఁకటి క్రమ్మునటుచే గన్నుఁగానకున్నవాఁడనుగాన,నాకీదౌర్జన్యము యుక్తమే. కనుక 'వీనికి నేనే దిక్కు; వీనిని నాకే భరింపవలసియున్నది. కాన,వీనిని దయఁజూడవలసియు నున్నది'యనితలంచి నాయీదుష్టత్వమును మన్నింపుము. నీ వండాధిపతివిగాన యీశ్వరుఁడవే యగుదువు గాని యీశ్వరుఁడ ననితప్పఁదలంచుకొన్నవాఁడవు గావు;కాన,

---

* దీనిచే ప్రపన్నులకు ప్రారబ్ధముల ననుభవించుట యొకటి తప్ప భగవత్ప్రాప్తికి మఱియొక్క ప్రయత్నమును జేయరా దని సూచితము.

నిన్ను నాకు దయఁజూడ నక్కఱలేదందువా ? ప్రధానము, మహత్తు, అహంకారము, ఆకాశము, వాయువు, అగ్ని; జలము భూమి యనునివి వరుస నావరణములుగాఁ జుట్టుకొనియున్న యీ యొకయండ మనుకుండయందు (నాకొలఁతను) నేఁడు జేనలకాయము గలనే నెక్కడ ? ఇట్టి లెక్కలేని యండము లెవ్వనిరోమకూపములందుఁ,గిటికీలయందు నుడియు పరమాణువులుంబోలెఁ, దిరుగుడు వడుచుండునో యట్టి నీమహత్త్వమెక్కడ? అధోక్షజా! కడుపులోపల నున్న శిశువు కాలందన్నినచో నది తల్లికిఁ దప్పగునా ? తప్పేకాదు. నీవు నాకడుపునందుఁ లేదే యందువేని, నీకుక్షికి వెలుపల, నించుకయినను, గలదు లేదను వ్యవహారమునకు విషయ మగు చిత్తుగాని యచిత్తుగాని యేమి యున్నది ? ఏమియు లేదు. అన్నియు నీ కడుపులోనివియే కదా! ముల్లోకములు ప్రళయ మందునపుడుసముద్రములన్నియుఁగలంగి చెలంగి యొకటితో నొకటిగూడికొనఁగా నామహాజలమందు నారాయణుని యుదరమండలినాభివలనినాళమునుండి నేను బయలువెడలితి నని జనులాడుకొందురు.అది పొల్లుకాదు;నిజమే యగును. ఈశ్వరా? నీవలననుండి పుట్టినాఁడనుగానా? పుట్టినవాఁడనే చుమీ. 'నీవెవఁడో నారాయణుని కొడుకయితే నాకేమియందువా? నారాయణుఁడవు నీవేకావా ? అగుదువు;ఎట్లన నీవు సమస్తదేహులకును నాశ్రయమవుకాన * నారాయణుఁ

* నారములనఁగా జీవసమూహములు. వానికి అయన మనఁగానాశ్రయము; గాన నారాయణుఁడవని యిట వ్యుత్పత్తిచేతఁగృష్ణునికినారాయణత్వము సమర్థించుట తెలియునది. ఇట్లె యితర వ్యుత్పత్తులచేతను నారాయణత్వము సమర్థించుట తెలియునది.

డవు. మఱి ప్రవర్తకుండవు * గావున నారాయణుండవు. మఱియు నఖిలలోకములను నీవై చక్కఁజూచునట్టి † సాక్షివి గావునను నారాయణుండవు. 'ఈవిధములచేత నీవు నారాయణుండ వగుట యెట్లు ? జలాశ్రయమునుబట్టియే కదా యట్లు ప్రసిద్ధి' యనియందువేని, పరమాత్మవలనఁ బుట్టినజలములయనము(ఆశ్రయము) గాఁ గలవాఁడు గావునను నారాయణుండు నీ యంగమగును. (అనఁగా నీవే యగుదువు.)'నేను నారాయణుండ నేని విశ్వమంతయు వ్యాపించియుండక విశ్వములోని ‡జలమాత్రమందు వర్తించుట యె' ట్లందువేని, విభుండవగునీ కా జలాశ్రయత్వము సత్యమే. అది పొల్లుగాదు. జగములెల్ల నున్నట్టి నీదుశరీరము సృష్టిమొదట జలమునందుండినదేని, జలమునం దుండుట నాయధ్యవసాయమునకుఁ దోఁపఁగూడినదేని, భగవంతా ! ఆజలమందుండిన దేహమే నేను జూడలేదా ? ఆ జలమునందుండిన దానినే నాహృదయమందుఁ జక్కఁగా గనుఁగొనలేదా ? తోడనే యపుడే నీవు దానిని మాకు మఱుఁగు పఱుపలేదా ? జలమందుండినదియు, నీవు జలమందును హృదయమందును జూపినదియు మఱుఁగుపఱిచినదియు నగుదేహము 'జగత్కారణ

* దీనికి 'నారస్య అయనం ప్రవృత్తిః యస్మాత్ సః నారాయణః' అని వ్యుత్పత్తి.

† దీనికి 'నారమ్ ఏవ జానాసీతి నారాయణః' అని వ్యుత్పత్తి.

‡ ఈవ్యుత్పత్తులు నారాయణ శబ్దమునకుఁ బ్రసిద్ధములుగావు. 'ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపోవై నరసూనవః, అయనం తస్యతాః ప్రోక్తాస్తేన నారాయణః స్మృతః ' అను వ్యుత్పత్తియె ప్రసిద్ధము. కాన యావ్యుత్పత్తి చొప్పునను నారాయణుఁ డని యిటఁ జెప్పఁబడినది. నారాయణుఁడైనచో 'విశ్వంనా

భూతుఁడగు ననిరుద్ధమూర్తిదిగాని నాదిగాదు. కాన నేను నారాయణుఁడనుగా' నందువేమో! మాబోంట్ల మాయలనెల్లఁ గ్రిందు పఱచుస్వామీ! నీకు బయట స్ఫుటముగాఁ దోఁచుచున్న చిదచిదాత్మకమయిన యీప్రపంచమును నీ యీ యవతారమందే నీయుదరములోపలఁ దల్లియశోదకుఁ జూపి నీ మాయిత్వమును (విచిత్రశక్తిత్వమును) బ్రకటించితివే. కాన ప్రపంచమంతయు లోపలఁగల నారాయణుఁడవేచుమీ నీవు. మనయిరువురకుఁ గూడఁ గనుపట్టుచున్న యీచిదచిదాత్మక మగు జగమంతయు వెలుపల నెట్లు వెలయుచున్నదో యట్లే యంతయును నీయందును, నీజఠరమందు, నారా! వెలసినదిగదా! ఇట్లు నీజఠరమందు వెలయుట నీమాయ (యాశ్చర్యశక్తి) కాక మఱియేమి? నీమునుపటి యిప్పటి యవస్థలు రెంటిని జూచువాఁడను గాన నాకు నీయిప్పటిగొల్లతనువు రూపమే కాక నీతక్కిన మాయనెల్లఁ (విచిత్ర శక్తినంతయుఁ) జూప లేదా యేమి? చూపియున్నావే. ఎట్లన మొదట నేను లేఁగలనుబాలు

---

రాయణం దేవ మక్షరం పరమమ్' అన్నట్లు విశ్వవ్యాపకుఁడను గావలయును గాని, విశ్వములోనున్న జలమాత్రమందు వర్తించుట యెట్లని యడుగఁగా నట్లు వర్తించుటయు సత్యమే యనెను. అనఁగా 'అణో రణీయాన్ మహతో మహీయాన్' 'ఏష మే ఆత్మాఽన్తర్హృదయేఽణీయాన్ వ్రీహేర్వా యవాద్వా సర్షపాద్వా... పృథివ్యాజ్యాయానన్తరిక్షాజ్జ్యాయాన్' ఇత్యాదిశ్రుతులచేత భగవంతుఁడు స్వరూపమునందునురూపమునందును అణువుకంటె నణువుగాను మహత్తుకంటె మహత్తుగాను నుండుటచే విశ్వములను వ్యాపించి యుండుటయు విశ్వములోని జలమాత్రమందు వర్తించుటయు రెండును నాసర్వశక్తికిఁ బొసంగును గాన, యది సత్యమే; పొల్లుగాదని యాశయము.

రను దొంగిలించునపుడు నీవెక్కండ వయ్యును సమస్తము లయిన దూడలును గొల్లబాలురు నయితివి. పిదప గొల్లబాలు రెందఱో యందఱు చతుర్భుజులయి నేనును దక్కినచరాచరములన్నియు నుపాసించుచుండఁగాఁ జూపట్టితివి. పిదపఁ జతుర్భుజులెందఱో యన్నివిరా*డ్రూపము లయితివి. పిమ్మట నపరిచ్ఛిన్నమును, మఱియొకటి లేనిదియుఁ, గృష్ణాత్మకమునగు బ్రహ్మమవయి మిగిలియున్నావు. 'నీవును దక్కిన వారందఱును నన్ను నుపాసించెదరంటివే. అట్లేని యందఱేల నన్నిట్టివానిఁగాఁ దెలియకున్నా' రందువా? ఆత్మ కానట్టి దేహమందు నాత్మభావము కలిమిచే (అనఁగా నాత్మాభిమాన స్వతంత్రాభిమానాదులచేత (నీయథార్థస్వరూపమును దెలియనేరక యుండువారికి నీమాయను (బ్రకృతి గుణములగు రజస్సు మొదలగువానిని) బఱపి జగముసృష్టియందు జతుర్ముఖుండ నగునావలెను, రక్షణమందు విష్ణుండ వగు నీవలెను, సంహారమందు ముక్కంటియగు రుద్రునివలెను వేఱువేఱ వెలుఁగుచున్నావు. నీకలరూపు నెఱింగిన వారికో బ్రహ్మరుద్ర లనెడుజీవులం దంతర్యామిగను దచ్ఛరీర కుఁడుగను, రక్షణమందు నీయవతారరూపమునను వెలుంగుచున్నావు. రక్షణమందు నీయవతారరూపముగనే యుండుట నిక్కము. ఈశా! కర్మమునకు లోకువ యగుపుట్టుక లేని నీకు ప్రభూ! విధాతా! † సురలయందును, ఋషులయందును, మను

---

* విరాడ్రూపములగుట ఋంమఁజెప్పఁబడదుగాని యిచటఁ బ్రస్తావమును బట్టి బ్రహ్మచూచినవిగాన చెప్పెనని తెలియునది.

† దేవతలయందు ఉపేంద్రాదులుగను, ఋషులందు నరనారాయణపరశురామాదులుగను, నరులందు శ్రీరామాదులుగను, తిర్యక్కులందు వరాహాదులుగను; జలజంతువులందు మత్స్యకూర్మాదులుగను జన్మించుటఁ దెలియునది.

ష్యులందును, తిర్యక్కులయందు, జలజంతువుల యందును జన్మమునొందుట దుష్టుల చెడుకావరమును నిగ్రహించుటకును సాధువుల ననుగ్రహించుటకును నగుచున్నది.భూమా ! భగవంతా! పరమాత్మా! యోగీశ్వరా! నీయవతారాదిలీలలను ముల్లోకములందును బురుషుఁ డెవ్వఁడివి యిచ్చోటనని కాని,యీజాతియందనికాని,యీప్రకారముననని కాని,యిన్నియని కాని,యిప్పుడని కాని యెఱుంగఁగలఁడు?. కేవలము నీయాశ్చర్యశక్తిని బరఁగించుచు నీ విట్లు క్రీడించుచున్నావని నాకుఁ దోఁచుచున్నది.ఇట్లు నీవుదప్ప వేఱుస్వతంత్రవస్తువు లేనందున నిత్యానుకూల జ్ఞానరూపుండును న[illegible]చ్ఛేద్య మహిముండు నగునీయందే నీసంకల్పరూపజ్ఞానమువలనఁబుట్టు చున్నదయ్యును లయించుచునున్నదగుట వలన నీ క పృథక్సిద్ధమయినదై పెనుదుఃఖములమీఁది దుఃఖములతోఁగూడినదై స్వప్నమునకును సాటియైయున్న యీచిదచిదాత్మక మగు జగత్తంతయు నెడతెగక వికారపడు చుండునసత్తయ్యుఁ దెలియనివారికి సత్తువలెఁదోఁచుచున్నది.అసత్తగు జగత్తు నీకు దేహమగుటవలన నీవు నసత్తుగావు; ప్రకృతిపురుషవిలక్షణుండవు. ఎట్లన, అచేతనమును దానితోఁగూడిన చేతనమునుంబోలె వికృతుఁడవుగాక నీవు నిర్వికారుఁడవు.ముక్తజీవులవలెనొక ప్పుడు జ్ఞానసంకోచము గలిగియుండక, నిత్యాసంకుచితస్వయంప్రకాశస్వరూపుండవు. మఱియు నిత్యసిద్ధ జీవులవలె స్వభావమం [illegible]సంతులయ్యు స్వరూపమునందుఁ బరిచ్ఛిన్నులై యుండునట్లు లేక స్వరూపమునను స్వభావమునను రెంటను మూఁడువిధము లగు పరిచ్ఛేదములును లేనివాఁడవు. జీవునకుఁ గర్మోపాధిచే దేహసంయోగ వియోగరూపములగు నుత్పత్తిమరణములు గలుగు

చున్నవి. నీ కట్టియుపాధిచేత నట్టియుత్పత్తి మరణములు గలుగవు. నిత్యమును నీవు గర్మాయత్తమగు దేహసంబంధమునుండి ముక్తుఁడవు. ప్రకృతి సంసర్గము గలజీవులవలెఁగాక బుణ్యాపాపరూపమయిన యంజనము లేక యుందువు. ప్రకృతివలె క్షరణస్వభావము లేక యక్షరుండ వగుదువు. కాలపరిచ్ఛేదము లేమిచే నిత్యుఁడవు. దేశపరిచ్ఛేదము లేమిచేఁ బూర్ణుఁడవు. వస్తుపరిచ్ఛేదము లేమిచే నద్వయుండవు. ఇట్లు ప్రకృతి పురుషవిలక్షణస్వరూపుండ వగుటంబట్టి యవిచ్ఛిన్నసుఖాత్మకుండ వగుదువు. ఇట్టివాఁడ నగునే నసత్స్వరూపమగు జగత్తునకుఁ గారణ మెట్లగుదు నందువా? ఆద్యుండవు గాన జగత్కారణభూతుండ వగుదువు. ఎట్లన నీవు నామరూపములచే విభక్తములుగాని చిదచిత్తులచేత విశిష్టుఁడవై మొత్తమున నొక్కఁడవుగా నగుదువు. కాన, నీస్వరూపముచేతఁగాక చిదచిద్విశిష్టాకారముచే నీజగత్తునకుఁగారణమగుట పొసఁగుచున్నది. మఱియునీవు*నీకుశరీరభూతములగు ప్రకృతిపురుషకాలాదులను గనుఁగొనుచుండునాత్మవు. జగత్సృష్టికిఁ బూర్వమే వర్తించుచుండునట్టి పురాణపురుషుఁడవు. కాన, జగత్కారణత్వము నీకుఁ బొసఁగియున్నది. దేవమనుష్యాది శరీరములందిలి జీవులకు నంతరాత్మ వగుటంజేసి యుపాసకులకును నంతరాత్మ వగు నిన్ను, అజ్ఞానమనెడి చీఁకటిని బోఁగొట్టు గురువనెడి సూర్యునిచేత వేదాంతముల (వాక్యార్థజ్ఞానము) నెడి మేలికన్నులనొంది యెఱుఁగుదురు ఒర్వింతురో-అనఁగా

---

* (ఏకః) ఒక్కఁడనుటచే ఉపాదాన కారణత్వమును, (ఆత్మ) యనుటచే నిమిత్తకారణత్వమునకు వలయుసర్వజ్ఞత్వమును, పురాణపురుషుఁడనుటచే నిమిత్తకారణత్వమును బొసఁగించినాఁడని తెలియునది.

గురుముఖమున వేదాంతవాక్యముల యర్థము నిశ్చయించి దానినే మననముసేయుచు నీయుపాసనమును దర్శన సమానాకార మగుపర్యంత మెవరుసేయుదురో, వారే సంసారమందలి పుణ్యపాపములనెడి సముద్రమును దరింతురు. రజ్జువును రజ్జువుగాఁ గలరూపునఁదెలిసికొనినవారికి యది పాముదేహమని తోఁపిక పుట్టును. రజ్జువని తెలిసికొన్నవారికి నాతోఁపిక నశించును. అట్లె దేహాత్మాద్యభిమానములచేఁ బరమాత్మ వగు నిన్ను సర్వాంతరాత్ముఁడవని కలరూపునఁదెలిసి(యుపాసనముసేసి)కొననివారికి నట్లు తెలిసి యుపాసింపమిచేతనే సంసారము కలుగుచున్నది. ఆ యభిమానమును విడిచి పరమాత్ముఁ డనునెఱుకతో నుపాసించువారికి నది మరల నశించుచున్నది. సంసారబంధమునకును మోక్షమునకును బరమాత్మోపాసనరూపమయిన జ్ఞానము లేమియు నట్టిజ్ఞానము కలిమియు ననురెండే మూలములగునుగాని తక్కినవిగావు. ఇట్లుండుటఁబట్టి దేహాత్మభ్రమాదిరూపమయిన యజ్ఞత్వమును విడిచి నిత్యజ్ఞానైకాకారం బగుప్రత్యగాత్మయందంతరాత్మగా నున్నపరమాత్మను వేదాంత వాక్యార్థవిచారముచేతఁ దెలిసి యుపాసింపఁగాఁ, బగటియందు సూర్యుఁడురాఁగాఁ జీఁకటియుంబోలె, నాసంసారము నశించుచున్నది. ప్రకృతిపురుషవిలక్షణుండును బ్రకృతి పురుషులయందుఁ జొచ్చి శాసించుచుఁ బోషించు భర్తయునగు నిట్టినిన్నుఁ బ్రత్యగాత్మగాఁదలఁచియుఁ బ్రత్యగాత్మను వేఱగు దేహమనియే తలఁచియుఁ బరమాత్మను బయట వెదకుచున్నారు. (ఇంటఁబోయినదాని నడవిని వెదకినట్లున్నదే) ఔరా! అజ్ఞజనుల యజ్ఞానమేమిచెప్ప! వివేకులన్నవో యట్లుబయట వెదుకక తమప్రత్యగాత్మలకంతరాత్మునిఁగానే

నిన్నుపాసింతురు. వివేకులగువారు తమదాపున నున్నత్రాడు,కల రూపున సర్పమునకు విలక్షణముగాఁ ద్రాడుగానే కనఁబడుచుండఁగా, లేకున్నట్టి సర్పముగా దానిని గ్రహింతురా? గ్రహింపరు. అనంతా! అట్లె దేహమందలిజీవునియం దంతరాత్మగా సన్నిహితుఁడవై జీవుఁడు మొదలయిన యిరువదియైదు తత్త్వములకు విలక్షణుఁడవుగాఁ దెలియుచుండఁగా వివేకులు నీయందు జడజీవుం డనుబుద్ధినుంపరు.మఱిజీవాదితత్త్వములనునిన్నుఁగాఁ దప్పుఁదలంపక వానిని విడిచి స్వరూపస్వభావములందు వానికి విలక్షణుఁడవుగా నిన్నునిశ్చయించుచునుపాసింతురు.కొందఱజ్ఞులిట్లు సంసారమునొందియుఁ, గొందఱు వివేకులు సంసారమును దరించియు, నుండినను దేవా! నీపాదారవింద యుగళమువలని ప్రసాదలవమును జూపి యనుగ్రహించినట్టివారే భగవంతుఁడ వగు నీదుమహిమమునకుం గలయథార్థస్వరూపమును దెలియుదురు. అట్టియనుగ్రహము నొందనివాఁడు తానొక్కండు నిర్జన ప్రదేశమందుండి చిరకాలము చింతించుచున్నను, దానిని దెలియనే తెలియఁడుచుమా. ఇట్లు నీయనుగ్రహమే వివేకమునకుఁ గారణమగుటవలన, దేవా!నాకుబ్రహ్మనయియున్న యీజన్మమందుగాని లేక తక్కినమనుష్యజన్మములందుఁగాని,వేయేల తిర్యక్కులందుఁ బుట్టినపుడుగాని, నీయాభిముఖ్యము నెట్లో సంపాదించిన నీదుభక్తజనులనడుమ నొకానొకఁడనై నీపాదపల్లవములను మిక్కిలియు సేవించునట్టి యీమహాభాగ్యము, నాథా! నాకుఁ గలుగుఁగాత. ఇంతవఱకును నెన్నియో యాగములు చేయంబడినను నీతృప్తికిఁజాలకున్నవి.విభూ!ఇట్టి నీవుదూడలును బాలురునై యెవ్వాని యమృతమువంటి స్తన్యమును ముదంబుననెంత

యుఁ గ్రోలితివో, యా మందగోపులును గొల్లచెలువలును, ఔరా! యెంత మహాధన్యులు! ఔరా! నందగోపుని మందయం దలివారల కేమిభాగ్యము!ఏమిభాగ్యము!పరమానందస్వరూపుం డును బరిపూర్ణుండును సనాతనం బగుబ్రహ్మమును వారిమిత్త్రమ య్యెనే! అచ్యుతా! అహంకారాధిష్ఠాత యగుశివుఁడును మనో బుద్ధి చిత్తాధిష్ఠాత లగుచంద్రాదులును వాగాదుల కధిష్ఠాతలగు వరుణుఁడు మొదలుగా మేము పదునొకండ్రునుగా, నీపదునలు వురు నొక్కొక్క యింద్రియమును బాత్రగాఁగొని నీపాదా రవింద మకరందమ నెడి తియ్యనియమృతమువంటియాసవమును మాటిమాటికిఁ గ్రోలుచున్నారము. మేము బళిరా!మహాభాగ్య వంతులముగదే! ఇట్లొక్కొక్క యింద్రియమున కభిమానులమై మేము నీదుకీర్తిసౌందర్య సౌగంధ్యాదులం దించించుకను సేవిం చినను బరమకృతార్థులము కాఁగా సమస్తేంద్రియములచేతను నీసర్వమును సేవించుచున్న యీగొల్లల భాగ్యమహిమ యెట్లుం డునో!దాని నింతయని చెప్ప నెవనికిఁదరము? ఆమహాభాగ్యము మఱేమియుఁగాదు; ఈమనుష్యలోకమందు,అడవిలో, అందును వ్రేపల్లెయందు, వేదాంతములింతవఱకు వెదకుచున్నను నెవ్వని పదరజమును గానకున్నవో యట్టిభగవంతుఁడు ముకుందుఁడగు నీవే తమ యావజ్జీవనముగాఁ గలిగియుండు గొల్లలయం దెవ్వ నియే నొక్కని పాదరజస్సు పయిని బొలయునట్టి మనుష్యజన్మ మేదియేనిఁ బడయుట యేచుమా యీమహాభాగ్యాతిశయము. పూతన నిజమునకు నిన్నుఁ జంపఁ గోరినను బయికి సాధు వుల వేషము వేసికొన్నమాత్రమున బకాదులతోడ నిన్నుఁ బొంది నది. అట్టిపాపిష్ఠకే యంతటి ఫలము గలిగెను. ఈగొల్ల

పల్లెయందలివారో తమయిండ్లను ధనములను సుహృదులను బ్రియులను తమ్మును బుత్త్రులను బ్రాణములను మనస్సులను నీ యం దర్పించి నీకొఱకు వినియోగించుచుండునట్టివారు. దేవా! ఇట్టివారికి ఫలమెద్ది? విశ్వఫలభూతుఁడవగు నీవె యిదె ప్రత్యక్షముగానున్నావు. నీకంటెను మేలయిన ఫలమును వీరికే మియ్యఁగలవని నామన స్సంతటఁ గలయఁజూచినను దానికేమియుఁ దెలియక తత్తఱపడుచున్నది. ఏ కారణముచేత నేని నీతోడి సంబంధమాత్రమే నిన్నుఁబొందుటకుఁ జాలుచున్నది. నాప్రాప్తికివిరుద్ధము లయిన రాగద్వేషాదు లున్నవానికిని 'నాసంబంధమాత్రముచేత నన్నెట్లు పొందఁగూడు'నవలదు. కృష్ణా! ఏప్రకారముచేతఁగాని నీ సంబంధము గలజను లెంతవఱకుఁ గాకయుందురో యంతవఱకే దొంగలుగను (నీప్రాప్తికి బ్రతిబంధకములుగ)నుందురు. అంతవఱకే గృహము కారాగృహముగనుండును. అంతవఱకే మోహము కాలిసంకెలగానుండును. నీసంబంధముగలిగినతోడనే యవి యన్నియుఁ బటాపంచలగును. ప్రభూ! నీకుఁ బ్రాకృత శరీరము శరీరవ్యాపారములు మొదలయిన యీ ప్రపంచము లేదు. అయినను నీదు ప్రపన్నజనసమూహమున్న కెడతెగని యానందపరంపరను బచరించుటకై భూతలమందిట్టి శరీరాదిప్రపంచము గలవానివలె ననుకరించుచున్నావు. కాకున్న నీకిది యెక్కడిది? ప్రభూ! 'నేను బ్రపంచము ననుకరించు హేతువునీకుఁజక్కఁగాఁదెలియ'దందువేమో? అట్లేని నీస్వరూపాదులను దెలిసినవారే నీప్రపంచవిడంబనహేతువును దెలియుదురుగాక. నేను బెక్కుమాటలాడిపనయేమి! నాకేది తెలియకపోయినను నీవైభవము నాదుమనస్సునకును గాయమునకును

వాక్కునకును నగోచరమయిన దనునింతమాత్రమని నాకుఁ దెలియుననుట తెల్లము. కృష్ణా! నీవు సర్వదర్శనుండవు: కాఁబట్టి సర్వము నెఱుంగుదువు. మఱియు జగంబులకు నాథుండవు నీవే కాని నేనుగాను. ఈజగత్తు నీయందుఁబుట్టి నీయందే లయించుచున్నది. కాని, నాయందుఁగాదుగాన నీకు నేనెంత? కాఁబట్టి నాకాజ్ఞ నొసంగుము. శ్రీకృష్ణా! వృష్ణికుల మనెడితామరకుఁ గొమరొసంగు సూర్యునివంటివాఁడా! భూమికిని దేవతలకును బ్రాహ్మణులకును బశువులకును సముద్రమువలె వృద్ధినివిస్తరింపఁ జేయుచంద్రుఁడా! పాపంబులనెడిచీఁకటినడంచు సూర్యుఁడా! భూమియందు రాక్షసులగు కంసాదుల నుదయించుచునే కీడ్పఱచుసూర్యుఁడా! సూర్యుఁడు మొదలుగా నెల్లవారికినిఁ బూజ్యుఁడగువాఁడా! భగవంతా! కల్పపర్యంతము నీకు నమస్కారము' అనెను.

ఇట్లు జగత్తునకు విధాత యగుబ్రహ్మ, భూముం డయ్యును లీలచేత సంకుచితవిగ్రహుం డగుభగవంతునికి ముమ్మాఱు వలగొని పాదములకు మ్రొక్కి నిజధామం బగుసత్యలోకమునకుఁ బోయెను. అట్లు భగవంతుఁడు తనపుత్త్రుఁ డయినబ్రహ్మకు ననుజ్ఞయిచ్చి పూర్వము తా నుండినయా యిసుకదిన్నెకు దూడలను దోలుకొనివచ్చెను. అందు తన చెలికాండ్రును మునుపటివలెనే యుండిరి. ఆబాలురకు వారి ప్రాణేశ్వరుం డగుకృష్ణునిఁ బాసి యొకసంవత్సరము గడచినను, రాజా! కృష్ణునిమాయకుఁ గీడ్పడి యా బాలురు దానిని నఱక్షణముగాఁ దలఁచిరి. ఆవిభునిచేత మోహితమై చరాచరాత్మకమయిన జగత్తంతయునుదన యాత్మ నేమాటికి మఱచిపోవుచుండఁగా నట్టి విన్నాణి మాయ

చేత మనంబులు మోహితములై యున్నవారేల మఱవకుందురు? కాన వారు క్షుత్పిపాసాదులు మఱచియుండుట వింత కాదు. వారు తమచెలికాఁడగు కృష్ణునిఁ జూడఁగానే, 'నీవు చక్కనతివేగముగాఁ బోయివచ్చితివి. ఇంతవఱకు మాలో నొక్కఁడును నోక్కపిడుచయు ముట్టలేదు. ఇటురమ్ము. లెస్స గుడుతము' అనిరి. అంత హృషీకేశుండు కృష్ణుఁడు నవ్వుచు నాబాలురతోడఁ గుడుపులు గుడిచి యటనున్న యజగరచర్మమును వారికి జూఁపి యంత వనమునుండి పల్లెకు మరలెను. ఆ చిన్నికృష్ణుండు తలయందు నెమిలిపురియు దండలును నవకంపుధాతు వన్నెలును నవయవములకు వింత లగుచిన్నెలు గలిగింపఁగా, బిల్లంగ్రోవులును నాకులును బుఱ్ఱటగొమ్ములును నూఁదురవళి యెంతయుఁ దనకుఁ బందువులు సేయుచుండఁ, దన యనుంగులయిన బాలురఘాసురాదులను జంపిన కీర్తిని బాడుచుండఁగా, గొల్లచెలువలకుఁ గన్నులవిందులు సేయు మనోహరాకారముతో, దూడలను దోలుకొని మందను బ్రవేశించినవాఁడయ్యె. అంత బాలురు మందలోన 'నేఁటి దినము యశోదానందపుత్త్రుఁడయినయీ చిన్నికృష్ణుఁడు పెద్దసర్పమును జంపి వానివలననుండి మమ్ము విడిపించి తెచ్చినాఁ'డని చెప్పిరి.

రాజు 'బ్రాహ్మణోత్తమా ! తమకడుపునందుఁ బుట్టిన బాలురయందును నింతవఱకుఁ బుట్టి యెఱుఁగనట్టి యింత యబ్బురంపుంబ్రేమ మఱి యొకరికడుపునఁ బుట్టినకృష్ణునియం దెట్లు గలిగెను ? ఇది చెప్పుము' అని యడుగఁగా నతఁ డిట్లనియె. 'రాజా! సమస్తమయినప్రాణులకును దమయం దంతరాత్మయై యున్న పరమపురుషుఁడే నిరతిశయప్రియుఁడగును. దేహమును

దదనుబంధువు లయినజీవాదులును నాపరమాత్ముఁడు నిరతిశయప్రియుఁడై యుండుటవలననే ప్రియములగుచున్నవి. రాజేంద్రా! కాఁబట్టి దేహధారులకు నిరతిశయప్రియస్వరూపుఁ డగుపరమాత్ముని సంబంధమువలనఁ దనయాత్మయం దెంత ప్రీతియో యంత యాత్మయెడగాఁ గలతమతమదేహమునందుఁ గలుగదు. దేహమునం దెంతప్రీతియో యంత దేహము నాత్మయు నెడగాఁగల పుత్త్రునియందుఁగలుగదు. పుత్త్రునియం దెంతో యంత విత్తమందును విత్తమం దెంతో యంత గృహాదులందును గలుగవు. దేహమునకంటె నాత్మ వేఱనువారికే కాక దేహమె యాత్మయనెడువారికిఁ గూడ, రాజన్యసత్తమా! తమదేహ మెట్లు ప్రియమో యట్లు దాని ననుబంధించినవి ప్రియములు గావు. దేహమే తామని తలంపక తమదిగాఁ దలంచునట్టివివేకు లన్నరో వారికి మమతాపాత్రమయిన యీదేహ మాత్మవలెఁ బ్రియముగాదు. అయినను ఆత్మకంటెనించుక తక్కువప్రీతి గలదు; కాని ప్రీతి లేకయె పోవదు. ఏలన దేహముజీర్ణించి తూలుచుండినను, బ్రతుకునందలి యాశజీర్ణింపక మఱిమఱి బలీయముగానే యున్నది. కాఁబట్టి దేహమునందాత్మకంటెఁ గొంచెము తక్కువప్రీతియుండకతీఱదు. కానియాత్మయంతప్రీతి లేమియెవ్వరియందలివిశేషము. కాఁబట్టిజన్మమెత్తు సమస్తదేహధారులకుఁ గృష్ణుఁడుత్తమజీవములందున్నయంతరాత్మగావున నెంతయుఁబ్రియతముఁడగును. కనుకఁ జరాచరాత్మకమయిన యీజగత్తంతయును నతని కిష్టమునొడఁగూర్చుటకొఱకే ప్రియమగును. కృష్ణుని నఖిలాత్మలకును నాత్మయనియెఱుంగుము. ఇతఁడిట్టివాఁడయ్యు జగమునకు హితము సేయుకొఱకుఁ దన సంకల్పముచేత నిట్లు పుట్టినాఁడు. ఈలోక

మున గోపాదులందుఁ గర్త్రాయత్తముగా దేహమునొందినవాని వలెనవివేకులకుఁదోఁచుచున్నాఁడు.'స్థావరజంగమాత్మకమయిన జగత్తంతయును భగవంతునిశరీరము.అతనిని విడిచి వేఱుగానుండఁగూడినవస్తు వ్యక్తియును గలుగదు' అని యీకలరూపునఁ దెలియనివారికి నతఁడు దేహివలెఁ దోఁచుచుండును. ఇట్లు తెలిసినవారికో దేవమనుష్యాది విజాతీయుఁడుగను సర్వశరీరకుఁడుగను దోఁచుచున్నాఁడు. సమస్తములయిన శబ్దములకును వానియర్థములకును సత్తె యర్థముగాఁగలది భూధాతువనఁబడుచున్నది. ఆభూధాతువునకును దాని యర్థప్రత్యయాదులకును సమస్తధాతు తత్ప్రత్యయాదులకును గల సత్తానిర్వాహకుఁడు భగవంతుఁ డగు కృష్ణుఁడగును.కనుకఁ గృష్ణునికిఁ బృథక్సిద్ధమగు వస్తువేమున్నదో నిరూపింపుము. పుణ్యకీర్తియుక్తమై మహనీయులకాశ్రయమై యొప్పు మురారిపదపల్లవముల నెవు తెప్పను నెవ్వరాశ్రయించిరో వారు సంసారసముద్రమును దూడయడుగంతగాఁగొనిదాఁటుదురు. పరమపదమును వారికి స్థానమగును. విపత్తుల కాస్పదములయినవియు వారికిఁ గలుగనేరవు. కౌమారమందు హరిచేసినదానిని బౌగండమందుఁ బుడమి లోఁ జెప్పట యెట్లని నీవు నన్నడిగినదానినంతయు నిదె వివరించిచెప్పితిని. ఇట్లు చిన్నికృష్ణుఁడు చెలికాండ్రతోఁగూడి యాడిన చరితములును, అఘునిఁజంపుటయు, పచ్చికబయలునందుఁ జల్దులు గుడుచుటయుఁ, శుద్ధసత్త్వమయదేహములతో దూడలు బాలురునగుటయు, బ్రహ్మస్తుతించుటయు, మనుజుఁడు విన్నను గీర్తించినను సమస్తములయినపురుషార్థములను నొందుచున్నాఁడు. ఇది పదినాలుగవయధ్యాయము.

---

## ధేనుకాసుర భంజనము.

ఇట్లు బాల్యముపోయి పౌగండప్రాయము రాఁగా రామకృష్ణులు పసులకాపరుల మనంబుల కెక్కు_మెలంకువలు గలిగి, తమచెలికాండ్రతోఁగూడి పశువులను మేపుచుఁ దమపదన్యాసములచేత బృందావనమును మిక్కిలియుఁ బుణ్యమయినది గావించిరి. అంతమాధవుఁడు కృష్ణుఁడు గొల్లబాలురు తనకీర్తి నెత్తి పాటలుపాడుచుండఁగా బలరామునింగూడి పిల్లఁగ్రోవి యూదుచుఁబశువులను ముందుదోలుకొని విహరింప నువ్విళ్లూరు మనంబుతోఁ బువ్వులకు నాటపట్టయి పశువులకెంతయు హితంబయినవనంబునుఁబ్రవేశించెను. అందుఁ దుమ్మెదలును జుంజుమ్మని యింపయిన గానములుసేయుచును, మృగములును బక్షులునుబలువిధములయిన ధ్వనులు గావించుచునుండెను. మహాత్ములయిన యోగులమనంబులవలె నిర్మలములయిన జలంబులుగల తామరకొలంకుసీటితుంపురులతోఁగూడి చల్లనై యాతామరలతావులను గొల్లలాడుచు నందుఁగాలి పొలయుచుండెను. రమణీయమయిన యట్టి వనమును భగవంతుఁడు నిరీక్షించి యందుఁ గ్రీడించుటకు మనంబు గొన్నవాఁడయ్యె. అందు నచ్చటచ్చట నెఱ్ఱని చిగుళ్ల జొంపములచేతను దట్టంపుఁ బువ్వులయుఁ బంఢులయు బరువులచేతను గొన్నివృక్షముల కొమ్మలకొనలు క్రిందికి వంగి రామకృష్ణుల యడుగులరెంటిని స్పృశించుచున్నట్లు చూపట్టెను. అట్టి వృక్షములనుజూచి యాదిపూరుషుఁడు కృష్ణుఁడు ముదంబున నవ్వుచుఁ దనయన్నతో నిట్లనియె. దేవవరా! ఔరా! చూడుము. ఈవృక్షములు, దేవతలచేత నర్పితములయిన పుష్పఫలాదిపూజాసాధనములను గొని నీపాదారవిందములకుఁ

గొమ్మలచేత మ్రొక్కుచున్నవి. ఇవియిట్లుచేయుట, యేపాపము చేతఁ దమకు వృక్షజన్మముగలిగెనో యట్టిపాపమును బోఁకార్చుటకుఁజుమీ. ఆదిపురుషా! ఈతుమ్మెదలు, ప్రతిక్షణమును సకల లోకపావన మయిన నీయశమును గానముసేయుచుఁ గొలుచు చున్నవి చూడుము. తిర్యక్కుల కిట్టియెఱుక యెక్కడి దనకు. ఈతుమ్మెదలు బహుళతరముగా నీదుభక్తశ్రేష్ఠులయిన మునిగణ ములు కాఁబోలును. అనఘా! కావుననే వనమందునీవుమనుష్య వేషమునగూఢముగానున్నను దమదైవముగాన మునులుగూడఁ దుమ్మెదవేషమునఁ గూఢులై నిన్నుభజించుచున్నారు. ఈడ్యా! ఈనెమళ్లు ముదంబున నాడుచున్నవి. ఈయాఁడుజింకలు ముదం బుపొదల గొల్లచెలువులవలెఁ బెళుకుం జూపులునిగుడ్చుచునీకుఁ బ్రియముగావించుచున్నవి. నీవింటికి మరలిరాఁగాఁ గోయిలలు గుంపులుగొని యింపయిన రవళులు నీకుసొంపుగావించుచున్నవి. ఇవి యడవియందు మనుచున్నవయ్యు నీకొయ్యన నింపుగావిం చుటచేఁ గడుధన్యములేచుమీ! సత్పురుషుల స్వభావమిట్టిదే కదా. ఈపుడమియు నిందలి తృణములును జిగురుఁగొమ్మలును నీపాదములు సోకుటవలన నేడు ధన్యములయినవి. నీగోళ్లు దగిలి నేఁడుమ్రాఁకులును తీఁగలునుబువ్వులునుధన్యములయినవి. కరుణ గడలుకొనునీచూడ్కులు పయినినిగుడుటచే నేఁ డీనదులును బర్వతములును, బక్షులును మృగములును గృతార్థములయినవి. శ్రీదేవియుఁ దమతోఁ గాంక్షించునీవక్షఃస్థలమును గదియుటచే నేఁడు గోపికలును జరితార్థలయిరి' అని పలికెను. ఇట్లు కృష్ణుం డెంతయు మనం బుల్లసిల్ల సిరిపెంపు సొంపారుచున్న యాబృం దావనమునం దనుచరులం గూడి పసులను గొండలదండలను

నేఱులతీరములను మేపుచుఁ గ్రీడించుచుండెను. మఱియు నతం డనుచరు లగుగొల్లబాలురు తనచరితములను బాడుచుండ బలరామునిని దక్కిన చెలికాండ్రనుంగూడి యాడుచుఁ జెలులను నవ్వించుటకై యొక్కచోఁ దుమ్మెదలు పూఁదేనియల మత్తుగొని కేరిజుంజుమ్మని యిమ్ములఁబాడుచుండగా వానివలెఁదానును జుమ్మని పాడుచుండును. ఒక్కచో రాయంచలుగూడి రవళులు సేయఁగా వానివలెనే తానును రవళి సేయుచుండును. నెమిళ్లొకచోఁ బురివిచ్చి యాడుచుండఁగాఁ దానును జేతులుత్రిప్పియాడుచుండును. మఱియొక్కెడ దవ్వుగాఁ జనిన పశువులను, మేఘగంభీర మయినయెలుంగునఁ, దనమక్కువపెల్లునకు నాగోవులయు గొల్లలయు మనంబులు పల్లవించునట్లు వానివాని పేరులిడి పిలుచుచుండును. వేఱొక్కచోఁ జకోరములును, గొంచపిట్టలును, జక్కవలును, భారద్వాజములును, నెమిళ్లును గూఁతలిడఁగా, వానివలెనె తానును గూయిడును. మఱియొకచో బెబ్బులులను సింగములనుజూచి బెదరి మృగముల కదుపులు బరువులిడఁగాఁ దానును జడిసినట్లు వానితోడఁ బరుగిడిపోవును. ఒక్కచోఁ దనయన్న యగురాముఁ డాట లాడియాడి యలసి సొలసి గొల్లలయొడిని దలగడగాఁ దలయిడి బరుండునపుడు దానే యతనియడుగు లొత్తి యుపచరించి బడలిక వాపుచుండును. ఒక్కచో గొల్లపిల్లవాండ్రు నర్తనము సేయుచున్నను, బాటఁబాడుచున్నను, నెగురుచున్నను, ఒండొరులతోఁ బెనఁగులాడుచున్నను రామకృష్ణాదు లొండొరుల చేతులూఁది చూచి నగుచును వారిని బలే సెబాసని యగ్గించుచును నుందురు. మఱియొకచో బాహుయుద్ధముచేసి బడలి సడలి చెట్లక్రిందఁ జిగురు

టాకుల సెజ్జలయందు గొల్లబాలురయొడియందుఁ దలయిడికొని పరుండును. అమ్మహాత్మునకుఁ గొందఱు గాలుపిసుకుదురు; మఱి కొందఱుఁదమపాపములన్నియుఁరూపుమాయఁ బువ్వులు చిగుళ్లు మొదలగువానిచే వీవనలుగావించి యతనికి విసరుదురు. వేఱు కొందఱామహనీయునికి మహిమకుఁ దగినట్లుగా నింపుసొంపారు పాటలను నుల్లంబులందు నెయ్యముతియ్యములు చివురులొత్త నల్లల్లఁబాడుదురు. ఇట్లాకృష్ణుండు తనస్వరూప మెవ్వరికి నెఱుక పడకుండఁ దానుమాత్రమె యనుభవించుచుఁ, బయికిఁ గొల్లపిల్ల వాఁడుగాఁ దననడవళ్లచే ననుకరించుచు, చిగురాకువంటి యడుగులను లక్ష్మీదేవిపుడుకుచుండునట్టిపరముండయ్యును, ప్రాకృతులలోఁ దా నొకప్రాకృతునివలెఁ జూపట్టుచును, నెడనెడఁ దన యీశ్వరత్వమున కనువయినచెయ్వులను బచరించుచును, గ్రీడించుచుండెను. శ్రీరాముఁ డనునొకగొల్ల కలఁడు. వాఁడు రామకృష్ణు లిరువురకును జెలికాఁడు. వాఁడును సుబలుఁడును, కృష్ణుఁడు మొదలగు మఱికొందఱు గొల్లలును నాయన్నదమ్ములను మక్కువపిక్కటిల్లఁజూచి 'రామా! రామా! నీవుమహాబలవంతుడవుగదే! కృష్ణా! నీవు దురాత్ములను బొరిపుత్తువుగదా! ఒకటి వినుము. ఇక్కడికి దాపున మిక్కిలియుఁబెద్దదియగు నొకవనము గలదు. అందుఁ దాటిమ్రాఁకుల తోఁపులు నెరసి బెరసియుండును. అందలి పెద్దపెద్దతాటిపండ్లు కొన్ని క్రిందఁబడియుండును. కొన్ని మిక్కిలియుఁ బండి నేఁడో రేపో పడునవిగానుండును.అందు దురాత్ముఁడగు ధేనుకుఁ డుండుటవలన దానిని గొనుట కడ్డుగలిగియున్నది. రామా! కృష్ణా! ఆయసుర మిక్కిలి వీర్యవంతుఁడు. వాఁడు గాడిదరూపముఁ దాల్చియుండును. మఱివానివంటి బల

వంతులగు వాని బంధువులు పెక్కండ్రు వానిని గలిసికొలుచు చుందురు. శత్రుహంతలారా! వాఁడుమనుష్యులనాహారించుచుండు రక్కసుఁడుగాన మనుష్య లాపొంతఁబోవుటకును వెఱచుచుం దురు. కాఁబట్టి మిక్కిలియు వాసన బుగులుకొనుచుండునా పండ్ల నింతవఱ కెవ్వరును భుజించినది గలుగదు. ఇదిగోఁజూడు. ఆపండ్ల కమ్మని వాసనలు గుబాళించుచు నెల్లయెడలను బర్వి, యిందును మనకు సొంపుగాఁ బొలయుచున్నవి. చూడు. కృష్ణా! ఆవాసనచే మామనములు వానిని దినవలయునని పేరాసలుపడు చున్నవి. వానిని మాకొసంగుమీ! రామా! మాకు వానిపై నెంతోకోరిక దొంతరగొనుచున్నది. మీకిష్టమేని యటపోదము' అనిరి. ఇట్లు చెలికాండ్రు చెప్పఁగావిని యన్నదమ్ము లిరువురును బక్కుననవ్వి బలుదిట్టలుగానసుహృదుల ప్రియమునుదీర్పఁదలం పులుగొని గొల్లలుచుట్టునుగొలిచి రా, నాతాలవనమునకుఁ బో యిరి. బలరాముఁడా వనమునందుఁ జొరంబడి మదపుటేనుంగు వలెఁ బలంబుచెలంగఁ దనబుజంబులచే నాతాటిచెట్లను బట్టి యుఱ్ఱూఁతలూఁచి వానిపండ్ల దబదబరాల్చెను. పండ్లట్లు దబదబ పడుచున్నచప్పుడు విని గార్ధభాసురుఁ డయినధేనుకుఁడు పుడమి కొండలతోడ గ్రక్కదలున ట్లడుగులిడుచు రివ్వునఁ బాఱు తెంచెను. ఆ బలవంతుఁడు బలరాముని వేగ దారసించి తన వెనుకటికాళ్లు రెంటిచే నతనిఱొమ్మునఁదాఁచి కోయని గాడిద కూఁతయిడుచు నతనిచుట్టును బరుగు వాఱెను. మఱియు నా గర్దభుఁడు క్రుద్ధుడై యురవడించి మరల బలునిఁదలపడి పెడ మొగముగాఁదిరిగి తనపిఱిందికాళ్లురెంటిచే నాబలునివలనిరోసం బున విసరెను. ఆబలుఁడువాని యాకాళ్ళు రెంటి నొడిసిపట్టికొని

రియొకచేత గిరగిరం ద్రిప్పి తాటిచెట్టుపై మోది కొనఁబడఁజిమ్మెను. వాఁడట్లుగిరగిరంద్రిప్పుటచేతనే యసువులనకుందప్పినవాఁడయ్యెను. తల మిక్కిలి విరివియు నురువునైయున్న యాపెను తాటిచెట్టు, ఆయసురను జిమ్మికొట్టఁగానే, బ్రల్లనఁగూలుచుఁ బ్రక్కనున్న చెట్టును బెకలి గూలునట్లాడించి తానును గూలెను. ఆరెండవదియు మఱొకదాని నల్లార్చికూల్చుచు,దానుగూలెను. అదియు మఱొకదాని నట్లె చేసి తానుద్రెళ్లెను. బలరాముఁడు లీలగాఁ జిమ్మినయాగాడిద రక్కసునిదేహము పయింబడిమోఁదఁగా నాతాటిచెట్లన్నియు, పెనుగాలి గొట్టిపెల్లగించినట్లు, పెకలిక్రిందఁ గూలినవయ్యె. పటమునందు నూలిపోఁగులు గ్రువ్వంబడియున్నట్లు, ఎవ్వనియం దీజగమంతయుఁ గూర్పంబడియున్నదో యట్టి జగదీశ్వరుండును ననంతుఁడు నగు భగవంతునియం దింతమాత్ర మొకవింత కానేరదు. అంత నట్లు తమ చుట్ట మగు ధేనుకుఁడు హతుఁ డగుటం జూచి వానిజ్ఞాతులగు తక్కినగాడిదరక్కసు లందఱును గ్రుద్ధులై రామునిని గృష్ణునిని వేగ మెదుర్కొని పయినడరిరి.కృష్ణుఁడును రాముఁడును వారిని బయిపయి నవలీలగా నొక్కొక్కరిని వెనుకటికాళ్లొడిసిపట్టుకొని తాటిచెట్లపయి మోఁది యసువులకుం బాపిరి. ఆవనమందలి భూమి రాలిన తాటిపండ్లచేతను, ఉసుఱెడలి కూలినయసురుల తలలచేతను, దాఁటిచెట్ల కొనలచేతను, నెరసిబెరసి మెఱుపును దెలుపును నలుపును గలమబ్బులచేఁ బర్వియున్నయాకాశతలమువలెఁ బ్రకాశించెను. ఇట్లు రామకృష్ణు లిరువురును గావించిన యాగొప్పకృత్యమును జూచి దేవతలు మొదలగు వారు పువ్వులవానలు గురిసి వాద్యములు బోరుకొలుపుచు

నెంతయు స్తుతులుగావించిరి. అంత మనుష్యులు యాపనమందు* ధేనుకాసురుఁడు హతుఁడుకాఁగాదిగులంతయుఁదొలఁగియందలి తాటిపండ్లను నిచ్చలు భక్షించిరి. పశువులును గడ్డిజొంపములును సొంపారమేసినవి. ఎవనిపేరువిన్నను నెవ్వనిముచ్చటలు గీర్తించినను బాపములన్నియుఁ దూలునో యాచిన్నికృష్ణుఁడు, ఆకమలపత్రాక్షుఁడు, తన యనుచరులగు గోపకులు తన్నుఁబలసి పలువగల స్తోత్రములు సేయుచుండ, నన్నయగు రామునితోఁడ మందకుఁబోయెను. అట్లు గోవుల దుమ్ము గ్రమ్మియున్న ముంగురులయందు నెమలిపురియును నడవిపువ్వులును మురువుగాఁ జెరివికొని, కన్నుంగవ చెన్నుగులుక, మొలకనవ్వులు ముద్దులుగురియఁ, బిల్లంగ్రోవి మొరయించుచుఁ దనవెంటవచ్చు బాలురు తనకీర్తినిబాడుచురా, మందను జొచ్చుచున్నచిన్నికృష్ణునిఁజూడవలయునని కన్నుంగవలు తమిగొని తుకతుక పడుచుండఁగా, గోపికలు గుములుగొని యెదురుకొనివచ్చిరి. ఆగొల్లసుందరులు ముకుందుని ముఖారవిందమకరందమును కన్నుఁదుమ్మెదలవలనఁ గ్రోలి యతనిని బగటియందుఁ బాసియుండినతాపమును మానిరి. మఱి యా పూవుంబోఁడులు నునుసిగ్గు లగ్గలింపఁ జఱునవ్వు మొలకలు చిగురులొత్త, నడంకువలు బెడంగై కడలుకొనుచుండఁ, గడకంటితెళుకుం బిసాళిచూడ్కులు పయి నిగిడించుటయు, నామన్నన గయికొనుచు వెన్నుండును మందలోనం బ్రవేశించెను. యశోదయు రోహిణియుఁ గొడుకులందు మక్కువలెక్కువగలవారు గాన యా కన్నయ్యలకు నయ్యైవేళలకుఁ దగుతెఱంగున వారి యిచ్చచొప్పున వలయు కోర్కులనెల్లఁ గూర్చుచుండిరి. అంత నారామకృష్ణులు నొడలు పిసికించు

కొనియు జలకములాడియు మఱియుఁ దక్కిన యుపచారముల చేతను బడలిక లెల్ల వీడి బెడంగయిన వలువలు గట్టి దివ్యము లగుగంధములచేతను మాల్యములచేతను నలంకృతులైరి. అంతఁ దల్లులు మేలయిన యన్నంబులు దెచ్చి యిడఁ గూడిచి వారు బుజ్జవములు సేయుచుండఁ జెలువయిన సెజ్జలయందుసుఖముగా నిదురించిరి. ఇట్లాకృష్ణుఁడు బృందావనమునందుఁ దిరుగుచుండి యొకనాఁడు రాము నొక్కనిని విడిచి తక్కినచెలికాండ్రను గూడి యమునానదికిఁ బోయెను. అంతఁ గటికివేసవి యెండకు గోవులును గోపజనములును గుంది కంది దప్పికి నిలువనోపక యా యమునయందుఁ గాళియవిషదూషిత మగుటంజేసి దుష్టం బైయున్న జలమును ద్రావినవారయిరి. వారావిషజలమును ద్రావి యపుడే యెఱుక లెల్లఁ దూల,సొమ్మసిల్లి యసువులు విడిచి నేలంబడిరి. కృష్ణుండు వారట్లగుటంజూచి మృతసంజీవనాది యోగసంపన్నులయందును దలమిన్న గావునఁదన్నే దిక్కుగాఁ గలిగి యున్న యాజనములను నమృతముగురియు చూడ్కిచే బ్రతికించెను. వారును మరల నెఱుకలువడసి యాజలములదరినుండి లేచి యొకరి నొకరుఁజూచుకొనుచు నందఱు మిక్కిలియు నాశ్చర్య పడినవారయిరి. వారల్లు విషమును ద్రావి మృతులయ్యుమరలఁ దాము బ్రతికి లేచుట యాగోవిందుని కరుణాదృష్టిచే నయినది గాఁ దలంచిరి. ఇది పదియేనవయధ్యాయము.

---

## కాళియ మర్దనము.

శుకుఁడు—'విభుఁడగు కృష్ణుఁడు కాళియుండను కృష్ణసర్పముచేతఁ గాళింది దూషితమైయుండుట నాలోచించి యానదిని

బరిశుద్ధముసేయనెంచి యాసర్పమునచటనుండి వెడలఁగొట్టెను' అనెను. అందులకుఁ బరీక్షిత్తు 'కాళిందీజలములోపల, అందును లోఁతయినయెడను, కేవలమైనదిగాక పెద్దదియగు నొకపామును భగవంతుఁడెట్లు నిగ్రహించెను? బ్రాహ్మణోత్తమా! ఆ సర్పము పుడమిపయిఁ దిరుగునదయ్యు లోఁతు నీళ్లయందుఁ బెక్కుయుగములెట్లు వసించియుండెను? బ్రాహ్మణవర్యా! అతి విపుల మహిముండును, స్వతంత్రవర్తియునయ్యు లీలార్థము గొల్లఁడై యా భగవంతుఁడు కావించిన యుదారంబులగు చరితంబుల నెడి యమృతమును జుఱ్ఱుచు నెవ్వఁడు తనివినొందును? ఎవ్వఁడును నొందఁడుగదా' యనెను. అందులకు శుకుఁడు, 'యమునా నదియందు నొకమడుఁగుండెను. అది కాళియునికి నునికిపట్టు. అందు వానివిషాగ్నిచేత నామడుఁగుజలములు సలసలఁ గ్రాగుచుండునుగాన దానిపయిని బిట్టలును సరిగాఁబోవునేని గిఱ్ఱున నిదానియందే పడుచుండును. ఆ విషజలముల కరుళ్లతుంపరలతోఁగూడిన గాడ్పుమాత్రము పయిని సోఁకఁగానే యాయేటియొడ్డున నుండు చెట్లు చేమలు మొదలగు స్థావరములును మృగాదులగు జంగమములును నగు ప్రాణులు, తోడనే మృతినొందుచున్నవి. ఆకాళియుని విషప్రభావము స్పర్శమాత్రముననే జంతువులందు వ్యాపించునట్టి చండవేగము గలిగియున్నందున వానిచేత నాయమున దూషితమై యుండుటఁ జూచి కృష్ణుండు ఖలుల నడంచుటకే యవతరించియున్నవాఁడు గావున, నాయేటియొడ్డున నున్నయొక కడిమిచెట్టుపయినెక్కి మొలనూలు చక్కబిగించిచేతుల బుజములప్పళించి యామడుఁగు విషజలమునందుఁ గొబ్బున దూఁకెను. అట్లాపురుషోత్తముఁడు పడిన యురవడి

నందలి సర్పములెల్లఁ గలఁగినలఁగి విషఫూత్కారము నిడెను. అపుడు జలసమూహమంతయు మిక్కిలి యుప్పొంగి యావిషముచేతఁ గషాయితము లయిన పెద్దపెద్ద యలలతోఁ జుట్టును నూఱువిండ్లపెట్టుమేరకుఁ బ్రవహించి యావరించిన దయ్యెను. అనంతబలుని కిది యొంతమాత్రము? ఆమడుఁగునందుఁ గృష్ణుఁడట్లు మేటిగజమువలెఁ బరాక్రమము మెఱసి వేడుకతోడఁ గ్రీడలాడుచుండెను. అప్పు డాతనిభుజదండములచే నీళ్లుగొట్టువడి మిక్కిలి కలఁగి వెనుచప్పుళ్లుసేయఁగా నది విని కాళియసర్పము తనయునికిపట్టు నట్టు తిరస్కరించుట కెంతమాత్రము సయింపక సైన్యములను గూడి వేగవచ్చెను. కృష్ణుఁ డట్లునవక మయిన నునుమబ్బువలెఁ గన్నులవిందుగా నిగనిగమెఱయుచు, శ్రీవత్సంబను మచ్చమెచ్చు గులుకుచుండ, పచ్చనివలువ మొలయందుఁ దలతలలాడ, చిఱునగవుచే నెమ్మొగము ముద్దులుగాఱ, పొక్కిలియు నడుగులును దామరలవలె నెఱ్ఱనయి కొమరారఁ, వెఱపు మఱపు నెఱుంగక విచ్చలవిడిఁ గ్రీడించుచుండఁగా నాకాళియ సర్ప మాతనిమర్మములందురోషమువిూఱఁ గఱచి,యతని దేహము మఱుఁగుపడునట్లు తన దేహముచేఁ బెనఁచుకొనెను. అట్లా సర్ప దేహము తన దేహము చుట్టును బెనఁచుకొనఁగాఁ గృష్ణుఁడు కాలుసేయి గదల్ప నేరకుండెను. దానిని జూడఁగానే నతనియనుఁగులైన గొల్లలెల్ల భయార్తులయిరి. వారలు తమ మనసులను, శరీరములను, మిత్రులను, ధనములను, గళత్రములను, నిష్టార్థములనును గృష్ణునియందే సమర్పించియుండువారు; కనుక దుఃఖమును శోకమును భయమును గలుగఁగా బుద్ధులు తెలివిదప్పఁ, గ్రింద సోలిపడిరి. ఆవులును, ఎద్దులును, గోడెదూడలును మిక్కి

లియు దుఃఖమునొంది కూయిడుచుఁగృష్ణునియందే చూడ్కులు నిలిపి దిగులుగొని రోదనముసేయుచున్న వానివలె నిలుచుండినవి. అంత నాకాశమందునుభూమియందునువారివారియందు నుగలుగు మూఁడువిధములగు మహోత్పాతములు మిక్కిలిదారుణములై దాపునఁ దోడనే యొకభయము గలుగునని సూచించుచుఁ బల్లెయందలివారికిఁ గనఁబట్టినవి. నందాదులయిన గొల్లలు వానినెల్లఁ గనుఁగొని భయపడి యవయవము లెల్ల వడవడ వడంకుచుండ, రాముఁడు లేకయె కృష్ణుఁడు గోవులను మేపుటకు దోఁలుకొనిపోయినాఁ డని యెఱిఁగి యతని మాహాత్మ్యము నెఱుఁగనివారు గాన యాదుర్నిమిత్తములచేత నతని కేదో విపత్తి మూఁడినట్లు తలంచిరి. వారికిఁబ్రాణములెల్లఁ గృష్ణుఁడే. అట్లు కృష్ణునియందే వారిమనసులెల్ల నెలకొని యుండుటవలనను దుఃఖశోకభయముల నెంతయుఁ గంది కుందిన వారయిరి. మందయందు బాలురు వృద్ధులు మొదలుగా నందఱును బసులకుఁ దమదూడలయందుఁ బోలెఁ గృష్ణునియందు మిక్కిలియు మక్కువగావున నెంతయు దుఃఖితులై కృష్ణునిఁ జూచుటకుఁ దుకతుకపడుచు గోకులమునుండి బయలువెడలిరి. మధువంశప్రభవుండగు మహాత్ముఁడు బలరాముఁడు వారట్లు భయపడుచుండుటను జూచి పక్కుననవ్వి దనతమ్మునిప్రభావముఁ దెలిసిన వాఁడుగాన యేమియుఁ బలుకకుండెను. వారు తమగా రాబుఁజిన్నికృష్ణుని నలుగడల వెదకఁదొడఁగి, భగవల్లక్షణంబు లగుధ్వజవజ్రాదిచిహ్నములు గల యతనిపదములజాడఁ దెలుపుచున్న దారినిబట్టి యమునాతటమునకుఁ బోయిరి. వారు విశ్వనాథుఁ డగుకృష్ణుని యబ్జయవాంకుశవజ్రధ్వజచిహ్నము

లతోఁ గూడియున్న యడుగులను బసులదారియందును, నితరుల యడుగులనడుమనడుమను,గనుఁగొనుచు వేగిరంబునఁబోయిరి. వారట్లు పోయిపోయి యమునాజలములనడుమ సర్పదేహము చుట్టును బెనఁచుకొనియుండుటవలనఁ గాలుసేయిఁ గదల్పనేరక యున్న కృష్ణుని, ఆమడుగుదరిని నెఱుకలుతప్పి సోలిపడియున్న గొల్లలను, చుట్టును గూయిడుచున్న పశువులనును, జూచి మిక్కిలి తబ్బిబ్బునొందినవారైరి. అనంతుఁడును భగవంతుఁడు నగుకృష్ణునియందు గోపికలకు మనసులెంతయు ననురాగములు గలిగియుండును. కాన వా రాతని చెలిమిసొంపును, జిఱునవ్వు మురువును, జూడ్కులసొబగును, మాటల ముద్దును, మనంబులఁ దలపోయుచుఁ, దమకుమిక్కిలి ప్రియుఁడయిన యాతనిని సర్పముపట్టికొన్నందులకు మిక్కుటమయిన దుఃఖమునఁ బుర బురఁ బొక్కుచుండిరి. వారికిఁ దమప్రియుఁడు కృష్ణుఁడు లేమిం జేసి ముల్లోకములును బాడుపడినట్లు తోఁచినవి. మఱి కృష్ణుని తల్లి యశోద గన్నకొడుకును జూచి నగలం బొగులుచు మడుఁగునందు బడ నుంకింపఁగా, వా రామెను బడనీయక గట్టిగాఁ బట్టికొని కన్నీళ్లు దొరుఁగుచు నాబిడవలెనే తామును దుఃఖించుఁచు, దమవారికి మిక్కిలియుఁ గూర్చునాకృష్ణుని యా యా ముద్దులను సుద్దులను జెప్పికొనుచుఁ, గృష్ణుని నెమ్మొగము నందుఁ జూడ్కుల నెలకొలిపి, మృతినొందినవారివలె నుండిరి. నందాదులకుఁ బ్రాణములెల్లఁ గృష్ణుఁడే. వా రతనివెంట నా మడుఁగునందుఁ బడఁబోయిరి; కాని భగవంతుండగు రాముఁడు చూచి కృష్ణుని ప్రభావమును దెలిసినవాఁడుగావున వారినందుఁ బడనీయక వారించెను. కృష్ణుం డట్లామందలోని వారికెల్లఁ

తానుదక్క వేఱుదిక్కులేకుండుట చూచెను. అందలి స్త్రీలును బాలురు నాదిగాఁ దన్నుగుఱించి మిక్కిలియు దుఃఖితులై యుండుటయు నెఱింగికొనెను. కాని తాను మనుష్యనిరీతి ననుసరించుచుండుటవలనఁ గొంతసేపట్లుండకతీఱదు గాన యశక్తునివలె నటించి యంతటఁ బాముమలకలనెల్లఁ దొలఁగం దాచుచుఁ బయికిలేచెను. ఆకృష్ణునిమేను రానురాను మిక్కిలియు బరువై తనదేహమును మిక్కిలిపీడింపఁగాఁ గాళియుఁడు కృష్ణుని విడిచిపుచ్చి కుపితుఁడై పడగలను బయికెత్తి పట్టి, నిట్టూర్పులు విడుచుచు ముక్కుఁజెరమలనుండి విషములురుల, వేఁచినమంగలమువలెఁ గన్ను లెఱ్ఱనై మాఱునుపడ, నోరనిప్పుకలుగ్రక్కుచు నేమియుఁ జేయనేరక యూరక హరిని జూచుచు నిలుచుండెను. ఇట్లు నాలుకలు రెంటిచే రెండుసెలవులను నాకుచును, మిక్కిలి క్రూరములైన చూడ్కుల విషాగ్ను లుమియుచును, నున్న యాకాళియునితోఁ గ్రీడించు గరుడునివలెఁ గృష్ణుండు వానిచుట్టును దిరుగుచుండెను. కాళియుఁడును నతనిఁగఱచుటకుఁ దెఱపి వెదకుచుఁ గూడఁ దిరుగుచుండెను. ఇట్లు గిఱ్ఱునఁ జుట్టుఁ దిరుగుటవలనఁ గాళియుఁడు బలము కుంది మూఁపులు పయికి నిక్కింపఁగాఁ గృష్ణుఁడు వానిని క్రిందికి నడఁగఁదొక్కి విప్పుగలవాని గొప్పపడగలపయి నెక్కికొనెను. ఇట్లాద్యుండును నఖిలవిద్యాకారణభూతుండును సకలభరతశాస్త్రవిదుల కాదిగురుండు నగు నా హరి యాపాపపడగలయందలి రత్నసమూహములు తగులుటం జేసి తనయడుగుఁదమ్ములు మఱింత మిక్కిలియు నెఱ్ఱనై తళుకొత్తఁగా, వానిపడగలపయి నర్తనమాడెను. అతఁడు నర్తనము సేయుటకుఁ దొడంగఁగానే నపు డతనిసేవకులైన గంధర్వులును

సిద్ధులును మునులును జారణులును దేవకాంతలును, నెంతయు సంతసముగడలుకొన మృదంగము,పణవము,ఆనకము మొదలగు వాద్యములను గొని గీతములుపాడుచుఁ బుష్పోపహారములతో నుతులుసేయుచుఁ దోడనేవచ్చిరి. కాళియుని వర్గమువారునువచ్చిరి. ఆకృష్ణుఁడో ఖలులకు దండధరుఁడు; కాన నూఱుడలల పాపమిన్న యాఁకాళియుఁ డేయేతలను గ్రిందికి వంపక పయికి నిక్కించునో యాయాదానిని నడుగులం బట్టిత్రొక్కుచు,నలియంగొట్టుచుండెను. ఆసర్పమును సత్తువ యుడిగి చుట్టుగిట్టున సుడివడుచు నోరనుండియు ముక్కులనుండియు వేడినెత్తురులు గ్రక్కుచు నెంతయు మూర్ఛనొందినవాఁ డయ్యె. అది కన్నులను విషము గ్రక్కుచును మరలఁ గోపము మల్లడిగొన బిట్టునిట్టూర్పులు విడుచుచును దనశిరసులందు నేదేది పయికినిక్కించునో దానిని గృష్ణుఁడు కాలఁద్రొక్కునఁ జక్కడ్రాల్చుచు, గంధర్వాదులు తన్ను మెచ్చి పువ్వులవ్వారిగాఁ గురియఁగా,వానిపయినాడుచుండెను. అపు డతఁడు శేషశయనుఁ డగుపురాణపురుషునివలెఁ జూపట్టెను. ఆకృష్ణుని చిత్రతాండవములచేతఁ గాళియుఁడు వేయి తలలును మిక్కిలియు నజ్జుగుజ్జయి, మేనంతయుఁ జదిసి, నోళ్ల నెత్తురులు గ్రక్కుచు నపు డతనిని జరాచరగురుండును బురాణపురుషుండు నగు నారాయణుండని తలఁచి యతనినే మనసున శరణుఁజొచ్చెను. జగమునంతయు గర్భమునం గలయాకృష్ణుని పెనుబరువువలన మిక్కిలియుఁ గీడ్పడి, యతనియడుగుఁ దమ్ముల నిబ్బరపుదెబ్బలచే గొడుగువలె నున్నతనపడగలు మిగుల భగ్నములుకాఁగా స్రుక్కుచున్న యాసర్పమునుజూచి వానిపత్నులు మిక్కిలియు నార్తలై పుట్టములుజాఱ, సొమ్ములూడఁ, గ్రొమ్ము

డులు పీడ, నాథున్ఁ డగుకృష్ణునిఁ గదియవచ్చిరి. ఆకాళియుని పత్నులు మనంబులం దెంతయు దిగులు మిగులుచుండుటచేఁ దామై ముందఱ రాక తమబిడ్డలును ముందఱ నిడికొని పుడమి పయిఁ దమమేనులు చాఁగిలవైచి నమస్కరించిరి. అంత నాపడఁతులు పతివ్రతలుగావునఁ బాపాత్ముఁడగు తమపతిని విడిపింపఁ గోరి యంజలిఁ గీలించికొని శరణప్రదుం డయినయాకృష్ణుని శరణుఁజొచ్చిరి.

## కాళియపత్నులు కృష్ణుని స్తుతించుట.

నాగపత్నులు—'మాపతి యితఁ డీమడుగును జెఱిపినాఁడు. మఱి నిన్నుఁ గఱచినాఁడు. ఇట్టి కిల్బిషము చేసినందుల కితనియందు నీవు దండము నెఱపుట న్యాయ్యమే కదా! మఱి యిందు నీవవతరించినదియు ఖలులను నిగ్రహించుకొఱకై యున్నది; కానయిట్లు సేయుట యుచితమే, 'అయినను వాత్సల్యనిధి నగు నాకిది తగ' దందువా? నీకుఁ బగవానియందును, గన్నకొడుకులయందును జూపొక్కరీతి నేయుండునుగాని విషమముగానుండదు. కాఁబట్టి పక్షపాతములేక దండమును నెఱపుదువు; కాని వెను వెంటనే దానివలన హితమగుఫలమును సూచింతువే కాని* చెడుగు సేయవు. నీవుగావించినయీదండము మాయందనుగ్రహమే కాని మఱియొకటిగాదు. ఏలన నీవుగావించుదండము మావంటివారి కల్మషములనెల్లఁ దొలఁగించునదిగదే! అట్టి కల్మషమున నేకదా యీ జీవుఁడు కాళియుఁడు సర్పమయ్యెను. అట్టికల్మషము నడఁచునట్టి దండ మనుగ్రహమే కదా. కావున నీకోపమును ననుగ్రహమే

* 'హరిర్దుఃఖాని భక్తాని హితబుద్ధ్యా కరోతి వై। శస్త్రక్షారాగ్నికర్మాణి స్వపుత్రాయ పితా యథా' యనుట నిట యనుసంధించునది.

యగునని చక్కఁగాఁ దెలిసినది. ఇతఁ డిప్పు డిట్లహంకారాది దూషితుఁడయ్యుఁ బూర్వజన్మమున నహంకారమును దిగవిడిచి మహనీయులకుఁ బూజలొనర్చుచు నెట్టి*తప మొంతబాగుగఁ జేసినాఁడో! లేక సమస్తజలనుయందునుఁ గరుణగలిగి ధర్మమెట్టిదేని యాచరించినాఁడో? కాకున్న సమస్తజంతువులకు భోగమోక్షములిచ్చి యుజ్జీవింపఁజేయునట్టి నీవు నితనినిదండించి యుజ్జీవింపఁజేయునంతటిసంతుష్టి యితనియందుఁ గలుగునా? దేవా! నీపాదారవిందముల యీపరాగపుస్పర్శమునకై శ్రీకాంత యువిళ్లూరి, యిది తప్పఁ దక్కిన కామితములనెల్ల దిగవిడిచి, వ్రతముదాల్చి, మిక్కిలియుఁ జిరకాలము తపము సలిపినదిగదే! అట్టి నీపాదాంబుజరజస్సును స్పృశించునంతటియధికార మితనికిఁ గలుగుట యెట్టిపుణ్యమునవలనిప్రభావమో! అదియితనికిని మాకును దెలియరాకున్నది. దేవా! వేయేల,నీపాదరజస్సును బడసినవారు పరమేష్ఠిపదము నొల్లరు. స్వర్గపదము నొల్లరు. చక్రవర్తిత్వము నొల్లరు. అతలవితలాదులయాధిపత్యము నొల్లరు. అణిమాది యోగసిద్ధులను నొల్లరు. కైవల్యమునేని యొల్లరు. నీపదారవిందరజము, ఐశ్వర్య కైవల్యాదు లగుపురుషార్థము లన్నింటికంటెను మిన్నచుమీ! ఈసర్పరాజు పుట్టుకయో తమఃప్రచురము. కావున నితఁడు కోపమునఁజిక్కి నిక్కుట వింతకాదు. నాథా! ఇట్టివాఁడయ్యును, నితరుల కెట్టివారికిని బడయనలవిగాని నీపదారవింద రజస్స్పర్శమును దానుబడయనోఁచినాఁడుగా! అయిన నిది య

---

* సర్వజీవనుఁ డగు నీవు సంతోషించునట్టి తప మేదేని యితఁడు చేసెనా? లేదు. లేక సమస్తజనులయందలి కరుణచేత నట్టిధర్మ మేదేని చేసెనా? అదియుఁ గలుగదు అని యర్థాంతరము.

బ్బరముగాదు. *తమతమతోంటికర్మములచే సంసారచక్రమం దు భ్రమించుచుండు దేహధారులకు దైవికముగానీసన్నిధానము గలుగుట కలదేకదా. (అనిష్టము లుడుపుటకువలయు) జ్ఞానంబునకును (ఇష్టములు పడయుటకు వలయు)విజ్ఞానంబునకును నాశ్రయుఁడును,(అఘటనఘటనాసామర్థ్యము మొదలగు శక్తులనంతములు గలవాఁడు గాన) యనంతశక్తుఁడును, (షాడ్గుణ్యాపూర్తి గలవాఁడుగాన (భగవంతుఁడును,)సర్వశేషిత్వము మొదలయిన గుణముల బృహత్త్వముగలవాఁడుగాన) బ్రహ్మంబును, (సమస్త జగములకు లోపలఁజొచ్చి నియమించునట్టి ధారకుఁడుగాన)పరమాత్ముండును, (పరమకారణుఁ డగుటచేత) పరభూతుండును, (సర్వభూతహృదయగుహావాసుండగుటచేత)భూతావాసుండును, (వాచామగోచరమహత్త్వము గలవాఁ డయ్యును, యాదవ్రులం దొకానొక)పురుషుం డగువాఁడును, (మహాపరాధియగుకాళీయుననుగ్రహించుటచే)వాత్సల్యయుక్తుండును,(భూతావాసుండును బరమాత్ముండు నగుటచే నన్నిట వ్యాపకుఁ డయియున్నను వాని దోషము లంటనివాఁడయి హేయగుణరహితుం డగుట వలన) అగుణుండును, (పరభూతుం డగుటచేఁ బరమకారణుం డగుటవలన వికారాశ్రయుండుగానందున) అవికారుండును,(పురుషుఁడును బ్రధానము ననెడి ప్రకృతులు రెంటిమూలమునఁ దద్వికారములకు నాశ్రయుఁ డగుటం జేసి) ప్రాకృతుండును నగు నీకు నమస్కారము. కాలాత్మకుండును, (గాలమునకు స్వరూపమున భిన్నుండునుగాన) కాలశరీరకుండును, (కాలమునకు ధారక

---

* 'ఏవం సంసృతిచక్రేఽస్మిన్ భ్రామ్యమాణే దురత్యయే। జీవే దుఃఖాకులే విష్ణోః కృపాకాఽప్యుపజాయతే' అనువచన మిట ననుసంధించుకొనునది.

త్వమునం జేసి)యాత్మభూతుండును. (నిమేషాదిసంవత్సరాంతములగు కాలావయవములకు సాక్షాద్ద్రష్ట గావున) సాక్షియు, విశ్వాత్మకుండును, (విశ్వంబునకు స్వరూపమున భిన్నుండుగాన) విశ్వశరీరకుండును, (జగమున కుపాదానమే కాక నిమిత్తము నగుటచేత) విశ్వకర్తయు, విశ్వహేతుండు నగునీకు నమస్కారము. మఱియు*సూక్ష్మమగు నచిత్తుచే విశిష్టుఁడవగు నీవే యాకాశాది భూతములు శబ్దాదితన్మాత్రలయిదు, జ్ఞానకర్మేంద్రియములు

* 'నమస్తుభ్యం భగవతే పురుషాయమహాత్మనే। భూతావాసాయభూతాయ పరాయ పరమాత్మనే।జ్ఞానవిజ్ఞాన నిధయే బ్రహ్మణేఽనన్తశక్తయే।అగుణాయ వికారాయ నమస్తే ప్రాకృతాయ చ' అనిమూలము. శరణ్యుఁడగు వానికి గుణములు రెండువిధములు. ఆశ్రితులకార్యములను నిర్వహించునవి; ఆశ్రయించుటకు సౌకర్యమును గలిగించునవియుని. అందు జ్ఞానము,శక్తి, పూర్తి, మొదలగునవి ఆశ్రితకార్యనిర్వాహకములైనవి. అందు జ్ఞానమనఁగా అనిష్ట పరిహారమునకు ఇష్టప్రాపణమునకు నుపయుక్తమగునది.ఇదియె 'జ్ఞాననిధయే' అని చెప్పఁబడెను. శక్తి యనఁగా అఘటితఘటనాసామర్థ్యము మొదలగునవి.ఇది'అనంతశక్తయే'అనఁబడెను. పూర్తియనఁగా అవాప్తసమస్తకామత్వము-అన్నికోర్కులును బడసియుండుట. ఇది 'భగవతే' అని షాడ్గుణ్యపూర్తి చెప్పుటచేతవ్యక్తము. ప్రాప్తి యనఁగా నిరుపాధిక శేషిత్వము. ఇది 'బ్రహ్మణే' అని సర్వశేషిత్వాదిగుణముల బృహత్త్వముచేత ప్రతిపాదింపఁబడినది. ఆశ్రయణ సౌకర్యాపాదకగుణములు పరత్వము, స్వామిత్వము. సౌశీల్యము, వాత్సల్యము మొదలగునవి.పరత్వమనఁగా తక్కినవారందఱకంటె తానుత్కృష్టుఁడై యుండుట. ఇదియె 'పరాయభూతాయ' అనఁబడెను. మఱియు 'పరమాత్మనే'యని యన్నింటిలోన నాత్మయై చొచ్చి నియమించునట్టి ధారకత్వము చేతను పరత్వము వ్యక్తము. సౌలభ్యమనఁగాసులభత్వము-సులువుగా లభింపఁగూడి యుండుట. ఇదియే 'భూతావాసాయ'యని సర్వభూతహృదయగుహా

పది, ప్రాణములైదు, మనస్సు బుద్ధి వాసన యనెడి స్థూలములగు నచిత్పరిణామములచే విశిష్టుఁడ వగుబ్రహ్మమవై రజస్తమోది గుణత్రయముంబట్టి దేహాత్మాద్యభిమానముఁ గలిగించి వానిచేత జీవులకు నిజాత్మస్వరూపమును గప్పిపుచ్చుచుందువు. ఇట్టి నీకు నమస్కారము. (సమస్తములోనం జొచ్చి తచ్ఛరీరకుఁడగుటవలన వస్తుపరిచ్ఛేదరహితుఁ డగుటంజేసి) యనంతుఁడును, (అణువగు నాత్మయందును జొచ్చుటంజేసి) సూక్ష్ముండును.* (నిర్వికారుండగుటంజేసి) కూటస్థుండును, (నిత్యము నసంకుచితమై సర్వవస్తువిషయకమైన ధర్మభూతజ్ఞానమున కాశ్రయుండగుటంజేసి) విప

వాసత్యముచేత చెప్పఁబడెను. సౌశీల్యమనఁగా ఎక్కుడగువాఁడు తక్కువవారితో మిక్కుటముగాఁ గలసి మెలసియుండు స్వభావము గలిగియుండుట. ఇదియే 'పురుషాయ మహాత్మనే' అని మహాత్త్వమెంతో గలవాఁడయ్యును యాదవులలో నొకానొకపురుషుఁడుగాఁబుట్టినాఁడనుటచేత వ్యక్తము. మహాపరాధ యగుకాళియుని ననుగ్రహింపఁ బూనుటను జెప్పెడియీప్రకరణముచేతనే వాత్సల్యముచెప్పఁబడినదయ్యెనని తెలియునది. గుణవర్గములు రెండును నిందు ప్రతిపాదితములు. 'భూతావాసాయ పరమాత్మనే' అని అన్నిటవ్యాపకుఁడగుటచే వ్యాప్యముయొక్క హేయగుణములతో భగవంతునికి సంబంధము గలుగుటను బరిహరించుటకై 'అగుణాయ' యనియు, 'పరాయభూతాయ' అని జగత్కారణభూతుఁ డగుటచే జగదాదికార్యవికారముల నొందువనుటఁ బరిహరించుటకై 'అవికారాయ' అనియుఁ జెప్పఁబడినవి.

* సూక్ష్మచిద్విశిష్టబ్రహ్మమే భూతాదిస్థూలాచిద్విశిష్టబ్రహ్మమగుచుకాన యుభయావస్థబ్రహ్మముల కభేద మిటఁ జెప్పఁబడినది.

* ఇట 'అనంతుఁడు కూటస్థుఁడు విపశ్చితు'డనుమూఁడుశబ్దములచే 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ' అనువాక్యము గుర్తింపఁబడెను. కూటస్థుఁడనుచే నిర్వికారత్వమునుబట్టిసత్యశబ్దమును, విపశ్చితుఁడనుటచేజ్ఞానశబ్దమునువ్యంజితములు.

శ్చితుండును, వేదాంత వాక్యముల యైక్యమును దెలియక బుద్ధి భేదములనొంది నానావాదములు సేయువారి యాయావాద ముల కనురూపముగాఁ బ్రతీతుండగువాఁడును, ఆయావాదులు ప్రయోగించు వాచకశబ్దములయుఁ దద్వాచ్యములగు నర్థముల యుశక్తులను నిర్వాహకుండగువాఁడును,నగునీకునమస్కారము. (నిజస్వరూపస్వభావముల ప్రమితినిగలిగించునది శాస్త్రమేకాన) శాస్త్రయోనియు, (స్వప్రమితిసాధనం బగుశాస్త్రమును వెలిపుచ్చుటవలనఁ దత్కారణం బగుటం జేసి) ప్రమాణమూలుం డును, శాస్త్రమును వెలిపుచ్చుటకు వలయు సర్వజ్ఞత్వము గల వాఁ డగుటం జేసి) కవియు, ప్రవృత్తి నివృత్తి కర్మ నిర్వాహ కుఁడగుటం జేసి) ప్రవృత్తుండును నివృత్తుండును, (ఉపనిషజ్జ్ఞాన ప్రవర్తకుఁ డగుటంజేసి) నిగముండును నగునీకు మాటికి నమ స్కారము. *వసుదేవసుతుం డయినకృష్ణుండును రాముండును బ్రద్యుమ్నుండును అనిరుద్ధుండును (నాశ్రితుల కనిష్టములంబరి హరించి పాలించువాఁ డగుటంజేసి)సాత్త్వతాంపతియునగునీకు నమస్కారము. (మఱియు సాత్త్వతుల గుణం బగుధర్మభూత జ్ఞానమును, దీపము విషయమును గ్రమ్మియున్నచీఁకటినిదొలఁ గించి తెలియఁ జేయునట్లు, ప్రకాశింపఁ జేయువాఁడవు గానగుణ ప్రదీపుండును,(అసాత్త్వతులగుజీవులజ్ఞానమునుగుణమయంబగు

* పరత్వాద్యవస్థలయందే నాకు మీరు చెప్పినట్టి గుణములు గలవు గాని వ్యూహవిభవావ్యవస్థలయందవికలుగ వనఁగా నిది చెప్పుచున్నారు. ఇట రామ కృష్ణాదులు విభవావస్థలు, ప్రద్యుమ్నానిరుద్ధాదులు వ్యూహావస్థలు, పరత్వా వస్థయందలి గుణములెల్ల నీయవస్థలందును గలవు. విభవావస్థయందు సౌశీల్యమొకటి యెక్కుడని తెలియుటకై 'వసుదేవసుతుం' డనఁబడెను.

మాయచేతఁగప్పి సంకుచితముగావించువాఁ డగుటవలన) గుణాత్మచ్ఛాదనుండును, *(ఇట్లుచేయుట వైషమ్యమునుబట్టికాక వారి వారి గుణవృత్తులను వ్యాజముగాఁగొనియే కావున) గుణ పరిణామాత్మకంబగుమనస్సునకుఁగిలన్యాసవృత్తిచేతనోయుపాసనావృత్తిచేతనోయుపలక్ష్యుండగువాఁడును, (అపరిచ్ఛిన్నమై నిత్యాసంకుచితమగు ధర్మభూతజ్ఞానమున కాశ్రయుఁడుగాన) స్వయంవిదుండును, కావున, (సర్వాంతఃకరణప్రవృత్తుల నొక్కమ్మడిని జూచువాఁడుగాన) గుణద్రష్టయు నగునీకు నమస్కారము. (గుణద్రష్టృత్వాదులగు నిజవిహారము లభివ్యక్తములు కాకుండుటను బట్టి) అవ్యాకృత విహారుండును, (వ్యాకృతములగు సర్వదేవాది పదార్థములయు వానిబుద్ధి వృత్తులయు నిష్పత్తికిహేతువగుటం జేసి) సర్వవ్యాకృతసిద్ధుండును, ఇంద్రియములకెల్ల నియంత యగుటంజేసి †హృషీకేశుండును, (తాపత్రయాతురు లగుజీవుల నుజ్జీవింపఁజేయుటకై వాకేవిధముననైనను సుకృతలేశ మేదేని చేసిరాయనిదానినేమననము చేయుచుండువాఁడుగాన) మునియు, బరిపూర్ణైశ్వర్యుండగుటవలన బ్రహ్మాది స్తంబపర్యంత మగుజగము నదృణీకరించి పరత్వమునంజేసి యేమియుఁ బలుకకయుండువాఁ

---

* సాత్త్వతులకు జ్ఞానవికాసమును అసాత్త్వతులకు జ్ఞానసంకోచమును గలిగించు వైషమ్యము భగవంతునకుఁ దగునాయని యడుగఁగా నట్లు వారి వారి మనోవృత్తినిబట్టి చేయుచున్నాఁడేకాని వైషమ్యమునుబట్టి గాదని యిందు దెలియునది.

† హృషీకమనఁగానింద్రియము. దానికి ఈశుండనఁగానియంత యని వ్యుత్పత్తిఁదెలియునది.

ఢుగాన) మౌనశీలుండును నగునీకు నమస్కారము. ఆశ్రితులకుఁ బరంబైన (మేలైన) మోక్షగతియు, అనాశ్రితులకు నవరంబైన (తక్కువయిన) బంధగతియు నెఱింగి యొసంగువాఁడుగాన*పరావరగతిజ్ఞుండును, (సర్వపురుషార్థములకు నధిపతి గాన) సర్వాధ్యక్షుండును, (సకలశబ్దవాచ్యుండు గాన విశ్వుండును, (అయినను సకలశబ్దములప్రవృత్తినిమిత్తములకు విలక్షణుండుగాన(అవిశ్వుండును, (సకలవిశేష్యజాతముల సత్తాస్థితి ప్రవృత్తులకు హేతువుగాన) విశ్వహేతువును, (నమస్తము నెఱుంగువాఁడుగాన) విశ్వద్రష్టయునగు నీకు నమస్కారము. విభూ! నీవు, కాలం బనెడిశక్తినిదాల్చి సంకల్పముతప్ప మఱియొక వ్యాపారము లేక, రజస్తమోగుణములచేత నీజగత్తునకు జన్మస్థితి లయములను గావించుచు, రాజసతామసాదు లగునాయాస్వభావములు జీవులు గలిగియున్నను, వారి ననుగ్రహగర్భం బగుదృష్టిని గటాక్షించి దండనముచేతఁ బ్రబుద్ధులను గావించుచు నిట్లప్రతిహతం బగుజగద్వ్యాపారం బనెడిక్రీడ నాడుచుందువు.

---

* ఆశ్రితులకు మోక్షమొసంగువాఁ డగుటచే మహాపరాధియయ్యు ఆశ్రయణమాత్రము నెపముచేసికొని రక్షింపఁదివురుచున్నాఁడు గాన యిది యాశ్రయణ సౌకర్యాపాదకమైన గుణము. సర్వాధ్యక్షుఁడను ధర్మము మొదలుగా తనపర్యంతముగల సమస్తమును నొసంగు మహాదాత యగును గాన యిది ఆశ్రితకార్యాపాదకమైన గుణము. సర్వమును శరీరములుగాను వానికిఁ దానంతరాత్మగాను నుండుటవలన శరీరవాచక శబ్దములు శరీరియగునాత్మపర్యంతము చెల్లును గావునను సర్వశబ్దవాచ్యుం డనఁబడెను. అయిన నాయా శబ్దముల ప్రవృత్తినిమిత్తముకుల విలక్షణుఁడేయగును. మఱియు వాని సత్తాస్థితిప్రవృత్తులకు హేతువును, అట్లు హేతువై యుండుటకు వలయుజ్ఞానమును గల వాఁడును, అగునని తెలియునది.

ఇట్లుజగత్తునకుజన్మాదులు గావించుచుండునీకుమూఁడులోకము లందును సాత్త్వికములును, రాజసములును, దామసములునగు నీప్రజలు దేహమువలె శేషభూతములు; కాన నన్నియు ననుగ్రహింపఁ దగినవియె. అట్లని నీజగద్వ్యాపారమునకు భంగమగునని తలంపవలదు. నీవు రక్షణకర్తవు గానసజ్జనుల ధర్మమును బరిపాలింపఁగోరి యవతారము లెత్తుచుందువు. కాన (సకలజన్మములం దపరాధము లొనర్చుచుండినను నిప్పు డువానినివిడువఁజూచుచుండుటచే)శాంతములై యున్న దేహము లను దేహభూతులగువానిని) రక్షించుట నీకుఁ బ్రియమేకదా! కాబట్టియీతఁడనుగ్రహపాత్రుఁడగుట నీభగవద్వ్యాపారమునకు భంగము గలుగదు. మాభర్తయితఁడుచేసిన యపరాధ మొక సారి సహింపవలెను.ఇతఁడు నీబిడ్డఁడు. బిడ్డలుచేసినయపరాధము ను సయింపవలసినదే. మఱియు నీతఁడు మూఢుఁడుగాన నిన్నెం తమాత్రము దెలియఁడు; కావునను క్షమింపనెంతయుఁదగును. భగవంతా! ఈసర్పము ప్రాణములు విడువనున్నది. కాననీక ననుగ్రహింపుము.మేమాఁడువారము;సాధువులకెల్లఁగనికరింపఁ దగినవారము గదే. ఇట్టి మాకుఁ బతియెప్రాణములు. కానపతి నొసంగుము. 'మీకుఁజూపెడియనుగ్రహము తక్కినవారికి మృ త్యువుగదా!' యనకు. నీయాజ్ఞంజేసి మాపురుషుఁ డితఁడిప్పటి మృత్యువుభయమునుండి విడివడుటకును, మావలన లోకము నకు భయము గలుగకుండుటకును, నేది శ్రద్ధతోడ ననుష్ఠింపఁ దగునో దానిని నీకింకరజనుల మగుమాకువిధింపుమీ''యనిరి.

ఇట్లానాగపత్నులాభగవంతునిఁ బరిపరివిధముల స్తుతిం పఁగా నతఁడు తనయడుగులబిట్టుత్రొక్కుడులచేఁ దలలు నజ్జ

గుజ్జయి మూర్ఛితుండై యున్న కాళియుని విడిచెను. అంతనా కాళియుఁడు మెల్లమెల్లగా నింద్రియములును బ్రాణములును మరలఁబడసి యెంతో కష్టమున నూర్పులుపుచ్చుచు దీనుండయి చేతులుజోడించి కృష్ణునితో నిట్లనియె. 'దేవా! మేముపుట్టిన దిమొదలుగాదుష్టులము, తామసులము. మాకుఁగోపముమిక్కిలి యుఁ బెద్దది. నాథా! ప్రాణులకుస్వభావమునుదిగవిడుచుటయెంత యుఁగష్టముగదే. అది వానిని పిశాచమునలెఁ బట్టుకొను చున్నదిచుమీ. ధాతా! నీవీతిర్యక్సమూహమును నాయాగుణ ములచేత ననేకవిధములుగా సృజించితివి. కాన యవియొక విధముగాక నానావిధములగు స్వభావములును, బలములును, సామర్థ్యములును, గలిగియుండును. మఱియు వాని యుత్పత్తి స్థానములును, బీజములును, ఆశయములును, ఆకృతులును, బలుదెఱంగులుగా నుండును. మహాత్మా! మేమట్టి తిర్యక్కులలో నొకతెగవారము. సర్పములము. పుట్టుకచేతనే మాకుఁగోపము పెద్దదిగానుండును. నీమాయచేత మోహితులమయిన వారము గాన నీమాయను (మాయకార్యమయిన మాయాకోపమును) నెట్లు విడువనేర్తుము. అది నీయనుగ్రహముచేతఁ గాకదిగవిడువ నెంతయుఁ గష్టముగదే. నీవుసర్వజ్ఞుఁడవు, మఱి జగదీశ్వరుండవు, కాన మేమామాయను విడుచునట్లుఁగారణము నీవేచుమీ. అను గ్రహమో, నిగ్రహమో, మాకేది యుక్తమని తలంచెదవో, దానిని మా కాజ్ఞాపింపుము.' అనెను.

కార్యముకొఱకై తనయిచ్ఛచేతమానుషవిగ్రహముఁదాల్చి యున్నయాభగవంతుఁడు కాళియుఁడు చెప్పినది యాకర్ణించి వానితో 'సర్పమా! నీవిందు నిలువరాదు. సముద్రమునకుఁ

బొమ్ము. జాగువలదు; గోవులును మనుష్యులును వారి చుట్ట ములును బిడ్డలును భార్యలు మొదలగువారును నీనదిని విచ్చలవి డిగాననుభవింతురుగాక. మిమ్ము నేనుదండించినయీచరిత్రమును బురుషుఁడెవఁడు రేపును మాపును రెండువేళలయందును స్మరిం చుచును గీర్తించుచునుండునో వాఁడు మీవలన భయము నెంత మాత్రమునొందఁడు. నావిహారస్థానమగు నీమడుఁగునందెవఁడు గ్రుంకులిడి జలముల దేవతలకును బితరులకును ఋషులకునుదర్ప ణము సేయునో, మఱి యుపవసించి నన్ను స్మరించుచు నర్చిం చునో, వాఁడు సమస్తపాపములనుండి విడివడుచున్నాఁడు. నీవు గరుడునికి భయపడి ముందున్నరమణక ద్వీపమునువదలియీమ డుఁగు నాశ్రయించితివి గదా! ఆగరుడుఁడు నాపదములగుఱు తునీయందుండుటనుబట్టి నిన్నిఁక భక్షింపఁడు.' అనెను. అద్భుత కర్ముండగు భగవంతుఁడు కృష్ణుఁడిట్లుచెప్పఁగాఁ గాళియుఁడతనిని బూజించెను. అపుడు నాగపత్నులును, ఆదరంబు గడలుకొన బూజించిరి. దివ్యములయిన వస్త్రమాల్యములచేతను, మణుల చేతను, మిక్కిలి వెలపొడుగయిన భూషణములచేతను, దివ్య గంధము లగుననులేపనములచేతను ,మిక్కిలియు గొప్పదియగు నుత్పలమాలికచేతను, నాజగన్నాథుని గరుడధ్వజునిఁ బూజించి యతనినిఁ బ్రసన్నునిఁగావించి వలగొని యభివాదనముఁ జేసియా కాళియుఁ డనుజ్ఞంబడసిపుత్త్రమిత్రకళత్రసహితుఁడై సముద్ర ద్వీప మగురమణకమునకుఁ బోయెను. తోడనే యమునయుఁ గ్రీడామానుషవిగ్రహుం డగుభగవంతుని యనుగ్రహమువ వలన విషమంతయు వీడియపుడే యమృతతుల్యంబగు జలములు గలది యాయెను. ఇది పదియాఱవ యధ్యాయము.

## కాళియుఁడు కాళిందిమడుఁగునకు వచ్చినందులకు గారణము.

రాజు, 'కాళియుఁడు నాగముల కునికిపట్టయిన రమణకద్వీపము నేల విడిచిపెట్టెను? తక్కిన నాగములు నిర్భయముగా నుండఁగాఁ గాళియుఁడు తనకు భయము గలుగునట్లు తా నొక్కఁడుమాత్రము గరుడునకేమి యప్రియము గావించెను?' అని యడిగెను.

శుకుఁడు 'తొల్లి సమస్తజనులును దమ్ముఁ బాములు కఱవకుండుటకుఁగాను భక్ష్యములతోఁగూడ *బలిని, నెలనెలకు, పువ్వులును బండ్లును లేకుండుచెట్లక్రింద, నమావాస్యయం దిడునట్లు కల్పితమై యుండెను. ఆనాగులు ప్రతిపర్వమునను దమకుజనులు కల్పించునట్టి బలియందుఁ దమతమభాగమును, దమరక్షణము కొఱకు మహాత్ముఁడగు గరుడునకు నర్పించుచుందురు. కనుక నక్కడివారికి గరుడునివలన భయముగలుగదు; ఇట్లు సర్పములెల్ల నిచ్చుచుండఁగాఁ గద్రువకొడుకు కాళియుఁడు తనవిషంపుఁ బెంపునను వీర్యంపు సొంపునను, మదము పయిఁకొనఁగా గరుడునిఁ దృణీకరించి, యాగరుడుని కీయవలసిన దగుతనబలి భాగమును దానే భుజించెను. అంతమహాత్ముఁడును భగవంతునకుఁ బ్రియుఁడు నగు గరుడుఁడు కాళియునిఁ జంపఁగోరి మహావేగముతోఁ

---

* ఉపహార్యైః సర్వజనై ర్మాసిమాసీహ యోబలిః, వానస్పత్యో మహాబాహో నాగానాం ప్రాఙ్నిరూపితః, అనిమూలము. 'సర్పజనైః' అనుపాఠమున గరుత్మంతునికి సర్పములను బలిగా నివేదించుట గలదు. దానికి బదులుగా వానస్పత్యము (పువ్వులు పండ్లు లేనిచెట్లక్రిండ నిడు బలి) నెలనెలకు గరుడబాధలేకుండుటకై నాగులకుఁ గల్పితమై యుండెను.

బాఱుతెంచెను. అట్లతఁడు పయి నడరుచుండుటను జూచి కాళి యుఁడు తనకు విషమును గోఱలును నాయుధములుగా నుండ, నాలుకలు భయంకరమైక్రాల,ఉగ్రములగుకన్నులుబ్బనిబ్బరము గాఁదోఁప, తన పెక్కుతలలను బయికెత్తికొని వేగమున గరు డునిపయి నడరెను. ఆగరుడుఁడో మధుసూదనుఁడగు విష్ణు నకు గద్దియ యగునుద్ది. కాన యతనిపరాక్రమ మత్యుగ్రము. అట్టిజెట్టి మిక్కిలియుఁ గోపముగొని ప్రచండవేగముగ నాక ద్రుపనపట్టిపయినడరి,యిట్టటుఁజిమ్మి,బంగారుకాంతి చేఁదళుకొత్తు తనయెడమఱెక్కచే వానిని దాఁచెను. అట్లు గరుడుని ఱెక్కచేఁ గొట్టువడి కాళియుఁడు, మిక్కిలియు విహ్వలుఁడై యటనుండి యమునానదిమడుఁగునుజొచ్చెను. అందుగరుడునకుఁబోవఁ దర ముగాదు.మిక్కిలియు లోఁతగుటచేనితరులకునుజొరనలవిగాదు. ఆమడుఁగునం దొకప్పుడు చేఁపయొకటియుండెను. అది గరుడు నకు మిక్కిలి యభీష్టమయిన భక్ష్యముగానుండఁగా నతఁడు,సౌ భరియను నొక బ్రాహ్మణుఁడు వలదని వారించుచున్నను,మిక్కిలి యాఁకలిగొనియుండుటచే బలవంతముగాఁ బట్టి కొంపోయెను. అట్లామీనపతి పట్టువడిపోవఁగాఁ దక్కినమీనము లెల్ల మిక్కిలి యు దుఃఖితములై యుండుటను సౌభరిచూచి కరుణమీఱఁగా నందలివానికి క్షేమముగావించువాఁడై 'గరుఁడుఁ డీ మడుఁగు నందుఁజొచ్చి యిటమీఁద మత్స్యములనుబట్టి తిను నేని,తోడనే ప్రాణములు వీడఁగలఁడు. ఇది సత్యముగాఁ జెప్పుచున్నాను.' అని శాపమిడెను.అది కాళియుఁ డొకఁడే యెఱుఁగునుగానిమఱియొక సర్ప మెఱుఁగదు. కావుననే కాళియుఁడు గరుడునకు భయపడి యందు వసించియుండెను. కృష్ణుఁ డిటనుండి వానిని వెడలఁ

గొట్టెను. అట్లు కృష్ణుఁడు దివ్యంబులగు మాల్యముల వాసనలు గుబాళింప, దివ్యవస్త్రములంగట్టి, వేలయిన మణిగణములుపయి నెఱసి మెఱయుచుండ, మంచికడానిబంగరుసొమ్ముల నలంకరించుకొని, మడుఁగునుండి వెడలిరాఁగానే గొల్లలందఱు నతనిని మరలఁ బడసి ప్రాణములు మరలవచ్చిన యింద్రియములవలె లేచిరి. అంత వారు తమదేహములును మనసులును మిక్కిలియుఁబొదలుచుండ,సంతోషమెంతయుదొంతరలుగొనఁ, గృష్ణునిఁ గౌఁగిలించికొనిరి. యశోదయు, రోహిణియు, నందుఁడును, గోపకులును, గోపికలును, గృష్ణునిఁ బడసి మరలఁజేష్టలొంది మనోరథము లీడేఱినవారయిరి.బలరాముఁడునుగృష్ణునిఁ గౌఁగిలించుకొని యతని ప్రభావము తెలిసినవాఁడుగాన యందులకు నవ్వి,అతనిని దొడపయినిడికొని ప్రేమమీఱ మాటిమాటికి మొగముజేఱి చూచుచుండెను. *వృక్షములును, ఆవులును, ఎద్దులును, దూడలును, మిక్కిలియు ముదమునొందిన నయ్యె. పెద్దలగు విప్రులునువారిభార్యలునునందునికడకువచ్చి 'నీబిడ్డఁడు కాళియునిచేఁజిక్కియు విడివడినాఁడుగా! భాగ్యము. ఇదియెంతో యానందముగా నున్నది'యని చెప్పిరి. మహాభాగ్యవతియగుయశోదయు,పోయినబిడ్డని మరలఁబడసినదై కృష్ణునిఁగౌఁగిలించికొని తొడపయినిడికొనియశ్రుకణము లవ్వారిగాఁదొరఁగించినదయ్యె. అంతసూర్యుఁ డస్తమించెను. రాత్రియునయ్యెను. కానయప్పుడు కృష్ణుండు రాముండును గోపాలురును తల్లియుఁ దండ్రియును గోధనముల కన్నిటికిని నారాత్రి యమునానదీతీరముపొంతనే

* వృక్షములు ముదమునొందుటయనఁగా నవి మును యెండియుండి మరలఁ బూవులు పండ్లుమొదలగునవి పెరిఁగి వెలయుచుండె నని భావము.

వాస మేర్పఱచెను. ఆకాళిందిగట్టకడ గొల్లలును గోవులును నాఁకలి దప్పులచేఁ గుందుచు బడలికలచే స్రుక్కుచును వసించి యుండిరి. అప్పు డాయడవియం దొక కారుచిచ్చుపుట్టి వడిగా మంద నలుప్రక్కల వ్యాపించి నడిరేయిని నిదురించుచున్నవారి నెల్ల నావరించుకొని కాల్పఁదొడంగెను.

### కృష్ణుఁడు గోవులను దావాగ్నివలన సంరక్షించుట.

అంతగొల్ల లెల్ల నగ్గి దరికొని కాల్చుచుండఁగా సంభ్రమించి తెప్పునలేచి మాయామనుష్యుం డయినయీశ్వరునిఁ గృష్ణుని శరణుసొచ్చి 'కృష్ణా! కృష్ణా! మహాభాగా! ఓరామా! అమితపరాక్రమా! ఇదిగోఁజూడుము. మిక్కిలి భయంకరమయినచిచ్చు నీవారమగు మమ్ముమ్రింగుచున్నదిచుమీ. ప్రలయకాలాగ్నివలె నున్నదియిది. ఇట్టి దీనినిగొంచెమేని మాకుఁగడవఁదరముకాదే. నీచుట్టముల మగుమమ్ము, ప్రభూ! దీనిబారినుండి తప్పింపుమీ. దేనివలనను భయము గలుగనీయనినీచరణములను విడుచుటకు, మేమించుకయు శక్తులముగాము గదే' యని మొఱయిడిరి. ఇట్లు తనవారిదైన్యమును జూచి యాజగదీశ్వరుఁడు, అనంతశక్తిధరుండగు ననంతుండుగావున,నాయగ్నినిఁ ద్రావిపుచ్చినవాఁడయ్యెను. ఇది పదియేడవయధ్యాయము.

---

### గ్రీష్మర్తువర్ణనము.

అంత నారాత్రి కడచెను. అపుడు కృష్ణుఁడు, గొల్ల లుల్లంబులు పల్లవింపఁ దన్నుగుఱించిన పాటలుపాడుచును బలసివచ్చుచుండఁగా, గోసమూహముచే నందమైన చిన్నమందను బ్రవేశించెను. ఆరామకృష్ణు లిరువురును దమసంకల్పమున గోపాలు

రను నెపమిడికొని యిట్లు వాసంతికక్రీడ లాడుచుండఁగా నంత గ్రీష్మర్తువు వచ్చెను. అది ప్రాణుల కంతగాఁ గాదు. కాని బృందావనంపు గుణములచే వేండ్రమయిన యావేసవియును వసంతఋతువువలెనే చూపట్టెను. ఏలన నందు భగవంతుఁ డగుకృష్ణుండు రామునితోఁగూడ వసించియుండెను. కాన యిది యట్లు చూపట్టెను. ఆబృందావనములో, నావేసవియం దును సెలయేళ్లు జలజలమని బ్రవహించుచుండుటవలన వాని బిట్టుచప్పుళ్లకు జలకోళ్ల బెడిదంపుఁగూతలు నడఁగి ముడిఁగిన వయ్యెను. మఱియు నాసెలల నీటితుంపర లెప్పుడును విడువక పయిని బొంపిరి యగుచుండుటవలన మ్రాఁకులగుంపులు పచ్చఁ గాఁ బెంపు సొంపారియావనమునకు వన్నెగూర్చుండెను. మఱియు గాలి, నదులయుఁ గొలంకులయు సెలయేళ్లయుఁ గరళ్లతుంప రలను గొల్లలాడి చలువయెక్కి చెంగలువలయుఁదామరలయు నల్లగలువలయుఁ బుప్పొళ్లను మోచికొని, తావులుఁ బుగులుకొ నుచుఁ బొలయుచుండెను; గాన యావనమందు పచ్చనిపచ్చికలు విచ్చలవిడిమెచ్చులుగులుకుచుండెను. కనుక నందున్న వారికి వేసవి కారునందగ్గివలనఁగానిసూర్యునివలనఁగాని వేండ్రముగాఁగలుగు తాపము కొంచెమైనను గలుగదయ్యె. నదు లప్పుడెండిపోవుటకు మాఱుగా లోఁతయినజలములతో నిండుగాఁ బ్రవహించుచుండె ను. కనుక, వానియందలి కరళ్లు దరులపయి కెగసిపర్వుచుండుట వలననినుకదిన్నియలును నేలయునురొంపులుగొనుచుండెను. మఱి యు వేఁడివెలుఁగులవాని వాఁడికిరణములువిషమువలెఁ బర్విచేవ పీల్చునట్టివయ్యెను, భూమియందలి రసమునుగాని దానియందలి పచ్చికపట్టులనుగానిహరింప నేరవయ్యెను. మఱియుఁజెట్లుదట్టము

గాఁ బువ్వులుపూచి,పండ్లు చిగుళ్లు మొదలగువానిచే సిరిగులుకు చుండఁగా, పలుదెఱంగులగు పిట్టలునుమృగములును శబ్దములు సేయుచుండఁగా, నెమళ్లునుదుమ్మెదలును నాడుచును బాడుచునుం డఁగా, కోయిలలునుసారసములును గోలకోలకూయుచుండఁగా, నావనమెంతయు చెలువుగులుకుచుండెను. భగవంతుఁడగుకృష్ణుఁ డందుఁ గ్రీడలాడ నుంకించిబలునితోఁగూడి వేణువు మొరయించు చు గొల్లలును గోవులును బలసి వచ్చుచుండఁగానందుఁజొచ్చిన వాఁడయ్యె. అందు రాముఁడును గృష్ణుఁడును మొదలగు గొల్ల లు, చిగుళ్లచేతను నెమిలిపురులచేతను బూవుఁగుత్తులచేతను, బూదండలచేతను, గైరికధాతువులచేతను, సొమ్ములు చేసికొని నర్తనములాడుచును, ఒకరితోనొకరుబాహుయుద్ధములు సేయు చును, బాటలుపాడుచును విహరించుచుండిరి. కృష్ణుఁడు నర్తించు చుండఁగా గొందఱు పాడుచుండిరి. కొందఱు వేణువులనూఁదు చును గరతలములఁ దాళములువైచుచునుగొమ్ములువాయించు చునుండిరి. మఱికొందఱు 'బలే! బాగు! బాగ'ని!పొగడుచుండిరి. గొల్లజన్మముచేఁ దమ్ముమాఱు సేసికొనియున్న సాక్షాదీశ్వరావ తారభూతు లగునారామకృష్ణులను, గోపాలరూపులయి యున్న యాదేవతలు,నటునివటులవలెనే, యెంతయు స్తుతించిరి. ఒక్కయెడ, రామకృష్ణులు కూఁకట్లు సీటుగులుక పలుదెఱంగులక్రిందులకు జొచ్చి తమ్ముఁబట్ట వచ్చినవానికి నేర్పునఁజిక్కక తప్పించుకొనఁ జుట్టుబవిరి దిరుగుచును, పట్టుటకు దగ్గఱినవానిని దప్పించుకొను టకై చెంగున గంతుల వైచుచును, పట్టుకొన్నవానిని నేలఁబడ ద్రొబ్బుచును, అఱచేతులచే బుజము లప్పళించుచును, ఒకరికొ కరు పట్టువడి బలముకొలఁదిని బట్టిలాగుచును, మల్లయుద్ధములు

సేయుచును నాడుచుండిరి. ఒక్కయెడ నితరులు కొందఱు నర్తిం చుచుండఁగా. తాము పాడుచును వాయించుచును, బళీ! బాగు! బాగనుచుఁ బొగడుచునుందురు. వారొక్కయెడ బిల్వకాయల చేతను, ఒక్కయెడఁ దట్టంపుఁ బూవుంగుత్తులచేతను, ఒక్క చోట నుసిరికకాయలచేతను, గాళింది యిసుకదిన్నియలందలి ముత్తియపుఁ జిప్పలచేతను, ఒక్కవలన*నస్పృశ్యము నేత్రబంధము మొదలయిన యాటలచేతను, నాడుచుందురు. కొన్నియెడల నానామృగములయుఁబక్షులయుఁ జేష్టలుగావించుచుందురు. కొన్నియెడలఁగప్పలవలె దూఁకుచును బలుదెఱంగులగు పరియాచకములాడుచును నుందురు. కొన్నియెడలఁ బల్లకీవంటినుయ్యేల లూఁగుచును, ఒకప్పుడు రాజులలీలలం జూపట్టుచును, నుందురు. ఇట్లు వారిరువురును లోకమునఁబ్రసిద్ధముగ నాయాక్రీడలాడుచు నావనమందుఁ గ్రుమ్మరుచుండిరి. ఇట్లు రామకృష్ణులు వనమందు, గోపకులతోడంగూడ నదులయందును గొండలయందును గొండపల్లములయందును బొదరులయందునునడవులయందునుఁ గొలంకులయందును బసులను మేపుచుండఁగా, వారిని జంపఁగోరి ప్రలంబుఁడనెడి యొకయసుర గొల్లరూపుదాలిచి యక్కడికి వచ్చెను. భగవంతుఁడు కృష్ణుఁడు సర్వదర్శనుఁడుగాన వానిని దమ్ముఁజంప వచ్చిన యసురయని తెలిసియుఁ దోడనే చంపఁగోరక మఱియొక యుపాయమున వానినిజంప నాలోచించుచువానితోడి నెయ్యమే

---

* అస్పృశ్యమనఁగా. ఇరువురు తమలో మనల నొకరి నొకరు ముట్టరాదని పంతముచేసికొని యాడు నొకవిధమయిన ఆట. నేత్రబంధమనఁగా ఒకఁడు తనచేతులతో మఱియొకని కన్నులు మూసి వేఱొకనిని,వచ్చుచున్న వాని పేరేమి చెప్పుమని యడిగెడి యాట; కనుమూసిగంతలు నగును.

యపు డియ్యకొనెను. అంతఁ గృష్ణుఁడు వానిని జంపుటకుఁ దగిన క్రీడ యిదియని తెలిసి గోపాలురను బిలిచి 'గోపకులారా! మనము వారివారి శక్తికిఁ దగురీతిని రెండు గుములుగా నేర్పడి క్రీడింత'మనెను. అపుడు గోపకులు తాము చిఱుబద్దులై రామకృష్ణులను బెన్నుద్దులు గావించుకొనిరి. కొందఱు కృష్ణుని క్రింద నుద్దించుకొనియుండిరి. కొందఱు రామునికిఁ జిఱుద్దులుగానుండిరి. వారిలో గెలిచినవా రోడినవారిపై నెక్కికొందురు. ఓడినవారు గెలిచినవారిని మోయుదురు. ఇట్లు వారు జయాపజయముల చొప్పున నారోహకులుగాను వాహకులుగాను నగుచు నానావిధక్రీడల నాడిరి. ఈవిధముగఁ గృష్ణుఁడు మొదలైన గొల్లలు మోయువారును మోవఁబడువారునై గోవులను మేపికొనుచు మెల్లమెల్లగా భాండీరక మనెడివటవృక్షమును జేరిరి. శ్రీధాముఁడు వృషభుఁడు మొదలుగా బలరాముని చిఱుద్దు లపుడాక్రీడయందు గెలుపునొందిరిగాన వారిలో నాయా వారిని గృష్ణుఁడు మొదలగువా రోడినందున మోచికొని పోవసాగిరి. భగవంతుఁడు కృష్ణుఁ డోడినందున శ్రీధాముని మోచెను. వృషభుని భద్రసేనుఁడు మోచెను. బలరామునిఁ బ్రలంబుఁడు మోచెను. ఆమేటి దానవుఁడు ప్రలంబుఁడు కృష్ణుఁడు వ్యోమాసురుని నడంచినవృత్తాంత ముఁదలఁచుకొనియతనితో నిర్వహించుటయశక్యమనియెన్నుచు రామునిక్రింద నుద్దించుకొనక కృష్ణునిక్రిందఁ జిఱుద్దియై రాముని కోడినందున నతని మోచికొనుచు దింపవలసిన గుఱిగడచి చాల దూరము కడువేగముగాఁబోయెను. ఆబలుఁడు మేటికొండయంత బరువై యున్నందున నమ్మహాసురుఁ డతనిని మోచికొని పోవం బోవఁగా మోవలేక, వేగముగుందితన యెప్పటియసురరూపమును

దాల్చినవాఁడయ్యెను. వాఁడు, సువర్ణాభరణములను దాల్చియున్న తెల్లనిబలరామునిమోచికొనిపోవునపుడు మెఱుపుఁదీఁగలుచుట్టుఁ గిఱిగొనఁ జుక్కలతేనితోఁ గూడియున్న నల్లనిమబ్బువలె విలసిల్లుచుండెను. ఆరక్కసునిపెనుదేహము మిక్కిలియుఁ బొడువగుటచే నాకాశము నొఱయుచున్నదై యతి వేగమువలనఁ గన్నులు నిప్పుకలవలె మెఱయుచుండఁగా, నుగ్రములయినకోఱలు బొమలపట్టున నెట్టుకొన, తలవెంట్రుక లెఱ్ఱనయి జ్వలింప, కటకములయుఁ గిరీటకుండలములయుఁ గాంతిచే వింతగొలుపుచుండఁగాఁ జూచి బలరాముఁ డించుక వెఱచెను. అంత నతఁడాయసురునకును దనకును గలబలాదితారతమ్యముల మనస్సునకుఁ దెచ్చుకొని భయంబును దొలఁగఁబుచ్చి, తనతోడివారయిన గొల్లలగుంపునుబాపి బహుదూర మాపగవాఁడు గొనిపోవుచుండఁగా రోషముదీపింప, దేవేంద్రుఁడు వజ్రాయుధపుబలిమిచేతఁ బర్వతమునుగొట్టునట్టు దృఢముగఁ ముష్టిచే వానితలను బిట్టుగా నడిచెను. ఆయసుర యట్లు బిట్టుకొట్టుపడి, తోడనే తల వ్రయ్యఁగా నోరనుండి నెత్తురులు గ్రక్కుచు, సెఱుకతప్పి, హాయని పెనుగూఁతయిడుచు నుసుఱువీడి యింద్రుని యాయుధముచేతఁ గొట్టువడినకొండవలె నేలపయినిఁ ద్రెళ్లెను. బలశాలియగు బలునిచేతఁ బ్రలంబుఁడు హతుఁ డగుటనుజూచి గొల్లలు బాగుబాగని పొగడుచు మిక్కిలియు విస్మయము నొందిరి. మఱియు, వారుదీవనలు పెక్కులొసంగుచు మృతుఁడయి మరల బ్రతికి వచ్చినవానిబోలెఁ బ్రేమచే మనసులెంతయు విరవిరఁబోవఁ బ్రశంసార్హుం డగునతనిని బిగియఁ గౌఁగిలించుకొని యెంతయుఁ బ్రశంసించిరి. పాపాత్ముఁడగు ప్రలంబుఁడు హతుఁడుకాఁగా

దేవతలు మిక్కిలియు నూఱటలొంది బలునిపయిఁ బువ్వులు గురియుచు బాగుబాగని యెంతయుఁ బొగడినవారయిరి. ఇది పదునెనిమిదవయధ్యాయము.

---

## కృష్ణుఁడు దావాగ్నినిఁ బానముసేయుట.

ఒకనాఁడు గొల్ల లాటపాటలయందు మరిగియుండఁగా వారి పసులు దూరముగాఁబోయివిచ్చలవిడిఁ గ్రుమ్మరుచుగడ్డియందలి పేరాసచేత బిలముపలె నున్నయొకకసవుపొదరుల యడవిలోఁ జొరఁబడెను. అపుడు మేఁకలును బసులును మనుష్యులును నొక వనమునుండి మఱియొకవనమును జొచ్చుచుఁ దాపముచేత మిక్కిలియుదప్పిగొని యాక్రోశించుచును ముండ్లదుబ్బులుమిక్కిలి దట్టముగాను బొడవుగాను బెరిఁగియున్నయొకయడవిని, గుహావంటిదానిని, జొచ్చిరి. అంత నపుడు కృష్ణుఁడు రాముఁడు మొదలు గాఁగలగోపకులుక్రీడాసక్తులయియుండి పసులనుగానక 'అయ్యో! అవి యెటుపోయెనో! ఏమయ్యెనో!' యని కనికరము పుట్టఁగా గోవులు పోయినయడుగులజాడ నెంత వెదకియుఁ దెలియరయిరి. అంత నెంతోకష్టమున గొరిజలతోఁద్రొక్కిళ్లను, పండ్లచేఁ గొఱుకుటవలనను ద్రెస్సియున్నగడ్డిపట్లను, గోవులయడుగులను, గుఱుతుపట్టి యవి పోయినమార్గమునుగనిపెట్టి యావెంటనే పోయిరి. అట్లు పోయియుఁ దమబ్రతుకుఁదెరువయిన యాగోధనము గనఁబడక పోవఁగా నెంతయుఁ జింతాక్రాంతచిత్తులయిరి. ఆయడవియందు ముంజకసవు దట్టముగాఁబెరిఁగియున్నందున మార్గము తెలియక మఱుఁగుపడి యుండెను. కానఁ దమ గోవులు దారిఁగనలేక కూయిడుచుండఁగా, నది యున్నచోటు

తెలిసి పట్టనేరక యందఱును దెప్పరమగు దప్పిగొని యలసి సొలసి యంత వెదకుటలుమాని మరలం బడసాగిరి. కృష్ణుఁడు మాత్ర మట్లుసేయక నల్లనిమబ్బువలెఁ బఱపై కాఱుకొనుచు మిక్కిలియుఁ బొడవైయున్న యొకమ్రానిపయి నెక్కి గోవులను జూచి, యవి యార్తినొంది యఱలుచుండఁగా వానివాని పేళ్లంబిలిచెను. అట్లు భగవంతుఁడు మేఘగంభీర మగుస్వరం బునఁ బేరుపేరఁ బిలువఁగా నవి తమతమపేళ్ల శబ్దమును విని యెంతయు నుప్పొంగి మాఱుధ్వను లొసంగినవి. అపుడాయడవి నలుప్రక్కల నున్నట్టుండి దైవికముగాఁ గారుచిచ్చొకటి పుట్టి, యడవియందలి వానిని నాశముసేయసాగెను. అది వాయువు చేతఁ బయిఁబయిఁజిమ్మి రేఁగి కొఱవినిప్పుకలు నలుదిక్కులఁ బరఁ గించుచు స్థావరజంగమముల సలమికొనుచుఁ బెచ్చుపెరుఁగఁ జొచ్చెను. అట్లు నలుప్రక్కలఁ గ్రమ్మి పయిపడదు చున్నయా కారుచిచ్చును గోసమూహములను గోపకులను జూచి భయము గొని, మరణభయమునఁ గలఁగినజనులు హరినింబోలె, బల రామసహితుం డగుకృష్ణుని శరణుఁజొచ్చి 'కృష్ణా! కృష్ణా! మహావీర్యా! ఓరామా! అమితపరాక్రమా! మమ్ము దావాగ్ని దహించుచున్నదే ! నిన్ను శరణుఁజొచ్చితిమి. మమ్ముఁ గావఁ దగదే ! కృష్ణా ! మేము నిజముగా నిబంధువులము గదే. కాన మేము కీడ్పడఁదగునా? తగదుసుమీ! నీకన్నిధర్మములు తెలిసియున్నవి. నీవేదిక్కుగాను బెనుస్రాపుగాను గలిగియున్న వారమేకదా మేము! ఇట్టి మమ్మురక్షింపవలసిన ధర్మము నీకుఁ దెలియదా ?' యని మొఱయిడిరి. భగవంతుఁడు కృష్ణుఁడు తన బంధువు లాడినవాక్యము విని వారితో 'భయపడకుఁడు. ఊరక

కన్నులు మూసికొనుఁ'డని పలికెను. వారును వల్లెయని కన్నులు మూసికొనఁగానే, కృష్ణుఁడుత్కటమయినయగ్ని నిదనముఖము చేఁ యోగాధీశుఁడు గావునఁ ద్రావి వారలనెల్ల నాసంకటమునుండి విడిచిపుచ్చెను. అంత వారలు గన్నులు విప్పిచూడఁగానేమంలఁ దా మందలును భాండీరమునకు వచ్చియుండుటయుఁ గామును గోవులును గారుచిచ్చునుండి విడివడుటయును దెలిసి యెంతెయు విస్మితులయిరి. పిదప వారలాశ్చర్యశక్తిరూపం బగు కృష్ణుని యోగమాయమహిమకుఁ బాత్రులై యోగాత్మకంబగు నతని వీర్యమును దావాగ్నినుండి తమక్షేమమును గాంచి యాకృష్ణుని నొకదేవతగాఁ దలంచిరి. కృష్ణుఁడు సాయంకాలమున బలరాముని తోడఁ బసులనెల్ల గుమిగూర్చుకొని వేణువును మొరయించుచు గోపకులు 'తన్నుఁబలసి పొగడుచుండఁగా గోష్ఠమును బ్రవేశించెను. గోపికలకుఁ గృష్ణుఁడు లేకున్నయొక క్షణము యుగశతములవలెఁదోఁచుచుండుగాన వారల కాగోవిందునిఁ జూడఁగానే పరమానందము గలిగిన దయ్యె. ఇది పందొమ్మిదవ యధ్యాయము.

---

**వర్షర్తు వర్ణనము.**

ఆరామకృష్ణులు తమ్ము దావాగ్నినుండివిడిచిపుచ్చిన యద్భుత కృత్యమును బ్రలంబవధమును గొల్లబాలురు యశోదమొదలగు పడఁతులకుఁ జెప్పిరి. గోపవృద్ధులును గోపికలును నా వృత్తాంతమును విని యెంతయు నబ్బురపడుచు నెవరో మేటి దేవతలిద్దఱు రామకృష్ణులుగా మందయందుఁ బుట్టియుందురు కాఁ బోలు నని తలంచిరి. అంత సర్వప్రాణులకు నుద్భవకారణం



1820. శ్రీకృష్ణుఁడు దావాగ్నిని పానము సేయుట.

బగు వర్షాకాలమువచ్చెను. అపుడు దిక్కులయందు ధళధళమని మెఱపుఁ దీఁగలు మెఱయుచుండెను. ఆకాశతలము నందుఁ బిడుగులు పెటపెటయని యుఱుముసాగెను. దట్టమయిన నల్లని మబ్బులును మెఱపుఁదీఁగలును నుఱుములును గ్రమ్ముకొనుట వలన సూర్యచంద్రాదిజ్యోతులు దేటపడకయున్న యాకాశమునుజూడఁగా గుణత్రయమునకు వశమై ప్రకృతిచేత ధర్మభూతజ్ఞానము మఱుఁగుపడి యున్న జీవస్వరూపమువలెఁ *బ్రకాశించెను. కార్తికము మొదలు జ్యేష్ఠమువఱకు నెనిమిది నెలలు తనకిరణములచేత భూమికిఁగల జలమయంబగు ధనమును మిక్కిలియు గ్రహించికొని దానిని దనకిరణములచేతనే మరలఁ దగినకాలమురాఁగా భూమియందు విడుచుటకు వర్షాధిదేవత యగు † సూర్యుఁడు మొదలుపెట్టెను. మెఱపులతోఁ గూడిన మహామేఘములు తీవ్రమయిన వాయువుచేతఁ గంపితములై ప్రాణులకు జీవనసాధనమగు జలమును గరుణారసము

* ఆకాశమునకు శరత్కాలము వచ్చువఱకు నీలమేఘములయు మెఱుములయు ఉఱుములయు సంబంధముండునట్లు; జీవునికిఁ ముక్తికలుగువఱకు గుణములు గ్రమ్ముటయు ధర్మభూతజ్ఞానము సంకోచించి మెఱుపువలె నించుకంత ప్రసరించుటయుఁ గలుగుచున్నదని తెలియునది. ఆత్మ యాకాశము వలె నిర్మలమైనదియు, ఆకాశమునకు మేఘాదులవలె ఆత్మకు గుణాదులాగంతుకములనియు, ఆగుణాదులను వారించు మోక్షోపాయమునకై యత్నింపవలయు ననియు భావము.

† దీనివలన రాజు పర్జన్యునివలె నుచితకాలమందుఁ బ్రజలవలన ధనమును బుచ్చుకొని మరల నర్థులకిచ్చునని యు జ్ఞానముదయించువఱకుఁ గామములనుభవించుచుండి యది యుదయింపఁగానే యాకామములను ముముక్షువు దిగవిడువవలయు ననియు శిక్ష తెలియునది.

నుంబోలె *దొరఁగినవయ్యె. తపంబుచేత (వేసవిచేత) నెండి, పర్జన్యునిచేతఁ దడుపంబడినదై భూమి,సస్యాదులచేఁ బ్రవృద్ధమై యుండుటఁ జూడఁగాఁ గామ్యతపము గావించు పురుషుని దేహము తపముసలుపునపుడు కృశించియుండి కామ్యతపమువలని ఫలము ననుభవించినపుడు, పరిపుష్టిఁజెందినట్లుంబోలె †నుండెను. సాయంకాలములందు చీఁకటిగ్రమ్ముటచే మిడుఁగురుఁ బుర్వులు మాత్రమే మినమినఁ బ్రకాశించుచుండినవికాని చంద్ర గురు శుక్రాదులగు గ్రహములు ప్రకాశింప వయ్యె. ఇది కలియుగము నందుఁబాపముచేతఁ బాషండములైన యాగమములే ప్రకాశించుచును వేదములుప్రకాశింపంక యుండునట్లు ‡చూపట్టుచున్నది. కప్పలు పర్జన్యుని ధ్వనివినువఱకూరకుండియదివినఁగానేబెక బెకధ్వనులు విడిచినవి. ఇది బ్రాహ్మణులగు శిష్యులు తమ యాచార్యుని నిత్యకర్మానుష్ఠానము తీఱువఱకు నూరకుండి యానియమములుతీఱఁగానే యతనిధ్వనిని వినియధ్యయనమునకుఁదొడంగునట్లున్నది. చిన్నవియగు నేళ్లు మిక్కిలి జలపూరితములై, యింద్రియపరతంత్రుఁడగు పురుషుని దేహమును ధనసమృద్ధియును §న

* దుఃఖితులగు జనులనుజూచి మేఘునివలె నిట్టూర్పులచే నవయవములువడంక కరుణగలిగి తనజీవనమువఱకు గలసర్వస్వమును నిచ్చి యుపకరింపవలయునని శిక్ష.

† దీనిచే కామ్యంబగు తపమునకు ఫలము కేవలము దేహసుఖమేకాని యాత్మసుఖముగా దని తెలియునది.

‡ దీనిచేత వైదిక ధర్మాభాసములందు రుచి పాపహేతువని సూచితము. తపస్సుచేత మిడుఁగురుఁ బుర్వులు ప్రకాశించునట్లు పాపముచేతఁ బాషండాగమములు వెలుంగునని తెలియునది.

§ ఇంద్రియలోలుఁ డగువానిసంపదలు చంచలములును వ్యర్థములు నగునని భావము.

పాత్రమునం బోవునట్లు, పెడదారులం బ్రవహించుచుండెను. తమ దేహముల నలంకరించుకొనుటయం దాసక్తులయిన పురుషుల *దేహములు వస్త్రాభరణాదిసంపత్తిచేత, ననంగా పచ్చని వస్త్రాభరణములచేం బచ్చంగను నెఱ్ఱనివానిచే నెఱ్ఱంగను పసుపుపచ్చనివానిచేం బచ్చగను వెలయునట్లు, భూమియు నాకు పసిమిగలుకు లేంతకసవు జొంపములచేం పచ్చగను, పట్టుపురుగులు గుంపులచే నెఱ్ఱగను, పొడమిన పుట్టగొడుగుల పువ్వులచేం బసుపుగాను నందందు వెలయుచుండెను. పంటపొలములు పంటల వెంపుచే సొంపారుచు సేద్యగాండ్రకు సంతోషమును,† ఫల మదృష్టాధీనమని తెలియక యొరుల ఫలసమృద్ధికి సైంపనివారలకు ననుతాపమును గలిగించినవి. జలమునం దుండునవియు స్థలమునం దుండునవియు నన్నియుం గ్రొత్తజలమును సేవించుటచేత, హృదయకమలమం దున్న ‡ హరిని సేవించుటచేతంబోలె, సొగసయిన రూపములను దాల్చిన వయ్యెను. యోగము పరిపక్వము గాని పురుషునకుం జిత్తము కామాసక్తమగునేని యది విష

---

* మరకతాదులచేం బచ్చగను పద్మరాగాదులచే నెఱ్ఱగను బంగారు మొదలయినవానిచేం బసుపుగను నుండునని తెలియునది. దీనిచేత మూర్ఖుల సంపదలు వారి కుపకరించునవిమాత్రమె యగునుగాని పరుల కుపకరించునవిగా వని సూచితము.

† దీనిచే పరులసమృద్ధిని జూచి పురుషుఁడు సంతోషింపవలయునని సూచితము.

‡ హరిచేతంగాక తక్కినవానిచేత రూపసౌమ్యత గలుగదని సూచితము. 'వసతిహృదిసనాతనేచ తస్మిన్ భవతి పుమాన్ జగతోఽస్య సౌమ్యరూపః' అను వచన మిట నసుసంధించునది.

యములఁ గూడిక చేఁ గలంకనొందునట్లు, *సముద్రమును వాయువుచేతఁ గరళ్లు చిమ్మిరేఁగుచుండఁగా, నదులు వెల్లువలుగొని వచ్చికలియుటచేత మిక్కిలి యల్లకల్లోలపడుచుండెను. †అధోక్షజుం డగువిష్ణునియందు మనస్సునిలిపినవారు ఆధ్యాత్మికాది వ్యసనము లెంతఁ దమ్ముఁ బీడించుచున్నను వ్యథపడకుండునట్లు పర్వతములు వర్షధార లెంతబోరనఁ బయిని బిట్టుగాఁ బడుచున్నను వ్యథ నొందకుండినవి. ‡వేదములను బ్రాహ్మణులు పలుమఱు వల్లింపకుండురేని యది యొకానొక కాలమున కెంతయు డిందుపడి మఱవంబడి తోఁపకపోవునట్లు, మార్గములు వర్షమునుబట్టి జనులు రాకపోకలు మాటికిలేమిచేతఁ జక్కఁ పఱుపంబడక నానాఁట గడ్డి దట్టముగాఁ గ్రమ్ముకొనుటచే నివియని తెలియక సందేహాస్పదములై యుండెను. సౌందర్యాది గుణసంపన్నులయిన పురుషులయందుఁ గామినులకు నెయ్యము గుదురులేక చంచలముగా నుండునట్లు, జలదానముచే మిక్కిలి

---

* మనస్సు కామములందుఁదగిలి విషయభోగములచేఁ గలఁగుటకును సముద్రము వాయువుచేతఁ గరళ్లురేఁగి నదీప్రవాహములతోఁగూడి కలఁగుడుపడుటకును సామ్యము. చిత్త చాంచల్యమునకు నిమిత్తమగు కామమును దన్మూలకమయిన విషయసంగమును నివర్తింపఁజేయునది భగవత్సమాధిపరిపాకము గాన యట్టి పరిపాకమునకై ప్రయత్నింపవలయు నని సూచితము.

† భగవద్భక్తియే తాపత్రయమును బోగొట్టునది యని సూచితము.

‡ వేదములు మాటికివల్లింపఁబడుటయు మార్గము మాటికిజనుల పోఁకలచేఁ జక్కఁబడుటయు, అవి కాలక్రమమునఁజెడుటయు, ఇవి గడ్డిచేఁ గప్పఁబడుటయు, సమములు. వేదము లధ్యయనము చేసినపిదప మరలమరల వల్లించుచునే యుండవలయు నని సూచితము.

యుపకరించుటవలన లోకమునకు బంధువు లయిన మేఘముల యందు మెఱుపుఁదీఁగలు నిలుకడగలిగి *యుండ వయ్యెను. గుణత్రయపరిణామాత్మక మయిన దేహమునందు గుణత్రయము లేకుండుజీవుఁడు వెలయునట్లు, శబ్దగుణక మయినయాకాశమందు గుణము (నారి) లేకున్న యింద్రధనువు † వెలుంగుచుండెను. పామరులగువారు విషయసుఖములవలెఁ దోఁచువానిని గొంచెమేని యనుభవింపఁగోరి యెప్పుడును బను లుడుగక యలజడి గలిగించుచునే యుండుగృహములయందు వసించుచుండునట్లు, చక్రవాకములు కొలంకులయందలి జలములు వండుచేఁ గలుషితములై యున్నను నందు ‡ వసించుచుండెను. కలియుగమందుఁబాషండజనుల యసద్వాదములచేత వర్ణాశ్రమధర్మరూపము లగువేదమార్గములు భేదిల్లునట్లు, పర్జన్యుఁడు గురియుచుండఁగా జలప్రవాహములచే నవకట్టలు § తెగిపోవుచుండెను. జనపతులు పురోహితాదు లగు బ్రాహ్మణులచేతఁ బ్రేరితులై యాయాతగుకాలములందు నర్థులను వలయుకామముల నొసంగుచుండునట్లు, మేఘములు వాయువుచేతఁ బ్రేరితములై యమృతమువలె జీవనహేతువయిన జలమును ¶ బ్రాణులకెల్లఁ దొరిఁగినవయ్యె. ఇట్లు ఖర్జూరములును జంబు

---

* దీనిచే బ్రయత్నపడి కామినీసంగము మానుకొనవలయునని సూచితము.

† ఆకాశమును నింద్రధనుస్సును బోలె, దేహము నాత్మయు స్వరూపస్వభావములందుఁ బరస్పర విలక్షణములుగా నుండు నని చెప్పఁబడినది.

‡ దీనిచే గ్రామ్యజనులకుఁగల విషయభోగములు దుఃఖబహుళములును నల్పసుఖ యుక్తములు నై యుండు నని భావము.

§ దీనిచేఁ బాషండవాదములు వినరాదని సూచితము.

¶ దీనిచే రాజులిట్లు వర్తింపవలయు ననుట సూచితము.

వృక్షములును బరిపక్వములై మిక్కిలియుఁ బెంపునఁ బొదలు చున్నయావనమును జూచి కృష్ణుఁ డందుఁ వసింప బలునిఁగూడి గోగోపాలపరివృతుఁడై ప్రవేశించెను. ఆవులు మిక్కిలి బలుపు లయినపొదుఁగులబరువుచేత మందముగా నడచునవ య్యును గృష్ణుఁడు పిలువఁగా బ్రీతినిఁబట్టి చన్నులు పాలుచేఁపు చుండఁగా వేగ పరుగిడివచ్చినవి.అడవియందలి పుళిందులు మొద లగువారినిని, ఫలపుష్పసమృద్ధిచేత ముదంబునఁ బొదలుచుఁ దేనియలు దొరుఁగుచున్నవనపంక్తులనును, కొండలవలననుండి పడుచున్నజలధారలనును, వాని పెనుచప్పుళ్లను, వాని దాపున నున్నగుహలనును,గృష్ణుఁడు చూచెను.నలుగడల బోరనవర్షము గురియుచుండఁగా, భగవంతుఁడు కృష్ణుఁ డొకానొక వృక్షము క్రిందనో లేక గుహయందో చొచ్చి కందమూలాదులే యా హారముగాఁ గ్రీడించుచుండెను. మఱియు నాకృష్ణుఁడు జలముల దాపున నున్నయొకబండఱాతిపయిని దెచ్చుకొన్న పెరుఁగన్న మును బెట్టుకొని తనపొత్తునఁ గుడువఁదగిన గొల్లలతోను బలరా మునితోనుగూడి యాచల్దులుగుడిచెను, మఱియు నాభగవంతుఁ డొకపచ్చనిపచ్చికపట్టునఁగూర్చుండి, యట గన్నులుమూసికొని గడ్డిమేయుచుఁ బొతరించి యున్నయెద్దులనునుఁ గోడెదూడల నును, పెనుఁబొదుఁగులబరువున కాఁగలేక శ్రమపడుచున్న యావులనును, మఱియు సమస్తప్రాణులకును ముదంబొదవించు చుఁ దన సంకల్పశక్తిఁ బుష్కలముగాఁ బెచ్చుపెరిఁగియున్న వర్షాకాలపు సిరిపెంపునును, గాంచి దానినెంతయు బహూ కరించినవాఁ డయ్యె.

## శరదృతువర్ణనము.

రామకృష్ణులిట్లామందయందు వాసము సేయుచుండఁగా శరదృతువు వచ్చెను. అప్పుడు మబ్బులెల్ల వెలిసి యాకాశము తెల్లగానుండెను. జలములు తేటలై నీటుగులుకుచుండెను. గాడ్పు లింపయిన సోఁకుల వీచుచుండెను. యోగులకు నిర్మలములయియుండిన మనస్సులు నడుమ నొకప్పుడు యోగభ్రష్టములయ్యును మరల యోగమునను ష్ఠించుటచేఁ దమయెప్పటినిర్మలత్వము నొందునట్లు, కడచినశరదృతువునఁ దు నిర్మలములై యుండినజలములు, నడుమ వర్షాకాలపురొంపి పుట్టుటచేఁ జెడియుండియు మరల శరత్కాలము రాఁగాఁ దమయెప్పటి తేటఁదనమునుబొందినవయ్యె. శరదృతువు, ఆకాశమునకుఁగలమబ్బును *నగ్నిజలవాయువుల సంపర్కమును, భూమికిఁగల బురదను, జలములకుఁగలమురికిని, కృష్ణభక్తి నాలుగాశ్రమములవారికిఁగల యశుభముహరించునట్లు, హరించినదయ్యె. భగవన్మననశీలురయిన వారు దారాదులయిన యీషణములను విడిచి కల్మషములన్నియు

* వర్షాకాలమందు నగ్నియు జలమును వాయువును బరస్పరము గలసియుండును. శరత్తునందవి విడును. కృష్ణభక్తి బ్రహ్మచారులకు గురూపదిష్టార్థగ్రహణమునకుఁ బ్రతిబంధక మయినజ్ఞానమనెడి యశుభమును, గృహస్థునకు విషయసంగరూపమైన యశుభమును, వానప్రస్థునకు నొకానొకప్పుడశక్తిచేత తన యాశ్రమమునకుఁ దగిన ధర్మమును ననుష్ఠింపమిచేఁ గలుగు ప్రత్యవాయమనెడి యశుభమును, యతికి కృష్ణప్రాప్తి ప్రతిబంధకమై పుణ్యాపాపాత్మకమై సవాసనమై యున్న కామాదిదోషమనెడి యశుభమును, హరించుచున్నదని తెలియునది. దీనిచే నాలుగాశ్రమముల వారికినిఁ గృష్ణభక్తి యావశ్యకమని సూచితము.

వీడి శాంతులై వెలుంగునట్లు, మేఘములు, తమ సర్వస్వమగు జలమును విడిచి శుభ్రమయిన వర్చస్సునఁ *బ్రకాశించు చుండెను. జ్ఞానులు (తత్త్వత్రయ స్వరూప) జ్ఞాన మనెడి యమృతమును శుశ్రూషువులు కొండఱకిచ్చియుఁ గొండఱకియ్యకయు నుండునట్లు, పర్వతములు శివం బగుజలములను గొన్నియెడలఁ దొరఁగి కొన్నియెడలఁ దొరఁగక యుండెను. మూఢులై కుటుంబపోషణమందే యాసక్తులై యల్పాయువులగు మనుష్యులు, ప్రతిదినమును దమయాయువు క్షీణించుచుండుటను దెలియనట్లు, అల్పజలములం దిరుగుజంతువులు జలము నానాఁట దగ్గిపోవుచుండుటను †దెలియవయ్యెను. ఇంద్రియ పరతంత్రుఁడగు నొక కుటుంబి ధనధాన్యహీనుఁడగుటవలన దీనుఁడయి యాఁకటివలని తాపమును దెలియునట్లు, అల్పజలములందుఁ జరించు చేఁపలు మొదలగునవి సూర్యునివలన తాపమును బొందినవయ్యె. జ్ఞానులగువా రాత్మవ్యతిరిక్తము లయిన దేహేంద్రియాదులయం దహంకారమమకారములను విడుచునట్లు, నేలలు మెల్లమెల్లఁ బురదనును, ‡వీరుత్తు లపరిపక్వతను, విడిచినవి. హృదయకమలమున శుభాశ్రయుం డగువిష్ణునిదివ్యమంగళవిగ్రహమును మననము సేయుచుండువాఁ డన్నపానము లుడుగ

* మును లవశ్యమును ఈషణములను దిగవిడువవలయు నని సూచితము.

† దీనిఁచే గుటుంబులగువారును దేహాత్మల స్వరూపమును బరిశీలింపఁ బూని యందులకు వలయు నాయువు క్షయించుచుండుటకుఁ బరితాపము పొందవలయు నని సూచితము.

‡ జ్ఞానులహంకార మమకారముల నవశ్యము విడువవలయు నని యిట సూచితము.

కున్నను దేహము విడిపోవనున్నను దేహము వీడు పర్యంతమును నిశ్చలుండై యూరకయుండునట్లు, శరదృతువు ప్రవర్తించుచుండఁగా, సముద్రము నిశ్చలము లగు జలములనుదాల్చి యూరక యుండెను. యోగులు తమ యింద్రియముల మూలమున బాహ్యవిషయములను గ్రహించుటకై పాఱుచున్నధర్మభూత జ్ఞానమును బ్రాణరోధము చేత వెలికిఁ బోనీక లోని యాత్మస్వరూపమందు వర్తింపఁజేయునట్లు, సేద్యగాండ్రు వరిపొలములనుండి పాఱుచున్న జలములనుగట్టి యనకట్టలుగట్టి పోనీక *యాఁపుచుండిరి. దేహాభిమానముచేతఁ (బరకృత నిందాదులవలనఁ) గలుగునట్టి తాపమును (దేహస్వరూప విషయకమగు) బోధము హరించునట్లును, గొల్లచెలువల మన్మథతాపమును గృష్ణుఁడు హరించునట్లును, శరత్కాల సూర్యకిరణములవలనఁ బ్రాణులకుఁ గలుగు తాపమును జంద్రుఁడు పరిహరించినవాఁడయ్యె. చిత్తము సత్త్వగుణయుక్తమై శబ్దబ్రహ్మమగు వేదమందలి యతీంద్రియములయిన యర్థములనెల్లఁ గనుఁగొనునట్లు, ఆకాశము మబ్బులు లేనిదై శరత్కాలమునందు నిర్మలములయిన తారకలచే † శోభిలుచుండెను. భూతలమున యదుపతి

---

* హేయమగుటను దెలియుకొఱకు దేహస్వరూపమును దప్పక పరిశీలింపవలయు నని సూచితము.

† ఇట చిత్తమునకును ఆకాశమునకును, క్రమ్మెడి మేఘములకును రజస్తమస్సులకును, వేదార్థములు చక్కఁగాఁ దెలియుటకును తారకములు నిర్మలముగా వెలుఁగుటకును సాదృశ్యము. వేదార్థములనఁగా పరమాత్మునియు తదారాధనములయుఁ దదారాధకాదులయు స్వరూపములని తెలియునది. సత్త్వప్రచురమగు నాహారశుద్ధి గలిగియుండవలయు నని సూచితము.

యగు కృష్ణుఁడు వృష్ణిచక్రముచేఁ బరివృతుఁడై వెలుంగునట్లు ఆకాశమునఁ జంద్రుఁడు పరిపూర్ణ మగు మండలముతో నక్షత్ర గణములుచుట్టును వెలుంగఁ బ్రకాశించుచుండెను. జనులు వేఁడి యునుజలువయు మితముగాఁగలిగినదై మేలయినపువ్వులుగలవన మునుండి వీచుచున్న గాలిని మెయినిండననుభవించుచు, వేసవివల నఁగాని చలివలనఁగాని గలిగినదుఃఖమును విడిచిరి. * గోపికలు మాత్రము కృష్ణుఁడు తమచిత్తములను జూఱగొని యుండుట వలన మన్మథతాపమును విడువరయి. శరత్కాలమువచ్చినపుడు గోవులును మృగములును బక్షులును స్త్రీలును దమతమప్రియు లనుగమింపఁగా, ఈశ్వరారాధనరూపములగు క్రియలు తమ తమఫలములగుధర్మాదిపురుషార్థము లనుసరింపఁగా సమస్తభోగ గర్భము లగునట్లు, †గర్భిణులయి యొప్పిరి. రాజునకు దొంగలు తప్పఁ దక్కినజనులందఱును నిర్భయులై హర్షించునట్లు, సూర్యు నకుఁ గలువలుతప్పఁ దామరలెల్ల నెంతయు వికసిల్లుచుండెను. భూమి, పురములందును, గ్రామములందును, ‡ నాగ్రయణ యజ్ఞములచేతను నింద్రియ ప్రీత్యర్థము లయినతక్కిన మహో త్సవములచేతను బ్రకాశించెను ; మఱి హారికళ లయినరామ కృష్ణులచేత మీఁదు మిక్కిలిగాఁ బ్రకాశించెను. తపస్సిద్ధులగు వారు ఫలకాలమువచ్చినపు డీలోకమునుండి వెడలిపోయి తమ

* దీనిచేత కృష్ణుని యౌవనావస్థయు గోపికలచిత్తముల నాకర్షించుట యు సూచితములు.

† ఈశ్వరారాధనక్రియలకు ఫలమెప్పుడును వీడకుండు నని సూచితము.

‡ ఆగ్రయణములనఁగా క్రొత్తవస్తు మొదలగువానిని భక్షించుకొఱకుఁ జేయు నొకవిధ మయినయాగము.

తమ తపస్సువలని ఫలములగు భోగ్యసమూహములను బొందు నట్లు, *వణిజులును, మునులును, రాజులును, దీర్ఘయాత్రాపరులును వర్షముచే నడ్డుపడియుండి, శరత్తునందు వెలువడిపోయి తమతమ ప్రయోజనములను బడసినవారయిరి. ఇది యిరువది యవ యధ్యాయము.

---

గోపికలు శ్రీకృష్ణుని వేణుగానమును వర్ణించుట.

ఇట్లు వనమునందెల్ల శరత్కాలమునఁ దేటనీళ్లు సీటుగులుగుచుండెను. తామరకొలంకుల గుమగుమ తావులతోఁగూడి గాడుపు చల్లఁగా నంతట వీచుచుండెను. అపుడు కృష్ణుఁడు గోపాలురనుగూడి యావనమందుఁ బ్రవేశించెను. మఱియు నందుఁ బూచియున్న వనపంక్తులయందుఁ బూఁదేనియలు గ్రోలిమత్తిల్లియున్న తుమ్మెదలకదుపులు జుంజుమ్మనిపాటలుపాడఁగా, పండ్లు దిని కెంపిలి పులుఁగులు కొలకొలమని యెలుఁగులు సేయఁగా, నందలి కొలఁకులును నేఖలును గొండలును మిక్కిలియు శబ్దించుచుండెను. అట్టిసమయమునఁ గృష్ణుఁడు, గొల్లలను బలరామునినిగూడి యావనమును జొచ్చియందుఁ గోవులనుమేపుచు వేణువు నింపుగా నూఁదెను. మరులు మొలపించు చున్నయా పిల్లంగ్రోవిరవళిని విని యాగొల్లచెలువలు కొందఱు కృష్ణునికిఁ బరోక్షమున నాగీతమును దమ చెలిమికత్తియలతో వర్ణింపఁదొడఁగిరి. వారాకృష్ణుఁడు వేణువు నూఁదు చెయ్వును వర్ణింపఁ

---

* వణిజులు తమవర్తకమును, మునులు విచ్చలవిడి సంచరించుటయు, రాజులు పగవారిని జయించుటయు, స్నాతులు తీర్థమునందుఁ గ్రుంకుటయును బొందిరని యాశయము. తపమునకు ఫలము తప్పదని భావము.

దొడంగిరికాని, యాకృష్ణునిని నతనిచేష్టితమును మనస్సునఁ దలంచుకొనఁగానే మరుఁ డురవడింపఁగా, చిత్తములు దిటసెడి కలఁత పడెను; కావున నట్లు వర్ణించుట కెంతమాత్రము చాలర యిరి. నెమిలిపురి తలయందుఁ జెరివి, చెవుల సందులయందుఁ గొండ గోఁగుపూవులఁ దాలిచి, బంగరుపసిమిని రంగారువలు వను మొలనుగట్టి, వైజయంతి యనుపూమాలికను గయిసేసి, పిల్లంగ్రోవి రంధ్రములను నధరామృతమునం బూరించుచు, గొల్లసమూహములు తనకీర్తిపయి గీతములు పాడుచుండ, తన యడుగు లిడుటచే బెడఁగారుచున్న బృందారణ్యమును నాకృష్ణుఁ డొకానొక మేటినటునివలె నెమ్మెను దిలకించుచుండఁగాఁ బ్రవే శించెను. ఆకృష్ణుని యీవేషమును, ఆపిల్లఁగ్రోవి నూఁదు మిటారిచెయ్వులను. ఆగొల్ల యొయ్యారులు తలంచుకొని యే మరులు పెల్లుగా మల్లడిగొన వర్ణింపఁజాలరయిరి. ఇట్లు వ్రజ కాంతలందఱును సర్వభూతమనోహరం బయిన వేణురవమును విని దాని నెంతయు వర్ణించుచును గ్రీడించిరి.

గోపికలు——'చెలులారా! కన్నులుగలందులకు ఫలమిదియె ! మఱియొకటిలేదు. అదేమందురా! తమయీడు బాలురనుగూడి పసులను వనమునకుఁదోలుకొని పోవుచున్న యీమనరాజుచిన్నా రికొడుకుల రామకృష్ణుల నెమ్మొగమును, పిల్లంగ్రోవి కనువుగా మెలంగుచు చూడంజూడ గన్నులపండువై నెయ్యమెులు కునట్టి నిద్దంపుఁ గడఁగంటిచూడ్కులు నిగిడించుచున్న యీ కుఱ్ఱలముద్దు నెమ్మొగమును, గన్నులారఁ ద్రావుట కన్న మఱి వేఱేమున్నదే ! చూడరే ! మావిచిగుళ్ళు, నెమిలిపురులు పూవుంగుత్తులు కలువలుతామరలు మొదలగువాని పూదండలు

వ్రేలాడుచుండఁగా వానికి నడుమనడుమఁ గొంతపచ్చని తెల్లని వలువలు కనుపట్టుచు వేషమున కొకవింత చెలువుగూర్ప, నీయిరువురును గొల్లల గోష్ఠినడుమ, రంగమునందు మేటినటుల వలె గానముసేయుచు, నీడుం జోడులేక ముద్దులు మూటలు గట్టుచున్నారు. గోపికలారా! ఈవేణు వేమిభాగ్యము చేసినదో కదే! గోపికలకుఁగూడ దొరకరాని కృష్ణుని కెమ్మోవి యమృతము దీనికిఁ జిబ్బనఁజూఱగదే. అందఱకునుభోగ్యమయినయీయధరసుధను దానొక్కండే జుఱ్ఱుచున్నదే. అది త్రావఁగా మిఁగిలిన యీయధరామృతరసమును, భగవద్భక్తు లారగించిన శేషమును భుజించి యార్యులు దేహము పులకరింప నానందాశ్రువులు విడుచునట్లు, నదులు త్రావి విరిసిన తామరలనెపమున గగురుపొడుచుచు, వృక్షములపూఁదేనియలమిషమున నానందాశ్రువు లొలుకుచునున్నవి, చూడుఁడు. సఖీ! ఈబృందావనమును జూడవే! దేవకీముద్దులపట్టిపదారవిందములచె నెంతయుఁజక్కందనను పెంపుసొంపారుచున్నదై యిది తానున్న నేలకు సాటి లేని కీర్తిని గలుగఁజేయుచున్నది చూడు! గోవిందుఁడు వేణువు మెల్లగా నూఁదుచుండఁగా నతనిని నల్లని మెఱుముచున్న యొక నల్లనిమబ్బుగాఁదలంచి మత్తిల్లియున్న నెమిళ్ళుపురివిచ్చి నృత్యము సేయుచున్నవి. కొండచఱియలం దున్నతక్కిన సమస్తజంతువులును నాకృష్ణుని వేణుగీతమును, ఆనెమిళ్ల నృత్యమును, జూచి తమతమవ్యాపారము లుడిగి మాఁ్రనుపడియున్నవిచూడుము. ఈయాఁడు జింకలో, యిదియంద మది వికారమని యొక్కటియు నెఱుఁగవు; మూఢబుద్ధులు, మఱితిర్యక్కులుగదే. ఇట్టివి సైత మక్కరో! యేమిచోద్యమోం! నెమిలిపింఛియములు మొద

లగువానిచే యింపైనవేషమున వెలుంగుచున్నయీనందకుమా రుని వేణురణితమును జెవులార విని నెయ్యంపుఁ జూడ్కులచే సత నికిఁ బూజలుగావించుచున్నవే! ఇవి తిర్యక్కులయ్యు నెంత ధన్యములే! తాము మాత్రమా! తమ పతులగు మగజింక లతోఁ గూడియే యట్లు పూజించుచున్నవిగదే! మనపతులో మంచిమనుష్యులే; కాని యల్పులుగదే. కాకేమి! వారిమోఁల మనమట్లు చూడ్కులు నిగిడింతుమేని మగజింకలవలె వారుసై తురా? సైఁపరుగదే. గోపికలారా! అటుపైనిచూడుఁడు. చెలు వలకుఁ గన్నులపండువై యొప్పులుగులుకు నడవడి గలయీ చిన్నారి కృష్ణునిఁ జూచియు, ఇతఁడువాయించుచున్నపిల్లంగ్రోవి రవళిని నేఱుగ నాలకించియు, దేవతాస్త్రీలదిగో విమానములం బోవుచున్న తమపతులతోడలసయి నున్నవారయ్యు, మరుని యేపున ధైర్యములుదూలి కొప్పులనుండి పువ్వులురాల పోఁకముళ్ళుప్రిదుల, నట్టె చొక్కిసోలుచున్నారు చూడు. ఆదే వస్త్రీలఁటుండ నీ. ఈగోవులను జూడు. కృష్ణుని ముఖమునుండి వెలువడుచున్న వేణుగీతామృతమును క్రిందఁ బడకుండునట్లు కర్ణపుటములు పయికినిక్కించి గ్రోలుచున్నవి.దూడలును దల్లు లపాలుగుడువఁదొడంగియు గీతమువినఁగానేయాయమృతమునే చెవులనిక్కించి త్రావుచు తల్లులు చేఁపుచున్న చన్నులను నోర నూరక యిడికొని కుడుచుట మఱచియున్నవి. ఇందులకు హేతు వేమో తెలియునా? ఆవులను దూడలును, కృష్ణునిరూపును చూపులమార్గమున మనస్సునందునిలిపి యాలింగనముచేయుచు నందునవలననే యశ్రువులించించుక కన్నులనుండితొరఁగుచుండఁ గా, నిలుచుచున్నవి. చూడు. ఓయమ్మా! ఈవింతచూచితివటే!

ఈవనమందుఁ బక్షులు మునులే కాఁదగునుజుమీ! ఏలందువా! ఈపిట్టలు మేలయినచిగుళ్లు గలచెట్లకొమ్మలపయి నెక్కి తాము దినుపండ్లు మొదలగువానిని మెసవక కృష్ణునియందే చూడ్కులు నిలిపి యతఁడు వాయించుచున్న వేణురవళిని నింతింతనరాని చొక్కునఁ గన్నులుమూసికొని వేఱుపలుకులు పలుకక విను చున్నవి చూడవే. కాన యివి *మునులే కావా! ఈ చేతన ముల ముచ్చట యటుండనీ; అచేతనములసుద్దులు చూడు! నదులునైతముముకుందునివేణుగీత మాలించి చేతనములవలెనే మరుని యురవడిచేతఁ దమఃయుదటు లుడిగెనని తెలుపునట్లుగా సుళ్లుగొని వేగములు సడలినవై తమ యలలనెడిచేతులచేఁ దామ రలను గానుకలుగా నెత్తికొని కృష్ణుని పాదయుగళమును గౌఁగిలిచే మఱుఁగుపడునట్లుగాఁ దాల్చుచున్నవి చూడు. ఇదిగో నీమేఘమువంకఁ జూడుము. మేఘుఁడు యమునాతటమున రామునితోడను గొల్లపిల్లవాండ్రతోడను గూడి మందపసులను మేపుచు గోవులపిఱుంద, వేణువును విన్నాణము మొరయించు చున్నకృష్ణునిఁ జూచి తానెంతయుఁ బొడసూపి మిక్కిలిప్రేమచేఁ బెచ్చుపెరిఁగి తన†చెలికాఁడగునతనికి మీఁదుగాఁ బువ్వుల సోనకు నెనయగు సన్ననితుంపురులతో దనమేనును గొడుగుగాఁ బఱచినాఁడు చూడుము.మఱియీబోయపడఁతులను జూడుము.

---

* మునులు వేదవృక్షశాఖలనెక్కి కృష్ణదర్శనము కలుగునట్లుగా వేదోక్త కామ్యకర్మఫలములను దిగవిడిచి భగవంతునియందే దృష్టినిలిపి సుఖంబునొంది యతనిమహిమనే వినుచుందురు. కాన నిట పక్షులకు మునిసామ్యము.

† కృష్ణుఁడు మేఘునివలె లోకార్తిహారత్వము నీలవర్ణత్వము మొదలగు సామ్యములు గలిగియుండుటచేత మేఘుని చెలికాఁడని వ్యపదేశము.

కృష్ణుని ప్రియకాంత యగులక్ష్మీదేవి వక్షస్థలమునందు సొబగు గూర్చుచున్న కుంకుమము కేళీప్రసంగమున నతనిపదారవిందములయందుఁ దగిలి, యాపదముల మెఱుపుచే మఱింత జిగిమెఱయుచున్నది. అట్టికుంకుమ యాతఁడు వనమున సంచరించునపుడు తృణములయం దంటుకొన్నది. దానిని జూడఁగానే యా పడఁతులకు మరులు చెలరేఁగఁగా దానినెత్తి బిత్తరిమొగములయందును జన్నుంగవలయందును బూసికొని మన్మథవ్యథను దిగవిడిచినవారయిరి. వీరెంతకృతార్థులో చూచితివా? ఓయబలలారా! ఈపర్వతము హరిదాసులయందు మేలుబంతి చుఁడీ! ఔరా! రామకృష్ణులచరణస్పర్శముచేత నిది యెంతగగురుపొడమి యామోదించుచున్నదో చూడుము. మఱి యీ గోవర్ధనాద్రి, గోవులతోను గోపగణములతోనుగూడియున్న యీ రామకృష్ణులకుఁ బానీయములచేతను మేలయిన యవస(తృణ)ములచేతను, కందరములయందలి కందమూలములచేతనుఁ దగురీతి ననతిథిపూజను గావించుచున్నది చూడుము. సఖులారా! ఈయతిచిత్రములఁ జూడరే! ఆవులకాలిబందపుఁద్రాళ్లను దలనుజుట్టికొని, మెడపలుపులను మూఁపులందు వైచుకొని, గొల్లచిన్నెలచ్చుపడుచుండ, రామకృష్ణు లొక్కొక్క వనమునందు గోవులను మేపికొనుచును నవ్యక్తమధురములగుశబ్దములఁ బిల్లఁగ్రోవులను గట్టిగా మొరయించుచుండఁగా నారవములకుఁ బ్రాణులయందు జంగమములు కదలక మెదలక మూర్ఛనుపడియున్నవి; స్థావరములుపులకించి యున్నవి. జంగమములు స్థావరములుగను స్థావరములు జంగమములుగను నయినయీవిచిత్ర మేమి!' యనిరి. గోపిక లిట్లు బృందావనమునఁ గృష్ణుఁడు గ్రుమ్మరుచుఁ గావిం

చినయీచిన్నెలును మఱియుఁ దక్కిన క్రీడలును నొకరితో నొకరు ముచ్చటలాడికొనుచుఁ దన్మయత్వము నొంది యుండిరి.
ఇది యిరువదియొకండవయధ్యాయము.

---

గోపీవస్త్రాపహరణము.

శుకుఁడు — హేమంతమువచ్చినది. అందుఁబ్రథమమాసమగు మార్గశీర్షమున నందునిమందయందుఁ గల యెలపరువంపు బాలికలందఱును హవిష్యము గుడుచుచు (నాహారనియతితోఁ) గాత్యాయనీదేవి నర్చించువ్రతము నాచరించిరి. వారు ప్రొద్దు పొడువఁగానే కాళిందీనదిజలములో జలకములాడి, దానితీరము నం దిసుకతో నాదేవిప్రతిమను గావించి నెలకొలిపి, గమగమ తావుల గుబాళించుచున్నగంధములను బుష్పములను ధూపదీపములను మఱియుఁ దక్కినపలుదెఱంగులబలులను నైవేద్యములను జిగుళ్లను బండ్లను దండులములను నర్పించి యర్చించిరి. ఆ దేవినిఁ జూచి 'కాత్యాయనీ! మహామాయీ! మహాయోగినీ! అధీశ్వరీ! దేవీ! నందగోపకుమారుని నాకుఁ బతిసేయఁగదే. దేవీ! నీకు మ్రొక్కెదను' అని యొక్కొక్కతియు మంత్రము జపించుచు నాకుమారికలా దేవికిఁబూజఁగావించిరి. ఇట్లాబాలలు కృష్ణునియందే మనసులిడి యెడతెగక యొకమాసము వ్రతము సలుపుచు నందకుమారుఁడు పతి యగుఁగాకయని భద్రకాళిని మిక్కిలి యర్చించిరి. మాసమీరీతిని వ్రతముసలిపియంతనొకనాఁడాపూవుంబోఁడులు వెందలకడ పేళ్లుపెట్టి పిలిచి యొకరినొకరు మేలుకొలుపుకొని యొకరిచేతులొకరుపట్టుకొని కాళిందియందు జలకమాడఁబూని కృష్ణుని నెలుఁగెత్తిపాడుచుఁ బోయిరి. ఇట్లొక

నాఁ డానదికిఁబోయి మునుపటివలె దానిగట్టునఁ బుట్టములను విడిచిపెట్టి కృష్ణునిఁబాడుచు ముదమున జలములందు విహరించుచుండిరి. అది యెఱింగి యోగేశ్వరేశ్వరుం డగుభగవంతుఁడు కృష్ణుఁడు వారలవ్రతము సిద్ధించుకొఱకుఁ దనయీడు గొల్లబాలురతోఁ గూడికొని యక్కడకుఁబోయెను. అట్లుచని వారక్కడఁబెట్టియున్నవలువలనెత్తికొనియాగట్టునందున్నకడపచెట్టుపయి వేగమె యెక్కి బాలురును దానును బకపకనవ్వుచు నాపువ్వుంబోండ్లతోడఁ బరియాచకముగా 'అబలలారా ! ఇచ్చటికి వచ్చి నిచ్చలు మీమీవలువలను బుచ్చుకొనవచ్చును. నేనిట్లు చెప్పునది సత్యము. పరిహాసముగాదు. మీరింతకే వ్రతమునలిపిచిక్కియున్నారు. కాన యిపుడు వేడుకలాడి మఱియు స్రుక్కింతునా! నేనో యింతవఱకబద్ధమాడినదిలేదు. ఇది వీరంటియును నెఱుఁగుదురు. వీరి నడిగి చూడుఁడు. సుమధ్యమలారా ! కాన నామాటనిక్కమని నమ్మి మీరొక్కొక్కరుగానో గుంపుగాఁగూడియో,వచ్చిపుచ్చుకొనుఁడు'అనెను. అతఁ డట్లు పరియాచకపుమాటలఁజూచి గోపికలు మక్కువలు మిక్కిలియుఁ బిక్కటిల్ల, ఒకరినొకరుచూచి సిగ్గులగ్గలింప, నవ్వులు నివ్వటిల్ల,నూరకుండిరిగాని వెడలి రారయిరి. గోవిందుఁ డిట్లుపలుకుచుండఁగా నాతనివేడుకపలుకు మనసుల నువ్వెత్తుగా హరింపఁగాఁ, గుత్తుకలవఱకుఁ జల్లని నీటియందు మునిఁగియున్నందునఁ జలికి వడవడవడంకుచు గోపికలోపికలేక యాకృష్ణునితో 'ఓయీ ! ఇట్లాఱడిఁబుచ్చకుము. ఇది పాడిగాదు. నీవు మా నందమహారాజుకొడుకవని యెఱుంగుదుము. కనుక నిన్నాజ్ఞసేయ మాతరమా ! మఱి యాతనికి గారాబుఁబట్టివనియు మాకుఁ దెలియును. కనుక



1839. గోపీవస్త్రాపహరణము.

నీవేమి చేసినను రా జడుగఁడు. మఱియు నంతలంతలు పనులుచేసి పల్లెయందెల్ల నెంతో పొగడ్తకెక్కియున్న వాఁడవు. ఇప్పటి పని యొక వింతయా! చలికి వడవడ వడంకుచున్నారము. నీనికైన దయసేసి మావలువలు మాకిమ్ము. నల్లనిసామీ! సొగసుకాఁడా! నీ చక్కందనమునకే నీదాసుల మయితిమే! నీవు మఱి యేది చెప్పినను జేయనే చేయనున్నారముగదే. ఇంతలో నాతురమా! నీకుఁదెలియని ధర్మమేమున్నది? దిస్సమొలనున్న యాఁడువారిని జూచుట ధర్మమా! ఆఁడువారికి స్వభావమె సిగ్గని తెలియవా? కాన వలువలిమ్ము, ఈయక పోయితివా, రాజునకుఁ జెప్పుదుము చుమీ'! యనిరి. అందులకుఁ గృష్ణుఁడు 'ఆబింకము లట్లుండ నిండు. మీరు నాకు దాసికలగుదురేని నేనుజెప్పునది యెద్దియైనను జేయుఁడు. తనకుఁదోఁచినది చేయునదియాదాసి! కాన యూరక వెలిచిఱునవ్వులు నవ్వుచుండుటవలనఁ బసలేదు. ఇట వెడలివచ్చి మీమీపుట్టములను బుచ్చుకొనుఁడు' అనెను. అంతనా బాలికలు చలికిఁ దాళలేక వడఁకుచుండుటవలనఁ జేయునది లేక యాజలాశయమునుండి యందఱును జేతులచే గుహ్యములను మూసికొని యామడుఁగునుండి తీరమునకు వెలువడిరి. భగవంతుఁడు కృష్ణుఁడు బాల్యయౌవనమునకు నడిమి వయస్సుగలిగి యీపదఁతులయోనులై యున్న యాకుమారికలనుజూచితాను జెప్పినట్లుచేసినందున, వారినిష్కపటభావమునకుఁబ్రసన్నుఁడై పుట్టముల నాచెట్టుకొమ్మపయినిబెట్టి ప్రీతుఁడై చిఱునవ్వు దళుకొత్త వారితో 'మీరలు వ్రతము పూనినవారై యుండియు, వలువలనువిడిచి జలములలోఁ గ్రుంకులిడితిరిగా! ఇది దేవికి నపరాధమేచుఁడీ! ఈపాపమును దొలఁచుటకై యాదలల యందుఁ

జేమోడ్పుల గీలించి మ్రొక్కి మీమీవలువలను బుచ్చుకొ నుఁడు' అనెను. ఇట్లమ్మహాత్ముఁడు చెప్పినదివిని యది ధర్మయుక్త ముగానుండుటనెంచి యామించుఁబోడు లొక్కచేత గుహ్యా ములను మూసికొని యొక్కకేల నమస్కరించిరి. వారినిజూచి భగవంతుఁడు మరల ధర్మయుక్తం బగునీమాట చెప్పువాఁడై 'ఒక్కచేత నెవ్వఁడు దేవుం డచ్యుతునకు మ్రొక్కుచున్నాఁడో వానికాచేతిని దుండించుటయె దండమని వేదవిదులు తెలియు దురు. కాఁబట్టి మనుష్యుఁడు తనస్వామికి రెండుచేతులతోను మ్రొక్కవలయును. అట్లె మీరును జేయుఁడు. అది నాకు మిక్కిలియుఁ బ్రియమగును' అనెను. అచ్యుతుఁ డట్లు చెప్పినది విని యాగొల్లముద్దియలు వస్త్రముల విడిచి జలకమాడుట వ్రత భంగమని తలంచి యది పూర్తినొందఁ గోరిరి. కాన వారాకృ ష్ణుఁడు దానికినిఁ దక్కినసమస్తకర్మములకును సాక్షాత్కర్త యగుటయేకాక కర్మములను విగుణములు గావించుపాపమును బోఁగొట్టునట్టి వాఁడగుటంజేసి వ్రతభంగపాతము దీఱుటకై రెండుచేతులతోను మ్రొక్కిరి. దేవకిపట్టి యాభగవంతుఁడు వా రట్లు మ్రొక్కి చక్కని నెమ్మొగంబుల సిగ్గునవాంచి యుండుటను గాంచి కరుణమించ నెంతయుసంతోషంబున వారలకు వలువలు మరల నొసంగినవాఁడయ్యె. ఇట్లు కృష్ణుం డాముద్దియలను 'దిస్స మొలతో మునుంగుదురా'యని కసరెను. 'పయికి రెండుచేతులు జోడింపుఁడని' సిగ్గులు విడిపించెను. తట్టించి పొగడెను. మఱికీలు బొమ్మలవలె వలచినట్లెల్ల నాడించెను. వలువల నపహరించెను. ఇట్లింతలు చేసినను నాచెలువలకుఁ గృష్ణుఁడు నిరతిశయ ప్రియుం డగుటవలన నతనితోడిపొత్తునఁ జిత్తంబులు మఱచి సుఖంబున

నోలలాడుచుండుటవలన వారి కాదుడుకులెల్లఁదప్పులుగాఁదోఁప వయ్యె. అంత నాచెలువలు తమవలువలను గట్టికొని తమకెంత యుఁ బ్రియుండగు నావన్నెకానితోడి కలయికల కువ్విళ్లూరుచు, చిత్తంబులు తదాయత్తంబులుకాఁగా, సిగ్గు గడలుకొనువా లుం జూడ్కు లావెన్నునియందు నిగిడించుచు,అటనుండి కదలి పోవనేరక నిలుచుండిరి. భగవంతుఁడు వారలు దనపదారవింద ముల కడనుండి తనతోడ నిచ్చలు క్రీడించుటకై సంకల్పించి యట్లు వ్రతములుదాల్చినవారని యెఱింగి యాయబలలనుజూచి "సాధ్వీమణులారా! మీరు న న్నర్చించినందులకు మీసంకల్పమే మో నాకుఁదెలిసియె యున్నది.సతులారా! మీసంకల్పమును నే నను మోదించితిని గాన యది యట్లెతప్పక యొడఁగూడఁగలదు. నాయందు మనస్సు మిక్కిలి నిలిపినవారికామము వట్టి కామ మునకే(విషయభోగమునకే)కాదు;అదిముక్తికిని జాలినదగును. విత్తనములను మంగలమున వేఁచినఁ బక్వముగాకున్నను నవి మరల మొలకొత్తనేరవుగదా. కనుక నాయందలి మనస్సునుం చినవారికిఁ గర్మములెల్లఁ గ్రాఁగుటచే మరలఁ బుట్టుకగలుగవు. బాలికలారా! మీకోర్కులీడేఱినవే చుఁడి. కానఁబల్లెకుఁబొండు. ఈరాఁబోవు శారదరాత్రులందునాతోడ నిచ్చలురమింపఁగలరు. సతులారా ! అందులకేకదా మీరీవ్రతము సలిపి కాత్యాయని నర్చించితిరి. అట్లె యది యొనఁగూడెడిని జూడీ!' యనెను. ఇట్లు భగవంతుఁడు చెప్పఁగాఁ గుమారికలు తమకోర్కులంబడసి యాపాబగునియడుగుఁదమ్ముల నేధ్యానించుచునెంతోకష్టమునఁ దరలి పల్లెకుఁబోయిరి. అంత నొకనాఁడు దేవకిపట్టి కృష్ణుఁడు గొల్లబాలురు బలసి కొలువఁగా బలరాముఁడును దానును గో

వులను దోలుకొని బృందావనమునుండి దూరమునకుఁబోయిరి. అప్పుడు మంచివేసవికాలము. సూర్యుఁడు మిటమిటవేండ్రముగా నెండకాయుచుండెను. అప్పుడు వృక్షములు కొన్ని తమ చల్లని నీడలచే నాయెండ దగులనీక గొడుగులవలెఁ బెడఁగుచూపఁగాఁ జూచి కృష్ణుఁడు గొల్లలతో 'ఓస్తోకకృష్ణా! అంశూ! శ్రీరామా! సుబలా! అర్జునా! విశాలా! వృషభా ! తేజస్వీ ! దేవశ్రేష్ఠా! వరూథపా ! చూచితిరా యీచెట్లను. ఇవి మహాభాగ్యవంతములుచుఁడీ. పరులకొఱకే తమబ్రతుకులనెల్ల నుపయోగించుచున్నవి. మఱి గాలి యెండ వాన మంచులకుఁ దాముసైచిదానిని మనకుఁ గలుగనీక వారించుచున్నవి. ఇవికదా ధన్యములు. ఔరా! సమస్తప్రాణులనుపజీవించునట్టివీనిపుట్టుకగదాపుట్టుక. అర్థిజనులు వీనికడకువచ్చిరేని సుజనులకడకుఁ బోయినట్లు, ఫలములొంది యుండుచుందురేకాని విఫలులై వెడమరలి పోవరు చుఁడీ. ఇవి, తమ యాకులు, పువ్వులుపండ్లు; నీడలు, వేళ్లు, పట్టలు, కొమ్మలు, గంధములు, ఊటద్రవములు, బూడిదలు, బొగ్గులు, మొలకలు, మొదలగువానిచేతఁ గోర్కులనొడఁగూర్చుచున్నవి. ఇహమందు దేహధారులయెడఁ దమప్రాణములచేతను ధనములచేతను మనస్సుచేతను, వాక్కుచేతను నెప్పుడునుమేలు సేయుచుండవలయు. ఇహమందు జన్మసాఫల్య మిదియె; ఇంత మాత్రమేచుఁడీ; లేనిచోవారిజన్మము జన్మమా' అనెను. ఇట్లు చెప్పి యంతఁగృష్ణుఁడు చిగుళ్లు గుత్తులు పండ్లు పువ్వు లాకులు మొదలగువాని జొంపములచే నెంతయుఁగొమ్మ లింపుసొంపొందుచున్న చెట్లగుంపుల నడుమంబడి యమునానదికిఁ బోయెను. అట్లు యమున సేరి యందుఁ దీయనై చల్లనయ్యుఁ దేటలుగులుకు

చున్న మంచిజలమును దూడలను ద్రావించి, యంతఁ దామును దనివితీఱఁ ద్రావి పిదప నాగొల్ల లాకాళిందీతీరమందలి వనమున విచ్చలవిడిని గోవులను మేపుచుండిరి. అపుడు వారి నాఁకలి మిక్కిలి పీడింపఁగా రామకృష్ణులను జేరఁ్గాని యిట్లనిరి. ఇది యిరువదిరెండవయధ్యాయము.

---

## బ్రాహ్మణపత్నుల ననుగ్రహించుట.

గోపకులు—‘రామా! రామా! మహావీర్యా! కృష్ణా! దుష్టనిబర్హణా! మమ్మీయాఁకలి మిక్కిలియు బాధించుచున్నది. దీని కోకశాంతి గావింపవలయును’ అని వేఁడిరి. వారట్లు విన్న వింపఁగా జగదీశ్వరుఁ డాభగవంతుఁడు తనభక్తురాం డ్రయిన విప్రభార్యల ననుగ్రహించువాఁడై యది తఱిగాఁగొనివారలతో ‘అదిగో బ్రహ్మవాదు లగుబ్రాహ్మణులు కొందఱు స్వర్గమునుబడ యఁగోరి దేవతలనుగూర్చి యాంగిరసమనెడు సత్రయాగమును యజించుచున్నారు. మీరు వారికడకుఁ బొండు. గొల్లలారా! మీ రక్కడికి మాపంపునఁబోయి వారితో నాపేరును మా యన్నగారిపేరును జెప్పుచు నన్నమడుగుఁడు’ అనెను. భగవంతుఁ డట్లానతీయఁగా వారుపోయి చేతులుమోడ్చికొని బ్రాహ్మణులకు దండమువలె నేలపయిఁ జాఁగిలఁబడి మ్రొక్కి యన్నమును వేఁడువారై ‘ఓభూదేవులారా! వినుఁడు. మేము కృష్ణుని పంపు సేయు గొల్లలము. కృష్ణుఁడును రాముఁడును బంపఁగా నిటవచ్చి తిమని తెలియుఁడు. మీకుభద్రంబగుఁగాత. ఇటకు సమీపమున రామకృష్ణులు గోవులను మేపుచున్నవారు. వారాఁకలిగొని మీవలన నన్నము నభిలషించుచున్నారు. బ్రాహ్మణులారా!

మీకువారియందు శ్రద్ధగలదేని యర్థులగు నాయిరువురకు నన్నము నొసంగుడు. మీరు ధర్మవిములందెల్ల మిన్నలుగదే! దీక్షితులమగు మాయన్నము భోజ్యము గాదనకుడు. దీక్షాపూర్వకమగు నగ్నిషోమీయమునఁ బశువధమునకు మీఁదను సౌత్రామణియందుఁ బిదపను దీక్షితుఁడయిన యజమానుని యన్నము తినుటవలన దోషముగలుగదు గదా!' యనిరి. ఇట్లు వారు భగవంతుఁ డన్నము నడుగఁబంచుటను వినుచున్నను దానిని చెవులఁ బెట్టరయిరి. క్షుద్రము లగుస్వర్గాముల కాశపడి యందులకై దుఃఖకరములగు పెక్కులు పెనుకర్మములఁ గావించుచుండు మూర్ఖులుగానఁ దమ్ము జ్ఞానాధికులగు పెద్దలని తలంచుకొనుచుందురు. అట్టివా రీమాటలను బాటింతురా! దేశమును గాలమును జరుపురోడాశాది ద్రవ్యమును, మంత్రమును,దంత్రమును, ఋత్విజులను, నగ్నిహోత్రములును, దేవతలును, యజమానుఁడును, యజ్ఞమును, ధర్మమును నెవ్వనిమయములగునో యట్టిపరబ్రహ్మమగు నధోక్షజుఁడాకృష్ణుఁడు. వారో కర్మమీమాంసకు దగినంత మాత్రము కొఱమాలిన యెఱుక గలిగి మరణశీలమయిన దేహమునే యాత్మగాఁ దలఁచుచుండువారు. కాన నాసాక్షాద్భగవంతుని మనుష్యుఁ డనుచూపునఁ జూచిరిగాని యట్టి పరబ్రహ్మమునుగా నెఱుంగరయిరి. వారాగొల్లలకు లేదనియుఁబలుకరు; ఊరకయుండిరి. గొల్లలాశలు దూలి మరలివచ్చి యాసంగతిని రామకృష్ణులకుఁ దెలిపిరి. భగవంతుఁ డాజగదీశ్వరుఁ డిదివిని పకపక నవ్వుచు వారలకుమన మొకకార్యముఁబూని యింతలోవిసుఁగుపడరాదు. యాచకుఁ డవమాన పడనివాఁడెవఁడు?' అని లోకస్థితిని వారికిఁ దెలుపుచు వారితో మరల 'మీరుపోయి యాబ్రాహ్మణులను

జూడక వారిపత్నులతో బలరాముఁడును నేనును వచ్చియున్నా మని తెలుపుఁడు. వారికి దేహము లింటనున్నను బుద్ధులు నాయందే యున్నవి. వారికట్టి నెయ్యము నాయందుఁ గలదుగాన, మీకు వలయున ట్లన్న మొసంగఁగలరు, పొండు' అనెను. అంత నా గొల్లలాయజ్ఞవాటమునకుఁ బోయి యందుఁ బత్నీశాలలోఁ జక్కఁగా నలంకృత లై, కూర్చుండి యున్నవిప్రపత్నులను దఱిసి మిక్కిలి వినయమున వారికి నమస్కరించి గొల్లలు వారితో 'బ్రాహ్మణపత్నులారా! మీకు నమస్కారము. మేము చెప్పు మాటలను వినుఁడు. ఇటకు సమీపమునఁ గృష్ణుఁడు క్రమ్మరుచుండి మమ్ము మీకడకుఁ బంపెను. అతఁడు బహుదూరము వచ్చియున్నాఁడు; ఆఁకలి గొనియుండుటవలన నతనికిని నతని యనుచరులకును నన్నము పెట్టుదురుగాక' యనిరి. ఆపడఁతులు కృష్ణునిచరితలు మును పే విని మనస్సు లతనియందుఁదగిలియతని దర్శించుటకుఁ దుకతుక పడుచుండిరి. కానయపుడు కృష్ణుఁడువచ్చి యున్నాఁడని వినఁగానే యెంతయు సంబరముగొని పాత్రముల యందు మిక్కిలియు గుణవంతము లయిన చతుర్విధాహారములను గొని యందఱును నదులు సముద్రమునకుంబోలె నిరతిశయప్రియుం డగుకృష్ణునిఁగూర్చి పోయిరి. వారు కృష్ణుని చరితములను జిరకాలముగా వినివిని యుత్తమ శ్లోకుండయిన యాభగవంతునియందుహృదయములు దగిలియున్నవారుగానఁ, బతులును, దోఁబుట్టువులును, దండ్రులును, కొడుకులును వలదని యెంతవారించుచున్నను వినక యమునానదితీరమం దశోకవృక్షముల క్రొంజిగుళ్ల జొంపములచే నింపారుచున్న యొకవనమందు గోపకులు బలసియుండ బలరాముండును దానును సంచరించు

చున్న కృష్ణునిఁ గాంచిరి. నల్లనిమేని చాయ దళుక్కొత్త, బంగారుమెఱుఁగు దువ్వలువగట్టి, వనమాలయు నెమిలిపురియు గైరికధాతువులును జిగుళ్లును నలంకరించుకొని, నటునివలె వేషముల్లసిల్లఁ,దనయనుచరునిమూఁపుపయి నొకచేయి వైచుకొని, మఱియొకచేతఁ దామరపువ్వు నాడించుచుఁ, జెవియందు నల్లగలువపూవు చెరివి,నునుఁజెక్కులపయిముంగురులు చిందులుద్రొక్కఁ, మొగముదామరయందుఁ జిఱునవ్వు చిగురు లొత్తుచున్నయాచిన్నికృష్ణునిఁగాంచిరి. మిక్కిలియుఁబ్రియుం డయినయాకృష్ణుని యతిశయములను బలుమాఱు వీనుల విందులుగ వినివినియున్న వారుగాన, యాపూవుంబోఁడులకు మనంబు లాతనియందే తిరముగా మగ్నములై యుండెను. కాన యతనిని దర్శింపఁగానే నయనరంధ్రములమార్గముననతనిని హృదయంబు లోనికిఁజొనిపి చాలసేపు బిగియఁ గౌఁగిలించుకొని యాపడఁతులు, భగవంతునిఁజూడ నువ్విళులూరుచుండునట్టి తద్భక్తులబుద్ధు లాపరమాత్మునిఁజూచి తాపమును విడుచునట్లు, తమ తాపములను దిగఁద్రోచిరి. అపుడు కృష్ణుఁడు సకలదర్శనుండుగాన యాచెలువలు సమస్తములయిన యాశలుదిగవిడిచి తన్నుదర్శింపఁ దహతహపడుచు నట వచ్చియున్నవారని తెలిసి వారిని జూచి నవ్వుచు 'మహాభాగ్యవతులారా! మీకు స్వాగతము. కూర్చుండుఁడు. మీకేమిసేయుదుము? మమ్ముఁ జూడవలయునని తలంచి యింత దవ్వువచ్చితిరే. ఇది మీబోంట్లకెంతయుఁ దగియున్నది. తమకు హితమిది యహితమిది యని తెలిసికొను పాటినేర్పరులై, స్వప్రయోజనము లివియని యెఱింగినజనులు, తమకంటె బ్రియుండయిననాయందే ఫలాభిసంధిరహిత మై యవిచ్ఛిన్నమైయున్న



1846. శ్రీకృష్ణుఁడు బ్రాహ్మణపత్నుల ననుగ్రహించుట.

భక్తిని గలరూపునఁగావింతురు.మీరు నట్లె కావించితిరి. ప్రాణములును, బుద్ధియు, మనస్సును, నాత్మయు, భార్యయు, బిడ్డలును, ధనములును మొదలయినవి యెవ్వని సంబంధమువలనఁ బ్రియములగుచున్నవో యట్టి నాకంటెను బ్రియుండు మఱియొకఁడెవ్వఁడు? మీరు వచ్చినపని మద్దర్శనము. అది యీడేఱినది. 'ఇఁక మీయజ్ఞవాటమునకుఁ బొండు. మీపతులగు బ్రాహ్మణులు గార్హస్థ్యధర్మము నాచరించువారుగాన గృహిణులగు మీరుతోడుగాఁ *దమసత్రమును నీడేర్చుకొన శక్తులగుదురు' అనెను. బ్రాహ్మణపత్నులు, "విభూ! నీవిట్లు మిక్కిలి పరుసనిమాట పలుకుట యెంతమాత్రము దగదు. † 'జ్ఞానికి నేనే మిక్కిలియుఁ బ్రియుఁడను. అతఁడును నాకు మిక్కిలియుఁ బ్రియుఁడు' అను నీ నిగమవచనము నిజము గావింపుము. మేము సకలబంధువులను నుల్లంఘించి త్రోసిపుచ్చి నీయడుగుఁదామరలనుండి దైవికముగా రాలినతులసిదండను గురులయందుఁదాల్చుటకు నీ పాదమూలమును వచ్చి యండగొంటిమిగదే. ఇఁకఁ దమ్ముఁద్రోసిపుచ్చి దిగవిడిచిన మమ్మువమాపతులుగాని బితలుగాని సుతులుగాని తోఁబుట్టువులుగాని బంధువులుగాని సుహృదులుగాని యెవరును గయికొనరు. మఱి తక్కిన వారేలకైకొందురు? కనుక నీపదయుగముపయిని, దేహాదులు పడవైచి

* యజ్ఞములందు దంపతులకు సహాధికారము గలిగి యుండుటనుబట్టి యిట పత్నులసాహాయ్యము చెప్పఁబడెను.

† 'ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమ ప్రియః' 'న మేభక్తః ప్రణశ్యతి' ఇత్యాదిగీతావాక్యములు భగవద్వచనములుగా నిటఁ దెలియనగు.

తిమి. అరిందమా ! మాకు మఱి వేఱుగతి లేదు. కాబట్టి మా యభిమతమును నీవే కావింపుము' అనిరి.

అందులకు భగవంతుఁడు కృష్ణుఁడు వారితో 'మీపతులుగాని పితలు భ్రాతలు సుతులు మొదలగువారుగాని, లోకులుగాని, నాతోడి దేవతలుగాని, మీయందుఁ దప్పుగొనరు. మఱి మిమ్ము నను మోదింతురు. ఇందు మనుష్యులకుఁ బరస్పరముగల యంగ సంగ మప్పటియనురక్తినే కలిగించునుగాని తక్కినప్పటిప్రీతిని గలిగింపఁదు. విశ్లేషమే తక్కినయప్పుడును బ్రీతిఁ గలిగించునది. కాఁబట్టి నాపరోక్షమున మనస్సు నాయందెనెలకొలిపి యుచితకాలమున నన్నుఁ బొందెదరు. పరోక్షమున నాకథలు వినుటవలనను నామూర్తులను దర్శించుటవలనను, నన్ను ధ్యానించుట వలనను, నన్నుఁ గీర్తించుటవలనను, నాయందెట్లు భావముగలుగునో యట్లు సన్నికర్షముచేత (నాయంగసంగముచేత) నాయందవి గలుగనేరవు. ఇట్లు నాపరోక్షము ప్రియముగాఁబట్టి మీమీగృహములకు మరలిపొండు'. అనెను.

కృష్ణుఁ డిట్లు చెప్పఁగా నావిప్రపత్నులు మరలి యజ్ఞవాటమునకుఁ బోయిరి. వారిపతులు మొదలగువారును వారియందుఁ దప్పుగొనక వారలంగూడి సత్త్రమును సమాప్తముగావించిరి. ఆపడఁతులలో నొక్కతినిమాత్రము, దానిభర్త కృష్ణునికడకుఁ బోనీక యడ్డగింపఁగా నప్పడఁతి చేయునది లేక యాభగవంతునిఁ దాను జూడనోఁచక, వినియున్న చొప్పుననే హృదయమునందు బిగియఁ గౌఁగిలించి, కర్మాయత్తంబగు నిజదేహమును దిగవిడిచిన దయ్యె. భగవంతుఁ డాకృష్ణుఁ డంత వారు దెచ్చియిడిన చతుర్విధాన్నముచేతనే గోపకులకుఁ గుడుపుపెట్టి తానును గుడిచెను.

ఇట్లు కృష్ణుఁడు లీలార్థము మానుషవిగ్రహముదాల్చి మనుష్య సమూహము ననుకరించుచుఁ దనసొబగు రూపము చేతను ముద్దులుగులుకుపలుకుల చేతను మోహనంపుఁ జెయ్వులచేతను గోవులను గోపకులను గోపికలనును రమింపఁజేసినవాఁడయ్యె. అంత నాబ్రాహ్మణులు భగవంతుఁడు యదువులం దవతరించు నని మున్ను తాము విన్నదాని నపుడు స్మరణమునకుఁ దెచ్చుకొనిరి. వారపుడు మనుష్యులవలె నభినయించుచున్న విశ్వేశ్వరులయిన యారామకృష్ణుల ప్రార్థనమును దాము భంగపఱిచిన పాపమున కెంతయు ననుతాపపడిరి. మఱియు నాస్త్రీలకు భగవంతుఁ డగు కృష్ణునియందుఁ దక్కినజనుల కెవ్వరికినిగానరానిభక్తికలిగియుండుటయు, అది తమకు లేకుండుటయును, గాంచి యెంతయు ననుతాపించుచుఁ దమ్ముఁ దామె మిక్కిలి యిట్లు నిందించుకొనిరి. 'ఇస్సీ! మన జన్మము కాల్పనా! మనసుహృదులు, మనవృత్తములు, మనవ్రతములు, మన చదువరితనములు, మనకులము, మనక్రియలు, మననేర్పులును నిస్సీ ఇస్సీ కాల్పనా! అధోక్షజునియెడ భక్తిసేయక విముఖు లయినమన కివియన్నియు నేల? గవ్వకుఁ గొఱయగునా? భగవంతుని మాయ యోగులను గూడ మోహింపఁజేయుచున్నది. ఇది నిక్కము. కావుననే మనము బ్రాహ్మణులమయ్యు,మనుష్యులకుఁ గురువులమయ్యు,మనహితమునే తెలియక యతనిమాయచేఁ దత్తఱపడితిమి! ఆహా! ఏమిలేని యాఁడువారికిని జగద్గురుం డగుకృష్ణునియందుఁ గల యనవధికభక్తినిజూడుఁడు. ఆభక్తియే వారికి గృహము లనఁబడు మృత్యుపాశములను ద్రెంచిపుచ్చినదిచూఁడీ. ఈయాఁడువారికి మనకుంబోలె నుపనయనాంత సంస్కారము లేదు; గురుకుల

వాసము లేదు; తపస్సు మొదలయినవియు లేవు; ప్రత్యగాత్మ దేహవిలక్షణమగునదెడియాత్మస్వరూపవిచారమును లేదు; శౌచమును లేదు. సంధ్యోపాసనాదులయిన యుత్తమక్రియలును లేవు. ఇట్లివి యన్నియు లేకున్నను, యోగేశ్వరేశ్వరుండు నుత్తమశ్లోకుండు నగుకృష్ణునియందు దృఢంబగు భక్తిగలిగి యున్నది. సంస్కారాదులన్నియుఁ గలమనకో యట్టిభక్తి లేదయ్యె. ఆభగవంతుఁడు, గృహవ్యాపారముచేఁ బ్రమత్తులమై స్వహితమునందు మిక్కిలి మూఢులమై యున్నను, అతఁడు తాను సజ్జనులకుఁ దిక్కయినవాఁడుగావున, అయ్యో! గోపకులవాక్యముల మూలమున, యాచన నెపము చేసికొని, సాధురక్షణముకొఱకుఁదా నవతరించియున్న నిరతిశయపురుషార్థస్వరూపుఁడని మనలను దలంపించినవాఁడయ్యె. అట్లుగాదేని, కైవల్య భోగమోక్షాదులయిన పురుషార్థములకుఁ బతియై, సకలమును నియమించు నీశుఁడయి, యవాప్తసమస్తకాముండయి యున్నయతనికి నీశితవ్యులయిన మనచేతఁగలుగు ప్రయోజనమేమి? కాన నిట్లతఁడు మనలయాచించుట వట్టివేడబమే. మనల ననుగ్రహించుటకై యట్లనుకరించినాఁడుగాని లేమిడివలనఁగాదు. మహాలక్ష్మితక్కిన బ్రహ్మాదులనెల్లవిడిచి యొక్కపరియైనను నెవ్వని పాదస్పర్శమును గోరి, దానిచేఁజంచలయైయుండుతనదోషమును బరిహరించుకొని కొలుచుచుండునో, యట్టి పరిపూర్ణకాముఁ డగులక్ష్మీనాథుఁడు యాచించుట యనఁగా నయ్యాది * జనులను మోహింపఁజేయునదిగా నున్నది. దేశమును గాలమును వేఱుద్రవ్యము

* భగవంతుఁ డవతరించుట విననివారికి నతనిమహిమను మఱుఁగుపఱుచునదిగాను విన్నమనకుఁ దానిని దలఁపించునదిగాను నున్నదని భావము

లును మంత్రమును, దంత్రమును, ఋత్విజులును నగ్నులును దేవతలును యజమానుఁడును యజ్ఞమును ధర్మమును నెవని మయములో, యాభగవంతుఁడే, ఆ యోగేశ్వరేశ్వరుండయిన సాక్షాద్విష్ణువే, యదువులందుఁ బుట్టియున్నాఁడని విని యున్నారము. అట్లుండియు నతనిని దెలియకపోయితిమే! ఎంత మూఢులమో! ఈ తప్పు ప్రణమిల్లియె పాపికొనవలయును. భగవంతుఁడును నప్రతిహతమేధాయుక్తుండును నగు కృష్ణా! నీకు నమస్కారము. నీ మాయచేతను బుద్ధులు మోహితము లగుటంజేసి నీభక్తిమాలిన యజ్ఞాదికర్మమార్గములందుఁబడి భ్రమించుచున్నవారము. నీమాయచేతఁ జిత్తములు మోహితములయినందున నీప్రభావమును దెలియనేరక మేము గావించిన యీయపరాధమును, నాద్యుండగు నాపరమపురుషుఁడెంతయు క్షమింప వలయును' అని తలంచిరి. ఇట్లు వారు కృష్ణునియందపరాధముఁ గావించి మెల్లనఁ దాముచేసిన తప్పిదమును స్మరించి యంత నతనిని దర్శింప నువ్విళ్లూరిరి;గాని కంసునిభయమున స్వస్థానమునుండి కదలినవారు గారయిరి. ఇది యిరువదిమూఁడవయధ్యాయము.

---

ఇంద్రయాగభంజనము, గోవర్ధనాచలోద్ధరణము.

భగవంతుఁడు కృష్ణుఁడు బలదేవుండునుదానును నాబృందావనమందే వాసము సేయుచుండఁగానొకప్పుడు గోపకు లింద్రయాగమును సేయుటకు నుద్యమించుచుండుటనుఁ జూచెను. ఆభగవంతుఁడు సర్వాత్ముఁడును సర్వదర్శనుండును నగుటంజేసి, యీయుద్యమ మెందులకో తెలిసినవాఁడయ్యుఁ దెలియనట్లు,

మిక్కిలి యడఁకువతోడ నందుఁడు మొదలయినవృద్ధులనుజూచి 'తండ్రీ! మీ కీసంభ్రమము గలుగనేల? ఏదోయజ్ఞముగా అగపడుచున్నది. దీనినిజేయుట కందుకేని, యాయజ్ఞమునకు ఫలమేమి? అదియెవరినిగూర్చి? ఎవఁడు దేనినిగొని దానినిసాధింపవలయును? ఇదినాకుఁ జెప్పుము. తండ్రీ! దీనిని వినవలయునని నాకుమిక్కిలియుఁ గోరికగానున్నది. సాధువులకందఱు నాత్మసమానులుగాన వారికృత్యమెన్నఁడును గోప్యముగానుండదు. ఏలన వారు దేహాత్మస్వరూపవిధులు గాన నీది నాది యను చూపుగలుగదు. వారికి మిత్రులుగాని యుదాసీనులుగాని శత్రులుగాని గలుగరు. ఇట్లు సమదర్శులగువారికి గోప్యమెక్కడిది? శత్రుమిత్రోదాసీనులలో,నుదాసీనుని శత్రువువలెనే విడువఁదగునే! కాన వారికి గోప్యమువినిపింపరాదు. సుహృదుఁడే తనకు సాటియని చెప్పఁబడుచున్నాఁడు. కాన విషమదర్శులకుసైతము సుహృదునకు దాఁపవలసిన దొక్కటియుఁ గలుగదు: మఱియు లోకమున జనులు సుహృదులతోఁ గలసి మాటిమాటి కాలోచించియే కర్మములు గావించుచున్నారు. ఈలోకపరిపాటి కనుపట్టుచునే యున్నది. ఇట్లు కలసి విచారింపక గతానుగతికముగాఁ జేయుట గ్రుడ్డితనమేయగును. మఱియు నిట్లువిచారించి తెలిసి చేయువానికిఁ గర్మములు సిద్ధించునట్లు తెలియనివానికి సిద్ధింపవు. విషయమిట్లున్నది. కాఁబట్టి, మీరు పూనిన యీ క్రియాయోగమును సుహృదులతోఁ గలసి శాస్త్రమునరసి విచారించి కయికొన్నారా? లేక లోకమం దేదోగ్రుడ్డివాడుకగా వచ్చినదా? ఇది యడుగుచున్నాను. నాకుఁ దెలివిడిగాఁ జెప్పుఁడు' అని యడిగెను.

నందుఁడు 'వర్షాధిదేవత యగుపర్జన్యుఁడు భగవంతుఁ డగు

నింద్రుఁడే. మేఘము లాయింద్రునకు నిజశరీరము లనవచ్చును. అవిశరీరములవలెనతనినియమమునకులోనై వర్తించుచుండును. ఆమేఘములు జీవములకు జీవనమును నాప్యాయకమునగుజలము గురియుచున్నది. నాయనా! ఆమేఘములకుఁ బతియు ముల్లోకములకు నీశ్వరుండు నగు నాయింద్రుని, మేఘముల మూలమున సర్వజీవనప్రదుఁడగుటంబట్టి మేమును మఱియితరు లగుమనుష్యులును నతఁడు వర్షించుజలముచేత నిష్పన్నము లగుద్రవ్యములనుగొని యజ్ఞములు యజింతురు. ఇట్లు ధర్మార్థకామములు సిద్ధించుకొఱకు నతనిని యజించి యాయాగశేషముచేతఁ దమదమ జీవనములఁ గావించుకొందురు. వర్షముచేతనే బ్రతుకు గలుగుచున్నది; ధర్మాదులు సిద్ధించుచున్నవి. కాన యింద్రునిచేత నేమందువా? త్రివర్గముల నొడఁగూర్చు పురుషులలో నింద్రుఁడే (తనకులోనయిన వర్షాదులమూలమున) ఫలమును బొందించువాఁడు. వృద్ధపరంపరగా వచ్చినయీయింద్రారాధనమనెడి ధర్మమును, గామమువలననో, లోభమువలననో, భయమువలననో, ద్వేషమువలననో, యెవఁడు దిగవిడుచున్నాఁడో యామనుష్యుఁడు సుఖమునుబొందనేరఁడు· దుఃఖమునే పొందును' అనెను.

ఇట్లు నందుఁడునుఁ దక్కినబృందావనవాసులును జెప్పినవాక్యమువిని కృష్ణుఁడింద్రునకుఁ గోపముఁబుట్టించువాఁడై తండ్రితో 'కర్మముచేత ప్రాణి పుట్టుచున్నది. కర్మముచేతనే యది లయించుచున్నది. కనుక (ఐహిక) సుఖమును దుఃఖమును భయమును (పారలౌకికమగు) క్షేమమును గర్మముచేతనే కలుగుచున్నవి. ఈకర్తకుఁ గర్మములఫలము లిచ్చు నీశ్వరుఁడొకఁడు గలఁడేని, ఆయీశ్వరుఁ డనువాఁడును (దన్నారాధించు కర్మము

ననుష్ఠించెడియా) కర్తనే యనువర్తించుచున్నాఁడు. అట్టివానికే ఫలము నొసంగుచున్నాఁడు. ఆయీశ్వరుఁడు నట్టి కర్తగాని వానికి (ఫలమునిచ్చు) ప్రభుండు గానేరఁడు గదా! కాన నా యీశ్వరుఁడును గర్మకర్తనే భజింపవలసి యున్నదిగాన, తుదకుఁ గర్మమే ఫలసాధనముగాను నీశ్వరుఁ డాకర్మము ననువర్తించుట చేతఁ బరతంత్రుఁడుగాను నున్నాఁడు. ప్రాణులు తమతమ రాజ సాదిస్వభావముల కనుగుణముగా నాయాపుణ్యాపుణ్యకర్మముల ననువర్తించుచు వానివలననే సుఖదుఃఖాదులను బొందుచుండఁ గా వానికిట నింద్రునితోఁ బనేమి? ప్రాణులు తమతమకర్మముల ననువర్తించుచు నందులకు ఫలములిచ్చువాఁ డీశ్వరుఁడే యం దురా? అట్లేని యింద్రుఁడీశ్వరుఁడగునా? మనుష్యులకు వారివారి స్వభావమున కనుగుణము లయినకర్మములచేఁ గలిగింపఁబడు సుఖదుఃఖాదులను గలుగనీక చేయుటకు నింద్రుఁడీశుఁడుగాఁడే. అట్టియనీశునితోఁ బనేమి? జనమంతయు స్వభావమునకు లో నయినది కాన, స్వభావమునే యనువర్తించుచుండును. దేవత లతోను నసురులతోను మనుష్యులతోను గూడిన యీజగత్తం తయును స్వభావమందే నెలకొనియున్నది. లోకములోన స్వభా వములేని వస్తువొక్కటియు లేదు. జీవుఁడు తనస్వభావానుగుణ మయిన కర్మముచేతనే కర్మానురూపము లగునానావిధ దేహ ములనుబొందుచును విడుచుచునుండును. శత్రువును మిత్రుఁ డు నుదాసీనుఁడును, గర్మ(కృత)మే. గురుఁడును *(నింద్రాదులగు) నీశ్వరుఁడును కర్మ(కృత)మే. ఇట్లు కర్మమే సుఖదుఃఖాదులకు

* ఇంద్రాదులందుఁ యీశ్వరత్వమును కర్మకృతమే కాన కర్మమే యన్నిటి కెక్కుడయిన దని భావము.

హేతువగుటవలన, స్వభావమునందు వర్తించుపురుషుఁడు స్వ స్వభావానురూపమయిన కర్మమునే యాచరించుచుఁగర్మమునే మిక్కిలియుఁ బూజింపవలయును. ఔరా! కర్మము వైభవము! *బ్రదుకఁ దివురువాఁడు దేనిచేతఁ జక్కఁ బ్రదుకుచున్నాఁడో, యదియె వానికిదైవతము. దానినే దైవమువలె నారాధింపవలయును. ఎవఁడొకదానివలన బ్రదుకుచు మఱియొకదానిని భజించుచున్నాఁడో,వాఁడు తానుపజీవించునట్టియా మొదటిదాని వలన, దానుపజీవించు పతి నారాధింపక విటకానిననువర్తించు అంకుటాలివలె†,క్షేమమునొందఁడు. అది యటుండనిండు.లోకమున వారివారివృత్తులను జూడుఁడు. బ్రాహ్మణుఁడు వేదముచేత నుపజీవింప వలయును.రాజు భూరక్షణముచేతజీవింపవలయును. వైశ్యుఁడు వార్తచేత జీవింపవలయును. శూద్రుఁడు త్రివర్ణముల వారిసేవఁజేసి జీవింపవలయును.కృషి వాణిజ్యముగోరక్షకుసీదము.(వడ్డిబ్రదుకు)ననివార్తయిట్లునాలుగువిధములుగానున్నది. అందు మనమెప్పుడును గోరక్షచే జీవించుచుండువారము. ఈవృత్తులు సహజముగామనకున్నవిగాని యింద్రునారాధించుటవలనఁగాదు. ‡ఈవృత్తులకు నింద్రారాధన మపేక్షితమును గాదు. ఎట్లన

* అడవిలోనివారమగు తమకు గోవులు పర్వతములు మొదలయినవియే యుపజీవనసాధనములుగాన వానినే యారాధింపవలయును గాని యింద్రునిఁ గాదనుటకై యిది ప్రస్తావించుట తెలియునది.

† దీనిచేతఁ దాముపజీవించు గోపర్వతాదుల నారాధింపకయింద్రునారాధించినచో గోపర్వతాదులవలనఁ దమకు క్షేమము గలుగదని తెలుపుట తెలియునది.

‡ వృత్తులు లోకసిద్ధములనియు నందుఁ దమగోవృత్తియింద్రారాధనమపేక్షింపనక్కఱ లేదనియు నిట దెలుపుచున్నాఁడు.

సత్త్వమురజన్సు తమస్సనిప్రాణులస్థితికినియుత్పత్తికినినాశమునకు హేతువులయినవి మూఁడుగలవు. రజస్సుచేతఁ బరస్పరము స్త్రీపురుషసంగమువలన జగత్తునుప్పతిల్లుచున్నది.జగ ముప్పతిల్లుట మాత్రమేకాదు. ఆరజస్సుచేతఁ బ్రేరితములై మేఘములు నదీసముద్రపర్వతాదు లన్నింటను వానగురియుచున్నవి. గోవులు మొదలయిన* ప్రజలు మేఘములవలననే జీవించుచున్నారు. కనుక మహేంద్రుఁడు సేయునదేమున్నది? ఏమియులేదే! మనకు వాసస్థానములు పత్తనములుగావు, దేశములుగావు, గ్రామములును గృహములునుగావు.తండ్రీ! మనమెప్పుడును వనములందును బర్వతములందును వసించుచుండువారము. కాఁబట్టి వనవాసుల మగుమనకు జీవనహేతువులయిన గోవులకును, మనకులమునకు దీవనలుగావించుచుండు బ్రాహ్మణులకును, తృణజలాదులచే నిత్యమును మనగోవులనుబెంచు పర్వతమునకును, సంతుష్టి గలుగుటకై యజ్ఞము నుపక్రమింపుఁడు. ఇంద్రయాగమునకై సమకట్టిన సంభారములచేతనే యీయాగమును నెఱవేర్పుఁడు. పాయసము మొదలుగా సూపమువఱకుఁగలనానావిధములయిన పాకములను సారెసత్తులను బిండివంటకములను జక్కిలములను బచనముసేయుఁడు. పల్లెయందుఁగలపాలంతయును బాయసాదులకై సంతరింపుఁడు. బ్రహ్మవాదులగు బ్రాహ్మణు లగ్నిహోత్రములను జక్కఁగావేల్తురుగాక. మీరు ధేనుదక్షిణలతోఁగూడ బహుగుణయుక్తం బయినయన్నము నిడవలయును. మఱియుఁ దక్కినవారగు కుక్క చండాలురు పతితులు మొదలగువారికి

---

* 'ప్రజాస్తై రేవ సిద్ధ్యన్తి' అని మూలము. 'ప్రజాస్తైరేవసిద్ధ్యన్తి' అను పాఠమున గోసమూహము లవానిచేతనే బ్రదుకుచున్నవని యర్థము.

వారివారికిఁ దగున ట్లన్నములిడి గోవులకు గడ్డియొసంగి, పర్వతమునకు బలి యొసంగుఁడు. మీరును జక్కనివస్త్రములు గట్టి మేలయిన మైపూఁత లలంది, చక్కఁగాఁ గయిసేసి మంచియన్నములును గుడిచి యంత గోవులకును విప్రులకును నగ్నిహోత్రములకును బర్వతమునకును బ్రదక్షిణము గావింపుఁడు. తండ్రీ! ఇది నామతము. మీకిష్టమేని చేయనచ్చును. గోవులకును బ్రాహ్మణులకును బర్వతమునకును నాకును నేనుజెప్పిన యీ యాగమే ప్రియమయినది' యనెను. ఆభగవంతుఁడు వెలుపలఁ గాలాత్ముఁడును లోపలఁ బురుషరూపుండు నై నియమించుచుండు వాఁడు; కాన నింద్రునిగర్వము నడంచుతలంపున నిట్లు చెప్పెను. అది విని నందుఁడు మొదలయినవారందులకునిజమయినకారణమును దెలియక యదియె లెస్సయని కయికొనిరి. అంత వా రింద్రయాగమునకు సమకట్టిన యాద్రవ్యములచేతనే పర్వతమును గూర్చియు బ్రాహ్మణులనుగూర్చియు బుణ్యాహముఁ జదివించి మధుసూదనుఁడు చెప్పినట్లెల్ల నొక్కటియు విడువక కావించిరి. అంత బలినిని గోవులను గడ్డినిని సమర్పించి నందాదులందఱు నాదరముతోడ గోధనమును ముందిడికొని గిరికిఁ బ్రదక్షిణము గావించిరి. మఱియు నెద్దులు గట్టిన బండ్లపయి నెక్కి యానందాదులును, జక్కఁగా నలంకరించుకొని గోపికలును, ద్విజుల యాశీర్వాదములను గయికొనుచుఁ గృష్ణుని చేష్టితములఁ బాడుచును గిరికిఁ బ్రదక్షిణము గావించిరి. పిదపఁ "కృష్ణుఁ డచేతనమగు గిరి యెట్లు బలిని గొనును? మనల నెట్లనుగ్రహించు?' నను శంక నందాదులకు లేకుండఁ జేయుటకై తాను గోపకులకు నమ్మికపుట్టునట్లు వారియందే యారూపమును

గయికొనును. అందుఁ బెద్దదేహముగలవాఁడై గిరిశిఖరముపయి నిలుచుండి 'నేను బర్వతము' అని పలుకుచు బలిని గయికొనును. మరల గోపకులనడుమఁ దానొకఁడుగా రూపముదాల్చి 'ఆహా! గోపకులారా! చూడుఁడీవింత! ఈకొండ మన మొసఁగినబలిని గయికొనుటకుఁ దగిన రూపమునుదాల్చి మనయం దనుగ్రహ ముగావించినది. ఇది కామరూపి. ఈగిరియెడ నవహేలనము మనుష్యులు చేసిరా యిదిచంపును; కాఁబట్టి మనకునుగోవులకును క్షేమముకొఱకు నీకొండకు నమస్కారము సేయుదము' అని పలుకుచు గోపజనులతోఁడఁగూడి పెద్ద శరీరముగలిగి పర్వత రూపముతో నున్నతనకే మ్రొక్కినవాఁడయ్యె. ఇట్లు కృష్ణుని చేతఁ బ్రేరితులై పర్వతమును గోవులను బ్రాహ్మణులనుగూర్చిన యాయజ్ఞమును యథావిధిని సలిపి యానందాదిగోపకులు కృష్ణు నింగూడి పల్లెకుఁ బోయినవారయిరి. ఇది యిరువదినాలుగవ యధ్యాయము.

---

### ఇంద్రుఁడు సంవర్తకాది మేఘములను గోపకులపయిని బంపుట.

శుకుఁడు—ఇంద్రుఁడు దనకుఁ గావించుపూజ విహతమయి నదని తెలిసి నందాదిగోపకులు కృష్ణుని దిక్కుగా నమ్మి యట్లు సేసినందులకు నెంతయును గుపితుఁ డయ్యెను. అంత నతఁడు తానే యీశుఁ డనెడియభిమానముచేఁ గ్రుద్ధుఁడయి ప్రలయ కారు లయిన మేఘములందు సంవర్తకము లనెడుమేఘగణ మును బురికొలిపి యంతఁ దనలో 'ఔరా! అడవియందుఁ గ్రుమ్మ రుచుండు నీగొల్లలకు ధనము పెరిఁగివచ్చిన కావరంపు మాహా

ర్త్యమేమి? మనుజుఁడయిన కృష్ణునాశ్రయించి దేవుండ నగు నన్నుఁ దిరస్కరించిరిగా ! ఔరా! ఆకావరపువైభవము! వివేకులగువారు ఆత్మవిద్యను దిగవిడిచి కేవలము దృఢములై నౌకాతుల్యములై కర్మాత్మకములయి యస్మదారాధనరూపములగు క్రతువులచేత సంసారసముద్రమును దరింప నుంకించినట్లు, వీరు నన్నువిడిచి వదరుబోతును మూర్ఖుఁడును అవినీతుఁడును నజ్ఞుండును బండితమానియు నగు మర్త్యుని నీకృష్ణుని నాశ్రయించి నాకు మిక్కిలి యప్రియము గావించిరి.వీరికి ధనసంపత్తిచేత మత్తిలి కన్నుగానక కృష్ణునిచేత దేహములు పెరిఁగియున్నవిచుఁడీ. వీరలకు సంపత్తికావరముచేఁ గలిగిన జడతను దూలఁబుచ్చుఁడు. పశువులనెల్ల నాశముసేయుఁడు. నేను నైరావతగజమునెక్కి మహావేగములగు మరుద్గణములతోఁగూడి నందాదు లయినగోపకులను జంపఁగోరి మందకు మీపిఱుఁదనే వచ్చెద; పదఁడు' అనెను.

ఇట్లు దేవేంద్రుఁ డాజ్ఞాపింపఁగా మేఘములు సంకెలలు విడిపింపఁ బడినవై నందగోకులమును దమబలముకొలఁదిని ధారాసారములచేఁ బీడింపఁదొడఁగినవి. తళతళమని మెఱపుల కన్నుల మిఱుమిట్లు గొలుపుచును, పిడుగులచే దిక్కు లదర భీకరముగా నుఱుముచును, దీవ్రము లయినమరుద్గణములచేఁబ్రేరితములై యామేఘములు వడగండ్లను జడిగొని గురిసినవి. అట్లపుడు మేఘములు స్తంభములవలెఁ దనరుపులయినవర్షధారలను నవ్వారిగాఁ గురియుచుండఁగా, భూతలమంతయు జలప్రవాహము లందుఁ దెప్పలు దేలుచుండెనుగాన యందుమిట్టపల్లము లివి యని గానరాక యంతయు నొకటే జలమయముగా నుండెను. మిక్కుటమయిన జడి గురియుటవలనను, మితిమీఱి వాయువు

నడియుటవలనను, బశువులు వడవడ వడంకసాగెను. గోపకులును గోపికలును జలికిం దాళక కళవళించుచు గోవిందుని శరణుంజొచ్చిరి. వారు భోరనంగురియు నావానకు చాలం బీడితులై తమ శిరసులను బిడ్డలను దమశరీరములచేతం గప్పికొని వానికిని నడునడ నడుంగుచు భగవంతుని కృష్ణునిపాదమూలముల నాశ్రయించి 'కృష్ణా! కృష్ణా! మహాభాగా! ప్రభూ! ఈగోకులము నకంతయు నీవొక్కండే దిక్కు. నీకన్న మాకు మఱెవరున్నారు? భక్తవత్సలా! దేవతలు కుపితులయి మమ్ము బాధించుచున్నారు. వారినుండి నీవే కావవలయును' అని మొఱయిడిరి. హరియునట్లు ఱాలవాన బెట్టిదముగాం గురియుటవలన గొల్లలును గోవులును ఖిక్కిలికొట్టునడుచుం దెలివితప్పిమడియుచుండుటను జూచి, యది యింద్రుండుకోపముగొని కావించిన కీడుగాందలంచి తనలో 'ఇది వర్షఋతువుగాదు. మఱి వెనువడగండ్లతోంగూడి, బిట్టుగాలితో వర్షమత్యుగ్రముగాంగురియుచున్నదేల? ఇంద్రుండు తనయాగము విహతమయినందులకుం గోపించి మనలను నాశముసేయుట కిట్లు గురియుచున్నాండుగాని మఱేమికాదు. అయిననేమి! అందులకుం దగిన ప్రతీకారమును నాసామర్థ్యముచేత సాధించెదను. మూఢత్వముచేం దమ్ము లోకేశులమని తలంచుకొనువారికి సంపన్నదమనెసితమమును హరించివైచెదను. దేవతలు నాయందు భక్తిగలవారు గాన వారికిం దామీశులమనెడియహంకారము కలుగనే కలుగదు. ఒకవేళం బ్రకృతివశమునం దమ్మీశులుగాం దలంచి విఱ్ఱవీంగుదురేని యాయహంకార ముడిగించి రక్షించుటకే వారిమానమునకు భంగము నేర్పరింతునుగాని శిక్షించుటకుంగాదు. కాంబట్టి నన్నేశరణముగాంగలిగి నేనేదిక్కై నన్నే



1861. గోవర్ధనోద్ధరణము.

గట్టిగాఁ జేపట్టి యున్న యీగోకులమును నాసామర్థ్యము చేరక్షిం చెదను. ఇది నేను బూనినవ్రతము' అని యిట్లు చెప్పి యావిష్ణుండు గోవర్ధనాద్రిఁ బెకల్చి, బాలుఁడు పుట్టగొడుగునుంబోలె దానిని నొకచేతిచిటికెనవ్రేలికొనయం దవలీలఁగాఁ దాల్చెను. అంత నాభగవంతుఁడు నందాదు లయినగోపకులనుఁ జూచి 'ఓతల్లీ! తండ్రీ! గొల్లలారా! మీ రీకొండవివరమును మీమీగోధన ములతోడ సుఖముగాఁ బ్రవేశింపుఁడు. నాచేతనుండి యీకొం డ క్రిందఁ బడునేమోయని మీరు సుంతయినను దిగులుపడవ లదు. గాలికిని వానకును భయపడనలదు. అన్నింటివలనఁ మీకు గాపుదల సవరించియున్నాను జూఁడీ' యనెను. కృష్ణుఁ డట్లు దిట చెప్పఁగా మనసుల నూఱటలుగలుగ గొల్లలందఱును దమగో ధనములతోడను బుత్త్రపౌత్త్రాదులతోడను, గొలిచి బ్రతుకు భృత్యపురోహితాదులతోడను నందుఁ బ్రవేశించి యిఱకటము లేక వలయునంత యెడగలిగి వసించియుండిరి. మఱియు వారాఁ కలి దప్పులబాధ లుడిగి మఱియేసుఖము నపేక్షింపక తన్నా రక చూచుచు దానిచేతనే యేకీమునుం బొందియక యుండిరి. కృష్ణుఁ డాపర్వతమును నేడురాత్త్రులు చేత ధరించియుండెను. అట్లుండియు మొదటనూనినయాడుగునుండి కొంచెమయిన నిటు నటుఁ జలించినవాఁడుగాఁడు. ఇంద్రుఁడును గృష్ణుని యీసామ ర్థ్యప్రభావమును జూచి మిక్కిలియు విస్మితుండై తనసంకల్పము విఫలముకాఁగా గర్వముడిగి తనదు మేఘములను మరలించిన వాఁడయ్యె. అంత నాకాశమున మేఘము లెల్ల వెలిసి సూర్యుఁడు వెలుఁగుచుండుటయు, దెప్పరమయినగాలియు వానయు నుడుగు టయుఁ, జూచి గోవర్ధనము చేతం దాలిచి యున్నయాకృష్ణుఁడు

గొల్లలతో 'గోపకులారా! దిగులువలదు. మీమీపడఁతులతోను బిడ్డలతోను నిచటనుండి వెడలిపొండు. గాలివాన యుడిగినది. నదులందు నల్పజలములే యున్నవి' యనెను. అంత నాగోపకులు తమతమ గోధనములను దీసికొని గృహోపకరణములను బండ్లపయి నెక్కించుకొని స్త్రీలతోడను బాలురతోడను వృద్ధులతోడను గూడి మెల్లగా వెలువడిరి. భగవంతుఁడును నాపర్వతము నందఱును జూచుచుండఁగాఁ బ్రభుఁడుగాన లీలయుంబోలె మునుపటివలెనే యెప్పటిచోట నెలకొలిపినవాఁడయ్యె. అప్పుడాగొల్ల లాకృష్ణునిఁ దమతమకుఁ దగినచొప్పునఁ బరిరంభణాదులు గావించుచుఁ గూడికొని యెంతయు సుఖమునొందిరి. గోపికలును పెరుఁగుచేతను, నక్షతలచేతను, జలములచేతను, నెయ్యములు దళుకొత్త, నుబ్బులుచెలంగఁ బూజించుచును మేలయిన దీవనల నొసంగిరి. యశోదయు రోహిణియు, నందుఁడును, బలవంతులయందు మిన్నయగు రాముఁడును గృష్ణునిఁ గౌఁగిలించికొని నెయ్యముల మనంబులు కలంగ, నతనికి దీవన లొసంగిరి. ఆకాశమున దేవగణములును సిద్ధులును సాధ్యులును గంధర్వులును జారణులును సంతుష్టులై స్తుతులుసేయుచును బుష్పవర్షములు గురియించిరి. అంతఁ గృష్ణుఁడుఁ దన కెంతయు ననురక్తులగు గోపకులు బలసి కొలుచుచుండఁగా, బలునిఁగూడి పల్లెను బ్రవేశించెను. ఈచందంబు లగు కృష్ణుని కృత్యములను గోపికలు పాడుచును, మనంబులఁ గృష్ణునే హృదయంగమునిఁగాఁ గొని యెంతయు ముదములుబొదల మందకుఁ బోయినవారయిరి. ఇది యిరువదియేనవ యధ్యాయము.

---

## గోపకులు కృష్ణుని యద్భుతకృత్యములను దలఁచి ముచ్చటించుట.

కృష్ణుఁ డాచరించిన యిటువంటి కృత్యములనెల్లఁ జూచి యాగోపకులతని యపారప్రభావమును దెలియనివారు గాన నెంతయు నాశ్చర్యపడి నందునికడకుఁబోయి యతనితో 'మన కృష్ణుఁడో కేవలము బాలకుఁడు. వాఁడు చేయునట్టి యీకార్యములనుఁజూడఁగా నద్భుతములుగా నున్నవి.ఇట్టివానికిఁ బామరులయందుఁ బుట్టుటయుఁ దనకు హేయముగదే. అట్లయ్యు, వారియం దెట్లుపుట్టుక నొందినాఁడు! తానో యేడేండ్ల బాలుఁడు. అట్టివాఁడు,అందునునొకచేత,అవలీలగా, నింతయంతగాక మిక్కిలియుఁ బెద్దదియగు నొకకొండను మహాగజము తామరపూవునుంబోలె నెట్లు దాల్పఁగలిగెను? ఏడేండ్ల వయసుసంగతి యటుండనీ! కన్నులు దెఱవను సయితము తెలియని కసుగందుగానుండునపుడే, మహాబలవంతురాలగు పూతనచన్నులను దాని ప్రాణములతోఁ గూడనే, కాలము దేహాంపువయసును హరించినట్లు, దిగఁద్రావినాఁడు. ఇంచుకంత బాలుఁడుగానుండునపుడే బండిక్రిందఁ బరుండియుండి, వాపోపుచుఁ గాలెత్తి తన్నఁగా నాకాలి తాఁకుపడి యాబండి తలక్రిందుఁగాఁ గ్రిందఁబడి కూలెను. ఒకయేఁడు బాలుఁడై క్రిందఁ గూర్చుండియుండఁగా, తృణావర్తుఁడను దైత్యుఁడెత్తికొని యాకాశమున కెగసెను. అట్టివానిని గుత్తుకఁబట్టికొని యదిమి యెట్లు చంపెను? ఒకనాఁడు వెన్నదొంగిలి నందులకుఁ గినిసి తల్లి ఱోలనుగట్టఁగా మద్దులనడుమ దాని నీడుచుకొని కాలుసేతులతోఁబట్టి యూఁగులాడుచు నాచెట్ల నెట్లుకూల్చెను? ఒకనాఁడు రామునితోఁగూడ

గొల్లబాలురు బలసివచ్చుచుండఁగా నడవికిదూడలను దోలుకొని పోవుచుండిఁ దన్నుఁ జంపఁగోరిన బకునిఁబట్టి రెండుచేతులతో నాపగవానిముఖమును రెండువ్రయ్యలుగా నెట్లుచీల్చెను? మఱి దూడలయందు దూడగాఁ జొచ్చి తన్నుఁజంపఁ దివురుచున్న వత్సాసురునిఁ జంపి కూల్చి వానినిసైచి వెలఁగలను నవలీలఁ ద్రెళ్లఁజేసెనే. ఇదియెట్లు? బలునింగూడి గర్దభాసురునిని వాని బంధువులనును జంపి పరిపక్వములగు ఫలములచేఁ జెలువారుచున్న తాలవనమును క్షేమముగావించెను.బలవంతుఁడగు బలరామునిచేతఁ బ్రలంబాసురుని జంపించి యంత దావాగ్నినుండి గోపకులను గోవులనును విడిపించెను. అతిక్రూరవిషముగల యామేటిసర్పమును గాళియుని నడంచి గర్వముడిపి తోడనే కాళింది మడుఁగునుండి వెడలఁదోలి యమునాజలము విషరహితములం గావించెను. పల్లెయందు గొల్లలకు మాకెల్ల వారికినిఁ గృష్ణునియం దనురాగము దిగవిడువ రాకున్నది! ఇది యెట్లు? నందా! ఇట్టి యతిమానుషచేష్టితములు గలసీకొడుకునకును మాయందెల్లననురాగము జన్మసిద్ధముగానే యున్నది. ఇది యెట్లు? ఇవి యెల్లనంత విచిత్రములుగావు. ఏడేండ్ల బాలుఁడెక్కడ? మహాపర్వతమును దాల్చుటయెక్కడ? వ్రజనాథా! కాఁబట్టి నీకొడుకునందుఁ బరమాత్ముండేమో యని మాకు శంక పుట్టుచున్నది' యనిరి.

అందులకు నందుఁడు వారితో 'గోపకులారా! గర్గుఁడీకుమారునిఁగూర్చి నాకేమిచెప్పెనో యది చెప్పెదను వినుఁడు. విందురేని, మీకు మనబిడ్డనియందుఁగల. శంకవీడిపోవును. అతఁడు చెప్పిన దేమనఁగా 'ఇతఁడు ప్రతియుగమున నొక్కొక్క దేహము

నొందునపు డొక్కొక్క వర్ణముగా మూఁడువర్ణము లితనికిఁ గలిగియుండెను. అవి తెలుపు, ఎఱుపు, పసుపు నగును. ఇప్పు డితఁడు నలుపునొందియున్నాఁడు. తొల్లి నీకొడుకితఁడు వసుదేవుని కొకచోటఁ బుట్టినాఁడుగనుక నీ శ్రీమంతుఁడు వాసుదేవుఁడను పేరఁ దెలిసినవారు వ్యవహరించెదరు. నీకొడుకున కాయాగుణములకును గర్మములకును ననురూపముగానామములును రూపములును బెక్కులుగలవు. అవి నేనెఱుంగుదునుగాని తక్కిన జనులు దెలియరు. ఇతఁడు గోపకులకును గోకులమునకును నానందకరుఁడై మీకందఱకును మిక్కిలియు మేలుకలిగింపఁ గలఁడు. ఇతనివలన మీరు సమస్తకష్టములను దోడనే తరింపఁ గలడు. వ్రజపతీ! తొల్లి యరాజకమయి యుండినపుడు దస్యువులు సాధువులనుబట్టి పీడింపఁగా, నితనివలన రక్షితులై వారు వృద్ధినొంది యాదస్యువులను గెలిచిరి. మహాభాగుం డయిన యితనియం దెవరు ప్రీతిగావింతురో, యామనుష్యులను, విష్ణుపక్షు లగువారి ననురులుంబోలె, శత్రువులును గ్రిందుపఱుపఁజాలరు. కాఁబట్టి నందా! ఈకుమారుఁడు గుణములచేతను లక్ష్మిచేతను గీర్తిచేతను బ్రభావముచేతను నారాయణునకుసమానుఁడు. కాన యితనికృత్యములం దాశ్చర్యపడ నక్కఱలేదు' అనెను. ఇట్లు గర్గుఁడు నాకుఁజెప్పి తనగృహమునకుఁ బోయినపుడు నేను సందేహించుచుంటినిగాని యిపుడో కృష్ణుని నఘటితఘటనాసమర్థుం డగు సాక్షాన్నారాయణుఁడని సులభముగాఁ దలఁచుచున్నాను' అనెను. ఇట్లు గర్గుండు చెప్పినది నందుఁడు వినిపింపఁగా విని గొల్లలందఱు నమితతేజుండయిన కృష్ణుని ప్రభావములు వినియుఁ గన్నారఁజూచియు నుండుటవలనఁ గృష్ణునియెడ నాశ్చ

ర్యమునువీడి ముదముతో నందుని నర్చించినవారైరి. దేవుం డింద్రుఁడు తనయజ్ఞవిఘాతమునకుఁ గుపితుఁడై పెనువర్షము గురియుచుండఁగా, పిడుగులచేతను ఱాలచేతను బిట్టుగాడ్పుల చేతను బోరనఁగురియు వర్షమునకు మందలోఁజేరిన బాలురును గోపులును స్త్రీలును మొదలుగా వెతలు గుడుచుచుండుటనుజూచి కరుణగడలుకొనఁ దనలోనవ్వుకొనుచు బాలుఁడయ్యు నొకచేతఁ బర్వతమునుఁ బెకలించి పుట్టగొడుగునుం బోలె నవలీలఁ గేలం దాలిచి గోకులము నెవఁడు రక్షించి మహేంద్రునిమదమును వ్రక్కలుచేసెనో, గోవుల కింద్రుఁడయిన యాకృష్ణుఁడు మాకుఁ బ్రసన్నుండగుఁగాక. ఇది యిరువదియాఱవయధ్యాయము.

---

## —●●◆ గోవిందుని పట్టాభిషేకము. ◆●●—

శ్రీశుకుఁడు.—కృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తి జడివాన నుండి గోకులమును, రక్షించినపిదప గోలోకమునుండి కామధేనువును నింద్రుఁడును గృష్ణునికడకు వచ్చిరి. ఆయింద్రుఁ డేకాంతమునందుఁ గృష్ణునిఁ దఱియవచ్చి కృతాపరాధుఁడు గావున మిక్కిలి లజ్జగడలుకొన సూర్యునివలె ధగధగ మెఱయుచున్నకిరీట మతనియడుగుఁదమ్ములు సోఁక మ్రొక్కెను. ఆయింద్రుఁడు మహాతేజుం డయినయాకృష్ణుని ప్రభావము మున్ను వినియు నిప్పుడుగనియు నున్నవాఁడుగాన ముల్లోకములకు నీశ్వరుఁ డనెడికావరము దూలఁగాఁ జేతులుమోడ్చి యతనితో నిట్లనియె. 'నీ*ధామంబగు పరమాకాశము శుద్ధసత్త్వమయ

---

* 'నీధామం' అనుటచే ఈశ్వరుని నిత్యవిభూతియును, 'నీమాయాకల్పితం'

మైనది; కాన రజస్తమస్సులగంధము నించుకయు లేనిది. రాగ ద్వేషాదులులేక శాంతమై, నిన్నుపాసించుట యనుతపముచేతఁ బొందఁదగినదై యొప్పుచుండును. నీ మాయా(సంకల్ప)మాత్రముచేతఁ బరికల్పితమై సత్త్వాది గుణకార్య ప్రవాహ మయిన యీసంసారమును దీనిమూలమున శరీరగ్రహణమునకుఁ గారణభూతమయిన కర్మానుబంధమును నందుఁ గలుగవు. అట్టివాఁడ వేని నాకు రాగాదులును దండాదులు నెట్లుందువా? నీధామమే సంసార శరీరగ్రహణ కర్మబంధాదులు లేనిదై యుండుటవలన, సర్వేశ్వరా! ఆశరీరగ్రహణముచేతఁ బ్రయుక్తములై మరల వేఱుశరీరగ్రహణములకు హేతువులై యుండు రాగలోభాదులు నీకెక్కడివి? అవి దేహాత్మభ్రమము గలయజ్ఞులకుఁ జిహ్నములగుపదార్థములే కాని నిత్యమును స్వయాథాత్మ్యానుభవస్వరూపుండ వగునీకు రాగాదులు కలుగుననుటయుఁ గలుగదు. అట్లయినను, భగవంతా! పూర్ణషాడ్గుణ్యుఁడ వగునీవు ధర్మసంస్థాపమునకును ఖలుల నిగ్రహించుటకును దండమును దాల్చుచున్నావు. అట్లు దండమువలన నీకు *వైషమ్యము గలుగదు. సమస్తజగత్తులకును గన్నతండ్రియు, హితముపదేశించుగురు

---

బనుటచే లీలావిభూతియు రెండునుజెప్పి యీరెంటికిని నతని నాయకునిఁగా రూపించుట తెలియునది.

* పితమొదలగువారు దాఁటితప్పి నడచు పుత్త్రాదులను శిక్షచేత సన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయు శక్తులయ్యును నుపేక్షించియుండరు. అట్లుశిక్షించుటవలన వారికిఁ బక్షపాతము గలుగదు; అట్లె సర్వజగత్పితృత్వాదికములుగల ప్రభుండవగు నీకును ఖలనిగ్రహముకొఱకు దండముదాల్చుట యుచితమె. దీనిచే వైషమ్యము గలుగ దని యర్థము.

వును, నియంతయును, నగుదువు. తక్కిన లౌకికనియంతలవలెనే నిన్నతిక్రమించుటకు శక్యముగాదు. ఇట్టివాఁడవుగావుననే నీవు దగినకాలమును దెలిసి ఖలుల నిగ్రహించుకొఱకు దండమును గయికొనెదవు. కాఁబట్టి నీవు జగదీశుల మని తమ్ముఁ దలఁచుకొనివిఱ్ఱవీఁగుచుండు మాబోంట్లకావరమును దూల్చువాఁడవై మాహితముకొఱకే (కర్మముచేతఁగాక) నీయిచ్చచేత నప్రాకృతము లగుదివ్యదేహములను గయికొని దండాదివ్యాపారములు చేయుచున్నావు. కాన నీకువైషమ్యము గలుగదు. తమ్ము జగదీశులఁగాఁ దలంచుకొనుచున్న మాబోఁటియజ్ఞులు తగినకాలమున నీవు భయంకర మగుదండమును దాల్చియుండుటను జూచి, జగదీశులమనెడి తమ మదమును వేగ దిగవిడిచి గర్వము పోయి, సత్పురుషులమార్గము ననువర్తించుచున్నారు. కనుక నీచేష్టయును ఖలులకు శిక్షయే సుమీ! ఇంద్రాధిపత్యమదము ముంచుకొనఁగాఁ దప్పుదారినిద్రొక్కి నీప్రభావమునుఁ దెలియక పోయితిగాన నీకీయపరాధము గావించితిని. అయినను నీవట్టి వాఁడవుగాన నన్ను మన్నింపఁదగును. ప్రభూ! నీవు నిగ్రహించుటకును ననుగ్రహించుటకును సమర్థుండవు. కాన మూఢచిత్తుఁడ నయిననాకు దుష్టంబయినయిటువంటిమతి మరలఁగలుగకుండుఁగాత. ఈశా! ఇట్లనుగ్రహింపుమా! అధోక్షజా! భూమికి భారముకలిగించుచును దమంతట దానికి బరువై యుండు చమూపతులకు సంసారము లేకుండునట్లు దండించి ముక్తినొసఁగుటకును, దేవా! నీయడుగుఁదమ్ములఁ గొలిచిమనునట్టివారికిని నిన్నుఁ బయింబయి ననువర్తించి యభివృద్ధినొందుటకును, ఈ లోకమందు నీ వవతరించుట యగుచున్నది. పూర్ణషాడ్గుణ్య

మూర్తి యగుటం జేసి భగవంతుండును, శరణాగతుండన్న వానిని జూడంగానే యపరాధములెల్ల మఱచి యనుగ్రహింపవలయునని యే యువ్విళ్లూరుచి త్తముగలవాండుగాన మహాత్ముండును, సౌలభ్యసౌశీల్యములనుబట్టి వాసుదేవుండును, మాబోంటిభక్తులు పాపములాచరించినపుడు శిక్షించి పాలించువాండగుటవలన సాత్త్వతాంపతియు, నగుకృష్ణునకు నీకునమస్కరించుచున్నాను.కర్మము చేతంగాక స్వేచ్ఛచేత దేహమును బరిగ్రహించినవాండును, సంకోచవికాసాది వికారములులేక విశుద్ధంబయినజ్ఞానమే ప్రకారముగాంగలవాండును,సర్వంబగువాండును, సర్వకారణుండయిన వాండును, సర్వభూతముల కాత్మయగువాండును నగునీకు నమస్కారము. భగవంతా! నాయజ్ఞము విహతమయినందులకు నెంతయు సయింపక కినిసి దేహాత్మాభిమానినిగాన నేను బూర్ణషాడ్గుణ్యుండగునీయనుగ్రహమునకు లోనయినయీగోష్ఠమును నాశము సేయవలయునని జడివానలను గాడ్పులను బరంగించి యిట్టియకృత్యమును గావించితిని.అట్లుచేసినను, ఈశా! నీవు నాయవినయమునెల్లం దూలించి నన్ననుగ్రహించితివి. కాన నిపుడు నీకపకారము చేయవలయునని పూనిన నాపూనిక హతమయినది. శరణాగతికై నిన్ను నియమించు నీశ్వరుండవై, దేహాత్మాభిమానాది దుర్గుణములను బోకార్చి హితప్రవర్తకుండ వగుగురుండవై, నాశరణాగతి కల్లగాదని తెలియనేర్చిన యంతరాత్ముండవై ననిన్ను శరణుంజొచ్చితిని' అనెను. ఇట్లింద్రుండు కీర్తింపంగా భగవంతుండతనితో మేఘగంభీరంబగు వచనంబున నవ్వుచు నీవింద్రైశ్వర్యము చేత మిక్కిలియు మత్తిల్లియుండుటనుజూచి నీకెప్పుడును నాయను

స్మరణము గలుగునట్లనుగ్రహింపఁగోరి నీయజ్ఞమునకు భంగము గావించితిని. జనుఁడైశ్వర్యముచేతను సంపత్తిచేతను మదాంధుఁడై వివేకముదూలి, దండమును నేను దాల్చియుండుటను గానకుండును. కాఁబట్టి యెవ్వని ననుగ్రహింపఁగోరుదునో వానిని సంపదలనుండి తొలఁగింతును. వానికి సంపదయం దభిలాష నివర్తింపఁజేయుదును. ఇంద్రా! పొమ్ము. మదనుస్మరణమనెడుభద్రము నీకగుఁగాక. నాయాజ్ఞ సేయుచుండుఁడు. అదిమఱేదికాదు. అవినయమును దిగవిడిచి యెచ్చరికగలిగి మీరు మీ మీయధికారములందే నెలకొనియుండుఁడు' అనెను. అంత మనస్విని యగు కామధేనువు తనసంతాన మగుగోగణములతోఁ గూడి వచ్చి గోపరూపుండయిన యీశ్వరున కభివాదనముచేసి 'కృష్ణా! కృష్ణా! మహాయోగీ! విశ్వాత్మా! విశ్వసంభవా! అచ్యుతా! లోకములకెల్ల నాథుండవయి యున్న నీచేతనే మేమందఱమును*సనాథల మయితిమి. నీవే మాకుఁ బరమంబగుదైవతము. జగత్పతీ! నీవే మాకును గోవులకును సాధువు లగువారికిని నభ్యుదయముకొఱకు నింద్రుఁడవు గమ్ము. వారివారి కయ్యై యధికారము లొసంగునట్టిబ్రహ్మ ప్రేరింపఁగా మేము నిన్నే యింద్రునిఁగా నభిషేకింపఁబోవుచున్నారము. 'దేవతయగువాఁడింద్రుఁడుకాఁదగును. మర్త్యుడనగునాకుఁ దగ'దందువా! విశ్వాత్మా! నీవు భూమిభారమును దింపుటకై యవతరించిన దేవాధిదేవుఁడవు గాని మర్త్యుఁడవు గావు' అనెను.

శుకుఁడు- కామధేను విట్లు కృష్ణునిఁ బ్రార్థించి తనక్షీరముచేత

---

* నాథులవలెఁ జూపట్టునింద్రునిచేత హతులమయ్యు నీచేత రక్షితుల మగుటచేత నీవే మాకు నాథుండ వని యర్థము.

నతని నభిషేకించెను. అట్లే యింద్రుఁడును, అదితి మొదలయిన దేవమాతలచేతఁ బ్రేరితుఁడై దేవతలను ఋషులనుంగూడి యైరావతము తొండముతోఁ గుంభములం దాల్చి తెచ్చిన యాకాశ గంగాజలములఁ గృష్ణు నభిషేకించి * గోవిందుఁడను నామమును గావించెను. అయ్యెడకుఁ దుంబురుఁడు నారదుఁడు మొదలగువారును, గంధర్వులును, విద్యాధరులును, సిద్ధులును, జారణులును, వచ్చి లోకముల పాపములనెల్ల హరించు కృష్ణుని యశంబును బాడిరి. రంభాదులయిన దేవాంగనలును ముదంబు పొదల నర్తనము లాడిరి. దేవతాసమూహములందు ముఖ్యులయినవా రాతనిని స్తుతించి యద్భుతంబగు పుష్పవర్షముల నవ్వారిగాఁ బయిని గురియించిరి.లోకములన్నియు మిక్కిలియు సుఖమునొందినవి. గోవు లపుడు పుడమిని బాలవెల్లిచేఁ దొప్పఁదోఁగునట్లు చేసెను.నదులు పాలు మొదలగు నానారసములతోఁ బ్రవహించెను. వృక్షములును బూఁదేనియలను దొరుఁగుచుండెను. వరిమొద లగుపంటలు దున్నకయే పండెను. పర్వతములు,తమలోని మణులను బయిని బ్రకటముగాఁదాల్చి పొల్చుచుండెను. కృష్ణుఁ డభిషిక్తుఁడు కాఁగాఁ బులులు మొదలయిన జంతువులు స్వభావముచేఁ గ్రూరములయ్యును సమతమ వైరములు మానియుండెను. ఇట్లింద్రుఁడు గోవులకును గోకులమునకును బతియగు గోవిందుని నభిషేకించి యతనిచేత ననుజ్ఞ నొంది దేవాదులచేఁబరివృతుండై దేవలోకమునకుఁ బోయెను.

ఇది యిరువదియేడవయధ్యాయము.

---

* 'గోధనం విన్దతి లభతే ఇతి గోవిన్దః' అని కాని 'గాం స్వర్గం ఇన్ద్రత్వేన విన్దతి' అనికాని గోవిందశబ్దమునకు వ్యుత్పత్తిని తెలియునది.

## శ్రీకృష్ణుఁడు వరుణలోకమునకుఁ బోవుట.

శ్రీశుకుఁడు:—నందుఁ డేకాదశినాఁడు నిరాహారుఁడై జనార్దనుని విష్ణుని నర్చించి ద్వాదశినాఁడు స్నానము సేయుటకై కాళిందీజలమందుఁ గ్రుంకులిడెను. అతఁ డసురవేళయని తెలియక రాత్రియందు జలమునఁ గ్రుంకుటను బట్టి వరుణుని భృత్యుఁ డయినయొకయసుర యతనిని బట్టికొని వరుణుని యొద్దకుఁ గొంపోయెను. గోపకులు నందునిఁగానక 'కృష్ణా! రామా!' యని బిగ్గఱఁ గూవెట్టిరి; కృష్ణుం డది విని తనతండ్రి వరుణునిచే నపహృతుఁడగుటఁ దెలిసి భక్తుల కభయప్రదుఁడు గావునను విభుఁడుగావునను వరుణునికడకుఁ బోయెను. లోకపాలుఁడు వరుణుఁడును హృషీకేశుఁ డగుకృష్ణుఁడు వచ్చుటను జూచి మిక్కిలియు గొప్పసపర్యఁగావించి పూజించి యతనిని గన్నులకుఁ బెద్దపండువుగా దర్శించుచు నతనితో 'ప్రభూ! నిన్ను దర్శించుటవలన నిప్పుడే నేను దేహముదాల్చుట సార్థకమయినది. ఇంతవఱకు సమస్తరత్నాకరపతి నై యుండియు నిపుడే పురుషార్థమును బొందింపించినవాఁడనయితిని. విభూ! నా కన్నులును వాక్కులును నిపుడే సాఫల్యము నొందినవి. మహాత్మా! నీపాదారవిందములఁ గొలుచువారు సంసారమార్గమునకుఁ బారం బయిన నిన్నుఁ బొందుదురు. ఇఁక నిన్నుఁ గన్నారఁ జూడనోచినభాగ్య మేమని చెప్ప! భగవంతుఁడును బరబ్రహ్మమును బరమాత్ముండు నగునీకు నమస్కారము. జీవుల జ్ఞానమును గుణత్రయానుగుణముగాఁ గప్పుచుండుచు గలిగించి సంకోచవికాసాదులచే నానావిధముల వికారపఱుచుచుండు మాయ పేరు సయిత మెవ్వనియందు వినఁగలుగదో, యట్టి నీకు

నమస్కారము. 'నాభృత్యుఁడు వీఁడు వివేక శూన్యుఁడుగావున మూఢుఁడై నీతండ్రియని తెలియక యితని నిచ్చటికిఁ దెచ్చినాఁడు. ప్రభూ! దీనిని నీవు క్షమింపఁదగును. నీతండ్రి నిట నేను దెచ్చినందువలననే దుర్లభమయిననీదర్శనము మాకుఁ గలిగినది. గోవిందా! తండ్రియందు నీకెంతో మక్కువగదే! ఇదిగో మీతండ్రి, కొనిపొమ్ము. మేము నీకన్నబిడ్డలము. కనుక ప్రభూ! అపరాధములు చేసినను మ మ్మనుగ్రహింపవలయునే చుమీ' యనెను.

ఇ ట్లఖిలేశ్వరుండగుకృష్ణునిఁ బ్రసన్నునిఁగావింపఁగా నతఁడు తనతండ్రినిదోడ్కొని మందకుఁబోయి బంధువులకు సంతోషమును గలిగించినవాఁడయ్యెను. నందుఁడును, లోకపాలుఁ డగు వరుణునకుఁ దా నింతవఱకుఁ జూచి యెఱుఁగనిమహైశ్వర్యము వెంపారు చుండుటయును,గృష్ణునియెడ నావరుణాదులుచూపిన భృత్యత్వమును, జూచి మిక్కిలియు విస్మితుఁడై జ్ఞాతులకువాని నెల్ల వర్ణించిచెప్పెను. ఆగోపకులు నాకృష్ణుని సాక్షాత్పరమ పురుషునిఁగాఁదలఁచి బుద్ధులు తహతహపడ 'ఈశ్వరుఁ డీకృష్ణుఁ డింద్రియాతీతమైన స్వగతిని (తనవిభూతులను) మనలఁ బొందించునా?' యని లోన సంకల్పించుకొన్నవా రయిరి.కృష్ణుఁడఖిల దర్శనుండుగాన, తనవారికిఁ గలిగినయభిప్రాయమును దానే తెలిసికొని వారి మనోరథములు సిద్ధించుకొఱకుఁ గృప గడలుకొన తనలో 'గోపజన్మము నొందియున్నయీజీవు లీలోకము నందు*నవిద్యా కామకర్మములచే నుత్తమ మధ్య మాధమము

---

* అవిద్యయనఁగా దేహాత్మాభిమాన స్వతంత్రాత్మాభిమానములచేఁగలుగు

లయిన దేవతిర్యఙ్మనుష్యాదిదేహప్రవేశరూపములగు గతుల యందుఁబరిభ్రమించుచు, నాయసాధారణమయినగతిని దెలియ కున్నారు' అని చింతించి మహాకారుణికుఁడు గావున నిర్వికా రంబును నిత్యాసంకుచితజ్ఞానాత్మకంబునగుతనస్వరూపమును, బరిచ్ఛేద రహితమగుటంజేసి యనంతమై స్వరూపగుణముల నిరతిశయబృహత్త్వముఁ గలిగియుండుటవలన బ్రహ్మంబై స్వయంప్రకాశంబై యనాదినిధనంబునై సమాధినిష్ఠు లగు మునులు త్రిగుణాత్మకమగు ప్రకృతిసంబంధము నివర్తించిన పిదపఁ గాంచునట్టిదియుఁ*బ్రకృతిమండలమునకు నవ్వల నున్న దియునగు తనలోకమును (నిత్యవిభూతిని), గోపకులకుఁజూపెను. ఆగోపకులును భగవంతుఁడు బ్రహ్మహ్రదమును బొందింపఁగా వారతనియాజ్ఞచేత నందు మునిఁగిలేచి సమాధియుక్తులై బ్రహ్మలోకమును గాంచిరి. ఆబ్రహ్మహ్రదము యమునాహ్రదమె యగును. అందుఁ దొల్లి యక్రూరుఁడు మునిఁగి బ్రహ్మలోక మును గాంచెను. నందాదులాలోకమునుజూచి పరమానంద ముచే మిక్కిలియు సుఖితులై కృష్ణుని నలుగడలస్తుతించి యెంత యు బహూకరించుచు, 'ఓరా! ఎక్కడి దితనికిట్టి యచింత్య వైభవ' మని మిక్కిలి యాశ్చర్యము నొందినవారయిరి. ఇది యిరువదియెనిమిదవయధ్యాయము.

---

నట్టి యజ్ఞానము. కామమనగా శబ్దాది విషయాభిలాషము. కర్మమనఁగా తదనుగుణ మయినచేష్ట యని తెలియునది.

* ఇందులకు 'క్షయన్తమస్య రజసః పరాకే' యనుశ్రుతి యనుసంధించునది.

## రాసక్రీడారంభ ఘట్టము.

అపుడు శరదృతువు వచ్చెను. అంత మల్లికలు వికసిల్లి యలరుచుండఁగా నాశారదరాత్రులు మిక్కిలి యుల్లసిలుచుండుటనుజూచి కృష్ణుఁడు నిజసంకల్పముమానిగొల్లమిటారులతోడ విచ్చలవిడి రమింప మనసుగొన్న వాఁడయ్యె. దేశాంతరగతుఁడయి చాలదినములు చూడకుండి యపుడువచ్చిన ప్రియుఁడు తనప్రియురాలి మొగమును గుంకుముపూసి సొగియించునట్లు, చంద్రుఁడును బూర్వదిక్కాంతముఖమున మిక్కిలి సుఖతరములగు తనకరములతో నుదయరాగంబును (పొడుపుకెంజాయను) రంజిలునట్లు పూయుచు నోషధులకును మనుష్యులకును దాపదుఃఖము లెల్లఁ బోకార్చుచును నుదయించినవాఁడయ్యె. క్రొత్త కుంకుమపూఁతచే నెఱ్ఱవాఱియున్న యొక మెఱుంగుఁబోడిముద్దు నెమ్మొగమువలె గుండ్రనగు నిండుమండలముతోఁ గండరించుచున్న తొగలరాయఁడగు చంద్రుని చల్లని తెల్లనివెలుంగులు పర్వి బృందావనము సొంపు పెంపారుచుండెను. దానిని గాంచి కృష్ణుఁడు మించువేడుకతో,మించుఁబోండ్లమనసులు చూఱగొను నట్లతిమధురముగాఁ గానముసేసెను. మరులు మిక్కిలియు మొలపించుచున్న యామధురగీతమును విని గొల్లజవరాండ్రు తమమనసులను గృష్ణుఁడాకర్షించుకొనుటవలన నిలుపోపక కృష్ణునికడకుఁబోవ నుంకించి యొకరిపోకడ మఱొకరికిఁ దెలియకుండునట్లుగదలి వేగమువలన గమ్మలు నునుఁజెక్కులపై నల్లలాడుచుండ, వన్నెకాఁ డున్న యెడకుఁబోయిరి. కొందఱు పాలు పిదుకుచుండఁగాఁ గృష్ణుని గీతమునువిని తహతహ మల్లడిగొనన ల్లి పిదుకుట విడిచిపోయిరి. కొందఱు ప్రొయిపైఁ బాలిడి యది

పొంగుట నెదురుచూడకయుఁ గొందఱు గోధుమపంటకమునిడి యదిపక్వమైనను దింపకయు వెడలిపోయిరి. వేఱుగొందఱు మగలు మొదలగు వారికిఁబళ్లెరముల వడ్డించుచుండి యాగీతమునువినఁగా వడ్డించుటను దిగవిడిచిపోయిరి. కొందఱు గోపికలు బిడ్డలకుఁ జన్నుగుడుపుచుండి యల్లిగీతమువినఁగానే కడుపారఁ బాలుగుడుపకయే పోయిరి. కొందఱు గీతము చెవినిబడఁగానే పతులకుఁగావించుచున్న పరిచర్యనువిడిచియు,కుడుచుచున్న యన్నము కుడువకయు, పూసికొనుచున్న మైపూఁతలను మానియు, ఆడుచున్న జలకము లాడకయు, కన్నులను బెట్టుచున్న కాటుకను బెట్టుకొనకయు, వస్త్రములను నాభరణములను దాఱుమాఱుగఁ దొడిగికొనికృష్ణునియొద్దకు సరగునఁబోయిరి. అపుడాపడఁతులను,బతులును, దండ్రులును, దోఁబుట్టువులును, బంధువులును, వలదని యొంతవారించుచుండినను మనసులు గోవిందునిచే నపహృతములగుటవలన వారెవ్వరును మరలినవారుగారు. కొందఱుసుందరుల మగలు మొదలగువారు పోనీయక యింటినడికట్టులోపల నే యడ్డగించి నిలుపుటచే వెలికిఁబోవుటకు వీలుగానక, మును పే కృష్ణునే మనసుల భావించుచు నుండువారు గాన యపుడు చేయునది లేక కన్నులుమూసికొని కృష్ణునే ధ్యానము సేయుచుండిరి. వారికిఁ గృష్ణుం డత్యంతప్రియతముఁ డగుటవలననతనివిరహము మిక్కిలియు దుస్సహమై తీవ్రం బగుమన్మథతాపముఁ గలిగింపఁగా,దానివలన సమస్తప్రారబ్ధపాపకర్మములను దూలంబుచ్చి ధ్యానముచేత నచ్యుతుని బిగియారఁ గౌఁగిలించికొని యాపరమానందంబునఁ బ్రారబ్ధపుణ్యములునుక్షీణించినవారయిరి.ఇట్లు ప్రారబ్ధ పుణ్యపాపాత్మక మయినసంసారబంధములెల్ల క్షీణింపఁ

గాఁ, బరమాత్ముఁడగునాకృష్ణునే జారుఁడనుతలంపునఁ గూడిన వారయ్యు సత్త్వాదిగుణమయ మగుదేహమును దోడనే విడిచినవారయిరి' అనెను. అందులకు రాజు 'మునీ! ఆగోపికలు కృష్ణునిఁ గేవలము తమకు వన్నెకాఁడనిమాత్రమే తెలిసిరికాని బ్రహ్మమనికాదు. ఇట్లు విషయాసక్తబుద్ధు లగునాపడఁతులకు సత్త్వాదిగుణమయము లగుదేహపరంపర లుడుగుట యెట్లు?' అని యడిగెను. శుకుఁడు 'రాజా! నీ వడిగినయీవిషయము నీకు * మునుపే చెప్పియున్నాను. శిశుపాలుఁడు హరిని ద్వేషించుచునే యుండియును, సిద్ధి నెట్లుపొందెనో తెలియుదువు.? ఇఁక నాహరికిఁ బ్రియులైన వారిసంగతి చెప్పనేల? రాజా! అవ్యక్తుండును, వాఙ్మనంబుల కగోచరుండును, ప్రాకృత గుణరహితుండును, అనంతకల్యాణగుణాశ్రయుండును, నగుభగవంతుఁడు భూలోకమున వ్యక్తుఁడయి దోఁచుట, నరుల కుశ్రేయస్సుకొఱకేకాని వేఱుకాదు. కాన యతఁడు తనయం దేకారణము చేతనేని యనన్యభావము గలిగియుండుటయే వెదకుచుండును. కనుక †కామమో, క్రోధమో, భయమో, స్నేహమో, ఐక్యమో, భక్తియో, నిత్యము హరియందు నెఱపుచుండువారు, తన్మయత్వమును దదీయసాధుధర్మమునుబొందుదురు సుమీ!

---

* సప్తమాధ్యాయమందు 'గోప్యః కామా ద్భయాత్కంసః' ఇత్యాదులు చెప్పుట నిటఁదెలియునది. భగవంతునియం దేవిధమయిన యనన్యభావమును ముక్తి హేతువని యందుఁ దెలుపబడి యున్నది.

† ఇట కామమనఁగా మన్మథప్రయుక్తమయిన యభిలాషవిశేషము. ఐక్యమనఁగా ఏకకులమునఁ బుట్టినవార మనెడి యనుసంధానము. స్నేహమనఁగా సఖ్యము. సౌహృదమనఁగా భక్తి యని తెలియునది.

అతఁడు తన్ను గుఱించి కామక్రోధాదులు నెఱపు జనుల యింద్రియములను దనయందే వర్తించునట్లు మెలపునట్టివాఁడు. మహాసమర్థులకును నియంతయైనవాఁడు. అందులకు వలయుజ్ఞానాదిగుణము లెల్లనిండారియున్నవాఁడు. అజుం డయినయట్టి భగవంతుని యందు నీచందమున నాశ్చర్యపడరాదు సుమీ! ఆకృష్ణునివలన నీస్థావరాదికములును విముక్తి నొందుచున్నవే! అట్టివాఁ డే కారణమున నేని కరుణించు ననుటలో సందేహమేమి? అట్లా గొల్లచెలువలు తనసమీపమునకు వచ్చుటనుజూచి భగవంతుండు మాటకారులందు మేటిగావునఁ దన వాగ్విలాసములచే వారిని జొక్కించుచు, వారిమనసుల నెఱుంగుటకై యిట్లనియె.

'మహాభాగ్యవతులారా! మీకే స్వాగతము. మందయందఱెల్లవారికి నారోగ్యమే కదా! అట్లేని మీరాకకుఁ గారణమేమి? మీకు మఱియేమి ప్రియము మేము చేయుదుము చెప్పుఁడు' (అని నునుసిగ్గు లగ్గలించుచున్న వారి చిఱునవ్వులను జూచి) 'ఇపుడో రాత్రి; మిక్కిలియు భయంకరముగా నున్నది. మఱియుఁ బులులు సింహములు మొదలయిన భయంకరజంతువులు తిరుగులాడుచున్నవి. సుమధ్యమలారా! మందకు మరలిపొండు. ఆఁడువారికి నీయడవియం దిట్టివేళను నిలువఁదగదు. ఇంతేకాక తల్లులును దండ్రులును బుత్త్రులును దోఁబుట్టువులునుమగలును మిమ్ముంగానక వెదకుచునే యుందురు సుఁడీ. మీచుట్టాలకు దిగులు గలిగింపకుఁడు.' అనఁగా వారించుక ప్రణయకోపము సందడించు నునువాఁడిచూడ్కులు నిగిడించిరి. వారితోడ 'పరిపాటిగాఁ బూచి, పున్నమచందురునికిరణములచేఁ బురణించుచు, యమునానది యలలగాడ్పులు మెల్లమెల్లగాఁ బొలయఁగా, చివు

ళ్లల్లలాడుచుండు తరువులచే మురుపుగులుకుచునున్న యీవనము ను జూచితిమైనది. కాన యింక మందకుంబొండు,జాగువలదు. సతీమణులరుగదే ! పతులకుం బరిచర్య సేయుండు. బిడ్డ లేడ్చుచుందురు. వారికిం జన్నుంగుడుపుడు. దూడ లఱచుచుండును, వానికి నావులను బిడుకుండు. నీయందలి నెయ్యమున వచ్చినందులకు ని ట్లందువా'యనవలదు. మీామనంబులు నాయందలిమక్కువకు లోనయి నిలువక మీారు వచ్చితిరేని, మీారిట్లురాక మిక్కిలి యుక్తమే. ఏలన (సర్వాంతర్యామియు సర్వహృదుండు నగు) నాయందు జంతువులెల్లం బ్రీతిగలిగియుండును. కాన మీాకును నట్టి ప్రీతిమాత్ర ముండుట విరుద్ధముకాదు. కాన యందులకని నిలువక వేగమరలిపొండు. 'నీయందలి నెయ్యముచేత నేకాదు; నీతోడ రమించు తలంపున వచ్చితి' మందురా? ఇది తగునా ? భర్తకుం గపటములేక పరిచర్య సేయుటే స్త్రీలకుం బరమ ధర్మము.కల్యాణులారా! అట్లే పతికింగల తండ్రితోంబుట్టువులు మొదలగు బంధువులను బరిచరించుటయుం బిడ్డలను బోషించుటయు బరమధర్మముచుండీ.పతి దురాచారుండయినను,కురూపుండయినను, ముదుసలియైనను, రోగియైనను, దరిద్రుండయినను, బుణ్యలోకములను బడయంగోరుపడంతికి విడువరాదు. మహాపాతకుండయిననే విడువవచ్చును. కులస్త్రీకి మగండున్నను లేకున్నను నూఱు మగనితోడి పొత్తు సుఖకరమును యశస్కరమునుగాదు; అది తుచ్ఛమును దుఃఖకరమును భయావహము నేయగును. మఱియు నన్నియెడల నది నిందితమేయగునుజుండీ. 'నిత్యనిరుపాధికుండగు పతియు బంధువును నీవే' యందురా?

---

* గోపికలకు కృష్ణునియందుం బరబ్రహ్మమనెడిబుద్ధియె లేనందున నిట్లు

అట్టినాయందు శ్రవణమువలనను దర్శనమువలనను ధ్యానమువలనను, వర్తనమువలనను నెట్టిభావము గలుగునో, యది నాతోడి సన్నికర్షణము(అంగసంగము)వలనఁ గలుగదు. కనుక గృహములకు మరలిపొండు' అనెను.

కృష్ణుం డిట్లప్రియమయిన మాటలాడుట విని గోపికలాశలుదూలి దుఃఖితలై కడవరాని చింతలపాలైరి. వారుమిక్కిలి శోకముచే విడుచునిట్టూరుపులవేఁడిమివలన దొండపండువంటి కెమ్మోవులు గమలి కొమరువాయ, నెమ్మొగములు వాంచి, కాలిబొటనవ్రేల నేలవ్రాయుచుఁ, గాటుకతోఁగూడికన్నీరువెల్లిగొని గబ్బిగుబ్బలయందలి కుంకుమునెల్లఁ దుడిచికొనిపాఱఁగా, మిక్కుటమయిన దుఃఖభరమున వ్రేఁగువడిన ట్లేమియుఁ జేయక యూరక నిలుచుండిరి. కృష్ణునియం దెంతయు ననురక్తలై తక్కిన మనోరథములన్నియును దిగవిడిచి యతనినొక్కనినేకోరి యతనినే మిక్కిలి ప్రియునిఁగాఁగొనియుండియు, నతఁడు పగవానివలెనట్లు పరుసనగా బదులుచెప్పఁగా వారుమిక్కిలియురోదనముచేసి యంతదుఃఖంపుఁగన్నీరు గ్రమ్ముటచేఁ జూపుచెడియుండుటవలనఁ

---

చెప్పుటయొప్పదని శంకింపరాదు. వారు 'భవాం స్తనుభృతాం కిలబన్ధురాత్మా' నీవు దేహధారుల కాత్మయు బంధువును' అనియు, 'యర్హ్యమ్బుజాక్ష తవ పాదతలం రమాయాః' అంబుజాక్షా! నీపాదతలము లక్ష్మీదేవి' యనియుఁశ్రీర్యత్పదామ్బుజరజశ్చకమే' 'లక్ష్మియెవ్వనియడుగుఁదమ్మిలపరాగమునుగోరెనో యనియుఁ జెప్పుటచేవారికట్టియెఱుక గలదు. ఇట శ్రవణమనఁగా భగవంతుని స్వరూపరూపగుణవిభూత్యాదులను వినుట. కీర్తనమనఁగా అతనిగుణ నామములను గీర్తించుట. ధ్యానమనఁగా కీర్తన పూర్వకముగా చింతనము సేయుట. దర్శనమనఁగా చింతనపూర్వక మగుసాక్షాత్కారము.

గన్నుంగవలను నల్లల్లఁ దుడిచికొని యించుక కోపావేశమునఁ బలుకులు తొట్రుపడుచుండ నతనితో 'విభూ! నీకిట్లు చెప్పఁదగునా? ఇంతకూ్రరంపుమాట నోరాడిపలుకుదువా? అన్నివిషయములను దిగవిడిచి, మగఁడు మొదలగువారి యాజ్ఞలను గడఁదో్రచి, నీయడుగుఁదమ్ముల దండ నండగొన్న వారమే. నీవ్రా స్వతంత్రుఁడవు. ఏమిచేసిన నెవ్వగడఁగువారు? అట్లని యిట్లుగట్టిగ నమ్మిచేరిన మమ్ము దిగవిడువకుము. నెయ్యముతియ్యమునఁ జేపట్టుము. ముముక్షువులైనభక్తులను నాదిపురుషుఁడగు దేవుఁడు విష్ణుఁడు విడువనట్లు, మమ్ముఁ జేవిడువకుమా! కృష్ణా! ఎంతధర్మవేత్తవురా! మగలను బిడ్డలను బంధువుల ననువర్తించుటయె స్త్రీలకు ననురూప మయినధర్మమని కదా చెప్పితివి? ధర్మము లుపదేశింపుమని నిన్నడుగవచ్చినపుఁ డట్లేయగుఁగాక. ఈశా! అందులకై నీకడకు రాలేదు. వచ్చినది, నీతోడికూటమికేఁజుమీ. ఏలందువా? నీవు మిక్కిలియుఁ బ్రియతముఁడవని బుద్ధికిఁబట్టువడినది. కాకేమి! దేహధారులకెల్ల నీవాత్మభూతుఁడవును నిరుపాధికబంధుఁడవునుగావా? కాన ప్రియతముఁడే యగుటకేమి? మేమేకాదు. శాస్త్రనిపుణులగువారను నాత్మభూతుండు కావుననే నిత్యనిరుపాధికప్రియుండ వయిననీయందే రతిగావించుచుందురు; కాని యనిత్యప్రియు లయినతక్కినవారియందుఁ గాదు. మగలు బిడ్డలు మొదలగువారు కడపట దుఃఖమునే యొసంగుదురుగాన వారితోఁ బనేమి? కాఁబట్టి మాయందనుగ్రహింపుము. నీవ్రా నిన్ను సయితమొసంగునట్టి మహాదాతవుగదే. నీయందుఁ జిరకాలముగా నూని యున్నమాయాశాలతను, అరవిందనయనా! త్రుంపకుమా! నీకన్నుఁదామరల చెన్నేకదా

మా కీయాశ పన్నినది. 'ఇండ్లకుఁబోఁడు జాగువలదు.' అంటివే, సరేకాని మాయిండ్లయందు మరిగియున్న మాచిత్తముల ననాయాసముగా నంతయుఁ జూఱఁగొంటివి. అంతటితోఁ బోక యింటిపనులయందు మరిగియుండు చేతులు రెండును నీకుఁ గయి వసమై యిటునటు కదల నేరకుండఁ జేసితివి. మఱి మాయడుగు లయినను గదలి సాగ నేరకున్నవి. మంద కెట్లు పోదుము? మఱి యేమి చేయుదుము? కృష్ణా! నీవు చేయవలసిన దిది. చిఱునవ్వుతోఁగూడిన నీసొబగుచూడ్కిచేతను, మధురమయిన నీపిల్లఁగ్రోవి రవళిచేతను, దరికొనియున్న మా మన్మథాగ్నిని నీయధరామృత ప్రవాహము చేతఁ జల్లార్పుము. చెలికాఁడా! ఇట్లు చేయవేని, నీవియోగాగ్నిచే దేహములు దగ్ధములై పోవును. పోయినను ధ్యానము చేసి నీపాదముల సన్నిధిని బొందుదుము. చచ్చియు నిన్ను విడువము సుమా. 'మీపతులే యధరామృతములం దడుపుదు'రనెదవా? అంబుజాక్షా! అరణ్యజనులగు మునులకుఁ బ్రియుఁడవై వారియందే మరిగియుండువుగాన నీపాద తలము మహాలక్ష్మికి సయితము, అందును నెప్పుడో యొకప్పుడే, మిక్కిలియు వేడుక గూర్చుచుండును గాని, యెల్లప్పుడును గూర్పదు. అట్టిపాదతలమును మే మడవియం దొకానొకపుడు స్పృశింప నోచి నీచేత నభినందితల మయినది మొదలుగా మఱియొక పురుషునిముంగల నూరకే నిలుచుటయు సైఁపకున్నదే! ఇఁకనట్టి తుచ్ఛుల నెట్లు వలతుము? ఏదేవికటాక్షవీక్షణముకొఱకు బ్రహ్మాదిదేవత లెన్నియో పాట్లుపడుచుందురో యట్టిలక్ష్మీదేవి నీవక్షము నందే సవతులేని మనికి పట్టును బడసినది. అట్టిపదవిని బడసియు నదేమి చిత్రమో! సమస్తభృత్యులచేతను సేవితమై సౌభాగ్య

ముప్పొంగు చున్న నీపదారవిందములపరాగమును సవతియగు తులసి దానును బడయ నువ్విళ్లూరినది. ఆయమవలెనే మేమును నీపాదరజమును బొందువారమయితిమి. దుఃఖాపహారకా! నిన్ను భజించుటయందే మాయాశ లన్నిటిని బట్టుకొలిపి, మాసాగృహములను బతిపుత్త్రాదులనందఱను దిగవిడిచి, నీపాదమూలమును జేరితిమి. కాఁబట్టి మాకుఁ బ్రసన్నుఁడ వగుము. ప్రసన్నుఁడవై మాకింతమాత్రమిమ్ము. సొగసయిన చిఱునవ్వుఁతోఁగూడిన నీమోహంపుఁజూడ్కులచే నిబ్బరమయిన మదనతాపము పెల్లుబ్బి మేను లెల్లఁ బురపురఁ దపించుచున్న మాకు పురుషరత్నమా! నీదాస్యము నొసంగుము. 'భోగ్యములయిన గృహాదులను విడిచి యెందులకని నాదాస్యము గోరెద' రందువా? కుండలముల కాంతులు చిందులు ద్రొక్కుచు నున్నయందంపు నునుఁజెక్కులును, సుధ లొలుకుచున్న యధరబింబమును చిఱునవ్వు దళుకొత్తుచున్న బెళుకుఁజూడ్కులును, వేడ్కలు సేయుచుండు నునుముంగురులు గ్రమ్మి రంగారుచున్న నీముద్దునెమ్మొగమును, ఆశ్రితులకు నభయమునొసంగు నీభుజదండయుగమును లక్ష్మికే యింపుసొంపు గూర్చుచు నాటపట్టయి యున్న నీవెడందవక్షమును, జూచి, సర్వలోకాతిశయసౌందర్యశాలిని నిన్నుఁజూచి, నీదాసుల మగుచున్నారము. 'మాఱుమగనితోడిపొత్తుసర్వత్ర నింద్య' మంటివి. కృష్ణా! మధురములయిన పదములతోఁగూడిన నీమూర్ఛనాస్వరములను దీర్ఘముగానాలాపించునపుడు దానికిఁ జొక్కియు, లోకత్రయసుందరమయిన నీయీరూపము నుఁజూచియు, ముల్లోకములందును నెవ్వతె సదాచార మగు నిజధర్మమునుండి చలింపకుండ నేర్చును? ఎవ్వతెయు లేదు. నీపాట

కున్న రూపమునకుఁ బడఁతులనిమాత్రమా? పశువులును వృక్షములును బక్షులును మృగములును సైతము పులకలుదాల్చుచున్నవే! మాబోఁటులనుగుఱించి నేమిచెప్ప? ఆదిపురుషుండగు విష్ణుఁడు మహేంద్రాదిరూపమున సురలోకము నార్తిని బోకార్చి వారినిరక్షించుటకై యవతరించినవిధమున, నీవును వ్రజజనముల యార్తిహరించుకొఱకు నిజముగా నవతరించినాఁడవు. కాఁబట్టి, యార్తబంధూ! నీకింకరీజనుల మగుమాకు మన్మథతాపతప్తములయిన స్తనములందును శిరసులందునుఁ దామరవలెఁ జల్లనై మృదువైయున్న నీహస్తము నుంపుమా! ఉంచి యార్తి నుడుపుమా' యనిరి.

ఇట్లాగోపికలు పరవశలై యాడిన దీనాలాపములనువిని యోగీశ్వరేశ్వరుండును నాత్మారాముండు నగుటచే విషయవిముఖుండయ్యును, ఆర్తిహర స్వభావుఁడుగాన వారు పలవించి చెప్పిన పలుకులకుఁ బక్కున నవ్వి, దయ నివ్వటిలుచుండ వారలతోడంగూడి రమించినవాఁడయ్యె. మరుఁలు మొలపించు చిఱునవ్వు మెఱయఁ, బలువరుస మొల్లపూవులసిరులను గులుకుచుండ, మోహాకరములగు విలాసచేష్టితములు గావించుచు నాప్రియుని కృష్ణునిచూడ్కులుపయఁనిబొలయఁగానే, ముద్దుమొగములు దద్దయు వికసిల్లినయా గొల్లముద్దరాండ్రు, అతనిని బలసి గూడికొనిరి. అప్పు డతఁడు చుక్కలచేతఁ బరివృతుం డయిన చంద్రునివలెఁ బ్రకాశించుచుండెను. గోపికలు తన్నుఁ గూర్చి పాటలు పాడుచుండ, దానును బాటపాడుచు, ఆఁడుఁగజముల నడుమ యూథపతియగుమగయేనుంగునుంబోలె, నావందలకొలఁది సుందరీమణులమధ్యమున వెలుగొందుచు, ఆఱుతవైజయంతి మాల వెలయ,

నావనము లోక వన్నెఁ గూర్చుచును గ్రుమ్మరుచుండెను. అంత నాయమునయందు దాని కరళ్లయందలి కలువ పూవుల తావులతోఁ గూడిన చల్లని గాడ్పులు పొలయుచుండఁగా బంగారపు టిసుకచే నొక యిసుకదిన్నె వెలయుచుండెను. కృష్ణుఁ డాతిన్నెను జేరిగొల్లవన్నెలాండ్రతోడఁగూడియాగుబ్బెతలనూఁపులపయిఁ జేతులువైచుచును, బిగియఁ గౌఁగిలింతలఁబట్టుచును, గేలనల్లల్ల ముంగురులఁ బుడకుచును, బోఁకముళ్లను సడల్చుచును, గబ్బిగుబ్బలనొక్కుచును, బరియాచకములాడుచును, నఖక్షతములుసలుపుచును, సయ్యాటములు సేయుచును, సొంపయిన చూడ్కులు నిడిగించుచును, సొగయించు నవ్వులు నవ్వుచును, నిట్లు మరులుద్దీపింపఁ జేయుచు, గొల్లకొమిరెమిటారులతోడ రమించినవాఁడయ్యె. ఇట్లు భగవంతుఁడు కృష్ణుఁడు మనసుతగిలి గూడఁగా దానివలన నాచెలువలెంతయు గర్వమునొంది భూవలయము నందుఁ దమ్ము స్త్రీలలోపల మిక్కిలి యెక్కుడుగాఁ దలంచిరి. వారలకట్లు తమ సౌందర్యమునుబట్టి కలిగిన మదమును మానమును గేశవుఁడు కృష్ణుఁడు గాంచి, వారి కారెంటినుడిపి తనయందుఁ బైపయి యభినివేశము పెచ్చు పెరుఁగుచుండున ట్లనుగ్రహింపఁదలంచియాపులినతలమందే మఱుఁగుపడినవాఁడయ్యె.

ఇది యిరువదితొమ్మిదవ యధ్యాయము.

---

### గోపిక లంతర్హితుఁడయిన శ్రీకృష్ణుని వెదకుట.

ఇట్లు కృష్ణుం డంతర్హితుఁడుకాఁగా, గోపిక లతనిని గానక యూథపతియగుగజమును గాననియాఁడుగజములవలె నించు

కయు విమర్శింపక పరితపింపఁదొడంగిరి. లక్ష్మీపతియగు నా భగవంతుని గతులును, నెయ్యముదొలఁకు నవ్వులును, ఒయ్యారంపుఁ జూడ్కులును, మనస్సునకింపయిన పలుకులును, నాటపాటలును, దక్కుంగల విలాసములును, దమ మనంబుల నాకర్షింపఁగా, ఆ పూవుంబోఁడులు తన్మయత్వమునొంది కృష్ణుని యాయా చేష్టితములను ననుకరించుచుఁ గ్రీడింపఁ జొచ్చిరి. కృష్ణునకు బ్రియురాండ్రయిన యాపడఁతులు తదాత్మత్వమునొంది యుండుటవలనఁ దమ ప్రియుం డయిన కృష్ణుని నడలను నవ్వులను జూడ్కులను మాటలు మొదలయినవానిని ననుకరింపఁ దలంచిరి. వారి కపుడతని మూర్తి మనసులయందు గట్టిగా నాఁటియుండుటవలనఁ గృష్ణుఁడు గావించిన విహారములను వేడుకలుగా నాడుచు 'నేను గృష్ణుఁడను నేను గృష్ణుఁడ'నని యొకరికొకరు తెలుపుకొనసాగిరి. మఱియు నా మెఱుంగుఁబోండ్లు తా మొక్కటిగాఁ జేరి యా కృష్ణునిఁ బాడుచు వనమునుండి వనమునకుఁ దిరుగుచు వేఁదుఱుకొన్న వారివలె వెదకిరి. చరాచరములగు సమస్తభూతములందును లోపలను వెలుపలను నాకాశమువలె వ్యాపించి వసించియున్న యా పరమపురుషునిఁ బ్రాకృతునింబోలెఁ దలఁచి వృక్షములను జూచి 'వాఁ డెక్కడ?' నని యడిగిరి. వారిట్లు వృక్షములను జూచి 'ఓ రాగిచెట్టా! ఓ జువ్వీ! ఓ మఱ్ఱివృక్షమా! నందసూనుఁడు తన నెయ్యము తియ్యముల చేతను దెలినవ్వుల చేతను, గలుకుఁజూపుల చేతను మా మనసులను దొంగిలిపోయినాఁడు. మీరు వానినిజూచితిరా? ఓ గోరంటా! అశోకమా! కడిమీ! అత్తిచెట్టా! చందన వృక్షమా! బలరాముని తమ్ముఁడు తన తెలిచిఱునవ్వుచే మానినుల మగు మా దర్పమును వారించి యిక్కడ వచ్చినాఁడా! తుల

సీ ! గోవిందచరణప్రియురాలవుగదే! కాన యెంతకల్యాణివే. ముసరు తుమ్మెద కదుపులతోఁ గూడ నిన్నుఁ దాల్చుచు నీకత్యంత ప్రియుఁ డగుకృష్ణునిఁ జూచితివా ? మాలతీ ! మాకృష్ణుఁడు మీ కగపడెనా? మల్లికా ! జాజీ! అడవిమొల్లా! మాధవుఁడు తన కరస్పర్శముచేత మీకుఁ బ్రీతిగలిగించుచు నీ వంకఁబో యెనా? మామిడీ! ద్రాక్షా! పనసా! అసనమా! కోవిదార మా ! నిమ్మా ! జిల్లేడూ ! బిల్వమా ! వకుళమా! ఆమ్రకమా! పారిజాతమా! పరార్థమై పుట్టుకనొంది యమునాతీరమునఁబొద లుచున్న తక్కిన వృక్షములారా! కృష్ణునిం గానక రిత్తమనం బులఁ దత్తఱపడుచున్న మాకుఁ గృష్ణుఁ డున్నయెడఁ జెప్పుఁడా! భూమీ ! నీవేమితపముచేసితివో ! కృష్ణుని యడుగుఁదమ్ములు సోఁకి వెనుఁబందువు గావింపఁగా నీయందు మొలచియున్న తృణపుంజములచేతఁ బులకించినట్లు కనుపట్టుచున్నావు. ఈ పండుగు నీకుఁ గృష్ణుని యడుగు లొకానొకయెడ సోఁకుచుం డుటవలనఁ గలిగినదా ? లేకమునుపే త్రివిక్రముఁడు తనయడు గుచే నంతయు నాక్రమించినపుడు గలిగినదా ? లేక యంత కును మునుపు భగవంతుఁడు వరాహరూపమునఁ గౌఁగిలించు కొన్నపుడు గలిగినదా ? * హరిణపత్నీ ! మీకన్నులకు, సుందర ములయిన తనయవయవములచేత మిక్కుటమయిన యానంద మవ్వారిగా వెల్లిగొలుపుచుఁ గృష్ణుఁడు ప్రియురాలినొకతెంగూడి యిటవచ్చెనా? చెలీ ! ప్రియురాలితోఁ గూడియె వచ్చియుండ వలయును. గోకులనాథుఁ డగుకృష్ణుఁ డాకాంతను బిగియఁ

---

* ఇట నాఁడుజింకకు చూపుల లాలిత్యము కృష్ణుని దర్శించుట వలని యుబ్బుచేఁ గలిగినదిగా నూహించి దాని నడుగుటఁ దెలియునది.

గాఁగిలించుకొన్నపుడు దాని గుబ్బలయందలి కుంకుమపూఁత లంటుకొన్న యాతని మొల్లపూలదండ వాసన బుగులుకొనుచు నిట పొలయుచున్నది. వృక్షములారా! రామునితమ్ముఁడు కృష్ణుఁడు కుడిచేతఁ దామరపూవును దాల్చి, యెడమచేతిని బ్రియురాలిమూఁపుపయి వైచి, తులసిపూవాసనకు మత్తిల్లి కెరలుచు ముసరుచున్న తుమ్మెదకదుపులు తన్ను వెన్నంటివచ్చుచుండఁగా, నిట్టియెడఁ దిరుగుచుఁ బ్రణయంపుఁ జూడ్కులచేత మీరిడిన * ప్రణామములను నభినందించుచున్నాఁడా? సఖులారా! చూడరే. ఈ పూఁదీగలు తమపతి యగు నీ వనస్పతి కొమ్మలనెడి బాహువులను బెనఁచుకొని గాఁగిలించియున్నను, నా కృష్ణుని గోటి నొక్కులు నిక్కముగాఁ గలిగియున్నవి. కాదేని, యారా! † ఇట్లు పులకలుఁ బొడమియుండునా?' యనిరి.

ఇట్లు గోపికలు వెఱ్ఱిగొన్నవారివలె యాటలాడుచుఁ గృష్ణుని వెదకి వెదకి మిక్కిలియు విహ్వలించుచుఁ, దదాత్మికలై భగవంతుని యామాలీలల ననుకరింపసాఁగిరి. వారిలో నొక్కతి పూతనవలె మెలఁగఁగాఁ గృష్ణునివలె నభినయించుచున్న మఱి యొకతి దాని చన్నుగుడిచెను. మఱియొక్కతి తన్ను శిశువువలెఁ గావించుకొని యాపురని యేడ్చుచు శకటాసురునివలె

---

* ఇట పండ్లబరువుచే వ్రాలియున్న వృక్షములను గృష్ణదర్శనము వలనఁ బ్రణామములు చేసినవిగాఁ దలఁచి ప్రియురాలితోఁగూడి వేడుకగా నడుగులిడిచ ట్లూహించి వాని నడుగుచున్నారని తెలియునది.

† ఇటఁ గొందఱుగోపికలు మఱికొందఱు గోపికలతోఁజెప్పుట తెలియు నది. ఇట నిక్కియున్న మొగ్గలను దీఁగలకుఁ బులకలుగా భ్రమించుట గ్రహించునది.

మెలఁగుచున్న నొకతిని కాలిచేతఁ దన్నెను. మఱియొకతి తృణావర్తునివలె నటించుచుఁ గృష్ణుని బాల్యమును భావించుచున్న మఱియొక్కతిని నపహరించి కొనిపోయెను. ఇంకొకతి యందెలు మువ్వలు గల్లుగల్లుమని మొరయుచుండ నడుగుల నీడ్చుకొని మోఁకాల బాలకృష్ణునివలె దూఁగాడెను. ఇరువురు పడఁతులు రామునివలెను గృష్ణునివలెను గాఁగాఁ, దక్కిన పడఁతులు కొందఱు గోపకులును గోవులు నయిరి. అందు వత్సాసురునివలె వర్తించుచున్న వానినిఁ గృష్ణునివలె నాచరించుచున్న మఱియొక్కతి పట్టుకొని గిరగిరం ద్రిప్పి కూలఁ ద్రోచెను. ఇంకొకతి కృష్ణునివలె నటించుచు బకాసురునివలెనున్న దానిని జంపుదానివలె నుండెను. అపుడు కృష్ణుఁ డెట్లో యట్లే పిలిచి కృష్ణు ననుకరించి వేణువు నూఁదుచుఁ గ్రీడించుచున్న యాపడఁతిని దూరమునందు గోవులవలె నాచరించుచున్న కొందఱు పడఁతులు 'బాగుబాగు' అని కొనియాడిరి. ఒకతి కృష్ణుఁడే తానని మనమునఁ దలంచుకొనుచు, మఱి యొక్కతి మూఁపు పయిని దనబుజమువైచికొని యడుగులిడుచుఁ, దక్కినవారినిజూచి 'సఖులారా! నేను గృష్ణుఁడను. లలితంబగు నా నడకను జూడుఁడు' అనెను. అట్లె మఱియొకగోపిక 'నేను గృష్ణుఁడ' ననుచుఁ బలుకుచు 'గాలివానలకు భయపడవలదు. దాని వలననుండి మీకుఁ గాపుదల నేర్పఱచియున్నాను' అని యొకచేతఁ దనయుత్తరీయమును విరివిగాఁ బఱపి పయికెత్తి పట్టుకొనెను. కాళియుఁడయినయొకగోపికతలపయిని గాలు పెట్టి యలమికొని మఱియొకతి దానితో 'దుష్టసర్పమా! ఇటనుండి పద. అహో! నేను ఖలులకు దండధరుఁడ నై యవతరించి యున్నాఁడ' ననెను.

ఆగోపికలలో వేఱొక్కతి, తక్కినవారితో 'గోపకులారా! మిక్కుటమయిన యీదావాగ్నిని జూడుఁడు. కన్నులుమూసికొనుఁడు. మీకు క్షేమమును వేగమ సులువుగాఁ గావించెదను' అనెను. ఒకతి పూదండతో మఱొక్కతిని గట్టుచు, 'కృష్ణా! నీవు వెన్నదొంగిలి తిని కుండను బగులఁగొట్టితివి. కాన యిదిగో నిన్నిపుడు ఱోటఁ గట్టెదను.' అనఁగా నట్లు కట్టుపడిన యావాలుఁగంటి భయపడినదానివలె మొగముమూసికొని భయము నటించినదయ్యె. ఇట్లాగోపికలు బృందావనమందలి తీఁగలను మ్రాఁకులను గృష్ణునిజాడ యడుగుచుఁబోవునపుడు వనప్రదేశమునం దొక్కయెడ నాపరమాత్ముని యడుగులను జూచిరి. వారు తమలో 'చూడరే! ఈయడుగులు నిక్కముగా నందసూనునివే చుఁడీ. ఎట్లందురా! ఇవిగో ధ్వజపద్మవజ్రాంకుశలతాదులగు శుభలక్షణములు వీనియందుఁ గనుపట్టుచున్నవి' యని చెప్పికొనుచు నాయబల లాయడుగుల చొప్పునుబట్టి కృష్ణుని పోయినజాడ నరయుచుఁ బోవఁగా ముందఱఁ గృష్ణునియడుగులతోఁగూడ నందందు మఱియొక గోపసుందరియడుగులును గూడియుండుటనుజూచి మిక్కిలి యార్తులై, 'ఇదిగో! నందకుమారునిమూఁపుపయిని జేయివైచుకొనియాపడఁతిమదగజముతోడఁ బోవు నాఁడుగజమువలెఁ గృష్ణునితోఁగూడఁ బోయినది; దాని యడుగుజాడలివిచుఁడీ. ఇట్లది కృష్ణునితోఁగూడి పోవనోచినదే! తొంటిజన్మమునందు భగవంతుఁడును నీశ్వరుండునగు హరిని నిది తప్పక యారాధించియుండును. ఇది నిజము. కావుననే గోవిందుఁడు మనలనెల్ల విడనాడి దానియందుఁ బ్రీతుఁడై మంతనమునకుఁ గొంపోయినాఁడు. చెలులారా! ఈ గోవిందుని

పదాబ్జముల రేణుకణము లౌరా! యెంత ధన్యములో కదే! కావుననే వీనిని బ్రహ్మేశాదులయిన దేవతలు పాపనివృత్తికొఱకుఁ దమతమ యౌదలందుఁ దాల్చినవారయిరి. మనము సైతమీ రేణువుల బ్రుంగితిమేని,కృష్ణునిఁబడయుట శక్యముగాకుండునా? ఆకృష్ణునితోఁగూడి పోయినదే దానియడుగు లివియే మాయమనస్సులను గలంచి నలంచుచున్నవే ! కాకేమి ? మనయిందఱు గోపికలకును సొమ్ముగ దేయాకృష్ణుని కెమ్మోవి.ఆయధరమును, మనయందఱి ధనమును, దా నొక్కతియే యపహరించి జుఱ్ఱుచున్నదే! ఇంతటికంటె నేమికావలెనే మనస్సును గలంచుటకు? ఇచ్చటఁ జూచితిరా! ఈదట్టంపు గఱికమొలకలలో దానియడుగులజాడయె కనఁబడకున్నవి. ఎందులకో తెలియునా? మిక్కిలి సుకుమారములయిన దాని పదతలము లీగఱికిమొలకలు గ్రుచ్చుకొని నొచ్చుచున్నందులకుఁ దాళక మన ప్రియుఁడు కృష్ణుఁడుతన గారాబు ప్రియురాలిని మూఁపుపయి నెక్కించుకొని పోయినాఁడు. ఇది నిజము;కావున వానియడుగఁలుమాత్రమేయిందుఁ గనుపట్టుచున్నవి. ఔనే! నీవు చెప్పినది నిజమే ! గోపికలారా ! వాఁడుదానిని మోచికొనిపోయినాఁడు. అట్లు పోవునపు డాబరువు వలన వానియడుగు లివిగో మఱింత లోఁతుగా దిగియున్నవి. చూఁడుడు. ఇటుచూడరే! పుడమి యెంత యెత్తుపడియున్నదో! ఇట నాకాముకుఁడు పువ్వులుగోయుటకై తనగాదిలి చెలువను దింపినాఁడుగాఁబోలు.ఇటుచూఁడుము.మన చెలువుఁడు తన ప్రియురాలి నలంకరించుటకై పువ్వులు చిదిమినట్లున్నది. కావుననేముని కాళ్లచే నిక్కిపొడుగుననున్న పువ్వులుగోసినాఁడు. గాన యడుగులరెండింటి ముద్రలును బూర్ణముగా నచ్చుపడక

సగముమాత్రమే నేల నొత్తుడుపడియున్నవి. పిదప వాఁడట్లు కోసినపువ్వులను దనపూఁబోఁడి తలయందు ముడుచుటకై యిచ్చటఁగూర్చుండి యుండును. ఇదినిజము' అనిరి. ఆగోపిక లిట్లీచందమునను మఱి పెక్కు తెఱంగులను బలవించుచుఁ గృష్ణునియడుగుల నొకరికొకరు చూపుచును నందందు మతిదూలిన వేఁదుఱులవలెఁ ద్రిమ్మరుచుండిరి. వారు 'కృష్ణుఁ డొక్కపడఁతితో విహరించినాఁ డనుట మతిభ్రమముగాదు; నిజమే. అతండవాప్తసమస్తకాముఁడై యాత్మస్వరూపానుభవముచేతనే సంతుష్టినొంది స్త్రీవిభ్రమములచే మనస్సు కొట్టవడకుండునట్టి దిట్టయయ్యును, లోకమునఁ గాముకులు స్త్రీలకు లోకువయై యుండు దైన్యమును, స్త్రీలుచూపెడి దౌర్జన్యమును, దెలుపుటకై యాపడఁతితోఁగూడ నిక్కముగ రమించినవాఁ డయ్యె. కృష్ణుఁడు తక్కిన గొల్లపడఁతులను వనమునవిడిచి యొక్కగోపికను దోడ్కొనిపోయెను. ఆగోపిక, పడఁతులందఱిలోను దానొక్కతియె మిక్కిలియు మిన్నయని విఱ్ఱవీఁగుచుఁ 'దన్ను వలఁచుచున్న గోపికలనెల్లవిడిచి ప్రియుఁడీకృష్ణుఁడు నన్నే కలసియున్నాఁడు. కాన యందఱు పడతులలోను నేనే యధికురాల'నని తలంచినదయ్యె. ఇట్లుతలఁచి యావనప్రదేశమునఁ గృష్ణునితోడఁ గొంతదూరము పోయి, యంత గర్వముపయికొనఁగా, సర్వేశ్వరుం డగు కృష్ణునిఁ జూచి 'కృష్ణా ! ఇఁక నడచిరాఁజాలను. నీకెక్కడికిఁ బోవలెనని మనసో యటు ననుఁగొంపొమ్ము' అనెను. అందులకు కృష్ణుఁ డా ప్రియురాలితో 'నామూఁపుపయి నెక్కికొనవచ్చు' నని చెప్పి యది యట్లుచేయ నుంకించుచుండఁగాఁ దా నింతలో నంతర్హితుం డయ్యెను. ఆయబలయు నందులకెంతయును ననుతపిం

చుచు, 'అకటా ! నాథా ! ఓరమణా ! నీకంటె నాకెవ్వఁడును బ్రియుఁడు గాఁడుగదరా! మహాభుజా ! ఎక్కడనున్నావు? ఎట పోయితివిరా? చెలికాఁడవుగదరా ! నీదాసినిరా ! దీనురాలను రా ! నాకు నీసన్నిధిని జూపుమీ!' యని మిక్కిలియుఁ బల వించుచుండెను. అపుడు తక్కినగోపికలు కృష్ణుఁడుపోయిన మార్గమును వెదకుచునునచ్చి సమీపమునఁ బ్రియు నెడఁబాసి నందున మతిదూలి వగలమురియుచునున్న యామగువను గాం చిరి. అంత నామగుద మాధవునివలనఁ దనకుఁ గలిగిన మన్న నయుఁ దన దౌర్జన్యమువలన మూఁడినయవమానమును జెప్పఁగా విని యాపడఁతులు మిక్కిలియు విస్మయమునొందిన వారయిరి. అంతనాకాంత లందఱును గూడి యావనమునఁ జొచ్చి వెన్నెలగాయుచున్నంతవఱకు నడుఁ గ్రుమ్మరుచుండి దట్టంపుఁ జెట్లనీడలనలనఁ జీఁకటి గ్రమ్ముటఁజూచి యంత వెద కుటను జాలించి మరలిరి. అట్లు చీఁకటి పర్వియున్నను, వారు కృష్ణునియందే మనంబులునిలిపి, తన్మయత్వమునొంది యతని పలుకులే పలుకుచు నతనిచేష్టలే యభినయించుచు నతని గుణ ములనే పాడుచునుండుటవలనఁ దమగృహములను దలంపను గూడఁ దలంపరయిరి. మరల వా రందఱును మున్ను కృష్ణు నితోఁ గూడియుండిన యా కాళింది యిసుకదిన్నియకే మరలి వచ్చి, యందఱునుగూడి కృష్ణునే భావించుచు నతనిరాకకై నతనిని గూర్చి పాడిరి. ఇది ముప్పదియవయధ్యాయము.

---

## గోపికాగీతలు.

గోపికలు, 'మీరుపుట్టినందున మామంద మిక్కిలి పెంపుసొంపారుచున్నది; లక్ష్మియు నిందు నిత్యమును(మంద నలంకరించుచు మాకుఁ గనుపట్టకయె) వర్తించుచున్నది. దయితా! ఇట్లందఱును సంతోషమునఁ బొదలుచుండఁగా నీవారమగు మేమో, నీకొఱకే యెట్లో యీకొఱమాలినప్రాణముల నిలఁబెట్టుకొని నిన్నుఁ గన్నులఁగానక వెదకుచున్నారమే. మాకిట్లు దగునా? కనుకఁ గన్నులకఱవుదీఱ మాకుఁ బొడసూపుమా! వరదా! నీవు సురనాథుఁడవుగదే! కానవే నీకు మేము వెలయీకయే వచ్చిన దాసికల మయితిమిగదే! ఇట్టిమమ్ము శరత్కాలమునందు దట్టంపుఁ దేటినీటికొలంకులనీటుగాఁబుట్టిన తామరపూవుఁబొట్టల జిగిపెంపును దొంగిలినట్టి నీనునుఁజూడ్కిచే నిట్లుచంపుచున్నావే! ఇది మమ్ము వధించుటయేకాదా? ఇందులకుఁ జూడ్కియే చాలదా? శస్త్రమే వలయునా? ఓమేటిసామీ! కాళియునిమడుఁగు విషజలమువలని నాశమునుండియు, సర్పరూపుఁడగు నఘాసురునివలన నుండియు, గాలివాననుండియు, పిడుగులపాటు చిచ్చువలననుండియు, వ్యోమాసురునివలన నుండియు, దక్కిన భయము లన్నింటినుండియును, మమ్ముఁ బలుమాఱు కాచిపుచ్చితివే! ఇప్పుడిదేమి చూడ్కిచేతనే క్రాఁచుచున్నావు. తగునాయిది? చెలికాఁడా! నీవు కేవలము యశోదకొడుకవు గావు. అఖిలదేహధారులయందును జొచ్చి శుభాశుభసాక్షివై యున్న పరమాత్ముఁడవు. కర్మముచేత నిట్లు దేహముఁ దాల్చినాఁడవుగావు. బ్రహ్మ విశ్వపరిపాలనముకొఱకుఁ బ్రార్థింపఁగా నీభక్తులయిన యదువులకులమందు నీయిచ్చను నవతరించితివేకాని ప్రాకృతుని

వలెఁ గర్మముచేతఁగాదు. ఇట్లు సకలజగద్రక్షణమునకై యవత రించిన నీవా,యాశ్రితుల నిట్లుపేక్షించెదవు? కాననీవారమగు మాకియ్యది యొడఁగూర్పుము. అవి మఱేమికావు.వృష్ణిధుర్యా! కాంతా!సంసారమునకు భయపడి నీయడుగుఁదమ్ములనండగొన్న వారికభయము గూర్చునదై కోరినవి యొసంగునదై లక్ష్మీపాణి గ్రహణరసికంబై యొప్పు నీకరసరోరుహమును మాశిరములం దుంపుమా ! వీరా ! వ్రేపల్లెజనుల వెతలెల్ల నుడుపువాఁడవు గదరా! మఱి నీవారగుచెలువల బింకమునెల్లఁ జిఱునవ్వు పొం కముచేత నే ధ్వంసముసేయుదువుగదరా! అచిఱునవ్వునకే లోఁగి నీకు దాసికలమై యున్నమమ్ము, చెలికాఁడా! కూడియాడి మెలఁగ రాదటరా! ముద్దులుగులుకు నీమోముఁదామరను మాకుఁ జూ పుమా! ప్రణమిల్లు దేహధారుల పాపములనెల్ల రూపుమాపున దై ,పశువులవెంటంబడి పోవుచు,సౌభాగ్యంబున సిరికి నాటపట్టై, వీర్యాతిశయమునఁ గాళియఫణిపణములపయి నిడిన నీయడుగుఁ దమ్ములను మాకుచములం దుంపుమా ! కామునిఁ ద్రుంపుమా! పుష్కరేక్షణా! బుధులకు మనోహరమై, సొగసయిన మాటలు నీటుగులుకుచుఁ,జెవికిఁ దీపులొలుకుచుండు నీముద్దుఁబలుకులకుఁ జొక్కి చిక్కి వచ్చితిమి.నీపంపుసేయు వరవుడు కత్తెలము.మమ్ము నీబిత్తరంపు కెమ్మోవి యమృతమునిచ్చి బ్రతికింపుమా! నీకథా మృతము,తాపత్రయతప్తులగువారికి జీవనమయినది.అదిప్రసిద్ధా మృతమువంటిది గాదు. బ్రహ్మాదులచేతఁ బొగడ్త నొందినది. విన్నను జదివినను గల్మషములనెల్ల హరించునదై విన్నమాత్రము ననే నిశ్శ్రేయసరూపమయినది. మఱి శాంతిమొదలగు గుణ

ముల పెంపు సొంపారునది. ఆయమృతమో, బ్రహ్మాదులకును నరకుగాక పాపహరమునుగాక సంసారనిమిత్తమై మదజనకమై యుండును. ఇట్టి నీకథామృతమును భూతలమున నెవ్వరు విస్తరించి కీర్తింతురో వారు పూర్వజన్మములందుఁ బెక్కులు దానములొసంగినసుకృతులుగావలయును. 'అట్లేనినాకథామృతమును వినుటచేతనే తనివినొందుఁ'డనకుము. గారాబు చెలువుఁడా! నీవెంత గారాబమైనను నీటక్కు టెక్కులమారితన మేమిరా! నీతెలినవ్వు నీనెయ్యంపుఁజూడ్కి, మనస్సునఁ దలంచుకొన్నను మిక్కిలి యింపుగూర్చు నీయాటలుపాటలును, మనసునందచ్చొత్తినట్లు మంతనమునందు నీవుగావించు చిన్నెలు వన్నెలును, మామనస్సులను గలంచి నలంచుచున్నదే! ఇట్లు నవ్వులు మొదలగు వెక్కింటిచే మామనసులను వంచించియుండఁగా నీముద్దుముచ్చట లొక్కటిమాత్రము విన్నఁ దనివిగలుగునా? మఱి యింతటితో నీవంచన తీఱెనా? నాథా! కాంతా! నీవు పసులను దోలుకొని మందనుండి కదలునపుడు, తామరపూవుల వలె మృదువై ముద్దుగులుకు నీయడుగులు పరుసులయిన గఱికిమొలకలు గ్రుచ్చుకొని యెంతనొచ్చునోయని మామనసు లెంతయుఁ గుదురుతప్పి కలఁకనొందుచుండును. ఇట్లు నీకెంత నొప్పిగలుగునోయని మనంబులు గలంగుచున్నవారము మేము. నీవో, మాపటివేళ నల్లనిముంగురులు గ్రమ్మ, గోవులదుమ్మున బ్రుంగి రంగారుచున్న నీముద్దుమొగము, నల్లని దుమ్మెదలు కదుపులు మూఁగి పుప్పొడిని మూసరియున్న దామరవలెఁ గొమరారు మొగమును, వీరా! నీవు మాటిమాటికి మాకుఁజూపుచు మమునెస కొలుపుచున్నావు; కాని మనసిచ్చి కూడుటమాత్రము లేదు.

కాన కపటుఁడవే నీవు చుమీ. రమణా! మనస్సుకుందులన్నియు డిందుపఱుచువాఁడవుగదే! కొలుచునపుడు మిక్కిలియు సుఖమై, యాపదలందు ధ్యానింపఁదగినదై, పుడమికి నలంకారమై, బ్రహ్మచేత నర్చితంబై, ప్రణతుల కభీష్టములనెల్లనొసంగునదైన నీయడుగుఁదమ్ములను మాకుచములందుంచి మరుకాఁక నుడుపుమీ! కపట ముడిగి మాతోఁగూడుమీ! వీరా! మనుష్యులకు సార్వభౌమాదిసుఖములయందలి రక్తిని సయితము మఱఁగించునదై, మొరయుచున్న వేణువుచేతఁ జక్కఁగా ముద్దిడంబడినదై, తాపత్రయములవలని దుఃఖము నుడుపునదై, పయింబయిని రతిని బెంచునట్టి నీయధరామృతమును మాకొసంగుమా! నీవు పగటిపూఁట బృందావనమునకుఁ బోవునపుడు ప్రాణులకు నిన్నుఁజూడకుండు నొకత్రుటికూడ, యుగమువలె నగుచున్నది. మరల నెట్లో మాపటివేళ నీవు వనమునుండి వచ్చునపుడు, నెరులుగల నల్లని ముంగురు లలమికొన సిరిగులుకుచున్న నీసొగసుమోమును, వారు దేఱి చూచుచుండఁగా నామహానందానుభవమునకు* నిమిషమేని యడ్డపడు ఱెప్పలను సృజించిన బ్రహ్మ జడుఁడే చుమీ. నీసౌందర్యాతిశయ మిట్లున్నది. అచ్యుతా! కాఁబట్టియె పనులను, సుతులను, వారిసంబంధులను, తోఁబుట్టువులను, జుట్టములను, నందఱను నెంతయు నుల్లంఘించి నీమృదుగీతమున మోహితలమై నీపోకడు దెలిసి, ధూర్తా! నీయొద్దకు వచ్చితిమి. ఇట్టిరాత్రి తమంతవచ్చిన పూఁబోండ్ల నెవ్వఁడు విడుచును? ఎవ్వఁడును విడువఁడే! మంతనమున నీవుగావించిన సంకేతంపుఁ జెయ్వు

---

* అమ్మహా సౌందర్యదర్శనసుఖము నిమిషమాత్రమేని యడ్డుపడిన దుస్సహ మగునని భావముఁ దెలియునది.

లును, మరు లుద్దీపింపఁజేయు నీనెయ్యంపుఁ జూడ్కులును, నవ్వుమొగమును, సిరికాటపట్టయిన నీవెడంద వక్షమును,జూడఁగా మాకెంతోస్పృహ కలుగుచున్నది. దానిచే మాటిమాటికి మనస్సు మోహపడుచున్నది. కృష్ణా! నీయవతారము మంద యందలి గోపకులయు వనమందలి మునులయు బాపములను దుఃఖములను బోకార్చునది. విశ్వమునకు మంగళావహ మయినది.కనుక మనంబుల నిన్నేకోరి యువ్విళులూరుచుండు మాకు నీవారల హృదయరోగములనెల్లఁ బుచ్చునట్టి మందును నించుకయిన నొసంగుమీ! ఆమందు నీకే తెలియును జుమీ! ప్రియా! మిక్కిలి సుకుమారములయిన నీ యడుగుఁదామరలు బిరుసులయిన మాగుబ్బలందు నొత్తువడి కందునోయని వానిని నల్లనల్లనందుఁ దాల్తుము. అట్టి యడుగులతో నీవడవికి నడచుచున్నావే! అవి కటువులయిన రాలుమొదలయినవి తగిలి యెట్లు నొగులకుండును? తప్పక నొగులునే యని మాబుద్ధి కుదురుతప్పి తిరుగుడు పడుచున్నదిసుమీ! ఏలందువా? మా జీవితమే నీవుగదా; నీవురొచ్చిన మాప్రాణ మెట్లునిల్చును?' అని పాడిరి. ఇది ముప్పదియొకండవయధ్యాయము.

---

{ కృష్ణుండు కనఁబడుట. గోపికల సరససాక్షేప సల్లాపక్రీడలు. }

ఇట్లాగోపికలు కృష్ణునిగుణములను బాడుచును బరిపదివిధములఁ బలవించుచును గృష్ణునిఁజూచుటకు మిక్కిలియుఁ దుకతుకపడుచు సుస్వరముగా రోదనముచేసిరి. అప్పుడు కృష్ణుండు నట్లు రోదనముసేయుచున్న వారలమ్రోల చిఱునవ్వు దోలఁ

కాడుచున్న మొగముఁదామరతో,పీతాంబరమునుగట్టి,పూదండ లుదాల్చి, మన్మథమన్మథుండై చక్కఁ బొడకట్టెను.అటఁ దమ ప్రియతముఁడు వచ్చుటను జూడఁగానే యాయబలలు ప్రీతిం జేసి కన్నుంగవలు మిక్కిలి వికసిల్ల, పోయినప్రాణములు మరల వచ్చిన దేహములవలె, నందఱును నొక్కపెట్టున లేచినిలఁబడిరి. వారలు కృష్ణుని ముఖలావణ్యామృతమును గన్నుంగవ లనెడి పాత్రములచే మాటిమాటికిఁ ద్రావినను, నతనిచరణాబ్జమక రందమును ద్రావు భక్తజనులుంబోలెఁ దృప్తినొందఁ జాల రయిరి. వారిలో నొక్కతె ముదముపొదల నాకృష్ణుని కేలు దమ్మిని దోసిటఁబట్టుకొనెను. మఱొక్కతె చందనపుఁ బూఁతగల యాతనిబాహువును దనమూఁపుపయి వైచికొనెను. ఇంకొకతె దోసిలొగ్గి యతని తాంబూలచర్వితమును గైకొనెను. ఒక్కతె విరహతాపమున మిక్కిలి క్రాఁగి యతని యడుగుఁదమ్మిని గబ్బి గుబ్బలయందుఁ దాల్చెను. ఒక్కతె నెయ్యంపుఁగినుకచేఁ ద్రో లుచు బొమలుముడిచి యాడుగఱచి కొట్టుచున్నదానివలెఁ గడ కంటిచూపుల నిగిడించెను. మఱియొక్కతె యతని ముఖార విందమకరందము తెప్పలువేయనిచూపుల మిక్కిలి త్రావియు, మఱలమఱల జుఱ్ఱుచు నుండెనేకాని, యతని పదాంబుజమును, భక్తజను లెంతయనుభవించినను దనివి నొందనట్లు, తానును దనివినొందదయ్యె.ఒకానొకతె నేత్రరంధ్రములమూలమునఁ గృ ష్ణునిఁ దనహృదయమునందుఁ జొనిపి కౌఁగిలించికొని వెలికిఁబో కుండునట్లు కన్నులుమూసి యంగములందుఁ బులకచా లెసంగ నానందపరిప్లుతయై యోగివలె నుండెను.ఆగోపిక లెల్లఁ గృష్ణునిఁ జూడఁగానే వెనుఁబందువై చొక్కుచు, యోగిజనులు పరమా

త్ముఁడు సాక్షాత్కరింపఁగాఁ దాపత్రయమును విడుచునట్లు, తాము కృష్ణవిరహమువలనం బుట్టినతాపమును విడిచిరి. అట్లా పడఁతుకలు శోకమంతయును వీడి తన్నుఁ జలసి కొలుచుచుండఁగా భగవంతుఁడు కృష్ణుఁడు, పరమపురుషుఁడు విమలాది శక్తులచేతనుంబోలెను, జీవుఁ డిరువదినాలుగు తత్త్వశక్తులచేతనుంబోలెను, మఱిమఱి యధికముగాఁ బ్రకాశించెను. అంత విభుఁడు కృష్ణుఁడు నావెలందులఁ దోకొని కాళిందిపులినమునకుఁ బోయెను. ఆయిసుక దిన్నియయందు విరిసినమొల్లలయు మందారపుఁ బువ్వులయుఁ దావులతోఁగూడిన గాడ్పునకుఁ దుమ్మెదలు ఝుంఝుమ్మని ముసరుచుండెను. మఱియు శరత్కాలముగాన యచ్చంపుఁ బండువెన్నెలల వెలుఁగువెల్లికలవలన రాత్రిచీఁకటి యంతయుఁ జీకాకై యెంతయు వెలుంగుచు మిక్కిలి శుభంబై యొప్పుచుండెను. మఱియు యమునానది తనయలలనెడుచేతులతో సంతరించి పోఁగుచేసిన సన్నని మెత్తనియిసుకయు నందె సలారుచుండెను. అట్టి పులినమందుఁ జొచ్చి యతఁ డాపూఁబోండ్లు బలసి గొలువ మఱిమఱి చెలువుగులుకుచుండెను. వారలా కృష్ణునిఁ జూచినయాహ్లాదమువలన హృదయంపు రోగములెల్లఁ దూలఁగా, శ్రుతులు పరమాత్ముని బ్రతిపాదింప వలయుననుగోరికను గడముట్టినట్లు, తమమనోరథమీడేర్చుకొనుకోరికయుఁ గడముట్టినవారయిరి. అట్లు పూనికి పారమొందఁగా వారు తమ కుచకుంకుమములచే నంకితములయియున్న పయింటచెఱఁగులఁ గొని యాత్మబంధుఁడగు నతని కాసనమును గల్పించినవారైరి. యోగీశ్వరుల హృదయకమలమధ్యమున నాసన మలవడి విలసిల్లుచుండు నాభగవంతుఁ డీశ్వరుఁ డాయాసనమందుఁ జుట్టను,

గోపీసమూహము బలసియుండఁ గూర్చుండి, ముల్లోకములందలి చక్కఁదనములనెల్లఁ గూర్చి యొక్క కుప్పఁజేసినట్లు నెమ్మేను నొప్పుచుండఁగా నెంతయు వెలుంగుచుండెను. మఱుని మొలపించుచున్న యాకృష్ణునిఁ జూచి, వారు చిఱునవ్వుదోలఁకఁ, గులుకుంజూడ్కులు నీటుమిటారించుచున్న బొమలతో,నతని నెంతయు రంజిలఁజేయుచుఁ, దమతొడలయందు నతనియడుగుఁదమ్ములు నిడికొని తమచేతులతోఁ బిసుకుచు,నిట్టట్టుఁ గదలనీక పట్టుకొని, యించుకకోపము మించఁగా 'కొందఱు తమ్ముఁ గొలిచినవారిని గొలుతురు. మఱికొందఱు తమ్ముఁ గొలువనివారిని సయితము గొలుతురు. ఇంకఁ గొందఱు, * దమ్ముఁ గొలుచువారిని గొలువనివారిని నుభయులనును గొలువకుందురు. ఇందలియెక్కువతక్కువ లేవియో ఓయీ! మాకు లెస్సగా వివరింపుమీ!' యని యడిగిరి. అందులకుఁ గృష్ణుండు, చెలులారా! ఒకరి నొకరు కొలిచినఁ గొలుచునట్టివారు స్వప్రయోజనమాత్రపరులేకాని వేఱుగాదు. కొలిచినఁగొలుచుట సౌహృదముగాదు. అందు ధర్మమును లేదు. అందు స్వప్రయోజనమునందే కన్నుగాని మఱియొకవిధము (అనఁగా స్వప్రయోజనమును విడిచి పరోపకారమువలనధర్మముగడించుట) గాదు. ఎవరు (స్వకార్యమునువిడిచి పరోపకారము సేయు)కరుణగలవారయి, తండ్రులు కొడుకులనుంబోలెఁ దమ్ముఁ గొలువనివారినిఁ గొలుతురో యట్టివారికి, సుమధ్యములారా! నిర్బాధ మయినధర్మమును సౌహృదమును(సర్వభూతసుహృత్త్వమును) గలుగుచున్నది. కొందఱు తమ్ముఁ గొలుచువారినిగూడఁ గొలువరు. ఇఁకఁ గొలువనివా

* ఇట గోపికలు కృష్ణుని మూఁడవపక్షములోని వానినిగా సూచించిరి.

రిని గొలుచుట యెక్కుడిది? వారు కేవలము స్వదేహయాత్రా పోషణపరాయణులు. మఱి కామితములగు సమస్తవిషయభోగములును దత్సాధనములును సమృద్ధముగాఁ గలిగియున్నవారు కృతఘ్నులును, మహోపకారులగు గురువులకును ద్రోహము సేయునట్టివారు నగుదురు. సఖులారా! నన్నుఁ గొలుచునట్టి ప్రాణులను సయితము నేను * గొలువను. కృతజ్ఞత లేమిచేతఁ గాదు. అట్లు గొలుచునట్టి యాజంతువులకు, దరిద్రుఁడు దైవికముగా దొరికినధనమును బోఁగొట్టుకొని యదేచింత యందు మఱియొకటిని దెలియకుండునట్లు, నేను గోచరింపకుండుటచే నాయందే ధ్యానమెడతెగక యనువర్తించుచుండుటకై యట్లు గోచరింపకుందును జుఁడీ. అబలలారా! మీరు నాకొఱకై యుక్తాయుక్తముల నరయనందున, లోకములను ధర్మార్థములను బాటింపనందున, వేదములనును నియ్యములను డిగవిడుచుట వలన జ్ఞాతులను మూలముట్టుగ విడనాడి † నారలు గదే. అట్టి మీరు నన్నే యెప్పుడనువర్తించుకొఱకు మీ కనుమఱుఁగు ననే మిమ్ముఁ గొలుచుచుండి మీకుపకరించుటకై యిట్లు ‡ మఱుంగయితిని గాని మఱేమిగాదు. ప్రియలారా! కాఁబట్టి ప్రియుతముండనగు నాయెడఁదప్పగొనమీకుఁదగదు సుఁడీ. ఇట్లు నిష్కపటముగాఁ నన్నుఁగొలిచిన మీకు మిక్కిలియుఁ జక్కఁగానుపకరింపఁ బూనితి నేని దేవతలయాయుఃపరిమాణముచేతను

* కన్నులకు గోచరింపననుట. ఇందుఁగృతజ్ఞత్వము కారుణికత్వమును దెలియవలయును.

† దీనిచేతను కృతజ్ఞత తెలియుచున్నది.

‡ దీనిచేతను కారుణికత్వము తెలియుచు నున్నది.



1903. శ్రీకృష్ణుఁడు రాసక్రీడ సేయుట.

నాకుశక్యముగాకున్నదే ! మనుష్యాయువుచేతను బ్రహ్మాయువుచేతనుగాని శక్యముగాదు. గృహములనెడి యుడివోని సంకెలలను మూలముట్టుగఁ ద్రెంచివైచి నన్నుఁ గొలిచితిరిగదే. ఇట్టి యీగృహపాశము లిప్పుడు వీడి*పోవుఁగాక ' యనెను. ఇది ముప్పదిరెండవయధ్యాయము.

---

## రాసక్రీడాదులు.

భగవంతుఁ డిట్లతి పేశలముగఁ బలికిన పలుకులనువిని గోపికలతని యంగసంగముచేతఁ దమకోర్కులెల్లఁ గొనలుసాఁగ విరహమువలని తాపమునంతయు విడిచినవారయిరి. అంత గోవిందుఁడు తన కనువ్రతలయి యెంతయుఁ బ్రీతితోడ వర్తించుచున్నయా స్త్రీరత్నములనుగూడి యొకరొకరిచేతులను బెనంచి రాసక్రీడను గావింపఁదొడంగెను. ఆకృష్ణుఁడు గోపికలను మండలాకారముగా నిలిపి యిద్దఱేసి ముద్దియల నడుమఁ దానొక్కొక్కఁడుగా నిలిచి యిరుచేతులను నిరుప్రక్కలనున్న పడఁతుల మెడలను గౌఁగిలించికొని,యిట్లు రాసక్రీడా మహోత్సవమును జరిపినవాఁడయ్యె. ఆకృష్ణుఁడు దాను పెక్కురూపములనొందియుండియు, వివిధ విచిత్రశక్తియుక్తుండగాన నా స్త్రీలు కృష్ణుఁడు తమయొద్దనేయుండి తమ్మె కౌఁగిలించుకొన్నాఁడని యొక్కొక్కతియుఁ దలంచినవారయిరి ! అప్పుడా వేడుకను జూడ, దేవతలు తమభార్యలంగూడి మనంబులఁ గుతుకలు పరఁగరాఁగా, వారివిమానములచే నాకాశతలమంతయు నెరసి

---

* అనఁగా మీకు ముక్తిగలుగునుగాక యనుట. నేను జేయు ప్రత్యుపకారము ముక్తిప్రదానమే యని భావము.

బెరసియుండెను. అంత దుందుభులు మ్రోఁగెను. పుష్పవర్షములు గురిసెను. మేటిగంధర్వులును వారిపడఁతులును విమలంబగు కృష్ణుని యశమును బాడిరి. గోపికలును వారి ప్రియుండగు కృష్ణుండును దాల్చియున్నకడియములయు నూపురములయుఁ గింకిణులయు ధ్వని యారాసమండలమున న ర్తించునపుడు మిక్కిలియుఁ దుములముగాఁ జెలంగెను. దేవకీసుతుఁడు కృష్ణుఁడందు నాసుందరీమణులంగూడి బంగారుపూసల నడుమనున్న పెద్ద మరకతమణివలె మీఁదు మిక్కిలి ప్రకాశించుచుండెను. ఆకృష్ణుని పథూమణు లడుగులు వైచుచును జేతులు ద్రిప్పుచును చిఱునవ్వులు దళుకొ త్తబొమలుకులుకుగాఁ ద్రిప్పుచును, సన్నని నెన్నడుములు వీఁగియాడఁ, గుబ్బలు పయింటలను నల్లలాడుచుండ, నునుఁజెక్కులందుఁ గమ్మలు చొకళింప, మొగమునఁ జెమ్మటలు వెల్లిగొనఁ, గ్రొమ్ముడులువీడి, మొలనూళ్లు బ్రిదుల, నాకృష్ణుని బాడుచును,* మేఘచక్రమునందు మెఱుఁగుఁదీఁగలుంబోలె నెంతయు వెలుంగుచుండిరి. ఆముద్దియ లట్లు నానారాగములచే రంజిల్లుకంఠములతోఁ, న ర్తనములు సేయుచు, శ్రీకృష్ణునియంగము లొరయుచుండుటచే నెంతయు సంతోషమునఁ దేలుచును నెలుఁగెత్తిపాడిరి. ఆగీత మీవిశ్వమంతయునునావరించినదయ్యె. వారిలో నొకసుందరి ముకుందునితోఁ బాటిగాఁ బాడఁదొడంగి యతఁడు ప్రీతుఁడై బాగుబాగు సెబాసని యగ్గించుచుండఁగా నతని స్వరములతోఁ గలియంబడకుండునట్లు షడ్జాదులయిన స్వరభేదములను ధ్రువతాళముతోడ నాలాపించి

* ఇట కృష్ణుఁడు మేఘచక్రముగాను, గోపికలు బహువిధములయిన మెఱుపులుగాను, గానము గర్జితముగాను, దెలియునది.

నదమ్మె. కృష్ణుం డందుల కా ముద్దియ నెంతయు సమ్మానించిన వాఁడమ్మె. ఒక చెలువ రాసక్రీడచే మిక్కిలియు బడలి కడియములును జెదిరిన మల్లెపూదండలును బ్రిదులుచుండఁగాఁ బ్రక్క నిలుచున్న కృష్ణునిమూఁపునఁ జేత నూఁతగాఁ బట్టుకొన్నదమ్మె. వారిలో నొక్కొకలికి కలువపూతావులు గుబాళించుచు గందంపుఁ బూఁతచేతఁ బొలుపారుచున్న చేతిని గృష్ణుఁడు తనమూఁపుపయి నిడఁగా, దానిని మూర్కొని మేనంతయు గగురుపొడను నతనిని ముద్దిడినదమ్మె! మఱి యొక మెఱుంగుఁబోఁడి,నర్తనము సేయుటచే నల్లలాడుచున్న కుండలముల కాంతులచే నెంతయు సొగసు గులుకుచున్న కృష్ణు నిద్దంపుఁజెక్కిలితోఁ దన చెక్కిలిని గదియింపఁగా నతఁడు పుక్కిటివిడియమునిచ్చి మన్నించెను. వేఱొక చెలువ, యందియలును మొలనూలును గల్లుగల్లని మెరయుచుండ, నాడుచుఁ బాడుచునుండి యంతె మిక్కిలియు నలసిసొలసి కెలన నిలుచున్న కృష్ణుని హస్తమును, దామరవలెఁ జల్లనై యున్నదానిని,శివంబగుదానినిఁ గుబ్బచన్నులయందిడుకొనెను.తక్కిన గోపికలును లక్ష్మీదేవికొక్కటి కే నల్లభుండయి యొప్పునచ్యుతునిఁ జెలువునిఁగాఁ బడసి యతఁడు తమ మెడలయందుఁ జేతులువైచి గాఁగిలించి కొనియుండఁగా నతనిని బాడుచుఁ గ్రీడించిరి. చెవులయందుఁ జెఱివిన కలువపూవులును, అలకలచేఁ జెలువు గులుకుచున్న నునుఁజెక్కులును,జెమటబిందువులును,మొగమునకుమఱింతముద్దులుగూర్చుచుండఁగా, వలయములునునూపురములును జెఱుగ జెలును వాద్యములై చెలంగఁగా,ఝంఝుమ్మను తుమ్మెదలు గాయకులై వెలయఁగా, గోపికలు రాసగోష్ఠియందు,గొబ్బుముడులనుండి పూ

దండలు జాఱుచుండ సంబరమునఁ గృష్ణునితోఁబాటిగా నర్తనముచేసిరి. ఇట్లే శ్రియఃపతియగు భగవంతుఁడునుఁ గౌఁగిలింతలు గావించుచును,గరములచే నల్లల్లగుబ్బలు మొదలగువానిని బుడుకుచును, నెయ్యంపుఁజూడ్కుల నిగిడించుచును, అకుంఠితంబులగు సింగారంపుఁజెయ్వులు గావించుచునుఁ, దెలినవ్వులు నవ్వుచును, నిట్లు బిడ్డఁడు తనప్రతిబింబములతో నాడికొనునట్లు, స్వాత్మికలయిన గొల్లబింబాధరలతోడఁ గ్రీడించినవాఁడయ్యె. ఆచెలువలకుఁ గృష్ణుని యంగసంగమువలన నెంతయు సంతోషము పొదలి యింద్రియములు పరవశములయినవి.కనుక వారుమాల్యములును నాభరణములును బ్రిదులుచుండఁగా,ఆపారవశ్యమునవీడినకురులునుగట్టినపట్టుపుట్టములును,గుబ్బలపయిని బయఁటలును జాఱుచున్నను వానిని వేగఁజక్కఁగా సవరించుకొనుటకు నెంతమాత్రము చాలరయిరి. కృష్ణుని యీక్రీడా విలసనమునుగాంచి యాకసమునందు దేవతాస్త్రీలును గామార్తితలై యెంతయు మోహమునొందిరి. చంద్రుఁడును, శుక్రాంగారకాది గణముతోడఁ జూచి *విస్మితుఁడయ్యెను. భగవంతుఁడు గోపికలెందఱో తానందఱై, యాత్మారాముఁడయ్యును కేవలము లీలకై వారితోడ రమించెను. ఆపూఁబోఁడులు సురతములచేతను గ్రీడలచేతను మిక్కిలి బడలిక నొందుటఁ జూచి కృష్ణుఁడు కరుణాత్ముఁడుగాన నిరతిశయసుఖకరంబగు తనకరముచేతఁ జెమరించుచున్నవారి ముద్దుమొగములను

* చంద్రుఁడు విస్మితుఁడై తనగతిని మఱవఁగా తక్కిన గ్రహములును నక్షత్రగతులను మఱచి యచటనే నిలిచియుండెను. కావున రాత్రి దీర్ఘము గాను నయ్యె నని తెలియునది.

బ్రేమగడలుకొనఁ దుడిచెను. గోపిక లాకృష్ణునఖస్పర్శములచే మిక్కిలియు మోదములు పొందిగొనుచుండఁగా, నల్లలాడుచున్న బంగరు కుండలముల కాంతులును ముంగురుల నిగనిగ మెఱుంగులును నిద్దంపుఁజెక్కులందు నునుపారుచున్న సొంపువెంపుచేతను, అమృతమువలె సొగయించుచున్న చిఱునవ్వు నూలుకొన్న చూడ్కులచేతను, దమభర్తకు మిక్కిలియు నుబ్బుగూర్చుచు నతని చేష్టితములను బాడిరి. వారినెమ్మేని రాపులవలన మిక్కిలియు నలంగినదై వారి కుచకుంకుమములచే నెఱుపువన్నె పాఱియున్న తనపూమాలికను వెంబడించి మేటిగంధర్వులవలెఁ బాడుచుఁ గందు తుమ్మెదలు వచ్చుచుండఁగా, నాకృష్ణుండా రతిక్రీడలవలని బడలికను బోఁగొట్టుటకై యాకులుకులాండ్రనుగూడి, గజపతి బడలికనొంది యాఁడుగజములతోడంగూడి దరినిగూల్చి మడుఁగునందుఁ జొచ్చునట్లు, లోకవేద మర్యాదలనుమీఱి, జలమునందుఁ బ్రవేశించెను. అభగ

## జలవన క్రీడావర్ణనము.

వంతుఁడు కృష్ణుఁడు తా నాత్మారాముండయ్యును గజపతిలీల ననుకరించుచు, జలముసొచ్చి చెలువలు పకపకనవ్వుచును గేరడముసేయుచును బ్రేమలు గడలుకొనఁ బయినీరుచల్లి దొప్పఁదోఁచుచుండఁగాఁ దానును వారిని జల్లులచేఁ దడుపుచు, పయిని విమానములందుండి చూచుచున్న దేవతలు పూవులసోనలు గురిసి పొగడుచుండఁగా, నారాసక్రీడయందు రమించినవాఁడయ్యె, అంతఁ గృష్ణుఁడు మెట్టపూవులయు నీటిపూవులయుఁ దావులతోఁగూడినదెమ్మెరలు నలుగడల హాయిగావీచుచుండఁగా, మిక్కిలి వెలయుచున్న యమునానదిపొంత నున్నయొకవనమునందుఁ

దేండ్లును బూవుంబోండ్లును గుంపులై బలసిరా, మదజలములు దొరుఁగుచున్న బరికాఁడు ఆఁడుగజములతోడంబోలె, నందుఁ జరించుచుండెను. ఇట్లు సత్యసంకల్పుఁ డతఁడు, అబల లను రక్తిఁగొని గుములై తన్నుఁగొలుచుచుండఁగా, శరదృతువునం దనుభవింపఁబడునవియుఁ గావ్యములందు వర్ణింపఁబడినవియు నగు రసములకెల్ల నాటపట్టయి చంద్రకిరణములచేఁ దళతళ మెఱయుచునుండు నాశారదరాత్రు లన్నియును,నాపడతులతోఁ గూడి క్రీడించుచున్నవాఁ డయ్యెను, వీర్యమును స్ఖలింపఁజేయక తనయందడఁచికొనినవాఁ డయి యుండి, యట్టిరాత్రుల ననుభవించెను' అనెను.

రాజు 'జగదీశ్వరుఁ డగుభగనంతుఁడు ధర్మమును సంస్థాపించు కొఱకును, నధర్మమును నడంచుకొఱకును దనయంశమగు బల రామునితోడ నవతరించినాఁడుగదా. ఇట్లు ధర్మమర్యాదలనెల్లఁ దానే యనుష్ఠించుచును,నితరులకుపదేశించుచును,దానికి విరో ధులగువారిని నిరసించి నలుగడల రక్షించుచుండునట్టి వాఁడై యుండి, బ్రాహ్మణోత్తమా ! ధర్మమునకుఁ బ్రతికూలమయిన పరదారస్పర్శనమును నెట్లాచరించినాఁడు ? ఆయదుపతి యవాప్తసమస్తకాముఁడై యుండియు నిట్టి నిందిత మయినకార్య మునుగావించినాఁడే! ఏయభిప్రాయముచేత ? సువ్రతా! మాకుఁ గల యీసందేహమును ద్రుంపుము' అనెను. అందులకు శుకుఁడు 'ఈశ్వరులై శాస్త్రవశ్యులుగాక యుండువారు ముందువెనుక విమర్శింపక యిచ్చవచ్చినట్లు శాస్త్రోక్త ధర్మముల నుల్లంఘింపు చుటచూపట్టెడిని.అయినను వారు మిక్కిలియుఁ దేజముగలవా రగుటచే నగ్ని సమస్తమును భుజించియు దోషిగానట్లు వారి

కది దోషము గానేరదు. ఇట్లు వారుచేసిరని, యనీశ్వరుండై శాస్త్రవశ్యుండగువాండు దానొకప్పుడును మనస్సుచేతను జేయరాదు. రుద్రుండు సముద్రమందలి హాలాహలవిషమును భక్షించినాండుగాన నేనును భక్షించెదనని మూఢత్వముచేత విషము దినువాండు వేగముగ నశించునుగదా. (కర్మవశ్యులుగాని) యీశ్వరులగువారు చెప్పెడి వచనములుమాత్రము పూర్ణముగా సత్యములే (ప్రమాణములే) యగును. వారియాచారములో యేదో యొకానొకటియె ప్రమాణములగును గాని, యన్నియుంగావు. మఱియు వారియాచార మెద్ది వారివచనములకవిరుద్ధముగా నుండునో, యదియే సత్యము. కాన బుద్ధిమంతుండయినను నీశ్వరునివచనమునకనుకూలమయిన యీశ్వరాచరితమునే యాచరింపవలయును. వారి యాచారమేనియు వారివచనమునకే విరుద్ధమగునేని యాచరింపరాదు. తేజోవంతులయినయీయీశ్వరులకు నిహమునం గుశలముగాం జేయుటవలన నొక యర్థమును గలుగదు; అకుశలముగాం జేయుటవలన నొకయనర్థమును గలుగదు. ప్రభూ! ఏలన వారనాత్మయగు*దేహమం దాత్మాభిమానము లేకుందురు. ఇట్లు కర్మవశ్యులుగాని జీవులకే కుశలాకుశలాచారముల మూలమున నర్థానర్థములు గలుగ వనంగా, తిర్యక్కులు మనుష్యులు దేవతలు నని

* దేహాత్మాభిమానము పూర్వాపూర్వకర్మములచే గలిగి మరల నుత్తరోత్తర కర్మములకు మూలమగును. దేహాత్మాభిమానము లేమివలనం గర్మవశ్యత్వమును లేకుండును. కర్మవశ్యత్వము లేనందువలన శాస్త్రవశ్యత్వము లేకుండును. శాస్త్రవశ్యత్వము లేకుండుటవలన ధర్మాధర్మమూలమునం గలుగు అర్థానర్థములు లేకుండునని భావము.

నియామ్యములయినసమస్తజంతువులకును నియంతయగు సర్వేశ్వరునకుఁ గుశలాకుశలకర్మములవలన దుఃఖాదుఃఖ సంబంధమెక్కడిది ? ఎవ్వని పదారవిందపరాగమును మిక్కిలియు సేవించి శబ్దాదివిషయాభిలాషలెల్ల నుడిగి తృప్తులై పదారవిందానుధ్యానయోగముసామర్థ్యముచేత సకలములైన కర్మబంధములను దూలించి యుండుసనకాదిమునులు సయితము కట్టునొందక శాస్త్రవశ్యులుగాక తమయిచ్ఛచొప్పునఁ జరింతురనఁగా, నీకఁ గర్మమునఁగాక యిచ్ఛచేత శుద్ధసత్త్వమయం బగువిగ్రహమును బరిగ్రహించునట్టి భగవంతునకు నెద్దియాచరించినను బంధమెక్కడిది?ఆప్తకాముఁ డగువానికి గ్రామ్యచేష్ట యెట్లుతగునని యడిగితివి. గోపికలకును వారిపతులకును,నశ్లేతక్కినజీవులకును నెవ్వఁ డంతరాత్మయైలోపలవ్యాపించి నియమించుచు, వారివారికిఁ గర్మానుగుణములగు సుఖదుఃఖాదిఫలముల నిచ్చు నధ్యక్షుఁ డగునో,యాభగవంతుఁడు కృష్ణుఁడే క్రీడించుకొఱకు దేహమును గయికొన్నాఁడు; కాని,మనవలె,సుఖదుఃఖాది భోగమునకైకర్మాయత్తదేహమునుబొందినాఁడుగాఁడు.అట్లుక్రీడ కవతరించినాఁడు గానయట్టిచేష్ట యనుచితముగాదు.అయినను నవాప్తసమస్తకామునకుఁగ్రీడవలనఁ గలుగు సుఖలవముతోఁ బనేమి'యని యందువా? మనమాదిగాఁ గలభూతముల ననుగ్రహించు కొఱకును మనుష్యుని దేహమువంటిదేహమును గయికొని క్రీడలట్టివి గావించినచోఁ దానిని విని జనుఁడు భగవత్పరుఁడగునో*యట్టివినాచరించు

---

* భగవదవతారమునకుఁ గ్రీడయవాంతర ప్రయోజనము. భూతానుగ్రహమో పరమప్రయోజనమని భావము. అవతారముక్రీడకొఱకు;క్రీడయనుగ్రహముకొఱకు నని సంబంధము. నాక్రీడలు కనుచు లోకము నిరతిశయపురుషార్థ

చున్నాఁడు. ఇట్లు క్రీడయు భూతానుగ్రహమునకేకాన యిం దును దోషములేదు. పల్లెయందున్న గొల్లముద్దియల మగ లాకృష్ణుని మాయచేత మోహితులై తమతమయిల్లాండ్రను దమప్రక్కనే యున్నట్లు తలంచుచుండిరి గాని కృష్ణునియందుఁ దప్పుగొన్నవారు గారయిరి. అంత బ్రాహ్మముహూర్తము రాఁగా, వాసుదేవుఁడు కృష్ణుఁ డభినందించి పోవుటకాజ్ఞ చేసి నను నాభగవంతుని యందే నిరతిశయప్రీతి గలవారు గాన యా గొల్లగుబ్బెతలు పోవుట కించుకయు నొల్లక యెట్లో యురియాడునుల్లంబుల నెట్టకేలకుఁ దమతమగృహములకుఁ బోయిరి. గొల్లవధూమణులతోఁగూడఁ గృష్ణుఁడు గావించిన యీరాసక్రీడితమును బురుషుఁ డెవ్వఁడు శ్రద్ధగలిగి క్రమంబున విన్నను లేక వర్ణించి వినిపించినను, వాఁడు భగవంతునియందుఁ బరమాంబయిన భక్తినిబడసి, జీవదశయందే జితేంద్రియుఁ డై మిక్కిలియు హృదయరోగ మగునజ్ఞానమును వేవేగ నిరసించిన వాఁ డగును. ఇది ముప్పది మూఁడవయధ్యాయము.

---

## సర్పరూపధరుం డయినసుదర్శనుం డను గంధర్వుని శాపమోక్షణము.

ఒకానొకప్పుడు గోపకులు పశుపతిదేవయాత్రకుఁ బోవ నెంతయుఁగుతుకములు పుట్టఁగా నెద్దులు గట్టినబండ్లనెక్కి యం బికావనంబునకుఁ బోయిరి. వారచట సరస్వతీనదియందు స్నా

---

భూతుఁడును ఇష్టానిష్టప్రాపణపరిహారసమర్థుఁడు నగుతనయందు మిక్కిలి యా సక్తినొందు విధముగా ననుగ్రహించుకొఱకుఁ గ్రీడను బూనుటయేకాని యది పూర్తిచేతఁ గాదని భావము.

నము చేసి, ప్రభుండగు పశుపతిదేవునిని నంబికాదేవినిని గంధాదులగు పూజాద్రవ్యములచే భక్తితోడ నర్చించిరి. మఱియు వారు 'పశుపతిదేవుఁడు మాయెడం బ్రీతుం డగుఁగాక' యని కోరుచు నందులకై బ్రాహ్మణులకు గోవులను బంగారమును వస్త్రములను దేనియను మధురాన్నమును నాదరంబున నొసఁగిరి. అంత నందుండును నందకుఁడు మొదలగునాగోపకులు భాగ్యం బొసఁగ నారాత్రి జలముమాత్ర మాహారముగాఁగొని వ్రతంబూని సరస్వతీతీరముననే వసించియుండిరి. ఆయంబికావనమందు నొక పెనుఁబాము మిక్కిలి యాఁకట నకనకలాడుచు వసించియుండెను. ఆ సర్పము దైవికముగా వచ్చి యందుఁ గ్రుష్మురుచు నచటఁ బరుండియున్న నందునిఁ బట్టుకొని మ్రింగసాగెను. అట్లు పామునకుఁ జిక్కియా నందుఁడు 'కృష్ణా! కృష్ణా! నాయనా! ఇదిగోఁ బెనుసర్ప మొకటి నన్నుఁబట్టి మ్రింగుచున్నది. నిన్ను శరణుఁ జొచ్చిననన్ను విడిపింపుమీ' యని బిగ్గఱఁ గూయిడెను. అట్లతఁడు మొఱయిడుటనువిని గొల్లలందఱును దటాలున మేలుకొని లేచి సర్పమున కతఁడు పట్టువడియుండుటనుగాంచి,సంభ్రమించి కొఱవులనెత్తుకొని యాసర్పమును జదియ నడిచిరి. కొఱవులచేత నెంత బిట్టుగాఁ గొట్టుచున్నను నాసర్ప మతనిని విడిచి వదిగాదయ్యె. అంతభక్తపాలకుండగు 'భగవంతుఁడు కృష్ణుఁడక్కడకు వచ్చి యాసర్పమును దనపాదముచే స్పృశించెను. అదియు నా భగవంతుని శ్రీమత్పాదారవిందస్పర్శమునఁ బాపములెల్ల నశింపఁగా,సర్పదేహమును విడిచివిద్యాధరులచేనర్చితంబగు తన తొంటిరూపమును గయికొనెను. అట్లు హేమమాలికను దాల్చి ధగధగని మెఱయుచున్న దేహముతోఁ దనకుఁ



1912. సర్పము నందునిఁబట్టుకొనుట; శ్రీకృష్ణుఁడు నందుని విడిపించుట.

ప్రణమిల్లి ముంగల నిలుచున్నయాతనిని హృషీకేశుండు కృష్ణుండు 'నీవెవ్వండవు ? మిక్కిలియుఁ గాంతిచేత వెలుంగుచున్నావే ! శుభదర్శనా ! నీకిట్టి నిందిత మయినగతి యేల కలిగినది? ఇట్టిగతిఁ బొందునట్టి పరవశుండేల కావలయును?' అని యడిగెను. సర్పము 'నే నొకవిద్యాధరుండను. నన్ను సుదర్శనుండని పలుకుదురు. నేను ధనము పెంపును జక్కందనము సొంపును మీఱంగా దిక్కులయందు విమానమెక్కి సంచరించుచు నారూపమునకు గర్వించి విరూపులయినయాంగిరసులనెడి మునులను జూచి నవ్వితిని. ఇట్లు నాపాపముచేత వారిని బరిహసింపంగా వారీసర్పజాతిని నాకుఁ గలిగించిరి. అయినను నాకిరుణాత్ములు నన్నట్లు శపించుటయు నన్ననుగ్రహించుకొఱకే. కావుననే సర్వలోకగురుం డగు నీదుపాదపద్మము సోఁకి పాపములెల్ల దూలినవాఁడ నయితిని. ఇది వారి యనుగ్రహమే కదా. పాపములెల్లలను దూలించు నీపాదస్పర్శమువలన శాపము వీడితిని. ఇఁక సంసారమునకు వెఱచి శరణుఁజొచ్చినవారి భయములనెల్ల నుడుపునట్టి నిన్ను నాకుఁబోవ ననుజ్ఞ వేఁడుచున్నాను. మహాయోగీ ! మహాపురుషా ! సజ్జనపరిపాలకా ! నిన్ను శరణుఁ జొచ్చితిని. కృష్ణా ! సర్వలోకేశ్వరా ! నాకు సెలవు సంగుము. అచ్యుతా ! నిన్ను దర్శించినంతమాత్రనే తోడనే బ్రాహ్మణశాపమునుండి విడివడితినిగదే. ఇదియొక వింతకాదు, ఏలన, ఏనీ నామమాత్రమును నుచ్చరించుపురుషుఁడు తన్నును వినువారిని నందఱను దోడనే పవిత్రులను జేయుననఁగా నట్టినామప్రభావముగల నీయడుగు సోఁకినప్పుడు శాపమునుండి విడివడుటయెంత మాత్రము !' అనెను. ఇట్లు సుదర్శనుఁ డా భగవంతునివలన

సెలవుపుచ్చుకొని ప్రదక్షిణముచేసి నమస్కరించి దేవలోకము నకుఁబోయెను. ఆయిదుమనుండి నందుఁడును విడివడ్డవాఁడయ్యె. గొల్లలందఱు నపుడు కృష్ణుని స్వాభావికమహత్త్వమును జూచి యావనమందలి నియమమును సమాప్తముగావించి యాదరంబున నతనిమహిమలనే ముచ్చట లాడుకొనుచు మందకు మరలిపోయిరి.అంత నొకనాఁ డద్భుతపరాక్రములయిన రాముఁడును గృష్ణుఁడును జక్కఁగానలంకరించుకొనిమెయినిండఁబూఁతలలంది, పూఁదండలనుదాల్చి, నిర్మలము లయినవలువలు గట్టి, గొల్లపడఁతులు చుట్టునుబరివేష్టించి యక్కజములగు మక్కువల నింపుఁగా దమ్ముఁబాడుచుండఁగా, వనమందు, విహరించుచుండిరి. అపుడు చందురుఁడును జుక్కలును నుదయింప, మల్లెపూవుల తావులకు మత్తిల్లి తుమ్మెదలు ముసరఁ, గలువలవాసనలుగొని గాడ్పు వీచుచుండు నిశాముఖము(మాపటివేళ)ను నెంతయుఁ గొనియాడిరి. షడ్జము మొదలయిన సర్వమండలముల మూర్ఛనము లొక్కపెట్టనే కల్పించుట నిబద్ధము గానందున నది యెవ్వరికి నశక్యమగును.వీరో యట్టివానిమూర్ఛనములను దామొక్కపెట్టునఁగల్పించుచు సమస్తభూతముల మనసులకును జెవులకును నింపుసొంపారునట్లు గానముచేసిరి.గోపికలా గీతము లాలించి విని మూర్ఛితలై కట్టినపట్టువలువలు జాఱుచున్నను, నెఱికురులనుండి పూఁదండ లురులుచున్నను,తమదేహముల నెఱుంగరయిరి. ఇట్లు రామకృష్ణు లిరువురును విచ్చలవిడి మిక్కిలిమత్తిల్లినట్లు విహరించుచుండఁగాఁ గుబేరుని యనుచరుఁడు శంఖచూడుఁ డనువాఁడక్కడకు వచ్చెను.వాఁడు రామకృష్ణులు దిక్కైయున్న యాయబలాజనమును జంకులేక కదిసివారుబిట్టు కుయ్యి

డుచుండఁగా, రామలక్ష్మణుల కన్నులయెదుటనే యుత్తరదిశకు బలవంతముగాఁ దఱిమి గొంపోవసాగెను. ఆయన్నదమ్ము లిరువురును, దమ్ముఁ జేపట్టియున్న యానారీజనులట్లు 'కృష్ణా! రామా!' యని బెబ్బులికిం జిక్కిన యావులవలె నఱచుచుండఁగా విని తోడనే వెంటఁబరుగిడిరి. వారిరువురును సాలవృక్షములు కేలం గొని భయపడవలదని వారి కభయముఁజెప్పుచు బలిమిమెఱసి యంతవేగిరముగాఁ బోవుచున్న యాగుహ్యకాధముని వేగదఱిసిరి. వాఁ డాయిద్దఱును గాలుండును మృత్యువునుంబోలెఁ దన్నుఁ దలపడుటనుజూచి యెంతయు భీతిగొని, స్త్రీజనమును దిగవిడిచి వారిని శరణుఁజొచ్చి తన్నుఁగాచికొను వెరవుతెలియక బ్రతుకుఁగోరి వేగ పరుగువాఱెను. కృష్ణుఁడు వాని శిరస్సునందలి రత్నమును దీసికొనఁగోరి వాఁ డెందెందుఁ బరుగిడినను నందందుఁ దానును వెంటఁబడి తఱిమెను.అప్పుడు బలరాముఁడు స్త్రీలను గాచుచుండెను. విభుఁడు కృష్ణుఁడును వానిని గొంతదవ్వననే తఱిసి యాదురాత్ముని శిరమును బిడికిటచేతనే పొడిచి వాని చూడామణిని గయికొనెను. ఇట్లతఁడు శంఖచూడునిఁ బోరి గొని తలతల మెఱయుచున్న మణిని గయికొని పడఁతులంద ఱును జూచుచుండఁగా దానిని బ్రీతితోడఁ దనయన్నకు నొసంగినవాఁ డయ్యె. ఇది ముప్పదినాలవయధ్యాయము.

---

{ పగటిపూఁటఁ గృష్ణుని విరహము సైఁపక గోపికలు విలపించుట. వేణుగీతలు. }

కృష్ణుఁడు పగటివేళల వనమునకుఁబోవఁగాఁగోపికలు మనసు లతనివెంటఁదగిలి పాఱఁగా విరాళిసైఁపక యాకృష్ణుని లీలలఁ

బాడుచును, బగళ్లెట్లో కష్టమునఁ గడపినవారయిరి.

గోపికలు—గోపికలారా! ముకుందుఁడు దాపలి మూఁపు పయిని దాఁపలిచెక్కిలినూఁది, బొమలు త్రిప్పుచు, మృదువు లయిన వ్రేళ్లను బిల్లఁగ్రోవిరంధ్రమార్గములందు నిడి, యా వేణువును నధరమందుఁ జేరిచి, యింపుగా వాయించునపుడు ఆకాశమునఁజరించు సిద్ధులముద్దియలుతమపతులతోడ నున్నను నాపిల్లఁగ్రోవిరవళిని వినఁగా మొదట నబ్బురపడి యంత మరుఁడు పూవుటమ్ములచే మనసులను గ్రమ్మఁగా సిగ్గు లూని పోఁకముళ్లు సళ్లుగాని వలువలు జాఱ చాలఁ గలఁకనొందిరి.ఇట్టి వన్నెకానిని బాసి మన మెట్లోర్వఁగలమే. అబలలారా! బలారే! ఈవింత వినుఁడు. ముత్తెంపు సరులసిరులుగులుకు తెలినగవుతో, నురమున మెఱుపుఁదీఁగవలె సిరి నెలుఁగుచుండునందునికొఱకును వీఁడు,తన్నెడఁబాసి కందకుందుచుండుమాబోఁటివారికి నెంతెయు దుఃఖమునుగూర్చుచు వేణువు నూఁదునపుడు,మందయందుఁగల యావులును నెద్దులును దక్కిన మృగములును వేణువువాయించు రవళి తమమనస్సులను హరింపఁగా దూరమునందే నిలిచి. పండ్ల యందుసగము కొఱికిన గఱికలు వెలయ, వీనులనిక్కించి,నిదురిం చినవానివలెను, వ్రాసిన చిత్తరువులవలెను,గదలక మెదలక నిలిచి యున్నవిచూఁడు. చెలియా! కృష్ణుఁడు నెమలిపురులను బూవుల గుత్తులను గైరిక ధాతువులను జివురాకులను గొని, మల్లుల చేల వలెనలంకృతులు గావించుకొని బలభద్రునిఁగూడి యెప్పుడెచ్చట గొల్లలును దానును వేణురవళిచేగోవులనుబిలుచునో,యపుడచెంత నములఁగునదులును నతనిపదాంబుజములనుండిగాడ్పుకొనివచ్చు రజమును,మనవలె నంతఁగా బుణ్యాత్మకములు గానందునఁ బడ

యక యూరక కోరుచు, మనముగృహకృత్యములుదప్పి కృష్ణుండని భ్రమసి చేతులుసాచుచుఁ గానకమ్రానుపడినిలుచునట్లు తాము ను బ్రవహించుగతులుతప్పి ప్రేమమునఁ గరళ్లనెడిచేతుల నల్లా ర్చుచు,జలములు కదలి మెదలి సాఱకుండఁగానూరకున్న విచూడు ము!అనుచరులగుగొల్లలుతనపరాక్రమమునువర్ణించుచుండఁగా నాదిపూరుషునివలె సిరి తన్నెప్పుడుఁబాయక యుండ,వనమందుఁ దిరుగాడుచుఁ గొండనెత్తములందుఁ గ్రుమ్మరుచుండు గోవులను వేణువుచే నతఁడు పిలుచునపుడు, భక్తజనులు తమహృదయము లోపల ధ్యానముచేత హరినిదాల్చుచుఁ బూజార్థము కల్పితము లయిన పుష్పఫలములతోఁ బ్రణామముచే వినతులయి పులకిత గాత్రులై యానందబాష్పములను విడుచునట్లు, వనమందలితీఁగ లును, అవి పెనఁగొన్నవృక్షములును, తమయందును విష్ణుఁడు న్నాఁడని సూచించుచున్నవియుం బోలె బుష్పఫలములచే నిం డారి,బరువుచేతఁ గ్రొమ్మలు క్రిందికివ్రాల, ప్రేమచేత మొగ్గలనెప మున గగ్గురులుపొడమ, మకరంద ధారలను విడుచుచున్నవి! ఏ మాశ్చర్యము!పన్నెకాండ్రయందుఁగన్నాకై,కన్నులవిందుగా దిలకమిడి,వనమాలయందుదివ్యగంధమునుబాళించుచున్న తులసి లోనిపూదేనియలు గ్రోవికేరుచున్న తుమ్మెదకదుపులు జుంజుమ్మని బిగ్గఱఁగా మనంబున కింపగ్గలింపఁ బాడుపాటలను బాటించి విను చుఁ,గృష్ణుండు కెమ్మోవియందుఁబిల్లంగ్రోవినిగూర్చునపుడు, సర స్సునందు సారసములు హంసలునునుపక్షులు మెచ్చయినయాగీత ము తమచిత్తములనుమ్రుచ్చిలింపఁగా జంకమాలిదరిసి యేకా గ్రములగు మనంబులతోఁ, బారవశ్యమునఁగన్నులుమూసి మౌ నముదాల్చిహరి నుపాసించుచున్నవి. గోపికలారా! బలునింగూడి

కృష్ణుఁడు ముత్తెంపు సరిని దలపువ్వుగా నొదలయందు మురువు గులుకఁ జెరివికొని, కొండచఱియలందుఁ దిరుగుచుఁ దన కెంత యానంతసముపుట్ట, విశ్వమును సంతసింపఁజేయుచు వేణురసము చేత లోకమునెల్ల రంజింపఁజేయునపుడు, మేఘ మామహాసీ యుని ధ్వనిని తనగర్జనముచే నతిక్రమించుటకు మనంబునఁ జంకి, యతని వేణురవళి కనుగుణముగా నల్లల్లనఱిముచు నలు పునందును నాశ్రితతాపశాంతియందును దనకు మిత్రమయిన యాకృష్ణునిపైఁ *బూవుల సోనలుగురియుచుఁ, జననీడచే నత నికిఁ గొడుగును గావించినదయ్యె. అమ్మా! యశోదా! నానా విధములగు గోపక్రీడలయందు నిపుణుండగు నీసుతుఁడు, దొండ పండువంటి కెమ్మోవియందు వేణువు నూన్చి యొకరివలనవిన్నవి గాక తనంతఁగఱచిన షడ్జనిషాదాది స్వరజాతులను నావేణు వాద్యమునందు బహుప్రకారముల నాలాపించినపు డింద్రుఁడు శివుఁడు బ్రహ్మ మొదలుగాఁ గలదేవతాశ్రేష్ఠులు నాగీతిధ్వని వంక మెడలు మలంచి చిత్తములు దిటగానిలిపి మాటిమాటికి నాస్వరములను నెంతయువిని, యందుఁ దాముపండితు లయ్యు, నాస్వరభేదముల కలరూపును దెలియక తబ్బిబ్బుపాలయిరి. ధ్వజ ము, వజ్రము, పద్మము, అంకుశము, మొదలుగాని చిత్రములైనచి హ్నములు గలతనపదము లనెడి తామరదళములచేత, భూమికిఁ గొరిజలవలని బాధను నుడుపుచు, గజరాజుంబోని గంభీరంపు నడతో వేణువు నూఁదుచు వచ్చునడమురిపముచేతను విలా సంపుఁ జూడ్కులచేతను మాకు మరులు వేంద్రమై తీండ్రిం పఁగా, మాక్రొంకులగతిని నిశ్చేష్టతనొందిమోహామునఁగ్రొమ్ముడి

---

* మేఘములను గొన్నియెడలఁ బూలసోనలు గురియుట ప్రసిద్ధము.

పీడుటగాని వలువ జాఱుటగాని తెలియముగదే. గోవులను లెక్కించుటకై గ్రుచ్చియున్న మణిసరమును దాల్చి యొక్క చోట నామణులచేత గోవులను నలుగడల లెక్కించుచు, మన స్సున కింపయిన తావులు బుగులుకొను తులసిదండను దాల్చి, తన యనుఁగుఁ జెలికాని మూఁపుపయిని బుజమును వైచి, వేణుగా నము సేయునపుడు, కృష్ణసారగృహిణులగు హరిణులు మొర యుచున్న యావేణురవళి తమచిత్తముల నువ్విళ్లూరింపఁగా, గృహములందాశలను డిగవిడిచినగోపికలవలెనే, గుణగణ సముద్రుండయినకృష్ణుని వెంటనంటి కృష్ణునితోడనే కూడి యాడియుండినవి. *అనఘురాలా! యశోదా! మొల్లపూదండచేఁ వేషము గనుఁబండువుగాఁ జూపట్ట, నోయమ్మా! యానందుని కొడుకు నీగారాబుపట్టి కృష్ణుఁడుఁ దన నెచ్చెలులకు సొంపుఁ గూర్చుచు గోపకులు బలసి కొలువఁగా యమునయందు విహరించు నపుడు, చందనము వలెఁ జల్లఁగా సోఁకుచు మందమారుత మను కూలముగా వీఁచుచున్నది. మఱియు సిద్ధ విద్యాధరాదులయిన యుపదేవగణములు స్తుతులు గావించుచు వాద్యములచేతను గీత ములచేతను బుష్పవర్షాదులచేతను బలసికొలిచినవి. పర్వతము నెత్తి గొల్లలకును గోవులకును హితముగావించువాఁడై, వచ్చు దారియందు బ్రహ్మాదులయిన పెద్దలు తనచరణములకు వందన ములు సేయుచుండఁగా, సాయంకాలమందు గోధనము నంతయు నొక్కటిగా గుమిగూర్చి వేణువునూఁదుచు ననుచరులు తన

* ఇంతవఱకు బృందావనమందలి లీలలను బాడి యిఁక సాయంకాలమున గోవులను మరల్చి యమునయందుఁ గ్రీడించు నతని సౌభాగ్యమును వర్ణించు చున్నారని తెలియునది.

కీర్తిని బాగడుచుండఁగా, మరు లనెడిపెను తేవులుచే నించు
మించుగాఁ జూపుచెడి యున్నమాకన్నులకు నెంతో పండువు
గావించుచు గోరిజలదువ్వ నివ్వటిలుచున్న ఘ్రాదండతో, సుహృ
దులమగుమాకు, మనోరథముల నెల్లఁ గలిగించుతలంపున దేవకి
కడుపునఁ బుట్టినయాచుక్కల దొరయె వచ్చుచున్నాఁడు. *ఇం
చుక కలుమత్తుచేత కన్నుంగవసుడియఁ దననెచ్చెలుల నెంతయు
మన్నించువాఁడై యించుక పండిన బదరపుఁబండువలెఁ దెల్ల
నగు నెమ్మొగముతో, బంగరుకుండలముల కాంతిచేత మెత్తని
చెక్కిళుల బిత్తరంపువన్నె గూర్చుచు, మేటి యేనుఁగువలె
నీటు గులుకు నెన్నడతో, బలభద్రుఁడు దినాంతమునఁ జంద్రుని
వలెఁ బ్రసన్నంబగు మొగముతోడ మందయంపలిమాకుఁ బగ
టిపూఁటఁ దన్నెడఁబాయుటవలన దురంతమైకలుగుతాప
మును బుచ్చుచు, నిదిగో సమీపించి వచ్చుచున్నాఁడు' అని
పాడిరి. రాజా! ఇట్లు గొల్లపడఁతులు కృష్ణలీలలను బాడుచుఁ,
బగటిపూఁటలయందును నతనియందే జీవితములిడి మనస్సులను
జొనిపి మిక్కిలియు వేడుకగాఁ గ్రీడించుచుండిరి. ఇది ముప్పది
యేనవయధ్యాయము.

---

## వృషభాసుర వధము.

ఇట్లు శ్రీకృష్ణుచేత మందయంతయు సంతోషమునఁ బొదలు
చుండఁగా నపుడు నరిష్టుఁడను పేరుగల యొక వృషభాసురుఁడు
మందకు వచ్చెను. వాని కాయమును మూఁపురమును మిక్కి
లియుఁ బెద్దవి. వాఁడు తనగొరిజ తాఁపులచేఁ బుడమిని గ్రక్క

*ఇందు సమీపమునకు వచ్చుచున్న బలరామునిగూర్చి చెప్పుటఁ దెలియునది.

దల్చుచు, మిక్కిలి బిరుసుగా అంకెవైచుచును, గాళ్లచేత భూమిని రాచుచుఁ, దోఁకను బయికి నిక్కించి కొమ్ముకొనతోఁ గొబ్బిళ్ల గోరాడుచును, నడుమనడుమ నించించుక మూత్రమును బురీషమును విడుచుచును, గన్నులు ఱెప్పలిడక తేఱిచూచుచును, నచ్చటికి వచ్చెను. మిక్కిలి నిష్ఠుర మయినవాని పెడబొబ్బ వినఁగానే గోపులకును స్త్రీలకును భయమువలన నకాలికములగు * గర్భస్రావములును గర్భపాతములును గలుగుచుండును. వాని వెనుమూఁపురమును జూచి మేఘములు పర్వత శిఖరమని శంకించి యందుఁ జొచ్చుచుండును. అట్లు వాఁడి కొమ్ములుగల యావృషభాసురుని గోపకులును గోపికలును మొగమునెత్తి చూచి దిగులుపడసాగిరి. పశువులును భీతిగొని మందను విడిచి పరుగువాఱినవి. వారందఱును 'కృష్ణా! కృష్ణా'యని గోవిందుని శరణుఁ జొచ్చిరి. భగవంతుఁడును గోకుల మట్లు భయమున విహ్వలించుచుండుటను గాంచి 'భయపడవలదు' అని యూఱడఁబలికి వృషభాసురునితోఁ 'ఓరీ! మూఢా! దుర్జనశ్రేష్ఠా! దిగులుగొనియున్న పశువులతోను బసులకాపరులతోను బనేమిరా! నినుఁబోలిన క్రూరస్వభావు లయినఖలులకుఁగల బలము కావరమును నడంచునట్టివాఁడనురా నేను' అని పోరికిఁ బిలిచి బుజములు కరతలముచే నప్పళించి యాచప్పుడుచేత నాయరిష్టునకుఁ గోపము గలిగించుచుఁ జెలికాని మూఁపుపయిని సర్పదేహమువలె నిడుదయగు బుజమును జాఁచి నిలుచుండెను. ఇట్లరిష్టు

* నాలుగు నెలలలోఁగా గర్భముపడుట స్రావమనియు ఐదవ యాఱవ నెలలయందుఁ బడుట పాతమనియుఁ బిదపఁ గలుగుట ప్రసవ మనియుఁ జెప్పఁబడును.

నకుఁ గృష్ణుఁడు కోపముఁ బుట్టింపఁగా వాఁడు గొరిజలచే భూమినిరాచుచుఁ, బయికిఁ దోఁకనునిక్కించి యల్లలార్చుటల వలన మబ్బులు విరిసిపోవఁ, గ్రుద్ధుఁడై కొమ్ములకొనలు మందటికి నిగిడించి, కన్నులు నెత్తురు గ్రమ్మ ఱెప్పపాటులేక నిలిపి, కృష్ణునిఁ గడకంట నడ్డముగాఁ జూచుచుఁ నింద్రుఁడు వైచిన వజ్రాయుధమువలె వేగముగఁ గృష్ణునిపైఁ బఱతెంచెను. భగవంతుఁడును వానిని గొమ్ములచేఁ బట్టికొని, గజము మఱియొక గజమునుం బోలె, వానిని బదునెనిమిదియడుగులు వెనుకకుఁ బడఁద్రోచెను. అట్లు కృష్ణుఁడు పిఱిందికిఁ జిమ్మఁగా వాఁడు మరల వేగమ లేచి యంగములన్నియుఁ జెమర్ప, నిట్టూర్పులు విడుచుచుఁ గ్రోధమున మైమఱచి పయికి నడరుదెంచెను. అట్లు పయి నురవడించుచున్న యారక్కసుని భగవంతుఁడు కొమ్ములచేఁబట్టుకొని కాలందొక్కి నేలపయిం గూలఁద్రోసి దడిసినవస్త్రమును నలుపునట్లు మిక్కిలియుఁ బీడించి, వానికొమ్మును బెఱకికొని దానిచేతఁ ద్రెళ్ళనేసెను. వాఁడు నేలఁగూలెను. అట్లు వాఁడు నెత్తురులు గ్రక్కుచును, మూత్రపురీషములు విడుచుచును, గాలుసేతులు విలవిలఁ దన్నుకొనుచుఁ, గన్నులు గిరిగిరం దిరుగ మరణసంకటము నొంది యమునియింటికిఁ బోయెను. దేవతలును బుష్పములు చల్లుచు హరి నెంతయు స్తుతించిరి.

{ నారదుఁడు బోధింపఁగాఁ గంసుఁడు రామకృష్ణులను దోడితేర నక్రూరునిఁ బంపుట. }

ఇట్లు కృష్ణుఁడు వృషభాసురునిఁ జంపి తనజాతివారు బాపురే యని పొగడుచుండఁగా, బలునింగూడి గోపికలకుఁ గన్నులపండువుగా మందను బ్రవేశించినవాఁడయ్యె. అద్భుతకర్ముఁడగు



1922. వృషభాసుర వధ.

కృష్ణుం డరిష్టునిఁ బల్లెయందు వధించినపిదప దేవర్షి యగు నారదుఁడు కంసునిఁజూచి 'ఆకన్య యశోదకూఁతురు. కృష్ణుఁడు దేవకికొడుకు. రాముఁడు రోహిణికుమారుఁడు. వసుదేవుఁడు నీకు భయపడి తనచెలికాఁడగు నందునియం దాయిరువురు పుత్త్రుల నిల్లడగాఁ బెట్టెను. వా రిరువురచేత నీవు పంపినపురుషులు హతులయిరి' యనెను. కంసుఁ డది వినఁగానే కోపమువలన నింద్రియములెల్లఁ గలగుండుపడ, వసుదేవునిఁ జంపు తెంపునకుఁబూని వాఁడికత్తి నంకించెను; కాని నారదుఁడు వలదని వారింపఁగా నుడిగెను. అంతఁ గంసుఁ డావసుదేవుని కొడుకు లిరువురును దనకు మృత్యువని తెలిసి యతనిని నతనిభార్యనును నినుపసంకెలలువైచి చెఱఁబెట్టెను. నారదుఁడు తరలిపోయినపిదపఁ గంసుఁడు కేశియనువానిని బిలిచి రామకృష్ణులనుబట్టి చంపుమనిపంపెను. పిదప ముష్టికుఁడు చాణూరుఁడు శల్లుఁడు తోలకుఁడు మొదలగువారిని మంత్రులను మావంతులనును దిన్నని తనంబునఁ బిలిచి వారితో 'ఓయీ! వీరా! చాణూరా! ముష్టికా! ఇది వినుఁడు. నందుని మందయందు వసుదేవుని కొడుకులు రామకృష్ణు లిరువురును నున్నారఁట. వా రిరువురను నాకు మృత్యువుగా దైవము చూపియున్నది. వారిద్ద ఱిక్కడకు వచ్చినప్పుడు మీరు మల్లయుద్ధమున వేడుకగాఁ జంపి పుచ్చవలయును. మల్లరంగమున్న మేరయంతయుఁబలువిధములయిన మంచముల నమర్పుఁడు. ఇష్టంబునఁగావించు నామల్లయుద్ధమును బురజనులును దేశజనులు నందఱును జూడవచ్చును. మావటీ! నీవు మహామతివిగదే! కాన నేనుజెప్పెడి యీమాటను బాటిగావినుము. తొండముచివరను జెక్కులను నెప్పుడును మదజలము దొరుఁగుచుండు

గజమును గువలయాపీడమును దానితుండమున నొకటినుంచి రంగపుద్వారమునందు నిలిపిపెట్టవలయును. అది యచ్చట వసుదేవుని పుత్త్రుల నిరువురను జంపి తీఱవలయును' అనెను.అంత నామావంతుఁడును మనస్సు మిక్కిలియు వ్యాకులపడఁగాఁ గంసునితో 'రాజుగారి మేనల్లుండ్ర నాకెట్లు చంపఁదగును' అనెను. వాఁడట్లు చెప్పినందులకుఁ గంసుఁడు దుర్మతిగావున నందుఁగూడియున్నవా రెల్లవినఁగా నిట్లనియె. 'సభ్యులారా! నేనుజెప్పెడి యీమాటను బాటించి వినుఁడు.విని యంతయు మీమనస్సునందుంచి యాలోచింపుఁడు. వీరు నాకు బంధువులై యుండియు మొదటనుండి వీరియందు మంచిమనస్సు లేకయే, చెలిమిమీఱి నడచుకొనుచుండుటకుఁ గారణమేదియో చెప్పెదను.మాతల్లి,తామరరేకులవంటి కన్నులంగవగల భాగ్యవతి, యొకనాఁడు తనయింటి పూఁదోఁటయందు మెల్లనిగాడ్పు లల్లల్లఁ బొలయుచుండఁ దిరుగుచుండెను.ఆతోఁటయం దపు డశోకములును బొగడలును బొన్నలును బూచి పొలుపుగులుకుచుండెను. తుమ్మెదలు గుంపులుగొని నలువలంకులఁ దిరుగుచుండెను.కోయిల లింపుగాఁ గూయుచుండెను. మఱియు నందు నెమిళ్లు కదుపులుగొని పురివిచ్చి మెచ్చులుగులుక నాడుచుండఁగా, గోఁతులు కేరికెకలి కొమ్మలఁ బ్రాఁకుచుండఁగా,నెంతయు సొంపుగానుండెను.అపుడు రమణీయమగు వసంతసమయము.నలుగడలఁ బచ్చనిపూఁగుత్తులజొంపములెంతయు నింపుగూర్చుచుండెను. అట్టియుద్యానవనమందుఁ బతివ్రతయగు మాతల్లి,ఋతుస్నాతయై చక్కఁగా నలంకరించుకొని విహరించుచుండి తనభర్తను దలంచుకొనెను. ఆసమయమందే యొక గంధర్వుఁడు ద్రమిలుఁడనువాఁ డాతోఁటయం దం

త్పన్నితుండై సంచరించుచుండెను. వాఁ డపుడు మాతల్లి యొంటి మెయిని దిరుగుచుండుటఁగాంచి సకలప్రాణులలోని యాశయములను దెలిసినవాఁడుకాన యాబిడ మనంబునఁ జింతించినది దెలిసినవాఁడయ్యె. అంతవాఁడు కామార్తుఁడై యుగ్రసేనుని రూపమును గయికొని యతని నవ్వును బలుకులును జూడ్కులును నలవఱుచుకొని, పతికై మరులుగొని యున్నయాపతివ్రతను గదిసెను. ఆబిడయు నామతకము దెలియక వానిని గూడి యౌవనమున రమించినదయ్యె. పిదప నాసతి వాఁడు తన రమణుఁడు కాఁడని తెలిసి యపారమయినదుఃఖము మనసునఁ జెలంగఁ గన్నుంగవ కలంగ వానితో 'ఓరీ! ధూర్తా! నీ వెవ్వఁడవురా! పెద్దలకు నిందింపఁదగిన యిట్టికట్టిఁడిపనికిదురాత్ముఁడవై యొడిఁగట్టితివే?' యని యడిగెను. నిడుదబుజములు రాజిల్లు నాద్రమిళుఁ డాబిడను నల్లల్ల నూరడించుచు 'అబలా! మేము గంధర్వకులమునఁ బుట్టినవారముచుమీ! దేవతలకు సమానులము.మును దేవతాపతి యగునింద్రునకు ననుచరులము. సుందరీ!మీాబోఁటివారుమనుజులకేముపభోగ్యలు. అట్టిమనుష్యస్త్రీలకుమీాకుమేము సులభులుగాముచుమీా.కల్యాణీ!ఏలన, జనన మరణాదులయిన యాధివ్యాధులకుఁ బాలయిన మనుష్యులకును, దేవతలకును వాసి మిక్కిలియుఁగలదు' అనెను. అందుల కా యమ కోపమున నింద్రియములు గలంగ మరలవానితో 'నీవింతటిపలుగాకిపని చేసిన దేకాక మఱల నన్ను సమాధానపెట్టెదవా? పుణ్యపాపసాక్షు లయినయాభూమిని జలము నగ్నిని వాయువు నాకాశమును సూర్యచంద్రులను దిక్కులను గాలమును ధర్మమును రెండుసంధ్యలను నతిక్రమించి దురాత్ముఁడవై

నన్నిట్లు చెఱిచితివి. ఏనుఁగు మదముచేఁ గన్నుఁగానక వనము నడుమ నున్న తామరకొలంకును గలంచి చెఱచినట్లు,నీవు విచ్చల విడివై, నిర్మలమైయున్న నన్ను మలినురాలను గావించితివి.సురా ధమా! ఇంతలు సేసి మరల నన్ను నేమని యూఱడఁబలికె దవు ?' అనెను. అట్లు పలుకుచున్నయాయమను జూచి వాఁడు భయమునొంది శాపమిడునోయని జంకుచు'కంజాక్షీ! మనుష్య స్త్రీలయందు దేవతలకు సంగము క్రమమే. దేవతాస్త్రీలయందు మనుష్యులకన్ననో సంగమము క్రమముగాదు; అన్యాయమే యని తెలియుము. పద్మగంధీ! కాఁబట్టి నాయందుఁ దప్పిదము లేదని యెఱుఁగుము. కనుక,నీయందుఁబుత్త్రుఁడు పుట్టుఁగాక.నావీ ర్యము వ్యర్థము కానేరదు. అట్టు పుట్టువాఁడు శ్రీమంతుఁడుగను ధీమంతుఁడుగను మహోత్సాహయుక్తుఁడుగను నుండును. నా మాట యెప్పుడును బొల్లయినదిలేదు' అనెను. వాసిగన్న మాయమ్మ మిక్కిలి కుపితయై యెంతయుఁ బడయరాని తనపాతి వ్రత్యమును దిగవిడిచినందులకు మిక్కిలియుఁ బరితపించుచుఁ 'మర్యాదమీఱి, సదాచారమును ద్రోసిపుచ్చి, కానిదారిని నడచునట్టి పాపాత్ముఁడవునీవు. ఇట్టి నీకుఁ బుట్టునట్టియాపుత్త్రుఁడు సుగుణములులేక సాహసాదిదుర్గుణములు గలిగి క్రూరుఁడై యుండును. మఱియు వాఁడు దేవతలయు ద్విజులయుఁ దపస్వు లయు ననుగ్రహమునకుఁ బాత్రము గాకుండును' అని పలికెను. ఆయమ యిట్లుపలుకుచుమఱిమఱి కోపము రెట్టించుచుండుటను జూచి యాగంధర్వుండు శపించునని శంకించి'వాఁడు నీచుట్టాలకే శత్రుండగు'ననిపలికితోడనేయంతర్హితుఁడయ్యెను. వాఁడింటిపూఁ దోఁటనుండితరలిపోఁగానేకీర్తిగన్న మాతల్లి తనవృత్తాంతమెవ్వ

రికిని దెలియకుండ నింటికిఁబోయెను. అంత నామె గర్భమును దాల్చి ప్రసవకాలమున నన్నుఁగాంచెను. ఈవిషయమును నాకు భగవంతుఁ డగునారదుఁ డొకప్పుడు చెప్పెను. అదిమొదలుగా నేనీబంధువులయందు నాకుఁ బ్రతికూలురగు వారినెల్ల ద్వేషించుచున్నాను. వీరుగూడ నన్నెప్పుడును ద్వేషించుచునే యున్నారు. ఇదిమీరెఱుంగుదురుగదా. దుర్బుద్ధియగు నుగ్రసేనుని, దురాత్ముఁ డయిన దేవకునిని, ధూర్తుండగువసుదేవునిని వానియాశ్రయించియుండుతక్కినవారినిని, జంపఁగా నాకుదోషముగలుగదు. ఏలన నేను గంధర్వునివలనఁ బుట్టినవాఁడనేకాని యుగ్రసేనుని వలనఁగాదు. కావుననే యీరామకృష్ణుల నిరువురను జంపుటకానతిచ్చుచున్నాను. బలవంతమైన మనయేనుంగుచేత నాబాలురను జంపించి పరలోకమందలి యమునికిఁ బూజఁగావించెద. అంత నీవసుదేవాదులును వారు పోయినదారినే పోదురుగాక. వసుదేవుఁడు నుగ్రసేనుఁడును, నల్లె నందుఁడును దేవకుఁడును యాదవులును గోపాలురును వారి ననుసరించినతక్కినవారందఱును నాబాలురను జంపుచుండఁగా శోకాశ్రుజలపూర్ణము లయిన నేత్రములతోఁ జూతురుగాక. అయిష్టయుద్ధమును జూచుటకై దేశజనులను బిలిపింపుఁడు. మహామాత్రా! భద్రా! నీవు కువలయాపీడమును రంగద్వారమునకుఁ గొనిపొమ్ము. అగజముచేత నాపగవారి నాయిద్దఱను జంపింపుము. చతుర్దశినాఁడు యథావిధిని ధనుర్యాగమును దొడఁగుఁడు. కోరినవెల్లఁ గురియునట్టి భూతరాజగురుద్రునకు మేధ్యములయిన పశువులను విశేసింపుఁడు' అని యాజ్ఞచేసి యర్థశాస్త్రసిద్ధాంతములం దభిజ్ఞుఁడుగాన యదుశ్రేష్ఠుండగు నక్రూరునిఁబిలిచి యతనిచేయి తనచేతం

గీలుకొలిపి 'ఏమోయీ! మహోదారుఁడవుగదే! నీవాదరముతో నా కొకమిత్రకార్యము సేయవలయును. ఏలన నీకంటె హితతముండు వేఱొకఁడు భోజులయందును వృష్ణులయందును నాకుఁ గలుగఁడు. సౌమ్యా! కావున మిక్కిలియు గొప్పకార్యమునకు సాధకుండగు నిన్ను, నింద్రుఁడు విష్ణువు నాశ్రయించి తనయభీష్టమును బొందినట్లు, నే నాశ్రయించినవాఁడ నయితిని. నందుని మందకుఁబొమ్ము. అందు వసుదేవునికొడుకు లిరువురున్నారు. వారి నీరథముపయి నెక్కించి తోడితెమ్ము. జాగువలదు. వారిరువురను నాకు మృత్యువులుగా విష్ణువు నాశ్రయించియుండు దేవత లేర్పఱచి యున్నారుగదా. కానఁ గానుకలను గొనివచ్చు నందాదుల తోఁగూడ వారిని బిలుచుకొనిరమ్ము. వారి నిటకుఁ దెచ్చినంత నే మృత్యువునకు సాటియైన నాయేనుఁగుచేత వారిని జంపించెదను. వారు దానినుండి తప్పించుకొనిరా, యంతఁ బిడుగులవలె బెడిదులయిన మల్లురచేఁ బొరిమార్చెదను. ఆ యిరువురును హతులు కాఁగా, నందులకుఁ దపించుచుండు వసుదేవుఁడు మొదలగువారిని వారిబంధువులను వృష్ణులను భోజులను దాశార్హులను, ముదుసలియయ్యును నిప్పటికిని రాజ్యమునకే యువ్విళులూరుచుండు నాతండ్రి నుగ్రసేనుని, నతనితమ్ముండగు దేవకునిని, మఱియుఁ దక్కిన నాపగవారిని జంపివైచెదను. చెలికాఁడా! అంత యీభూమి యంతయు నకంటక మగుచున్నది. జరాసంధుఁడు నాకు గురుఁడు. ద్వివిదుఁడు గారాబుచెలికాఁడు. శంబరుఁడును నరకుఁడును బాణుఁడును నాతోడఁ జెలిమిగలిగినవారు. వారిం గూడి నేను దేవపక్షపాతు లయినరాజులను జంపి భూమి ననుభవింతును. నేను జేయఁగోరినది యంతయు నెఱింగి నీవు బాలు

రగు రామకృష్ణుల నిటఁ దోడితెమ్ము. చంపుటకని చెప్పవలదు. ధనుర్యాగమును గాంచుటకును మధురాపురి సంపత్తి సొంపును జూచుటకు నని చెప్పి పిలుచుకొని రమ్ము' అనెను.

అక్రూరుఁడు 'రాజా! నీమరణమును దొలంగఁబుచ్చుటకయి యిట్లాలోచించినది యెంతయు లెస్సగానున్నది. అయినను దైవమే ఫలమిచ్చునట్టిది. కాన సిద్ధియందును నసిద్ధియందును నభినివేశము లేక సముఁడవై కార్యము సేయవలయును. జనుఁడు దైవముచేత నెంత విఫలనుగుచున్నను దనమనోరథములు పైపైని బెంచుచు సేయుండును. తన సుఖముకొఱకుఁ జేసిన కార్యముచేత దుఃఖమునొందుచున్నాఁడు. ఒకప్పుడు సుఖమునొందుచున్నాఁడు. అట్లే పరులదుఃఖముకొఱకుఁ జేసిన కార్యముచేతఁదానే దుఃఖము నొందుచున్నాఁడు. పరుఁడు సుఖమునే పొందుచున్నాఁడు. ఇట్లయ్యును నీయాజ్ఞను గావించుచున్నాను' అనెను. అంతఁ గంసుఁ డక్రూరునిని మంత్రులను వీడుకొలిపి నిజమందిరమునకుఁ బోయెను. అక్రూరుఁడును స్వగృహమునకు నరిగినవాఁ డయ్యెను. ఇది ముప్పదియేడవయధ్యాయము.

---

## కేశిసంహార ఘట్టము

కంసుఁడు మున్ను పంపిన కేశియు గొప్పయశ్వమై మనోవేగమున గొరిజలచే భూమిని వ్రచ్చుచు మెడవెంట్రుకలచే మింటియందు మేఘములను విమానములను జెల్లాచెదరుగావించుచుఁ, దనసకిలింతలచే సమస్తమును దిగులుగొనఁ, గృష్ణునిచంపు చెడు తలంపునఁ గంసునికి హితము సేయఁగోరి నందునిమంద వడవడ వడఁకించుచు వచ్చెను. వానికి వెడఁద లయినకన్నులును, విరివియై

బిలమువలెనున్న వాయియు,నిడుదయిన మెడయు,నల్లని పెనుమబ్బువలెనున్న యాకారమును నుండెను. వాఁడట్లు సకిలింతలచే గోకులమునంతయు దిగులుకొలుపుచును, దోఁక వెంట్రుకలచే మేఘములను విరియఁదూల్చుచుఁ, గృష్ణుని యుద్ధమునకై వేఁచుచుండఁగాఁ జూచి భగవంతుఁడు కృష్ణుఁడు తనగమికి మొనకాఁడై వానిని బోరికిఁ బిలిచెను. వాఁడును నట్లు పిలువంబడి సింహమువలె బొబ్బరించెను. వాఁడు కృష్ణుఁడు తన్నెదురఁ దలఁపకుటను జూచి నోరిచే నాకసమును మ్రింగువానివలెఁ జూపట్టుచు నెంతయు రోషముమీఱ నెదురుపఱతెంచెను. ఆరక్కసుని, నితరులకుఁ గొంచెమైనను జెనకుటకును గడచుటకును శక్యము గాదు. అట్టి యాకటికిరక్కసుఁడు బిట్టుగానార్చుచు నరవిందనయనునిఁ గృష్ణునిఁ బిఱుందికాళ్లచేఁ దాఁచెను. కృష్ణుఁడాతాపును దప్పించుకొని రోషమునఁ దనరెండుచేతులచే వాని కాళ్లనుబట్టుకొని గిరగిరం ద్రిప్పి, గరుడుఁడు సర్పమునుంబోలె, వానిని నవహేలనముగా,నూఱువిండ్లపట్టున కవ్వలఁ బడఁ జిమ్మి నిలుచుండెను. వాఁడు మూర్ఛిలి కొంతసేపటికిఁ దెలివినొంది మరల పయికిలేచి రోషమున నోరుదెఱచికొని బలిమిమెయిఁ హరిపయి నడచెను. కృష్ణుఁడును వెఱవక నవ్వుచు బిలమునందు సర్పమును జొప్పించునట్లు,తన యెడమచేతిని వానినోటియందుఁ జొనిపెను.అట్లాభగవంతుని బుజముతగులఁగానే, కాలినయినుము తగిలినట్లు వానిదంతములెల్ల రాలెను. అమ్మహాత్ముని బాహువును వానిదేహమునందు, నుపేక్షించిన జలోదర రోగమువలె, మీఁదుమిక్కిలి పెరుఁగసాగెను. అట్లు కృష్ణునిబాహువు పయింబయిని బెరుఁగుచుండుటచేత వానికూపిరి వెడలక యుద్ధు

పడఁగా, వాఁడునుగాలుసేతులువిలవిలఁదన్నికొనుచు, దేహమం తయుఁ జెమర్ప,గన్నులు గిరగిరందిరుగఁ,బురీషమునువిడుచుచు, నును ఆడలి నేలంగూలెను. కర్కటికాఫలము పండఁబాఱి నపుడు మొదటను దుదని విరియునట్లు వాని దేహమును విరి యఁగా మహాభుజుఁడు కృష్ణుఁడు దానినుండి తనబుజమును దీసి కొని యనాయాసంబున నిట్లు పగతునిఁజంపి యుందులకు విస్ఫ్ర వీఁగక వెలయుచుండెను. దేవతలపు డతనిపయిని బువ్వులసోనలు గురిసి యెంతయుఁ బొగడిరి. భాగవతశ్రేష్ఠుం డగుదేవర్షి నార

—●●◆ శ్రీకృష్ణుని కడకు నారదుఁడు వచ్చుట. ◆●●—

దుఁ డుదారచేష్టితుం డగుకృష్ణునికడకువచ్చి మంతనమున నతని తోఁ 'కృష్ణా! కృష్ణా! అప్రమేయాత్మా! యోగేశా! జగదీశ్వ రా! వాసుదేవా! అఖిలాధారా! సాత్త్వతప్రవరా! ప్రభూ! నీవు బ్రహ్మాది స్థావరపర్యంతము లగుసమస్తభూతములకును లోనఁ జొచ్చి నియమించునట్టి యాత్మవు. అట్లు వానియందెల్లఁ జొచ్చి యున్నను,గట్టెలయందలినిప్పు,వానివంక మొదలగువాని చొప్పు నఁ దానును వంకపోవుట మొదలగు వికారములొందకుండునట్లు, చొచ్చిన వస్తువులయందలి వికారములకు లోనుగాక యేకరూ పుండవై యుందువు. మఱికట్టెలయందు గూఢమైయున్న నిప్పు వలె నీవును హృదయకుహరమందు గూఢుఁడవై (యోగవి ద్ధమనస్కులకుమాత్రము తెలియుచు) నుందువు. సర్వజ్ఞుండవు. మహాపురుషుండవు. ఈశ్వరుండవు. నీవు స్వతంత్రుఁడవై సత్యసం కల్పుండవుగాన నీయంతటనీసంకల్పము చేత గుణకార్యములును నీకు శరీరములునైనమహదాదులనుసృజింతువు. ఈశ్వరా! అంత నాగుణకార్యములచేవిచిత్రసన్నివేశముతోఁ జూపట్టుచున్నయీ

బ్రహ్మాది స్తంబ పర్యంత మగుజగత్తును సృజింతువు, పాలింతువు, సంహరింతువు. అట్టి నీవు భూమికి భారములయిన దైత్యులను బ్రమథులను రాక్షసులను నాశము సేయుటకును సాధువులను రక్షించుటకును నవతరించితివి. మాభాగ్యవశమున నశ్వాకారుఁడయిన యీదైత్యుని నవలీలఁజంపితివి. వీనిసకిలింత వినఁగానే దేవతలు దిగులుగొని దేవలోకమును దిగవిడిచిపోవుదురు సుమీ. విభూ! చాణూరుఁడు ముష్టికుఁడు ననుమల్లురను మఱియు నితరులును,కువలయాపీడగజమును, కంసుఁడును నెల్లినీచేత హతులుకాఁగాఁ జూడనే చూడఁగలను. ఆకంసునికిఁ బిదపఁ బంచజనుఁడును, కాలయవనుఁడును, మురకుండును, నరకుఁడును హతులుకాఁగాఁ జూడఁగలను. పిదప నింద్రునిగర్వ మడంచు పారిజాతాపహరణమును, వీరులగు భీష్మాదుల కన్యలగురుక్మిణీదేవి మొదలగువారిని వీర్యమెయ్యుంకువుగాఁ బెండ్లియాడుటయు ద్వారకయందు నృగుని శాపమునుండి విడిచిపుచ్చుటయు, స్యమంతక మనుమణిని సత్యభామ యనుభార్యతోఁగూడఁ దెచ్చికొనుటయు, మృతులగు బ్రాహ్మణ పుత్త్రులను వారున్నపట్టయిన సంకర్షణ లోకమునుండి తెచ్చి బ్రాహ్మణున కొసంగుటయు, పౌండ్రకునివధమును, పిదపఁ గాశీపురినిగాల్చుటయు, దంతివక్త్రునిఁ జంపుటయు, రాజసూయమహాయజ్ఞమందు శిశుపాలునిఁబొరిపుచ్చుటయు, మఱియు నీవు ద్వారకయందు వసించియుండి మహాకోటికవులు గానముసేయఁదగిన పరాక్రమకృత్యములను మఱియు నేయేవానిని జేయుదువో వానినింజూడఁగలను. పిదపనీవు కాలరూపుండవై యీభూభారమును నాశముసేయఁగోరి యర్జునునకు సారథివై యక్షౌహిణులను దునుమాడుటయుఁ జూడఁ

గలను. మఱి యపహతపాప్మాదిగుణుండును కేవలజ్ఞానైకస్వరూపుండు నై నిరతిశయానందస్వరూపమగుస్వాత్మానుభవ నిష్ఠచేత నవాప్తసమస్తకాముండై యమోఘవాంఛితముల నొప్పుచు నిజతేజంబున మాయాగుణప్రవాహరూపంబుల నన్నింటిని నివర్తించి యుండువాఁడ వగునిన్ను శరణుఁ జొచ్చుచున్నారము.నీకు నీవే యాధారమవై నీసంకల్పముచేత సమస్తములైన దేవతిర్యఙ్మనుష్యాది నానావిధవిశేషములను గల్పించుచు, నిపుడు క్రీడకొఱకు మనుష్యవిగ్రహమును దాల్చి యదువృష్ణిసాత్వతులకు మేటివై యున్న నీకు నమస్కరించినాఁడను' అనెను. ఇట్లు భాగవతోత్తముం డయినయాముని యదుపతికిఁ గృష్ణునకు నమస్కరించి యతనిదర్శనమున నెంతయు నుబ్బుచు వీడుకోలువడసి తనదారిని బోయెను. గోవిందుఁడును కేశిని యుద్ధమునఁ జంపి నందులకుఁ బ్రీతులయిన గొల్లపిల్లవాండ్రం గూడి మందకు సుఖముఁ గూర్చుచుఁ బసులను గాచుచుండెను.ఒక నాఁ డాపసులకాపరులు కొండచఱియలందుఁ బసులను మేపుచుండి కొందఱు

## వ్యోమాసుర వధము.

దొంగలుగను గొందఱు వారినుండి కాచు తలారులుగను బన్నికొని *నిలాయనక్రీడను గావించిరి. అందుఁ గొందఱు దొంగలును మఱికొందఱు కాచుతలారులును వేఱుకొందఱు గొఱియలునై నిర్భయముగా నాడుచుండిరి. మయునిపుత్త్రుఁడును మహామాయుఁడు నగు వ్యోముఁ డనురాక్షసుఁడు గోపవేషమును

* నిజాయనక్రీడయనఁగా ఒకఁడు దొంగయై గొఱియగానున్న మఱియొకని దొంగిలి యొకగుహయందు నిలీనుఁడైయుండఁగాఁ దలారియైనయొకఁడు వానినివెదకి యాదొంగనుండి యాగొఱియను విడిపిఁచుటకై యాట.

దాల్చి తానునువారిలోదొంగ యై గొఱియలుగానటించుచున్న గొల్లలను బెక్కండ్రను నెత్తికొని పోయెను. ఇట్లమ్మహాసురుఁడు బాలురను గొని పోయిపోయి, యొక కొండగుహయందునిడి యొక ఱాతిచేత దాని ద్వారమును మూసిపుచ్చెను. అప్పుడు వాఁడెత్తికొని పోవకున్నవారు నలుగురైదుగురు మాత్రమే మిగిలియుండిరి. వాఁడట్లుచేసినపనిని గృష్ణుఁడెఱిఁగి సజ్జనులకు శరణప్రదుండు గాన గొల్లలను గొనిపోవుచున్న యీరక్కసుని సింహము వృకమునుంబోలె, బలిమిమెయిం బట్టుకొనెను. వాఁడంత నారూపువిడిచి మేటిపర్వతమునకు సాటియైన తనయొప్పటిరూపమును దాల్చి మిక్కుట మగుతనబలిమి యంతయు నెఱపి యాపట్టునకు నలంగికలంగి దానినుండి తప్పించుకొనఁజూచెను; గాని యందులకు శక్తుఁడు గాఁడయ్యె. కృష్ణుండును దన రెండు చేతులచే వానిని బిట్టొడిసిపట్టుకొని భూతలముపైఁ బడఁద్రొబ్బి యాకసమున దేవతలు చూచుచుండఁగాఁ బశువునుజంపునట్లు చంపెను. అంత నాగుహకు మూసియుంచిన ఱాతిని బడఁదన్ని గోపకులను నాసంకటమునుండి వెడలఁదప్పించి దేవతలును గోపకులును దన్నుఁబొగడుచుండఁగా మందకుఁ బోయిన వాఁడయ్యె. ఇది ముప్పదియేడవయధ్యాయము.

---

## రామకృష్ణులను దోడితెచ్చుట కక్రూరుఁడు నందగోకులమును జొచ్చుట.

మహామతి యగునక్రూరుండును నారాత్రి మధురాపురియందుండి తెల్లవాఱఁగా రథమెక్కి నందునిమందకు బయలువెడలెను. అమ్మహాభాగుఁడు దారినిబోవుచును నంబుజాక్షుఁ డగు



1935. అక్రూరుఁడు గోకులమున రామకృష్ణులను జూచి మథురకు రమ్మని పిలుచుట.

భగవంతునియందుఁ బరమంబయిన భక్తినొంది తనలో నిట్లు చింతించెను. 'ఆ! నేనేమి సుకృతము చేసితినో! ఎట్టిమహాతపముగావించితినో! ఎట్టిపాత్రమునకు దానముచేసితినో! కృష్ణుని నేఁడు కన్నారఁ జూడఁ గాంచుచున్నానే! విషయాసక్తచిత్తుండనగు నాకు, విషయలోలుం డగు శూద్రునకు వేదప్రవచనముం బోలె, నుత్తమశ్లోకుం డగుకృష్ణుని దర్శనము దుర్లభమని తలఁచుచున్నాను. ఇట్లును జెప్పరాదు. నేనెంత యధముఁడయినను నాకుఁ గృష్ణునిదర్శనము కలుగనే కలుగవచ్చును. నదియందుఁ బడి కొట్టుకొనిపోవుచున్న తృణాదులలో నెద్దియేనొకటి యెప్పుడేని నదిని దాటుచున్నదియే కదా. అట్లె కర్మవశమునఁ గాలప్రవాహమందుఁ గొట్టుకొనిపోవుచున్న జీవులం దెవ్వఁడేనొకఁడు దానిని దరింపవచ్చును. ఇట్లు నాకుఁ గృష్ణునిదర్శనము గలుగఁ గూడును. యోగులమనసులకును ధ్యేయంబైన యాభగవంతుని చరణపంకజములకు నేఁడు మ్రొక్కఁగలిగినది గాన నాయశుభములెల్ల నేఁడు నశించినవి. నాజన్మమును సఫలమైనది. పూర్వులగు ప్రహ్లాదాదు లెద్దాని నఖమండలంపుఁగాంతిని హృదయమున భావించి దురత్యయం బగుసంసారతమమును నుత్తరించిరో, కృష్ణుండై యవతరించిన విష్ణుని యా పదపద్మమును నేఁడు గన్నులలరఁ జూడఁబోవుచున్నానుగా! ఇది కంసుఁడుపంపుటచేతఁగదా నాకుఁ గలిగెను? ఆహా! కంసుఁడు నేఁడు నాకుఁడా నెంతో యనుగ్రహమే చేసినవాఁడయ్యె. మఱియు నెద్ది *బ్రహ్మరుద్రాదు లగు దేవతలచేతను, బ్రహ్మాదులును గొలుచు

* బ్రహ్మాదులచేత నర్చితంబనుటచేఁ బరత్వమును, లక్ష్మిచేతనర్చితంబనుటచే పారమైశ్వర్యమును, మునులచేతను భక్తులచేతను నర్చితంబనుటచేత సౌభా

చుండునట్టిలక్ష్మీదేవిచేతను, మునులచేతను, భక్తజనులచేతను, నర్చితంబైనదో, ఎద్దియనుచరులగు గోపకులతోడ వనమున గోవులను మేపుటకై వానివెంటఁ దిరుగుచుండునో, ఎద్ది గొల్ల పూఁబోండ్ల గబ్బిగుబ్బలందు జొబ్బిలు కుంకుమపంకముచే నంకితమై యొప్పునో, యట్టికృష్ణుని పదాంబుజమును నేఁడు చూడఁ బోయెదను. ఇవిగో నీమృగములు నాకుఁ బ్రదక్షిణముగాఁ బోవుచు శుభమును సూచించుచున్నవి. కాన, నిద్దంపు ముద్దుఁజెక్కులును, నువ్వుఁబువ్వువంటి నాసికయు, చిఱునగవుచే సొగసయినచూడ్కులును, చెందామరలవంటి కన్నుంగవయుఁ జెన్నుగులుక, నెఱికురులు మురువుగాఁ గ్రమ్మియున్న వెన్నుని నెమ్మొగమును దప్పక చూడఁగలను. భూభారమును దీర్చుటకై కర్మముచేతఁగాక నిజేచ్ఛచేత మనుష్యత్వమునొంది నిరతిశయలావణ్యకాంతికిఁ బట్టయియున్న విష్ణుని దర్శనము నాకుఁ నేఁడేకలుగునేని నాకన్నుంగవకుఁ దోడనే ఫలము కలుగకపోవునా? అది సఫలముగాదా! జీవుండు తన దేహమునుజూచి యదినేనేయని భ్రమించునట్లుగాక, తనకు దేహభూతులయిన ప్రకృతిపురుషులనుజూచియు వారే తన్నుగా భ్రమించుట లేనివాఁడై, నిజతేజంబునం జేసి,దనయం దజ్ఞానమూలమగు దేవమనుష్యత్వాదిభేదభ్రమమునెల్ల నిరసించి, తనకు శరీరభూతమగు ప్రకృతిని గారణముగాఁగొని దానినిగుఱించిన నిజసంకల్పముచేతఁ దనయందే రచితములయిన కార్యములగు ప్రాణబుద్ధీంద్రియముల

గ్యాతిశయమును, వనమున గోవులవెంటఁ దిరుగుచున్నదనుటచేత సౌలభ్యసౌశీల్యములును, గోపికల కుచకుంకుమపంకముచే నంకితంబైనదనుటచేత కమనీయత్వమును, పదాంబుజములకుఁ జెప్పఁబడియెను.

చేతనే భోగాయతనము లయిన దేహములందు నాప్రాణాదులకుం గారణభూతుఁడుగా నెవఁడు తెలియుచున్నాఁడో, సమస్తపాప హరములై నిరతిశయ మంగళకరము లయిన యెవ్వని * గుణ కర్మజన్మములను ముచ్చటించునట్టి వాక్కులు జగము నుజ్జీవింపఁజేయుచును శోభిల్లఁజేయుచును బవిత్రముఁ గావించుచును నుండునో, యెవ్వని గుణాదులను బ్రతిపాదింపని వాక్కులెంత యర్థపదలావణ్యములు గలిగియుండినను వస్త్రాద్యలంకృత మయిన పీనుంగువంటి సొంపుగలవిగాఁ దలంపఁబడునో, యట్టిజగదీశ్వరుఁడు విష్ణుఁడే యాదవకులమునఁ గృష్ణుఁడై యవతరించి స్వకృతము లగుధర్మమర్యాదలనెల్లఁ బాలించు నమరవర్యులకు (దైవసంపదభిజాతులకు) సుఖముఁగావించుచు, సమస్తమంగళప్రదమై దేవతలు పాడుచుండునట్టి తనయశంబును బచరించుచును వ్రేపల్లెయం దున్నాఁడుగదా. నాకీ ప్రభాతసమయములు సొంపై చూపట్టుచు శుభమును సూచించుచున్నవి. కనుక మహనీయు లగుసాధువులకు గతియై, హితకారిగాన గురువై, త్రిలోకసుందరంబును జూపఱకుఁ గన్నులపెనుఁబండువు నైనవిగ్రహంబును దాల్చి, సిరికి మనసునకుఁగూర్చు మనికిపట్టయినయాకృష్ణుని నేఁడు తప్పక చూడఁగలను. అతనిని గన్నులకఱవుదీఱఁ జూడఁగానే, తోడనే నేను రథమునుండి దిగి పురుషోత్తములయిన యా రామకృష్ణులచరణములకు, యోగులు సయితము తమ స్వరూపసిద్ధికై కన్నులఁజూడ నేరక బుద్ధిచేతఁ గేవలము భావించునట్టి యాచరణములకు, నిక్కముగ నమస్కరింతును. పిదప నా

* గుణములు వాత్సల్యసౌశీల్య సౌలభ్యాదులు కర్మములు జగద్వ్యాపారాదులు. జన్మములు రామకృష్ణాదులు.

పురుషోత్తములతోఁ బాటిగా వారలచెలికాండ్రయినగోపకులకు నమస్కరింతును. మఱియు నతనిపాదమూలమందు నేను జాఁగిలఁబడినపుడు, విభుం డాకృష్ణుఁడు, కాలంబను క్రూరసర్పమునుర వడిచే సంసారమునకు భయపడుచు శరణుగోరుచున్న నరులకు నభయ మొసంగు తనహస్తపద్మమును, నాశిరస్సునందు నిడకపోవునా? ఏద్దానియందు బలి మూఁడడుగుల నేల నిచ్చినపు డర్ఘ్యమునిడి జగత్త్రయమున కింద్రత్వము నొందనయ్యెనో, ఇంద్రుఁడును నట్లె యొకప్పుడుగావించి యట్టిపదవిని బొందెనో,ఏదిగొల్లపూఁబోఁడు లాడిపాడి యలసినపుడు వారిబడలికల నెట్టిగలువలతావులు గుబాళించుచు నింపయిన తన తాఁకున నల్లఁబుడుకుచునుడునో,*యట్టిహస్తపద్మము నాయూాదలపయి నిడకపోవునా? నేను గంసునిచేతఁ బంపఁబడినవాఁడ నయ్యాను, గంసునికి భృత్యుఁడ నయ్యు, నచ్యుతుఁడు నాయందు వీఁడు పగతునివాఁడను బుద్ధినొందఁడు. ఏలన నతఁడు సర్వసాక్షి. సనుస్తక్షేత్రములను నొక్కమ్మడిఁ గనుఁగొనుచును నియమింపుచును నుండునట్టివాఁడు. కాన నాయీామనస్సునందలి వ్యాపారమును, నేను వెలికిఁ గంసు ననువర్తించుచున్నను లోపలఁ గృష్ణునే యనువర్తించుచుండుటను, మనస్సు లోపలను వెలుపలను వసించుచుండువాఁడు గాన యమలంబయిన తన ధర్మజ్ఞానచక్షువుచేఁ గనుఁగొనును. మఱియు నతని పాదమూలమందు మెల్పున నిలుచుండి చేతులుమోడ్చి యున్ననన్నుఁ జిఱునవ్వుదొ

* ఇట మున్ను ముముక్షువులకు మోక్షప్రదముగను సకాములకు నభ్యుదయప్రదముగను, జెప్పి యిందు ననురక్తులకు పరమసుఖదంబని వర్ణించుచున్నాఁడు.

లంకఁ గరుణ గడలకొనుజూడ్కి ని జూడఁగలఁడు. అప్పుడు నేను దోడనే సమస్తకల్మషములును నశింపఁగా, జంకువీడి, మిక్కుటమయిన సంతోషమును బొందఁగలను. తనకు మిక్కిలియు సుహృదుఁడును, మీఁదుమిక్కిలి జ్ఞాతియుఁ దన్నుండప్ప మఱి యొకదైవము నెఱుంగనివాఁడునునగునన్నుఁ,దన నిడుదబుజములుసాఁచి బిగియఁ గౌఁగిలించుకొనఁగలఁడు. అపుడే నాదేహము, పవిత్రమయి, దానివలనఁ గర్మాత్మకమగు బంధమును బ్రిదిలిపోవును. మఱియు నాకృష్ణుఁడు నన్నుఁగౌఁగిలించికొని, యంజలిఁగీలించి యున్ననన్నుంజూచి 'అక్రూరా!అయ్యా!' అని పిలువఁగలఁడు.అప్పుడుగదా మాజన్మములు సఫలములగును.పురుషుఁడెవఁడు మహనీయుం డగుభగవంతుని యాదరము నొందఁడో, యట్టి వానిజన్మ మిస్సీ! కాల్పనా? సర్వసముం డగునతనికి నెవ్వఁడు గాని గారామైనవాఁడును మిక్కిలి సుహృదుఁ డయినవాఁడును లేఁడు. అప్రియుఁడును ద్వేష్యుఁడును లేఁడు. ఉపేక్షింపఁ దగిన వాఁడుగాని లేఁడు. అట్లు విషమబుద్ధిలేనివాఁ డయ్యును, గల్పవృక్షము దన్నాశ్రయించినవారికే కోరినయర్థము లొసంగునట్లు తన్నుభజించినవారినే తాను భజించుచున్నాఁడు. కాన యిది వైషమ్యము గాదు.మఱియు యదుతిలకుండును గృష్ణునకన్నయు నగుబలరాముఁడు, ప్రణతుం డయిననన్ను నవ్వుచుఁ గౌఁగిలించుకొని, నాయంజలిని గయికొని గృహమునకుఁ దోడ్కొనిపోయి, యర్ఘ్యము మొదలయిన సమస్తసత్కారములు గావించి, పిదపఁ దనబంధువులయందుఁ గంసుఁడు గావించు కృత్యముల నడుగఁగలఁడు' అనెను.

ఇట్లక్రూరుఁడు దారియందు గృష్ణునే యెంతయుఁ జింతించి

కొనుచు రథారూఢుండై పోయి గోకులమును జేరెను. సూర్యుం డు నస్తమించెను. సమస్తలోకపాలుర కిరీటములం దెవ్వని విమలపాదరేణువులు సోఁకుచుండునో యావిష్ణుని శ్రీకృష్ణుని యడుగులను, అబ్జయవాంకుశాది శుభలక్షణ లక్షితంబులై పుడమికి నలంకారములై తనరుచుండువానిని, వ్రేపల్లెయం దక్రూరుఁడు గాంచెను. అట్లు చూడఁగానే యా యాహ్లాదమువలన సంబరమెంతయుఁ బెచ్చు పెరుఁగఁగా, ప్రేమచేత గగురు పొడమఁ, గన్నీరించుక కన్నులయందుఁ గలంగఁ బాఱ, రథమునుండి గొబ్బునదూఁకి, 'ఆహా! ఈ రజములు ప్రభువు పాదాబ్జరజములు గదే. బ్రహ్మాదులకు సయితము దుర్లభములైనవిగదే' యనుచు నతం డాయడుగులందుఁ బడి పొరలాడెను. * దంభమును, భయమును శోకమును దిగవిడిచి హరికథలను ముచ్చటించుటవలనను నతనియడుగులు

* 'దేహంభృతా మియానర్థో హిత్వాదంభం భయం శుచమ్। సన్దేశా ద్యో హరే ర్లిఙ్గదర్శన శ్రవణాదిభిః' అనిమూలము. ఇందులకర్థము క్లిష్టముగా నున్నది. 'కంసుని పరిజనుండయ్యుఁ గేశి మొదలగువారివలె దంభము (కపటాచరణము) లేకయు, కంసుఁడు పంపినవాఁ డగుటచేఁ దన్నుఁ దక్కినవారి వలెఁ జంపునని భయమునులేకయు, అట్టిభయమువలని శోకమునులేకయుఁ గంసుఁడు సందేశము చెప్పిపుచ్చినదాదిగాఁ గృష్ణునియడుగులు మొదలగు చిహ్నములు చూచుటవలనను దారినడుమ వచ్చువారివలన నతనిముచ్చటలను వినుటవలనను, మఱి శుభ సూచనాదులవలనను నక్రూరునికిఁ గలిగిన యిట్టి యానందానుభవ మింతియె పురుషార్థము. ఇంతియే జన్మఫలము' అని మునిభావప్రకాశిక. ఇది మఱింత ప్రకృతముగాను ఉపపన్నముగాను నున్నది. వ్యాఖ్యాతలకు వెక్కుండకు నున్న పాఠమునకే యర్థము సమర్థించుట కౌశలముగా నున్నదిగాని యర్థమున కనుగుణముగా సుపాఠమును సమర్థించుటగాదు.

మొదలగుచిహ్నములను దర్శించుటవలనను విభవాదులు వినుట మొదలగువానివలనను గలుగునట్టి పారవశ్యరూపమయినయవస్థ యిదియె దేహధారులకుఁ బురుషార్థము. ఇదియె జన్మఫలము. ఇట్టిది భక్తిపరాకాష్ఠయని తెలుపుటకుంబోలె నక్రూరుఁడందుఁ బొరలాడెను. ఇట్లతఁడు చాలసేపు పొరలాడి యంతలేచి రథము నారోహించి వేగపయనమై, 'గోపతియగుకృష్ణుఁడెక్కడ! రాముఁ డెక్కడ!' నని యడుగుచుఁబోయి,మందయందునావులనుబాలు పిండుచోట నున్నరామునిని గృష్ణునిని గాంచెను. ఆబాలురు పచ్చని నల్లనివలువలు ధరించి, శరత్కాలపుఁ దామరపూవుల వలెఁ గన్నుంగవ చెన్నుగులుక, నల్లని తెల్లని మేని చాయలు దయివారు, సిరికి సొంపయిన యిక్కలోయన నింపారుచుండిరి. మఱియు నిడుదలయి కండబలుపుగల గుండ్రని బుజములును సొగసయిన నెమ్మొగమునుగలిగి, సొబగుగాండ్రయందుమిన్నలై చూపట్టుచుండిరి. మఱి యేనుంగుగున్నలవలె గంభీరంపు నెన్నడలు గలిగి,ధ్వజవజ్రాంకుశపద్మాదులచేఁ జిహ్నితములయిన యడుగులచే వ్రేపల్లె భూమినెంతయు జెడఁగార నలంకరించు చుండిరి. మఱియు నమ్మహాత్ములు కరుణయుఁ జిఱునవ్వునుగడలు కొనుచున్న చూడ్కులుగలిగి, యుదారములై యింపుగులుకు క్రీడలాడుచుండిరి. వా రపుడు జలకములాడి మేలయిన వలువలు గట్టి, పూదండలను వనమాలికలను నూని, గుమగుమతావులు బుగులుకొనుచున్న గంధముల మేననలందికొని యుండిరి. ఆ పురుషశ్రేష్ఠులు, సృష్టికిఁ బూర్వులై జగత్కారణభూతు లగు వారు, జగత్పరిపాలనముకొఱకుఁ దమసంకల్పముచేత రామ కృష్ణులుగా నవతరించియున్నవారు. వారు తమయక్కజంపు

దేహకాంతులచే దిక్కులందలి చీఁకటి విరియించుచు నడుమ బంగారు పరఁగియున్న యింద్రనీలపర్వతమువలెను గాటుక చఱిమియున్న రజతపర్వతమువలెను వెలుంగుచుండిరి. ఆయక్రూరుఁడును రథమునుండి వేగదుమికి నెయ్యంబున నవయవములు విరవిరఁబోవ నారామకృష్ణుల యడుగులకడఁ గొయ్యవలెఁ గొబ్బునఁ జాఁగిలఁబడెను. అతఁ డాభగవంతునిం గృష్ణుని పర్శించుటవలని యుబ్బువెంపునఁ గన్నుంగవను బాష్పములు చిప్పిలి కలంగుచుండ,అవయవములందెల్లఁబులకలవ్వారిగాఁబర్వఁ,దుకతుకనాటుచేఁ దన్నక్రూరుం డనిచెప్పి మ్రొక్కుటకును శక్తుఁడు గాఁడయ్యె. భగవంతుఁడు కృష్ణుం డతఁడు వచ్చినవిషయమును దెలిసి ప్రణతజనవత్సలుండు గావునఁ జక్రాయుధచిహ్నితంబయిన తనహస్తమునఁ బ్రీతుండై యతనిని దగ్గఱకు నీడ్చికొని బిగ్గఁ గౌఁగిలించికొనెను. బలరాముఁడును మనంబెంతయు నుప్పొంగఁ, దనకుఁ బ్రణమిల్లిన యక్రూరునిఁ గౌగిలించికొని యతనిచేతఁ దనచేయి గీలుకొలిపి తమ్ముండునుదానునుగృహమునకుఁ దోఁకొనిపోయెను.అంత నతనిని స్వాగతంబడిగి మేలయిన యాసనంబిడి, విధ్యుక్తముగా నడుగులనుగడిగి, మధుపర్కమర్పించి, గోవును నాయతిథికి నివేదించి బడలియున్న యతని పదములను నాదరంబున నిపుణులగువారిని బిసుకునట్లుగావించి, పరిశుద్ధంబును షడ్రససంపన్నము నగునన్నమును శ్రద్ధతోడ నిడినవాఁ డయ్యె.అతండు భుజించినపిదప రాముఁడు పరమధర్మవిదుండుగానఁ బ్రీతితోడ ముఖవాసములగు కర్పూరాదులను గంధములను మాల్యములను నొసంగి యెంతయు సంతోషము గావించెను. అట్లు సత్కృతుండయినపిదప నందుం డతనింజూచి

'దయమాలిన కటికిదాశార్హుఁడా కంసుఁ డనుజుతో నున్నాఁడు. మీరలో పశుఘాతుకుల కాపుననున్న గొఱియలవలె నా కటికివాని ప్రాపున నున్నారే. వానియండ నెట్లు బ్రదికెదరో గదా! తనయప్ప సెల్లెలు కుయ్యో యని బిట్టు మొఱయిడుచుండఁగా నా బిడ్డ సుగంధులను జంపి తనయునుఱు పోసికొన్న ఖలుఁ డా కంసుఁడు. నా ప్రజలకు బ్రతుకే యరిదిగా నుండఁగా నిఁక వారి కుశలము నేమని విచారింపఁగలము?' అని యడిగెను. ఇట్లు నందుఁడు మధురములయిన వచనముల నడిగి యెంతయు సత్కృతిఁ గావింపఁగా నక్రూరుఁడు మార్గాయాసమును వీడినవాఁ డయ్యె. ఇది ముప్పదియొనిమిదవయధ్యాయము.

---

## రామకృష్ణు లక్రూరునితోడ భాషించుట.

అక్రూరుఁ డట్లు రామకృష్ణు లెంతయు గారవింపఁగాఁ బర్యంకమున సుఖంబునఁ గూర్చుండి, దారియందుఁ దనమనసునఁ గోరినకోర్కెల్లను నప్పుడు పడసినవాఁ డయ్యె. భగవంతుఁడగు శ్రీనివాసుఁడు ప్రసన్నుం డయినచోఁ బడయరానిది యేమున్నది? అయినను, భగవత్పరులగువారు మఱి వేఱొక్కటియు నడుగరు చుమీ? తదనుభవమునకు ముందుఁ దక్కిన వెల్లఁ దుచ్ఛములే కదా. దేవకీపట్టి కృష్ణుఁడు మాపటి భోజనము చేసినపిదపఁ గంసుఁడు సుహృదులందు మెలంగువిధమును, మఱియు వాఁ డేమేమి చేయఁ గోరుచుండునదియు నక్రూరు నడుగువాఁడై యిట్లనియె. 'అయ్యా! నీరాక యెంతయు లెస్సగదే! స్వాగతము. మీ కెల్లపుడును శుభంబగుఁగాక. మనజ్ఞాతులకును బంధువులకును నశుభం బేమియులేక యారోగ్యమగుచున్నదే కదా! అయ్యా! పట్టి

పేరునకు మాత్రము మేనమామయయ్యుఁ గులమునకెల్ల నిర్మూలక మయిన తెవులువంటి యాకంసుఁడు వర్ధిల్లుచుండఁగా మనవార లప్రజలకును నాకంసుని ప్రజలకుఁ గుశలమేమనియడుగుదును? అక్కటా! నిరపరాధులయిన మాతలితండ్రులకు మానిమిత్తమున మిక్కుటమయినదుఃఖము ప్రాప్తించెనుగదా. కాకేమి. మమ్ముఁ బట్టి వారికి మున్నుపుట్టిన పుత్రులెల్ల మరణమునొందిరి. మమ్ముఁ బట్టి వారికి బంధనమును దాపరించినది. అవి యట్లుండనిమ్ము. సౌమ్యా! మావారల రగుమిమ్ముఁ జూడవలయునని చిరకాలము గాఁ గోరుచున్నకోరిక నేఁడు మాభాగ్యవశమున నొనఁగూడినది. మిమ్ము దర్శింపఁగంటిమి. అయ్యా! నీవు వచ్చినందులకుఁ గారణ మేమో చెప్పుమా' యనెను. భగవంతుఁ డట్లడుగఁగా నక్రూ రుఁడును, గంసునకు యదువులందుఁ గలయెడతెగని వైరమును వసుదేవుని వాఁడు చంపఁబూనినదియు, తన్నునిక్కముగా నేపని కొఱకు నేమికల్లమాటలు చెప్పి యట దూతఁగా వాఁడు పుచ్చిన దియు, నారదుఁడు వానితోఁ గృష్ణుఁడు వసుదేవునకుఁ బుట్టిన వాఁడని చెప్పినదియు, సకలమును బూసగ్రుచ్చినట్లు కృష్ణునకు వివరించినవాఁడయ్యె. అక్రూరుండు చెప్పినది విని కృష్ణుఁడును రాముఁడును బరవీరులందునుమాడు నుక్కుతునియలుగాన యందులకుఁ బక్కుననవ్వి తండ్రియగు నందునికి రాజు కంసుఁడు చెప్పిపుచ్చిన యాజ్ఞను విన్నవించినవారయిరి. అతండును గోప కులను జూచి 'మనపల్లెయందుఁ గలపాలు పెరుఁగులనెల్లసంతరిం పుఁడు. వలయు కానుకలను సమకట్టుఁడు. బండ్లను బన్నింపుఁడు. రేపు మధురాపురికిఁ బోయి రాజునకుఁ బాలు నెయ్యి మొదలగు వానిని జెల్లింపవలయును. మఱియు నామధురయందు ఘను

ర్యాగమును జూతము. అందులకై యట పల్లెపట్టులజనులును బోవుచున్నారఁట' యని యానతిచ్చెను. నందుఁ డిట్లు తనవ్రేపల్లెయందు సూతునిచే నెల్లయెడలఁజాటించెను.గోపికలు,రామకృష్ణులను మధురాపురమునకుఁ దోడ్కొనిపోవుట కక్రూరుఁడు వ్రేపల్లెకు వచ్చియున్నాఁడని విన్నంతనే మిక్కిలియుఁ జింతలవంతలపాలయిరి. కొందఱు గోపిక లది వినఁగానే హృదయములఁ దుందుడుకుగలిగి వేఁడి నిట్టూరుపులు పొలయఁగా, మోముఁదమ్ముల సిరి పెంపు వాఁడువాఱినదయ్యె,కొందఱకు వెలిపట్టుపుట్టములు వీడఁ,గడియములు జాఱ, క్రొమ్ముడులు నుఱిలినవయ్యె. వేఱు కొందఱు గొల్లసుందరు లాకృష్ణునే మనంబున ధ్యానించుటవలనఁ దక్కినవ్యాపారము లెల్లనుడిగి యాత్మసాక్షాత్కారులయిన యోగులుంబోలె, నీలోకమునే యెఱుంగకుండిరి. మఱికొందఱు పడఁతులు, కృష్ణుఁడు మక్కువపిక్కటిల్లఁ జఱునగవు చిగురొత్త, మనసున కింపుసొంపార, విచిత్రములగు పదములఁ గూర్చి పలుకు నవకంపు బలుకులను దలఁచుకొనుచు నెంతయు మోహితలయిరి. మఱియు నాపూవుంబోఁడులు మిక్కిలి యొయ్యారంపు శీవిగులుకు కృష్ణుని నడయు, జంకెనలు మొదలయిన సింగారంపుఁ జెయ్వులును, నెయ్యంబును నవ్వును దొలఁకు నునుఁ జూడ్కులును, దుఃఖములనెల్లఁ దూలించు చమురులును, పూతనను జంపుట మొదలయిన మేలి చరితములను. మనసుల నెడతెగక తలపోయుచు నతని యెడఁబాటున కించుకయు సైఁపనేరక వెఱచి భావంబులెల్ల నచ్యుతునియందే పొందుపఱచి మొగంబులఁ గన్నీరు వెల్లిగొన నందఱు గుములుగట్టి యొక్కచోఁ గూడి యి ట్లనిరి.

'ఓవిధాతా! అయ్యో! నీకించుకయుఁ గనికరము లేదయ్యెనా! నీవు హితముననను నెయ్యముననను విశ్వాసముననను జనుల నొకరితో నొకరిని గవగూర్చుచున్నావు; కాని వారికోర్కు లీడేఱఁ గూడకమునుపే యెడఁబాపినవై చెదవే! ఇది దయ యగునా? తుది నీచేష్టితమంతయు బాలుని యాటచెయ్వివలెఁ బసలేనిదే కదా! మూర్ఖుఁడవే నీవుచుమీ! నీవు నల్లనిముంగురు లలమినదై ముద్దుఁజెక్కిళ్లను మవ్వంపు ముక్కునుఁ జక్కనై వెతల నెల్లఁ దూలించు చిఱునవ్వ చిందులుద్రొక్కుచు నందనుఁ జూపుచున్న చిన్నికృష్ణుని ముద్దుమొగమును జూపితివి. కాని మఱల మఱుఁగుఁ జేసితివే! నీకిట్లు చేఁత సరియగునా? అక్రూరుఁడే కాని యట్లుచేయువాఁడు నేనుగాదందువా? నీవే మాకుఁ గన్నులిచ్చితివి. మరల నీవే యక్రూరుఁడని పేరుపెట్టుకొని వచ్చిమా దుఃఖముల నెఱుఁగనియట్లు మాకిచ్చిన కన్నులను మరలఁ దొంగలించుకొనుచున్నావు. ఇట్లు మఱియొకనికిఁ జేయనగునా? మాఱుపేరు పెట్టికొనివచ్చి యిచ్చినదానిని మరలఁద్రుచ్చిలు నీవు క్రూరుఁడవే కావా? కొనిపోవుట కృష్ణునేకాని మాకన్నులను గావందువా? ఆకన్నుచేతఁ గృష్ణునియం దొక్కపట్టున (కన్నులు మొగము మొదలగు కొండొకయవయవమందే) నీసమస్తసృష్టినైపుణ్యమంతయుఁజూచితిమి. నీరహస్యమంతయుమాకుఁ దెలిసిపోయినదని చూపోపక కృష్ణునిఁ బెడబాపి మాకన్నులు గానకుండఁ జేసెదవ్రో. కటా! నందసూనుని నెయ్యమేమీ! క్షణముసేపులో మాయమా! కాకేమి? ఇండ్లను, సొంతజనులను, బిడ్డలను, మగలను, దిగవిడిచి తనయూడిగమునే కయికొని, తననవ్వులు మొదలయిన చెయ్వులకే పరవశలమై

యున్నను మనలఁ గన్నెత్తి యిఁకఁజూడఁడు. వాఁడు నూతన ప్రియుఁడుగదే. కాన వానిని మానుపవలదే! మధురాపురి చెలువలకు నేఁటిరాత్రి సుఖముగాఁ దెల్లవాఱినది. వారి కోరిక లెల్ల నిక్కములే యైనవి. ఇది నిజము. కావుననే వారు కృష్ణుఁడు తమపట్టణమందుఁ జొచ్చినపుడు వాని ముద్దునెమ్మోముఁదామర యందలి కడగన్నులఁ జిప్పిలుచున్న చిఱునవ్వనెడి గొనబురస మును గ్రోలిసోలుదురుచుమీ. వారి భాగ్య మేమి చెప్ప! మధు రకుఁబోయి మరలివచ్చునఁటే! అది యేటిమాట. చెలులారా! పురస్త్రీల పూఁదేనె లొలుకుపలుకులకుఁ జిత్తము గోలుపోయి వారి నునుసిగ్గుతోడి మిటారంపుఁగులుకుబెళుకులందుఁ దిగుడు పడుచుఁ గృష్ణుండుఁ దానెంత దిట్టఁడయ్యు వారికి లోనై చిక్కు వడును. పిదప వారియంత నీటుకత్తెలముకాని మనబోంట్లకడకు నెట్లు మఱలివచ్చునో? నేఁటికిలక్ష్మీరమణుండునుగల్యాణగుణాక రుండు నగుకృష్ణునిఁ జూడఁగా దాశార్హులకును భోజులకును, నంధ కులకును వృష్ణులకును, సాత్త్వతులకును మఱిదారియందా దేవకి పట్టిని జూచునట్టి యితరజనులకును గన్నుల కెంతో పెనుఁ బండువు కాఁగలదు. ఇది నిజము. కరుణమాలిన యిట్టి కట్టిఁడి వానికి 'అక్రూరుఁ'డను పేరెంతమాత్ర ముండఁదగదు. వీఁ డిం తింతనరానిబెట్టిదుఁడు గాన క్రూరుఁడనియే పిలువవలయును. మిక్కిలియు దుఃఖితలమై యున్నయీమనలను నించుకయు నోదార్పక ప్రాణములకంటెఁ బ్రియుఁ డయిన మనకృష్ణుని నెక్కడికో కానని దవ్వులకుఁ దీసికొనిపోవుచున్నాఁడే! క్రూరుఁ డే కానిచో నిట్లు సేయునా? వీఁడుగోఁ జూడరే మనకృష్ణుఁ డెంతకఠినహృదయుఁడో రథము నెక్కినాఁడు. మనముదుస్సల్లో

మూర్ఖులుగాన పోవలదని వారింపరయిరి. వారికిఁ దోడుకొ్ని్ిపోవు నయీగొల్లలును గృష్ణుని వెన్నాడి బండ్లను బూన్చి రా రమ్మని వీనిని నిలువనీయక తొందర పెట్టుచున్నారుగదే! మఱి దైవము గూడ నేఁడిట్లు మనకుఁ బ్రతికూలమే సేయుచున్నదే! ఏమి సేయుదమే! మాటలతో నేమి? తెగింపక తీఱదే. మన మందఱమును గూడి కృష్ణునిఁదఱిసి పోవలదని చలపట్టి యడ్డగింతము. మన కులము పెద్దలుగాని బంధువులుగాని మనల నేమిచేయఁగలరే! మనకృష్ణునితోడి పొందువిడిచియుండుట కరనిమిషమేని సైఁపదు. అట్టిదైవ మిట్టిపొందునే తుదముట్టఁబాపినందునఁ జిత్తము లగలి వందికుందుచున్న మనకు మృత్యువ్పును సరకుగాకుండఁగా మఱి యెవ్వరేమి సేయవచ్చును? గోపికలారా! రాసక్రీడయం దందఱు గుమిగూడినపు డనురాగంపుఁబెంపునసొంపారు నా కృష్ణునినవ్వులను, మంతనంబున నాడు సరసంపుఁబలుకులును, విలాసంపుఁ జూడ్కులును, బిగికౌఁగిలింతలను జిక్కి సొక్కుచు రాత్రు లొక క్షణమువలెఁ గడపిపుచ్చితిమి. అట్టికృష్ణునిఁ బాసి తుదలేనియీవిరహదుఃఖాంధకారము నెట్లు తరింపఁ గలమోగదే! దుఃఖమును దరించుట యటుండనీ! మనకృష్ణుఁడు రామునిఁగూడి గొల్లలుచుట్టు బలసికొలువ, మాపటివేళను గోవులకాలిదువ్వచే ముంగురులును పూసరులును ధూసరితములై యొప్ప, వేణుపల్లెను జొచ్చుచు, వేణువునూఁదుచుఁ, జిఱునవ్వుతోడి కడకంటిమిటారి చూడ్కిచే మనచిత్తముల నువ్వెత్తుగా హరించుచుండునుగదే. అట్టి చెన్నునిఁబాసి యెట్లు బ్రతుకఁగలమో?' యని ముచ్చటలాడిరి. ఆగొల్లచెలువలిట్లుపలుకుచుఁ గృష్ణవిరహంబునకు సైఁపలేక యాఱటపడుచు నతనియందు మనంబులు మిక్కిలియుఁ

దగులుపడఁగా నంత సిగ్గును దిగవిడిచి యింపయిన యెలుంగున 'గోవిందా ! దామోదరా! మాధవా!'యని రోదనముఁగావించిరి. ఆ పూఁబోం డ్లిట్లు రోదనము సేయుచుండఁగా సూర్యుఁ డుదయించెను. అంత నక్రూరుఁడును గోపకులయందుఁ దన నెయ్యముతియ్యమును నెఱపి ప్రాతస్సంధ్యోపాసనాదులఁ గావించి, యంత రథమునుదోలెను. నందుఁడు మొదలయిన గోపకులు పాలుపెరుఁగు మొదలగు గోరసములు నిండియున్నకుంభములనే కానుకలుగొని బండ్లనెక్కి యతనివెంటఁబోయిరి. గోపికలును దమగారా మయినకృష్ణునివెంబడించి యతఁ డూఱడింపఁగా నతనిప్రత్యుత్తరమును గోరుచు నచ్చటనే నిలుచుండిరి. ఆ యదుసత్తముండు తనపయనమున కాబిత్తరు లట్టుతత్తఱించుచుండుటను దన మాఱుపలుకు నెదురుచూచు చుండుటను జూచి, వేగ మరలవచ్చెద నని దూతలమూలమునఁ జెప్పిపుచ్చి, వారి నెంతయు నోదార్చెను. వారు తమచిత్తములను గృష్ణుని వెంట నంపిపుచ్చి యాతని తేరిపడగ తెలియువఱకును, పిదపఁదేరిధూళి చూపట్టువఱకును, జూచుచుఁ జిత్తరువులవలె నిలఁబడియుండిరి. అంత వారు గోవిందుఁడు మరలు ననెడియాశయుడిగి తిమతమయిండ్లకు మరలి యంతఁ దమప్రియుం డయినకృష్ణుని చేష్టితములనే పాడుచును దానిచేతనే శోకముడిగి దినములు గడపుచుండిరి. భగవంతుఁడును రాముని నక్రూరునిని గూడి వాయువేగంబగు రథమునఁబోయి యంతఁ బాపనాశినియగు కాళిందినిఁ జేరినవాఁ డయ్యె. అంత రాముఁడును దానును జలముల నాచమించి మెఱుఁగుపెట్టిన యింద్రనీలమణివలెఁ దలతల మెఱయుచున్న యాజలములను ద్రావి యంత జల్లనిచెట్ల జొంప

ములకుఁబోయి రథము నారోహించెను. అక్రూరుండును శత్రువులకు జంకి యారామకృష్ణుల రథముపయినిలిపి 'వారిని వీడ్కొని మాధ్యాహ్నికకృత్యమునకై కాళిందీహ్రదమునకువచ్చి యందు యథావిధిని స్నానము జేయఁబూనెను. అతండు నిత్యబ్రహ్మస్వరూపావేదకంబగు ప్రణవమును జపించుచు, నందలి జలంబులఁ గ్రుంకి యందారామకృష్ణులే కవగూడియుండఁగాఁ గాంచెను. అట్లు వారినిఁజూచి, 'ఆ వసుదేవునికొడుకు లాయిరువురును రథమం దున్నవారే; ఇప్పుడిచ్చట నెట్లున్నారు ? తేరుదిగి యిట వచ్చిరేమో! అప్పుడు తేరియందు లేరు కాఁబోలు' నని వితర్కించి గ్రుంకిలేచి రథమును నరసెను. అతఁ డారథమునందును మునుపటివలె వారిరువురు గూర్చుండియుండఁగాఁ జూచి 'వీరిని జలములందు నేనుజూచినది యబద్ధమా ? నిజమా ? నిజమేని మరల నందుఁబోయి చూచెద' నని తిరుగ నందు గ్రుంకులిడెను. ఆజలమందును దొలుత నతఁడు సిద్ధులును మేటి భుజంగులును నసురులును మెడలువంచి వినయంబున సన్నుతించుచుండఁగా వెలుంగుచున్న యీశ్వరుని శేషునిఁ గాంచెను. ఆ దేవుండును వేయిశిరసులు గలిగి వేయి పడగలయందును గిరీటములు బెడఁగుచూప నీలవస్త్రమునుగట్టినఁ దామరతూడువలెఁ దెల్లని వన్నె దళుకొత్త బంగారుశిఖరములతోఁ గూడిన వెండికొండయుంబోలె గండరించుచుండెను. అతని యొడిమీఁదు నీలమేఘశ్యాముఁడై పీతాంబరముధరించి చతుర్భుజములును, పద్మపత్రములవంటి విశాలనేత్రములును వెలయ శాంతుఁడై యున్న యొక పురుషునిఁ గాంచెను. అతఁడు చెలువయి చల్లఁదనము దొలకుచున్న నెమ్మొగమును, సొగసయిన నగవుతోఁ గూడిన

చూపును గలిగియుండెను. కొమరుగా వంపుదీరిన కనుబొమలును, చక్కనయిన ముక్కును, సుందరములయిన కర్ణములును, నిద్దములయిన ముద్దుచెక్కులును, కెంపారుచున్న యధరమును నాతనియందు మురువుగులుకుచుండెను. మిక్కిలి బలువులై మోఁకాలివఱకు వ్రేలుచున్న నిడుదబుజములును, నిక్కగల మూఁపులును, విశాలమయినవక్షఃస్థలంపు సొంపును మిక్కిలి వెంపారుచుండెను. మఱియు సంకువవలె మూఁడు రేకలుగల కంఠమును, లోఁతయిన పొక్కిలియు, నెత్తఱులుగలిగి రావి చిగురువలె నున్నయుదరమును, వెడందమైన కటితటమునుం బిఱుందులును, నేనుఁగుతొండములవంటి తొడలును వఱలుచుండెను. సొగసయిన జానువులును, నిడుదలయిన చిఱుదొడలును, బెడఁగారుచుండెను. ఇంతేకాక నిక్కగల గుల్ఫములయు నెఱ్ఱని నఖపంక్తియుఁ గాంతులచేతను, అంగుష్ఠములును వ్రేళులు ననెడిఱేకులచేతను నతనియడుగుఁదమ్ములెమ్మె గులుకుచుండెను. మిక్కిలి వెలపొడుగయిన మణులుదాఁపిన కిరీటమును మకుటము నంగదములును, మొలనూలును, జందెమును, హారములును, నూపురములును, గుండలములును దాల్చి యతఁడు తేజరిల్లుచు లీలారవిందమును గరమునఁ దాల్చియుండెను. మఱియు హస్తములశంఖచక్రగదాదులుగొని, శ్రీవత్సంబనుమచ్చ వక్షంబున మెచ్చులుగులుక, కౌస్తుభము ధగధగమని మెఱయ, వనమాలయు నెలుంగఁ జెలంగుచుండెను. సునందనందాదు లయిన పార్షదులును, సనకాదిమునులును, బ్రహ్మరుద్రేంద్రాది దేవతలును, తొమ్మండ్రు మరీచ్యాదు లగుబ్రాహ్మణోత్తములును, బ్రహ్లాదుఁడు, నారదుఁడు వసువులు మొదలయిన భాగవతోత్త

ములును, నద్దేవుని 'సర్వశేషియనియుఁ బరబ్రహ్మమనియు,సర్వ కారణుండనియుఁ బ్రజాపతియనియు' భిన్నాభిప్రాయంబులగువా క్యముల వేఱువేఱ విశుద్ధమానసంబులతో స్తుతించుచుండిరి. మఱియు, శ్రీ, పుష్టి, గీ, కాంతి, కీర్తి, తుష్టి, ఇల, ఊర్జ, విద్య, అవిద్య, శక్తి, మాయ యనెడుపండ్రెండు మూర్తివిశిష్టలయిన శక్తు లాతనిని గొలుచుచుండెను. అక్రూరుం డద్దేవునిఁగాంచి మిక్కుటమయిన సంతోషము దొంతరలుగొనఁ బరమభక్తియు క్తుఁడై మేను గగురుపొడువ, నగ్గలంపుఁ బ్రీతిని నుల్లము పల్ల వింపఁ, గన్నుల నానందజలము చిప్పిల, బలుకు డగ్గుత్తికపడు చుండ నెట్టకేలకు దిటదెచ్చుకొని శిరసుసోఁక మ్రొక్కి చేతులు మోడ్చి యల్లల్ల నిట్లని స్తుతించెను. ఇది ముప్పదితొమ్మిదవ యధ్యాయము.

---

## అక్రూరుఁడు శ్రీకృష్ణుని స్తుతించుట.

సమస్తవ్యష్టిప్రపంచమునకు హేతువులగు మహదాదులకును హేతుభూతుండుగాన యఖిలహేతుహేతుండును,నట్లయ్యు నాస త్తుగాని, బ్రహ్మగాని, ఆకాశాదులనొక్కండు గాని గాక సర్వజగ త్కారణుండగుటంజేసి నారాయణుండును, దనకుఁగారణాంతర ములేమింజేసి యాదిపురుషుండును, శరీరభూతములగుచిదచిత్తుల కేకాని తనకు వికారములు లేమింజేసి యవ్యయుండును నగునీకు నమస్కరించెదను. ఎవ్వనినాభినుండి పుట్టినతామరమొగ్గనుండి బ్రహ్మయు నాబ్రహ్మవలననుండి యీలోకమును బుట్టెనో, యట్టి నీకు నమస్కారము. భూమియు, జలమును, నగ్నియు, వాయు వును దానికిఁ గారణమగు మహత్తును, దానికిఁ గారణమగు

మూలప్రకృతియు,దశవిధము లయినయింద్రియములును, మనస్సును నింద్రియాధిష్ఠాత లగు దేవతలును, నింద్రియార్థములగు శబ్దాదులును, నని జగత్తునకు హేతువు లగునివియన్నియు నీకు నంగములు. నీదు శరీరభూతములు. ఇట్లు నీవు నిమిత్తమును నుపాదానమునై యఖిలహేతుహేతు వగుచున్నావు. నీకు శరీరభూతము లయినయీమూలప్రకృతి మొదలయినవియు జీవాదులును నంతరాత్మ వగు నీదు స్వరూపమును దెలియనేరవు. జడము లగుప్రకృత్యాదులకుఁ దెలియక పోవచ్చునుగాని యజడములగు జీవులకును దెలియకుండుట యెట్లందు వేని, ఆత్మ కాని దేహమునం దాత్మాభిమానమునకును, స్వతంత్రముగాని యాత్మయందు స్వతంత్రాభిమానమునకు, ని ట్లొకటిని మఱియొకటిగా భ్రమించు నభిమానములకుఁ బట్టువడి జీవులుందురు; కాన వారు తనుయాత్మయే దేహమునకంటె వేఱై యీశ్వరపరతంత్రమై యుండుట నెఱుంగరు.ఇఁక ని న్నెట్లు తెలియనేర్తురు. బ్రహ్మయు స్వశరీరారంభకము లయిన సత్త్వ రజ స్తమోగుణములకుఁ బరవశుఁ డగుటం జేసి, ప్రకృతిగుణము లయినయాసత్త్వాదులకంటె విలక్షణుండై తన్నియంతవై యుండునీస్వరూపము నెఱుంగఁడు. ఇఁకఁ దక్కినవా రెఱుంగరని చెప్ప నేల? కావుననే నిన్ను నెల్లవారును సర్వకారణుండ వని యెఱుంగకుందురు. *యోగులు (ప్రకృతికిని దత్సంసృష్ట చేతనులకును నిత్యులకును ముక్తులకును విలక్షణుండుగాన)మహాపురుషుం డగునిన్నే యుపాసింతురు.కొందఱు†సాధువులు, (ఆదిత్యునినడుమ నింద్రాదిదేవతాంతర్యా

* వీరు ఆనందవల్ల్యాది విహితోపాసనానిష్ఠు లని తెలియునది.

† వీ రంతరాదిత్య ప్రతర్దనాది విద్యానిష్ఠులు.

మివై యింద్రాదిశరీరకుండ వగుటంజేసి) సాధిదైవుం డగునిన్ను నుపాసింతురు. కొందఱు, (శరీరావయవములగు నక్షిహృదయాదు లందు వసించుటంజేసి) *సాధ్యాత్ముఁడవగు నిన్ను నారాధింతురు. వేఱుకొందఱు యోగులు (సర్వభూతములందును సర్వశరీరకుండ వై యుండుటంజేసి) † సాధిభూతుండ వగునిన్ను నుపాసింతురు. నీకు నానావిధ శరీరభూతులయిన యింద్రాది దేవతలను జేర్కొ నునట్టిది వేదపూర్వభాగ మగువిద్య. అది బోధించుచున్న పలువిధ ములయిన యజ్ఞములచేత నాయింద్రాది దేవతాంతరాత్మ యుఁ దచ్ఛరీరకుండు నగునిన్నుఁ గొందఱు కర్మయోగు లగుద్విజులు నారాధించుచున్నారు. 'నేను భగవంతునకే శేషభూతుండను. నాస్వరూపస్థితి ప్రవృత్తులు తదాయత్తములు. భగవంతుఁడో యసంఖ్యములగు కల్యాణగుణములచేత నాకంటె నుత్కృష్టుఁ' డనెడి యిట్టిజ్ఞానముగలవాఁడు, నిత్యనైమిత్తికాదిసమస్తకర్మ ముల ఫలమును నాయందు సన్న్యసించి వానిస్వరూపమును మదారాధనముగా ననుష్ఠించుచుశబ్దాదివిషయములందుభోగ్య ములనెడిబుద్ధి నుడిగి 'ప్రాప్యమును బ్రాపకమును మనోరథ విష యములగు సర్వమును బరమపురుషుఁడే' యనెడి యిట్టిజ్ఞానయో గముచేత జ్ఞానస్వరూపుం డగునిన్ను నుపాసించుచున్నారు. నీవు వచించిన పాంచరాత్రవిధి చొప్పునఁ దాపాది పంచవిధ సంస్కా రము లొందిన దేహములుగలవారై నీజ్ఞానమే మిక్కుటముగాఁ

*'ఆత్మని శరీరే అధ్యాత్మం తేన సహితం సాధ్యాత్మం' అని వ్యుత్పత్తి. శరీర ముతోఁగూడినవాఁడు-అనఁగా శరీరావయవములందువసించుచున్నవాఁడనుట. 'అథాధ్యాత్మం య ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే' అని ఛాందోగ్యము.

† ఇందులకు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇత్యాది శ్రుతు లనుసంధింపఁదగును.

గలిగియుండు భగవచ్ఛాస్త్ర నిష్ఠులగు నితరులును, వ్యూహావిభ వాదిరూపమున బహుమూర్తులు గలిగియుఁ బరరూపమున నేకమూర్తిఁగలిగియు నుండు నిన్నే చక్కఁ బాంచకాలికములగు ధర్మములచే నారాధింతురు. భగవంతా! కాపాలిక కాలాముఖ శైవపాశుపతాదు లగువెక్కు లాచారభేదములచే నొప్పుచు శైవాద్యాగమము లందుఁ జెప్పఁబడినట్టి ప్రకారమున నిన్నే *శివరూపిఁగాఁ గొంద ఱుపాసించెదరు. ప్రభూ! నానాదేవతలను భజించు నాయాజను లాయాదేవతలనుబరమాత్మయనితలంపక యాయాదేవతలనియె వేఱుబుద్ధిగలిగి భజించినను సర్వదేవతా శరీరకుండవగుటంబట్టి, సర్వదేవమయుండవగు నీశ్వరుండవగుటం జేసి, వా రందఱు తుది నిన్ను యజించినవారే యగుచున్నారు. పర్వతమునుండి పుట్టిననదులు పర్జన్యునిచేత నంతటను జలపూరితములై వెక్కులు వెల్లువలుగొని యన్నియుఁ దుదిని సముద్రమునే చొచ్చునట్లు, తత్తద్దేవతావిషయములగుబుద్ధులన్నియును దుదకు నిన్నే గుఱించిన వగుచున్నవి. నీకు శరీరభూతం బగు ప్రకృతికి సత్త్వము రజస్సు తమ సుని గుణములుమూఁడు. ఆమూఁడు గుణములయందుఁ దంతువులందుఁ బటమువలెఁ బ్రకృతి పరిణామాత్మకము లయిన బ్రహ్మాదిస్థావరపర్యంతము లగు దేహములు గూర్పం బడియున్నవి. నీకు దేహవిశేషణము లగుగుణముల

---

* ఇట 'యేఽప్యన్య దేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః। తేఽపిమామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్' అని భగవద్గీతాశ్లోకము ననుసంధించునది. ఏదేవతను యజించినను సర్వదేవతా శరీరకుఁ డగు భగవంతునియందే యది పర్యవసించుచున్నది. కాని యాదేవతలను యజించుట విధిపూర్వకము గాదు గానతత్ఫలము అంతము గలిగియుండును. భగవద్యజన మనంతఫలము.

మయము లేకాన బ్రహ్మాదుల దేహముల ప్రవృత్తులెల్ల నీకు లోన యినవి యై యున్నవి. బ్రహ్మాది సమస్తక్షేత్రజ్ఞులకు నాత్మభూతుండయ్యు సమస్తము లయినబుద్ధులను దనంతటఁ గనుఁగొనుచుండువాఁడును, గాన జీవునివలెఁ దన దేహభూతములగువానియందుఁ దాననియెడి యభిమానముతోడి చూపులేనివాఁడును, నగు నీకు నమస్కారము. మఱి యెవ్వనిప్రకృతిం జేసి దేవతిర్యఙ్మనుష్య దేహములు గలక్షేత్రజ్ఞులయందు సత్త్వాదిగుణప్రవాహరూపమయిన యీసంసారము మాటిమాటికిఁ బ్రవర్తించుచున్నదో, యట్టినీకు నమస్కారము. నీకు నగ్నిముఖము, *భూమియంఘ్రులు; చూపు సూర్యుఁడు, నాభి యాకాశము, దిక్కులు చెవులు, సత్యలోకము శిరస్సు, ఇంద్రాదులు బాహువులు, సముద్రములు కుక్షి, వాయువు ప్రాణమును బలమును, మఱి వృక్షములును నోషధులును నీకు రోమములు, మేఘములు తలవెండ్రుకలు. పర్వతములు నీకు నస్థులును నఖములును. రేయుంబగళ్లు ఱెప్పపాట్లు, బ్రహ్మ మేఢ్రము, వర్షము వీర్యము. అవ్యయాత్మా! పెక్కండ్రు జీవులును దత్పరిపాలకులును నెరసిబెరసియుండు నీలోకములన్నియును జలములందు సూక్ష్మప్రాణిసమూహములన లెను, మేఁడిపండులోనియకీరువులందు దోమలవలెను. నొండొంటివార్తనే

* ఇట భూమియనఁగా పాతాళమువఱకుఁగల భూతలమనియు, అంఘ్రియనఁగా నడుగులు మొదలుకొని జఘనమువఱకుఁగల నవయవ సమూహమనియు, నాకాశమనఁగా భువర్లోకము మొదలుకొని తపోలోకపర్యంతమనియు, నాభియు లోన్నును మెడయు ముఖమును లలాటమునుంగాఁ దెలియునది. ఇట విశ్వరూప వర్ణనము. సత్యలోకము శిరసుగా నిందు వర్ణితము. తక్కినవియు నయ్యెయెడల నట్లె యూహ్యములు.

నెఱుంగక వర్తించునట్లు, ని ట్లనంతములయిన బ్రహ్మాండములును విశుద్ధమనంబునకే వేద్యుండ వయినపరమపురుషుండ వగునీ యందుఁ జరించుచుండును. నీ వీలోకమున వేడుకకొఱకు నేయే రూపములను దాల్తువో, వాని ననుసంధించుటచేత దుఃఖము లెల్లఁ దుదముట్ట వీడి రసజ్ఞజనులు ముదముతో నీయశమును గానము సేయుచుందురు. జగత్థ్సితికారణభూత మై ప్రలయ సముద్రమందుఁ జరించునాదిమత్స్యమునకు నీకు నమస్కారము. మధుకైటభులకుమృత్యువగుహయగ్రీవునకునీకునమస్కారము. మందరపర్వతమును దాల్చుటకై మహాకూర్మంబ వైన నీకునమ స్కారము. భూమిని బయికి నెత్తి క్రీడకై వరాహరూపము నొం దిననీకు నమస్కారము. సజ్జనసమూహముభయమును బోకా ర్చుటకై యద్భుతంబగు సింహమవయిన నీకును నమస్కారము. ముల్లోకములను నడుగులచే నాక్రమించిన వామనమూర్తికి నీకు నమస్కారము. గర్వితులయిన క్షత్రియు లనెడి వనమును భేదింప గొడ్డలిని దాల్చినభృగుకులపతి వగుపరశురామునకు నీకునమస్కారము. రావణాంతకరుండయినరఘువర్యునకునీకునమ స్కారము. వసుదేవునిపుత్త్రుండగు నీకు నమస్కారము. సంకర్షణు నకునీకునమస్కారము. ప్రద్యుమ్నుండునునిరుద్ధుండును సాత్త్వ తులకుఁ బతియు నగునీకునమస్కారము. దైత్యదానవులను మోహపెట్టుటకై శుద్ధుండవగు బుద్ధునకు నీకునమస్కారము. మ్లేచ్ఛ ప్రాయు లగుక్షత్త్రియులను సంహరించుటకై కల్కిరూపు నొంది ననీకు నమస్కారము. భగవంతా! ఈజీవలోకము నీమాయ చేత మోహితమై యహంకార మమకారము లనియెడి దుష్ట ములగు నభిమానములొంది శబ్దాదివిషయసాధనము లగుకర్మ

మార్గములందుభ్రమించుచున్నది.జీవలోకములోనివాఁడనగు నే, నును దేహపుత్త్రగృహములునునుభార్యలునుధనములును సొంత జనములు మొదలగునవియుస్వప్నసమానములయినవియగును. వీనిని మూఢుండనై సత్యములుగాఁదలంచి విభూ ! యిందుభ్రమించుచున్నాను. మఱియు నిత్యములగు వస్తువుల ననిత్యములనియు, ఆత్మగాని దేహమునే యాత్మయనియు, దుఃఖములగు శబ్దాదివిషయములను సుఖములనియుఁ, దలక్రిందుగా బుద్ధిగలిగినవాఁడనై నేను సుఖదుఃఖాది ద్వంద్వములందుఁగ్రీడించుచుఁ దమోగుణ మావేశించియుండుటవలన నిత్య నిరతిశయ నిరుపాధిక ప్రియుండ వగు నిన్నుఁ దెలియనేరకున్నాను. జలమువలనఁ బుట్టిన తృణాదులచే ముసుఁగుపడిననిక్కంపుజలమునువిడిచి తెలియనివాఁడు జలమువలెఁ దోచునెండమావులకుఁ బోవునట్లు, నేనును నిరతిశయపురుషార్థభూతుం డగునిన్నువిడిచి దేహాదుల కభిముఖుండ నై వర్తించుచున్నాను.నన్నిట్లు ఱంగినట్టి నీకువిషయాభిముఖ్య మెక్కడిదందువా? నాబుద్ధి విషయవాసనచే డిందువడియున్నది. కావుననే లోపలఁ గామకర్మములచేఁ గలగుండువడి కలంచునట్టివియు, బలవంతము లయినవియు, విషయయుక్తములు నగు నింద్రియములచే నిట్టట్టు లాగంబడుచున్న నామనస్సును నడంచి నిలువరించుటకు శక్తుఁడను గాకున్నానే ! ఇట్లు విషయపరవశుండనై నీవుదప్ప వేఱుసాధనము లేకున్న నేను సజ్జనులకు నెంతయు లభ్యముగానట్టి నీపాదారవిందములను శరణొందితిని. అదియు నీ యనుగ్రహమనియె యీశా! నేను దలంచుచున్నాను. సత్సంగతివలననిదిగలుగదా యందువేని సంసారియగు పురుషునకు సంసారము ముగియుట

నీయనుగ్రహమె. అబ్జనాభా! అప్పుడే చుమీ సజ్జనుల నుపాసించుటకు మతిపుట్టును. కాన యన్నింటికి మూలము నీయనుగ్రహమే. అనుకూలజ్ఞానమాత్ర స్వరూపుండును, సర్వజనులకు జ్ఞానప్రదుండును, ప్రధానపురుషులకు నీశ్వరుండును, బరబ్రహ్మంబును ననంతశక్తియు నగు నీకునమస్కారము. వాసుదేవుండును సర్వభూతావాసుండును నగు నీకు నమస్కారము. హృషీకేశా! నీకు నమస్కారము. ప్రభూ! నిన్ను శరణుఁజొచ్చితిని. నన్నురక్షింపుమా' యని స్తుతించెను. ఇది నలువదియవ యధ్యాయము.

---

కృష్ణుఁడు—ఇట్లతఁడు స్తుతించుచుండఁగాభగవంతుఁడు జలమునం దతనికిఁ దనయసాధారణ దివ్యవిగ్రహమునుజూపి మరల దానిని నర్తకుఁడు తననాట్యమునుంబోలె, మఱుఁగుపఱిచినవాఁడయ్యె. అక్రూరుఁడు నాదివ్యరూప మంతర్ధానము నొందుటనుజూచి, జలములనుండి వేగమలేచి యావశ్యక మగుమాధ్యాహ్నికక్రమమునంతయుఁ దీర్చికొని విస్మితుండయి రథము నెక్కెను. హృషీకేశుఁడు కృష్ణుఁ డతనినిఁజూచి 'నీ వీరథము నందో లేక భూమియందో యాకాశమందో జలమందో వింత యేమిచూచితివి? నీవేమో వింతచూచినట్లు నాకు జాడ కనుపట్టుచున్నదే' యని యడిగెను. అక్రూరుఁడు, 'ఇందును భూమియందును నాకాశమందును జలమందును నద్భుతములెన్ని గలవో యన్నియు విశ్వశరీరకుండ వగునీయందేయున్నవి. అట్టినిన్నే నేను జూచుచుండఁగా నిఁక నద్భుతమేమి చూడవలయును? నీయందులేని యద్భుతమొక్కటియు నాకుఁ జూపట్టినదిగాదు.

'బ్రహ్మమా ! అద్భుతములెల్ల నీయందే యుండఁగా నట్టి నిన్నే చూచుచున్న నాకు భూమియందుఁగాని, ఆకాశమందుఁగాని, జలమందుఁగాని, యద్భుతమేమి కనుపట్టును. నీవుతప్ప మఱి యద్భుత మేదియులేదు చుమీ' అని చెప్పి రథమును దోలి సాయంకాలము వేళకు రాముని గృష్ణుని మధురకు గొంపోయి చేర్చెను. మార్గమందుఁ బల్లెపట్టుల జను లందఱు మూఁకలు గొని వసుదేవ పుత్త్రులఁగాంచి యెంతయు సంతోషముమీఱఁ దమచూపులను దిప్పుకొనలేక పోయిరి. వ్రేపల్లెవా రగు నందుఁడు మొదలయిన గోపకులు, ముందుగానే మధురను జేరి యందుఁ బురోపవనమును బొంది రామకృష్ణులరాక నెదురు చూచుచు నిలిచియుండిరి. జగదీశ్వరుఁడు కృష్ణుఁడు వారలను గూడికొనియక్రూరుని చేతినిదన చేతఁగీలుకొలిపివినయసంపన్నుం డగు నతనితో 'నీవురథమునుదోలుకొని ముందర పురముచొచ్చి యిలు సేరుము. మేమిచట విడిసి వెందలకడఁ బురమునుఁ జొచ్చి చూచెదము' అనిరి. అక్రూరుఁడు 'నేను మీరిరువురు లేక మధురాపురమును జొరనొల్లను. నాథా! భక్తవత్సలుండ వగు నీకు భక్తుని నన్ను విడువఁదగదు. గృహమేధుల మగుమాగృహ మునకు,సురోత్తమా! రమ్ము. అన్నను గోపాలురను దక్కినసుహృ దులను గూడిరమ్ము.అందఱును గలసి యేమనయిండ్లకుఁబోదము. అధోక్షజా ! మమ్ము సనాథులను జేయుము. ఎద్దానిని గడిగినజల ములను ద్రావినను శిరంబునఁదాల్చినను బితరులునునగ్నులును దేవతలును దృప్తినొందుదురో, యట్టి నీపాదరజముచేత గృహ మేధుల మగుమాగృహములను బావనము సేయుము. నీపాద యుగళమును గడిగి బలిచక్రవర్తి మహాకీర్తియు, గుణము

లందు మిక్కిలి గొప్పవాఁడ వయ్యె. అసమానంబగు నైశ్వర్యమును బడయువాఁ డయ్యె. మఱియు ననన్యప్రయోజనులగు ప్రపన్నుల గతియుఁ బొందువాఁడయ్యె. నీపదములను గడిగినట్టి జలములు, గంగాజలములు, పవిత్రములై మూఁడులోకములను బావనములు గావించినవి. ఆజలములనే శివుఁడు శిరంబునఁ దాల్చెను. సగరునిసుతులు దానిచేతనే స్వర్గమునొందిరి. దేవ దేవా! జగన్నాథా! పుణ్యశ్రవణకీర్తనా! యదూత్తమా! ఉత్తమశ్లోకా! నారాయణా! నీకు నమస్కారము' అనెను.

రామకృష్ణులు మధురానగరమును బ్రవేశించుట.

కృష్ణుఁడు—'యదుసమూహములకు ద్రోహియగు కంసుని జంపి పిదప మాయన్నతోడ మీయింటికి వచ్చెదను. మఱితక్కిన సుహృదులకుఁ బ్రియమును గావించెదను' అనెను. కృష్ణుఁ డట్లు చెప్పఁగా నక్రూరుఁ డించుక మనంబునందు సంతుష్టిచూపట్టఁ బురమును బ్రవేశించి కంసునికిఁ దాను జేసినదంతయుఁ జెప్పి గృహమునకుఁ బోయెను. అంత సాయంకాలమునఁ గృష్ణుఁడు బలరామునింగూడి గోపకులుబలసి కొలువ మధురనుజూడఁగోరి యందుఁజొచ్చి కాంచినవాఁ డయ్యెను. అది పటికంపుఱాలచే గట్టంబడి పొడువులయిన పట్టణంపు ద్వారములును నితరద్వారములునుగలిగి, పెద్దవియై బంగారు మయము లయినకవాటములు గలబహిర్ద్వారములతోఁ గూడి బెడఁగారు చుండెను. మఱియు నందు రాగిచేతను నిత్తడిచేతను నిర్మితములయిన ధాన్యాదుల కొట్టులును, జుట్టును దారసింప నలవిగానియగడ్తలును, దవ్వుల నుద్యానములును, దాపున రమణీయములయిన యుపవనములును గలిగి చెలువు గులుకుచుండెను. బంగారు

మయము లయినచతుష్పథములునునుప్పరిగలును బెరఁటితోఁట
లును నాయాశిల్పకారులు గుఱుతులుగొని గూర్చుండియుండు
రచ్చపట్టులును, నితరము లయినగృహములును నాపురమున
నొకశోభఁ గూర్చుచుండెను. వైడూర్యములు వజ్రములు
విమలము లయిననీలములు పగడములు ముత్యములు పచ్చలు
మొదలగునవి దాపఁబడిన పలభులయందును వేదులయందును,
గిటికీల సందులయందునుఁ, గట్టనపుసేలలందును, బావురాలును
నెమిళ్లును నెలకొని యింపయిన నాదములు సేయుచుండెను. మ
ఱియు నందలి రాజమార్గములందును నంగడివీథులందును జతు
ష్పథములందును జక్కఁగాఁగలయంపులుచల్లఁగా నవియింపుగు
లుకుచుండెను. అందందుఁ బువ్వులును మొలకలును బేలాలు నక్ష
తలును నెరసియుండెను. మఱి మంగళార్థము వెరుఁగును జంపన
మును జల్లంబడినవై, పూవులయు దీపములయుఁ బంక్తులతోఁ
గూడి, చిగుళ్లుగలిగి వెలుఁగుచుండుపూర్ణకుంభములును, బండ్లగె
లలువ్రేలాడుచున్నయరఁటిపోఁకబోదియలును, టెక్కెములును,
మూరెఁడేసి నిడివి వన్నెగుడ్డలును, ఒక్కొక్క గృహద్వార
మును నలంకరించుచుండెను. వసుదేవునికుమారు లారామకృష్ణు
లిట్టిపురమును సఖులు గొలువ రాజమార్గమునఁ బ్రవేశించిరి.
అపుడు పురస్త్రీలు వారినిజూచుటకై యుత్సుకలై తొడిఁబడ
హర్మ్యముల నారోహించిరి. అందుఁ గొందఱు సుందరులు
వస్త్రములను భూషణములు తాఱుమాఱుగఁ దొడిగికొనియు,
మఱికొందఱు కుండలములు మొదలగు జతసొమ్ములలో నొకటి
దొడిగి యొకటిమఱచియు, కొందఱు నొకచెవియందు మాత్ర
మొకకమ్మదొడిగియు, కొంద ఱొక కాలియం దొకయందియ

దాల్చియు, కొందఱొకకంటమాత్రము కాటుకఁబెట్టికొనియుఁ, దోడిబడ నరుగుదెంచిరి. కుడుచుచుండినకొందఱు పడఁతులా కుడుపునువిడిచియు, కొందఱు జలకమాడుచుండి దానినిఁ దుడ ముట్ట నాడకయు, కొందఱు నిదురించుచుండి చప్పుడువినఁగానే లేచియు,కొందఱు బిడ్డలకుఁ జన్నిచ్చుచుండి యట్లె వారిని దిగఁ ద్రోచియుఁ బాఱుతెంచిరి. తామరఱేకులం బురడించు కన్నుం గవ గలయావెన్నుండు, ఆలక్ష్మీరమణుండు, తనపోఁడతనంబు లీలలచేతను, నగవు దళుకొత్తు నునుఁజూడ్కులచేతను, నాపూఁ బోండ్ల మనసులను హరించి మత్తిల్లిన యేనుగజమువలె వీథి గులుకు నెన్నడతోఁ బోవుచుఁ గన్నులకుఁ బెనుపండువు గావించు చుండెను. ఆస్త్రీలు కృష్ణునిఁ బలుమాఱు వినివిని యున్నవారు గాన నతనియందు వారిమనసులు దవిలియుండెను. కాన నతనిని జూచి, యాచూపులందును నవ్వులందును దొలఁకు నమృతము తమపయిని జిలుకుటవలన మనస్సున విఱ్ఱవీఁగి తెరచినకన్నుల మూలమున మనస్సునందుఁదొరకొన్న యాయానందమూర్తిని బిగియఁ గౌఁగిలించి మేనుగగురుపొడమ నతనిం బాయింప మివలన నింతిం తనరాక కలిగినవెత నంతయు దిగవిడిచినవార యిరి. పడఁతులు మేడలశిఖరములపయినెక్కి ప్రీతిసొంపున నెమ్మో ముఁదామరలు వికసిల్ల, బలకృష్ణులపయిని బుష్పవలజొంపములు నలుగడలఁ గురిసిరి. ద్విజులు మిక్కిలియు ముదమునొంది యా యిరువుర నందందుఁ బెరుఁగుచేతను నక్షంతలచేతను జలపాత్ర ములచేతను బూదండలచేతను గంధములచేతను, దక్కిన కాను కలచేతను నర్చించిరి.పురకాంతలు వారినింజూచి 'మనుష్యలోక మునకంతయు మహోత్సవముగా నున్నయీ ముద్దుకుమారుల

నిద్దఱను గోపికలు చూచుచుందురే. ఔరా! వారు తొల్లి యెట్టి మహాతపము చేసిరో కదా'యనిరి. అపుడు రామకృష్ణులు

రజకవధము. వాయకసుదామకుబ్జాదులసమ్మానము.

పోవుదారి యందొక చాకలివాఁడు వచ్చుచుండెను. వాఁడు వలువలకు రంగుసయితము వేయువాఁడు. కృష్ణుఁడు వానినిజూచి మిక్కిలి యుత్తమములయి యుదికిన మడుఁగుపుట్టములను గట్టికొననిమ్మని యడుగువాఁడై 'ఓరీ! మాకు నెంతయుఁ దగినట్టి వస్త్రములనిమ్ము. అందులకు మే మర్హులమే చుమీ. నీవిచ్చితివేని నీకెంతో శ్రేయము గలుగును. ఇందులకు సందియము లేదు' అనెను. అవాప్తసమస్తకాముం డగుటచే నన్నిటఁ బరిపూర్ణుం డయిన భగవంతుఁ డట్లు తన్నువేఁడఁగా వాఁడు కంసునిభృత్యుఁ డగుదుర్మదుఁడు గాన యెఱుంగక మిక్కిలి కోపముగొని యాక్షేపవచనములతో 'ఓరోరీ! కొండలయందును నడవులందును ద్రిమ్మరుచుండు తులువలారా! తలక్రొవ్వి కానితోవ నడచెదరా? మీరిటువంటి పుట్టములనే నిత్యమును గట్టుకొనుచుందురఁటరా? మీమీపరువులు దెలియక మహారాజుగారి ద్రవ్యములనే కోరికొనుదురా? ఇస్సీ! మతిమాలినవాఁడా! పదఁడవ్వల. వేగ తొలఁగుఁడు. ఓరీ! బ్రతుకవలయునని యించుక తలంపేనియుండెనా,! యిట్లు తలక్రొవ్వి కోరరాదుచుఁడీ. కోరితిరా! రాజభృత్యులు మిమ్ము చెఱఁబట్టి, చావఁగొట్టి, యున్న విత్తమంతయుఁ దోఁచుకొందురు చుఁడీ' అనెను. ఇట్లు వాఁడు మీఁదు మిక్కిలి బిరుసులు పలుకుచుండఁగాఁ గృష్ణుండు కుపితుఁడై తనకరాగ్రముచేత వానిని తలను మేనినుండి త్రెస్సిపడఁగూల్చెను. వాని యనుచరులందఱును వలువలమూటలను బడ

వైచి నానామార్గములఁ బరుగులెత్తిరి. కృష్ణుఁడును వలసినపుట్టములను గయికొనెను. కృష్ణుఁడును బలరాముఁడు నవుడు తమ తమకుఁ గూర్చునట్టి పుట్టములను గట్టికొని మిగిలినవానిని పక్కనగోపకులకు నొసంగి, కొన్నిటి నచ్చటనే నేలఁబడవైచి పోయిరి. అంత నొకసాలెవాఁ డెదురువచ్చి తలచీర రుమాలు మొదలుగా వింతవింత వన్నెలవలువలను వాని కనురూపము లయినవానిని దొడిగి వానికిఁదగు వేషము సవరించెను. ఇట్లు రామకృష్ణులు నానావిధము లయిన వేషములచే మిక్కిలి చక్కఁగా నలంకృతులై పర్వోత్సవమందుఁ జక్కఁగా సింగారింపఁబడిన తెల్లని నల్లని యేనుఁగుగున్నలవలె నెంతయుఁ జెన్నుగులుకు చుండిరి. భగవంతుఁ డావాయకునకుఁ బ్రసన్నుఁడై నీకమీఁద దన సారూప్యమును నిహమందుఁ బరమంబయిన సిరిని బలమును నైశ్వర్యమును, దనస్మృతియు, నందులకుఁ దగు నింద్రియపాటవమును, నొసంగినవాఁ డయ్యె. అంత వారు మాలాకారుఁ డగు సుదాముని మందిరమునకుఁ బోయిరి. ఆతఁడును వారిని జూడఁగానే దిగ్గన సంభ్రమించి లేచి, శిరసు నేలసోఁకఁ జాఁగిలఁ బడి మ్రొక్కి యాయిరువురకు నాసనంబులు దెచ్చి యునిచి పాద్యము సమర్పించి యర్ఘ్యద్రవ్యాదులు పుష్పమాలికలు తాంబూలములు ననులేపనములు మొదలగువానిచేతను వారిని వారియనుచరులనును బూజగావించెను. అంత నతఁడు వారితో 'ప్రభూ! మీయిరువురును వచ్చుటవలన మాజన్మము సార్థకమయ్యెను. మాకులము పవిత్రమయ్యెను. పితరులును దేవతలును ఋషులును మాయెడ సంతుష్టులయిరి. మేము యాదవులమే. మమ్మెల్లెచ్చుగాఁ దలంపవచ్చునా యనవలదు. మీరిరువు

రును సమస్తజగమునకుఁ బరమకారణముగదే. మీరు జగం బుల క్షేమమును యోగమునుగోరి మీమీసంకల్పమునం దవ తరించితిరి. ఒకరి ననుగ్రహించి మఱొకరి నిగ్రహించు మేమీశ్వరుల మెట్లగుదు మనవలదు. మీరు జగమున కాత్మ లరు. అది మీశరీరము. కాన మీరు దానికి సుహృదులరు. తన శరీరమునం దెవ్వనికేని సౌహార్దము లేకుండునా? కాన మీకు విషమదృష్టిగలుగదు. మీరు భజించువారిని ఆనెపమునుబట్టి భజంతురు, అంతేకాని సమస్తభూతములందును సమబుద్ధిగలిగియే యుందురు. మీకింకరుఁడను. మీరు నేనేమిచేయుదును. లెస్స నాజ్ఞసేయుఁడు. మీరు పనిపంపుటయే పురుషునకుఁ బరమాను గ్రహము గదే' అని విన్నవించి యాసుదాముఁడు మనసునఁ బ్రీతిగడలుకొన గుమగుమతావులు గుబులుకొనుచున్న మేలి పువ్వులు గ్రుచ్చి రచించినమాలికలను వారికి నర్పించెను. రామ కృష్ణులు అనుచరసహితముగా నాపుష్పమాలికలచే నలంకృతు లయి యెంతయు సంతసిల్లి వరదులుగాన ప్రణతుఁడైన యా ప్రపన్నునకు వరములొసఁగినవా రయిరి. అతఁడు నాయఖిలాత్ముని యందే చలింపని యనన్యభక్తియు, నతనిభక్తులతోడి చెలి మియు, భూతములందు పరమంబయిన దయయుఁ గలుగునట్లు వేఁడెను. ఇట్లతనికి వరంబొసంగి వంశవృద్ధికరం బగుసంపత్తినిని, బలమును, ఆయువును, కీర్తియుఁ గాంతియునొసంగి, యన్నయుం దానును నచటనుండి బయలుదేఱినవాఁ డయ్యె. ఇది నలువది యొకండవయధ్యాయము.

---



1967. శ్రీకృష్ణుఁడు కుబ్జ ననుగ్రహించుట.

అంత మాధవుఁడు రాజమార్గంబునఁ బోవుచుండఁగాఁ గల పంబులపాత్రము నెత్తికొని యొక్కపడఁతి పోవుచుండుటను జూచెను. అది కుబ్జ. దాని మొగము కడు సొగసుగానుండెను. వయసు మంచియౌవనము. కృష్ణుఁడు దానికి సొంపుగూర్చుచు నవ్వుచును 'అంగనా! నీవెవ్వతవే? నీతొడలు బలారే! యెంత బెడఁగు! ఇం దీకలపమును నెవ్వరికి గొంపోవుచున్నావు?కలిగినది చెప్పుము. ఈకలప మెవ్వరికయినంగానీ! మే లయినయీమై పూఁత మాయిరువుర కొసంగుము. దానివలన నీకుఁ జిరకాలము మంచి మేలుకలుగఁగలదు సుమీ' యనెను. సైరంధ్రి 'సొగసు కాఁడా! నేను గంసుఁడు మిక్కిలి మెచ్చుదాసి నగుదును. నా పేరు త్రివక్రయండ్రు. అతఁడు నన్నెపుడును గలపములు సమ కట్టు పనియందు నియోగించి యుండును. నేను సంతరించు మైపూఁతయె యాభోజరాజునకు మిక్కిలియుఁ బ్రియముగా నుండును. మీరిరువురుదక్క నందులకు మఱియెవ్వఁ డర్హుఁడు?' అని వారల చక్కందనములను సౌకుమార్యములను రసికత్వ మును నవ్వులను బలుకులను జూడ్కులను మనం బెంతయుఁ జొక్కిచిక్కఁగా నాయిరువురకును గలపముల దట్టముగా నొసంగెను. అంతవారు దమ నల్లని తెల్లని చాయలకు విరుద్ధము లయిన కప్పురమును గస్తూరియు నెక్కుడుగాఁగలిగి మఱివేఱు వన్నెచెన్ను గులుకుచు దానిచే నెంతయు నతిశయించుచున్న యా కలపముల నలందికొని మిక్కిలియుఁ బ్రకాశించిరి. భగవం తుఁడు కృష్ణుండును సొగసయిన నెమ్మొగము గలయాత్రివక్రను గుబ్జను దనదర్శనమువలని ఫలమును జూపువాఁడై చక్కనిలు వుగా నుండునట్లు చేయనెంచి దానిమీఁగాళ్లను దన రెండడుగు

లచే ద్రొక్కిపట్టి రెండువేళ్లను (బొటనవ్రేలిని జూపుడువ్రేలిని) నిలువుగా నిడికొని దాని గవుదలనుబట్టికొని దాని దేహమును జక్కఁజాఁగునట్లు పయికి నొత్తి లాగెను. ఆ చెలువయు నపుడే చక్కనై తగుపాటికొలఁదు లగునంగములు రంగార, బలితంపుఁ బిఱుఁదులును గుత్తంపుగబ్బిగుబ్బలును నాగుబ్బతిలఁ, గృష్ణుఁడు స్పృశించినంతనే పడఁతులమిన్నయై మిటారించు చుండెను. అట్లది చక్కఁదనము, నెలజవ్వనము మొదలయిన యొప్పిదములును, మురిపెంపు నెన్నడలు బెళుకుఁజూపులు మొదలయినవియు, మేలిమి పెంపుసొంపార మరులు తల సూపుటచే నవ్వుచు, నతనిపయిపుట్టము చెఱంగును మెల్లనఁ బట్టికొని లాగుచు 'వీరా! మనయింటికిఁబోదము.నిన్నిటవిడిచి పొసిపోవఁ జాలను. పురుషతిలకా! నామనస్సును గలంచి పుచ్చితివిగాన కరుణింపఁగదే' యని వేఁడెను. ఇట్లాపడఁతి రామునియెదుటఁ దన్ను బతిమాలుకొనుచుండఁగాఁ, గృష్ణుఁడన్న మొగమును దక్కిన యనుచరుల మొగములను జూచి నవ్వుచు దానితో సొగసయిన కనుబొమలదానా! నేను నావచ్చినపనిని సాధించినపిదప మగవారల మరులు పీడలనెల్ల నుడుపునట్టి నీయింటికి తప్పకవచ్చెదను. నిలువ నిల్లులేక యిందుఁ ద్రిమ్మరుచుండు మాబోఁటి తెరువరులకు నీవేకదా పెనుఁజొప్పు' అని దానిని దీపారుపలుకుఁజెప్పి వీడుకొని, యంత నంగడివీథినిఁ బోయెను. అపుడందలివారు పలువగల కానుకలును దాంబూలములును బూదండలును గంధములును నొసంగి కృష్ణుని నతనియన్నను నర్చించిరి. వారిని జూడఁగానే నందలిపూఁబోండ్ల మనసులను మన్మథుఁడు కలంచి పుచ్చుటచే వారు కట్టినపుట్టములునుగొ్రిమ్ముడు

లును జాఱ కడియములువీడఁ దమ్ముఁ దామెఱుంగక చిత్తరు బొమ్మలవలె నుండిరి. అంతఁ గృష్ణుఁడు 'ధనువున్న చోటెక్కడ' నని పురజనుల నడుగుచు నాధను వున్న పట్టునుజొచ్చి యందు నింద్రధనువువలె మిక్కిలి యద్భుతముగా నున్నయాధనువును గాంచెను. దానిని బెక్కండ్రు పురుషులు కావలిగాచుచుండిరి. అది యెంతయు నర్చితమై స్వర్ణాలంకారసంపత్తి పెంపుసాం పారుచుండెను. దాని రక్షకులు వలదువలదని వారించుచుం డఁగా బలవంతముగాఁ గృష్ణుఁ డావింటిని బట్టికొని యెడమ చేత దాని నవలీలగాఁబయికెత్తి నారియెక్కిడి జనులు చూచు చుండఁగా నిమిషమున దానిని దివిచి మదించిన యేనుఁగు చెఱకుఁ గోలనుంబోలె దానిని నడుమఁ బ్రల్లన విఱిచినవాఁ డయ్యె. అట్లావిల్లు విఱుఁగుచున్నపుడు పుట్టిన పెనుచప్పుడు భూమిని రోదసిని దిక్కులను బిక్కటిల్ల బూరించినదయ్యె. అది వినఁగానే కంసునికి గుండె జల్లనెను. అంత నావింటికావలివారు తమ యనుచరులంగూడి కుపితులై చంపుతలంపునఁ గృష్ణునిఁ బట్టుకొన నెంచి 'వీనిని బట్టుఁడు కొట్టుఁ' డనుచుఁ జుట్టిముట్టిరి. అట్లు వారు తమ్ముఁ జంపుతలంపులు గొనియుండుటను జూచి రామకృష్ణులు క్రుద్ధులై యా వింటితునుకలను గొని వారి నెల్లఁ బొరిపుచ్చిరి. మఱియుఁ గంసుఁడుపంపిన సైన్యమును దునిమి యా ధనుశ్శాలనుండి వెలువడి యుబ్బు రాగుబ్బతిల్ల నాపురసంపదలను జూచుచు నిచ్చలుఁ గ్రుమ్మరుచుండిరి. ఆపుర వాసు లాయిరువుర యద్భుతవీర్యములను దేజములను దిట్ట తనములను విని వారెవరో దేవతోత్తములు కాఁబోలుదురని తలఁచిరి. అట్లు వారు నిచ్చలు విహరించుచుండఁగా సూర్యుఁడ

స్తమించెను. కృష్ణుండును రాముండును గోపికలు పరివేష్టించిరాం దమబండ్ల విడిపట్టునకుం బోయిరి. కృష్ణుండు వేంచేసెను నెడలు నపుడు గోపికలతనివిరహమునకు సైంపక వందురుచు మధురాపురివారికి నేయేసొంపువెంపులు గలుగునని యాశాసించిరో యవి యన్నిటిని, లక్ష్మీదేవి తన్నుంగొలుచునట్టి బ్రహ్మాదులను సయితము విడిచి తానై కామించిన యతని గాత్రంపుంజక్కందనంపువెంపుసొంపునను, గన్నులకవ్వు దీఱం జూచువారికి నవి యెల్లను సత్యములే యయ్యెను. ఆరామకృష్ణులు పదయుగళమును గడిగికొని క్షీరాన్నమునుగుడిచి మఱునాఁడు కంసుఁడు చేయనున్న దానిని దెలిసి హాయిగా నారాత్రి వసించియుండిరి. కంసుఁడును ధనువు ఖిలుగుటయు, దాని కుండిన కావలివారును దానంపినసేనయును వధమునొందుటయు విని, రామకృష్ణులకుం గేవలక్రీడ లయినయాకార్యములకు భీతిగొని కంటికి నిదురపట్టక దుఃఖితుఁడయ్యెను. అతఁడు మృత్యువునకు దూతలవంటివైన స్వాప్నములు జాగరితములని రెండువిధములుగానున్న దుష్టనిమిత్తములను బెక్కింటిని గాంచెను. తనప్రతిబింబము తోంచుచున్నను, నందుం దనశిరసు గనబడకపోవుటయు, చంద్రాదులగు జ్యోతులకు రెండవది లేకున్నను నొక్కొక్కటి రెండేసిగా నగపడుటయుం, దననీడయందు ఛిద్రములుదోంచుటయు,లోనిప్రాణఘోషము వినంబడకుండుటయు, వృక్షములు బంగారువన్నెగాం గనుపట్టుటయు,దుమ్ము రొంపి మొదలయినవానియందుం దనయడుగులగుఱుతు గానరాకుండుటయు,నిత్యాదులగుజాగరిత దుర్నిమిత్తములుకంసునకుం దోంచెను. మఱి స్వప్నమందుమృతులయినవారిని కౌంగిలించుటయు, గాడిదనెక్కి పోవుటయు, విసభక్షణ

మును, జపాకుసుమ మాలికలు దాల్చుటయు, నూనెతలకురాచికొ టయును, దిస్సమెలతో నొంటిమెయిఁ బోవుటయు, మొద లయిన దుర్నిమిత్తములనుగాంచెను. ఇట్లువాఁడుస్వాప్న జాగరితములగు నిటువంటి దుర్నిమిత్తములను మఱియు నితరము లయినవానిని గాంచి మరణము గలుగునని దిగులొంది యాపెనుచింత చే నిదుర పోయినవాఁడు గాఁ డయ్యె. రాత్రి తెల్లవాఱఁగానే సూర్యుఁడు జలములనుండి పయికిఁబొడసూపెను. అపుడుకంసుఁడు మల్లక్రీడా మహోత్సవమును గావించెను. పురుషులు రంగమునకు నర్చనలు గావించిరి. తూర్యములును భేరులును వాయింపఁబడెను. పూదండ లచేతను బతాకలచేతను వన్నెగుడ్డలచేతను దోరణములచేతను మంచములను జక్కఁగా నలంకరించిరి. అందు బ్రాహ్మణులు క్షత్రి యులు మొదలుగాఁగల పురజనులు, తమతమ నియతి చొప్పున సుఖముగాఁ గూర్చుండిరి. రాజులును నాసీనులయిరి. కంసుఁడును నమాత్యులు బలిసికొలువ మండలేశ్వరుల నడుమ మిక్కిలియుఁ గంది కుందుచున్న హృదయముతో రాజమంచమునఁ గూర్చుం డెను. అంత వాద్యములు వాయించిరి. పిదప మల్లులు బాహువు లచేత నప్పళించుటలు వినఁబడెను. మల్లులు చక్కఁగా నలం కృతులై మిక్కిలియు విజృంభించుచుఁ దమయుపాధ్యాయులతోడ రంగమునుజొచ్చిరి. చాణూరుఁడును ముష్టికుఁడును, కూటుఁ డును, శలుఁడును, దోసలుఁడును, నామేలి వాద్యముల కెంతయు నుబ్బుచు, మల్లరంగమును బ్రవేశించిరి. భోజరాజు కంసుఁడు పిలిపింపఁగా నందాదు లగుగోపకులు, తమ యుపాయన ములను సమర్పించి యొక్కమంచమునఁ గూర్చున్నవారయిరి.
ఇది నలువదిరెండవ యధ్యాయము.

కృష్ణుఁడు కువలయాపీడమును దానిమావటివానిని జంపుట.

అంత గృష్ణుఁడును రాముఁడును శౌచములను దీర్చికొని మల్ల దుందుభులమహాధ్వనిని విని దానిని జూచుటకై వచ్చినవారయిరి. అట్లు కృష్ణుఁడు మల్లరంగపు ద్వారమును జేరఁగా నందుఁ గువలయాపీడ మనుగజమును మావంతుఁడు తనపై డీకొలుపుచుండుటను జూచెను. కృష్ణుఁడు పుట్టమును నడుమఁ జక్కఁగా బిగించి కట్టికొని, వంకర లగునలకలు పైకిఁ ద్రోచికొని మేఘధ్వనిగంభీర మగువాక్యముల నామావటివానితో 'అంబష్ఠా! అంబష్ఠా! మాకుదారినిమ్ము. ఎడతొలఁగుము. జాగువలదు. అట్లు సేయక పోయితివా నిన్ను నీకుంజరముతోడ నిపుడే యమునియింటికిఁ బంపుదును జుమీ' అనెను. ఇట్లదలింపఁగా నామావంతుఁడు కుపితుఁడై గజమును గినియించి కాలాంతకయమునిం బోని దానిని గృష్ణునిపయి డీకొలిపెను. ఆమేటిగజమును గృష్ణునిఁ దలపడి తొండముచేత బలుపిడి నతనిని బట్టుకొనెను. కృష్ణుండును దానితొండమునుండి దట్టించి తప్పించుకొని పిడికిట దానినిబొడిచి దానిపాదములనడుమ మఱిఁగియుండెను. ఆయేనుఁగును మిక్కిలియుఁ గ్రుద్ధంబై తొండముతో మూరుకొని కనుఁగొనునది గావున నతనిని గానక తొండముకొనతో నతనిని వెదకెను. కృష్ణుఁడు బలాత్కారమున దానిపాదముల నడుమనుండి తప్పించుకొని వెలికుఱికెను. అంత నతఁడు మిక్కిలి బలవంతమయినదానితోఁకను బట్టికొని యిరువదియేనువిండ్లపెట్టుదవ్వునకు, గరుడుఁడు సర్పమునుంబోలె, నవలీల దానినీడ్చెను. బాలకుఁడు దూడఁతోఁకను బట్టికొని యిటునటు దానిని ద్రిప్పునట్లు, కృష్ణుండును దానితోఁకను బట్టికొని, యది కుడిప్రక్కఁ దిరుగఁగా దానెడమప్రక్కకును

నది యెడమప్రక్కఁ దిరుగఁగాఁ గుడిప్రక్కకును ద్రిప్పెను. ఇట్లు కుడియెడములుగాఁ ద్రిప్పుచు నదిదిరుగుడువడుచుండఁగాఁ గూడ దానునుదిరుగుచునునుండెను. అంత నతఁడు దానికెదురుచని దా రసించిచేతనొక పెట్టువైచి, పిడపనది మాటిమాటికిఁ దరిసిరాఁగాఁ దాను పెక్కువంకలుగా నది వెంటంబడి క్రిందఁబడునట్లు నేర్పు మెఱసిపరువులిడెను. ఆగజము పడినపుడు కృష్ణుఁడును వేడుకఁగాఁ బరుగెత్తుచుండి క్రిందఁబడును. అతఁడు పడినాఁడనియదిపరువిడి రాఁగా మరలనతఁడు పైకిఁ జెంగలించి పరుగువాఱును. ఏనుఁ గును గృష్ణుఁడు పడియున్నప్పు డతఁడు కదలక యట్లే యుండు ననితలఁచి క్రుద్ధంబై యతనిని గ్రుమ్మంబోయియిరుదంతములచేత వట్టినేలనే క్రుమ్మినదయ్యె. ఇట్లు తనమగఁటిమి డిందునటును జూచి యామేటిగజము మిక్కుటమయినక్రోధమునొంది మావ టీండ్రు బలువిడిఁ బురికొలుపుచుండఁగా రోషం బినుమడింప నతినిపై నురవడించెను. అట్లు పయి నడరుచున్నగజమునుజూచి కృష్ణుఁడు తనచేత దానితొండమును బట్టుకొని భూతలమునఁ గూలవైచెను. అట్లు కూలినయేనుఁగును గాల నదిమి త్రొక్కి సింహమువలె దానిదంతములు పెకల్చి దానిచేత మావటీనిఁ బొరిపుచ్చెను. అట్లు కూలినగజమును విడిచి దానిదంతమును చేతం దాలిచి కృష్ణుఁడు మల్లరంగమును బ్రవేశించెను. అతఁడు మూఁపుననేనుఁగుదంతముల నిడికొని, దాని మదరక్తములబిందు వులు తనపైఁ జెదరియుండ, నెమ్మోముఁదామరయందుఁ జెమట బొట్లు దండడిగాఁ బొడసూప, నెంతయు నేపారుచుండెను. రామ కృష్ణులు, కొందఱుగోపకులు పరివేష్టించి రా, గజదంతములనెడి మేటియాయుధములుదాల్చి రంగమును బ్రవేశించిరి. కృష్ణుండు

తన్నుఁజూచుచున్న మల్లురకుఁబిడుగుగాను, రాజులకు రాజుగాను, చెలువలకు రూపొందిన మన్మథుఁడుగాను, గోపకులకుఁ జుట్టము గాను, దుర్జను లగు రాజులకు దండకుఁడుగాను, దనదండ్రులకు బిడ్డఁడుగాను, కంసునకు మృత్యువుగాను, తత్త్వముఁ దెలియనివారికి నొకదేహిగాను, (పరమాత్మోపాసకు లగు) యోగులకుఁ బరతత్త్వముగాను, వృష్ణులకుఁ బరదేవతగాను, నన్నతోడ రంగమును జొచ్చి చూపట్టుచుండెను. కువలయాపీడము హతమగుటను జూచి కంసుఁ డారామకృష్ణు లిరువురును మిక్కిలియు దుర్జ

—◆◆◆చాణూరముష్టికాదులగుమల్లురను గృష్ణుఁడు వధించుట.◆◆◆—

యు లని తెలిసి తానెంతధీరుండయ్యును మిక్కిలియు భయము నొందినవాఁ డయ్యె. మహాభుజు లాయన్నదమ్ము లిరువురును విచిత్రవేషములును నాభరణములును వస్త్రమాల్యములును దాల్చి రంగమునందు నిలిచి మేలయినవేషములను దాల్చిన నటులవలె నొప్పుచు తమదేహకాంతులచేతఁ జూపఱమనంబులను హరించుచు నెంతయుఁ బ్రకాశించిరి. మంచములందున్న నాగరజనములును దేశజనములును నాయుత్తమపురుషులను జూచి మిక్కుటమయినహర్షంపుఁ బెల్లునఁ జూడ్కులనుమడింప మొగములు వికసిల్లఁ దమకన్నులచే వారినెమ్మోమునందలి లావణ్యరసమును ద్రావిరిగాని యెంతద్రావినను వారికిఁ దృప్తికలుగ దయ్యె. వా రాయిరువురనుఁ దమగన్నుఁగవలచేఁ ద్రావుచున్నట్లును, నాలుకలచే నాకుచున్నట్లును, ముక్కులచే మూరుకొనుచున్నట్లును, చేతులచేఁ గౌఁగిలించుకొనుచున్నట్లును జూపట్టిరి. మఱియువారాయిరువురును గజదంతాదులుదాల్చియున్న రూపములను, శౌర్యాదిగుణములను, నవ్వులు పలుకులు మొదలగువాని

సొంపు పెంపును, దిట్టతనమును, గలరూపునఁ దలఁపునకుఁ దెచ్చు కొన్నవారివలె తాముగన్న ధనుర్భంగాదులకును విన్నగోవర్ధనోద్ధరణాదులకును ననుగుణముగా వారినిగూర్చి యొకరితో నొకరిట్లు గజగుజలువోయిరి. 'వీరు భగవంతుఁడు నారాయణుండు నగుసాక్షాద్విష్ణువునంశముచే నిందు వసుదేవుని గృహమున నవతరించినవారేకాని వేఱుగారు. ఆయీకృష్ణుఁడే కదా దేవకియందుఁబుట్టి గోకులమునకుఁ గొంపోవఁబడినవాఁడు. ఇతఁడింతికాలము నందునియింట గూఢుఁడై వసించుచుఁ బెరుఁగుచుండెను. వీనిచేతనే పూతనయుఁ దృణావర్తుఁ డనురాక్షసుఁడును హతులయిరి. మఱి సంగడిమద్దులును, ధేనుకాసురుఁడును, కేశియు, గుహ్యకుఁడును నటువంటివారితరులు పెక్కండ్రును హతులయిరి. ఇతఁడే దావాగ్నినుండి గోవులను గోపాలకులనువిడిచిపుచ్చెను. కాళియుఁ డనుసర్పము నడఁగఁద్రొక్కెను. ఇంద్రునిగర్వమును దూలించెను. ఇతఁడే యీమేటిపర్వతము నేడుదినము లొకచేతఁదాల్చియుండి గోకులమును వర్షమునుండియుఁ గాలినుండియుఁ బిడుగులనుండియుఁ గాచిపుచ్చెను. గోపికలును, నెప్పుడును జిఱునవ్వుతోఁగూడినసునుఁజూపులుపొలుపారుచుండు నితనిముద్దుమొగమును జూచుచు నానావిధములయిన తాపములను నశ్రమంబునఁగడచిసంతోషమునఁదేలుచుందురు. మిక్కిలియు గొప్పదై విరివిగాంచి యున్నయీయదువంశమును వీనిచేతఁ బరిరక్షితమై మిక్కిలి సిరియుఁ గీర్తియు మహత్త్వమును, బొందఁగలదని చెప్పెదరు. తామరరేకులవంటి కన్నుంగవ గలశ్రీమంతుఁ డితనియన్న రాముఁడు. ఇతనివలనఁ బ్రలంబుఁడును వత్సకుఁడును బకుఁడుమొదలగువారు హతు లయిరి'

అని మాటలాడుకొనుచుండిరి. జను లిట్లు గుజగుజ లాడుకొను చుండఁగా, వాద్యములును మ్రోఁగుచుండఁ, జాణూరుఁడు కృష్ణుని రాముని(బేర్కొని పిలిచివారితో 'ఓకృష్ణా! రామా! మీ రిరువురు వీరులకు మెచ్చయినవారనియు బాహుయుద్ధమునందు నిపుణులనియు విని రాజు మిమ్ముఁ జూచుతలంపున నిట పిలిపించె ను. మనోవాక్కాయములచేత రాజునకుఁ బ్రియముసేయుచుం డు ప్రజలు శ్రేయమునొందుదురు. అప్రియము సేయువారు కీడే పొందుదురు. మేము మల్లయుద్ధనిపుణులము గా మనసుఁడు. మీరు దూడలనుమేపుతఱి మొదలుగా, నావులను గాచు నయసు నుండియు,నిత్యమును ముదము పొదల వనమునందు మల్లయుద్ధ ముచేతఁ గ్రీడించుచునే గోవులను మేపుచుంటిరి కాన బాహు యుద్ధమునం దాఁటితేఁటినవారే యగుదురు. కాఁబట్టి మీరును మేమును జేరి రాజునకుఁ బ్రియముఁ గావింతము. రాజు కృతుఁ డయ్యెనేని సమస్తభూతములును మనయెడఁ బ్రసన్నములగును. ఏలనఁగా రాజు సర్వభూతాత్మకుఁడు చుఁడీ'! అనెను. అది విని కృష్ణుఁడు బాహుయుద్ధము, దనకభీష్టమని తలఁచుచు దానికెం తయు నభినందించి యప్పటికాలమునకును దేశమునకుఁదగిన మాటలతో. 'వనచరులగు మేమునయితము నీభోజరాజునకుఁ బ్రజలమే యగుదుము; కాని మీవంటివారముగాము. ప్రజలము గాన యతనికి నిత్యమును బ్రియముసేయుదుము. అతని కెట్లో యించుక ప్రీతిగలుగుట యేమాపట్లఁ బరమానుగ్రహముచుమీ. అది యటుండనీ. మేమో బాలురము. మాకు బలమునం దీడయిన వారితోఁ గ్రీడింతుముగానియధికబలవంతులతోఁగాదు. కాఁబట్టి కొలఁదికిఁ దగినట్లు బాహుయుద్ధము జరుపవలయును. మల్ల

సభాధికృతులను నధర్మమొందకుండుగాఁత' మనెను. చాణూ రుఁడు 'నీవు కసుఁగందుగావు; మఱిపిల్లవాఁడవునుగావు. నీవును నీయన్నయు బలుఁడును వయసుకాండ్రు. అంతేకాదు; బలవంతుల యందు మేలుబంతులరు. కావుననే నీవు వేయియేనుంగుల బలిమి గలమహాగజమును నవలీలఁ జంపితివి. కాఁబట్టి బలవంతుల రగు మీకు మాఁబోటిబలవంతులతోడఁ బోరుట యొప్పును. ఈయుద్ధమునం దధర్మము గలుగదుచుమీ. కృష్ణా ! నీవు నాతోడఁ బెనఁగుము. బలునితో ముష్టికుఁడు పోరాడును' అనెను. ఇది నలువదిమూఁడవ యధ్యాయము.

---

భగవంతుఁడు కృష్ణుఁ డిట్లు తాను దలంచినదియె తుదకునిశ్చయముకాఁగా, నంతఁ జాణూరుని దారసిల్లెను. బలరాముఁడు ముష్టికునితోఁ దలపడెను. వా రొండొరులఁ జేతులతోఁ జేతులను బాదములతోఁ బాదములను బెనఁచి యొకరినొకరు జయించుతలంపు లగ్గలింప బలిమిమెఱసి పట్టియీడ్చిరి. వారుమోచేతులతో మోఁచేతులను, మోఁకాళ్లతో మోకాళ్లను, తలచేతఁ దలనును, ఱొమ్ముచేత ఱొమ్మును, నొకరినొకరుబట్టి తాఁకిఁ కొట్టుకొనిరి. మఱియు నొండొరులఁ జేతులుపట్టుకొని గిరగిర గుండ్రముగాఁ ద్రిప్పుచును, పట్టి దవ్వులఁ జిమ్ముచును, బాహువుల బిగియఁబెనచి నలంచుచును, పైకెత్తి దిగువగొబ్బునఁ బడఁగూల్చుచును, నొండొరులపైకిఁ దలపడుచును, మరలఁదారసించుకొనుటకుఁ బిఱేఁదికిఁ దాఁటుచును, నిట్లొకరినొకరుఁజుట్టిముట్టి పీడించుచుండిరి. మఱియు నడుగులను మోఁకాళ్లను నొక్కటిగాఁగూర్చుకొని పడినవానిని బయికినెత్తుచును, రెండుచేతులను

బట్టి పయికిలాగుచును, నడుము మొదలగువానిని దగిలినపుడు త్రోలఁగజిమ్ముచును, కాలుసేతులను నొక్కటిగాఁ ద్రొక్కిపట్టి కదలనీక నిలుపుచును, నిట్లు జయించుకోరిక లీరికలొత్త, పరస్పరకాయములను నొంచుచుండిరి. అంత నందలికాంతలందఱును గుంపులుగుంపులుగఁ గూడి రామకృష్ణులయెడ మిగులఁ జాలిగొని యొండొరులతో నది యబలులతో బలవంతులు పెనఁగు యుద్ధముగాన సరికానిదని చెప్పుకొనిరి. వారు 'కట్టా! ఈరాజసభాసదుల కిది గొప్పయధర్మము గదే! వీరుబాలురతో బలవంతులు పెనఁగుచుండఁగా రాజు చూడవచ్చినచో వలదని వారించుట తమకుఁగర్జమైయుండఁగా రాజుతోఁబాటిగాఁదాము ననుమతించుచున్నారే. మేటిపర్వతములను సాటియై యవయవములెల్ల వజ్రసారమైయున్న మల్లులెక్కడ? అతిసుకుమారములయిన యవయవములు గలిగి వయసింకను దలసూపనుండు కసుఁగాపు లెక్కడ? ఈసమాజమువారికి ధర్మవిపర్యయము తప్పక గలుగును. ఎక్కడ నధర్మము తల సూపుచున్నదో యక్కడ క్షణమయినను నిలువఁదగదు.సభ్యులదోషముల నెఱింగిన మతిమంతుఁడు, వారిదోషములను దలంచుచు నాసభను జొరకుండును. అది తెలియనిమనుజుఁ డందుఁజొచ్చి యేమియుఁబలుకకుండినను దాఱుమాఱుగఁ బలికినను బాపమునొందుచున్నాఁడు. కృష్ణుఁడు పగవానిచుట్టును బరుగిడినపు డతని నెమ్మోముఁదామర చెమటజలములఁ దోఁగి, నీటిబిందువులతోఁ గూడిన తామరమొగ్గవలె నున్నది చూడుఁడు. ఇంచుకంత యెఱ్ఱనికన్నులు గలిగి ముష్టికునియెడఁ గినుక సందడింపఁగాఁ బెడనవ్వు నురవడిచే బెడఁగారుచున్న రామునిమోమునుజూడరా

యేమి ! ఈపురాణపురుషుఁడు, శివుఁడును శ్రీదేవియు నర్చించు నట్టి పదపద్మములు గలయీపురుషోత్తముఁడు, తాను మనుష్య లక్షణములచేఁ బ్రచ్ఛన్నుఁడై యడవియందలి వింతవింతల పూవులదండలను దాల్చి బలునిం గూడి గోవులను మేపుచును వేణువును మొరయించుచును నెంతయుఁ గ్రీడలాడుచుండెడి యీవ్రేపల్లెభూములే చూడఁ డీ యెంతోపుణ్యములు; కాని యితనిని బరిభవించుచున్నయీ సభారంగము గాదు. ఆ గోపికలు లావణ్యంపు సారమై, యీడుజోడుగాని యెక్కువగాని లేక, స్వభావముచే తనేకలిగి, యశమునకును సిరికిని నైశ్వర్యమునకునొక టేపట్టయి, యపుణ్యాత్ములకుఁ బడయరానిదై, యప్పటప్పటికిఁ గ్రొత్తగ్రొత్తగా బిత్తరము గులుకుచుండు వీనిచక్కందనమును గన్నులార గ్రోలుచుందురే. వారుతొల్లి యేమితపము లాచరించిరోగదే ! కృష్ణునియందు మనసులు దగులువడి యెడతెగని మక్కువలు పిక్కటిల్లుచుండుటచే బుద్ధులు పరవశములై యొప్పఁగన్నీరుచే డగ్గుత్తికవడ వీనిని, బాలు పిదుకునపుడును, ఱోట దంచునపుడును, బెరుఁగుచిలుకునప్పుడును, నిల్లలుకునపుడును, నుయ్యేలల నూఁచునపుడునుఁ బిడ్డలు నేడువఁగా బుజ్జగించునపుడును, బాలురకు బోరుకాడించునపుడును, గలయంపి చల్లునపుడును, నిల్లూడుచునపుడును, బాడుచు నుండునట్టి యీగోపిక లెంతధన్యలో ! పెందలకడ వ్రేపల్లెనుండిపోవుచు మాపటివేళ గోవులతోఁగూడ వేణువునూఁదుచువీఁడుపల్లెనుజొచ్చుచుండఁగా వీనివేణురవళిని విని యందలియబలలు మహాపుణ్యాత్ములుగావుననిండ్లు వెలువడి దారియందు వచ్చి నిలిచి చిఱునవ్వు దొలఁకుచున్న వీనిముద్దు మొగమును, దయ దళుకొత్తుచున్న పిసాళిచూడ్కులను, గన్ను

లలరఁ జూతురుగదా' యనిరి. స్త్రీలీచందమున మాటాడికొను చుండఁగా, యోగేశ్వరుం డగు భగవంతుఁడుకృష్ణుండు పగవా నిని జంప మనసున నిశ్చయించెను. పడఁతు లాడికొను పలుకు లను విని తండ్రులగు నందవసుదేవు లిరువురును నాయిద్దఱబల ముల నెఱుంగరుగాన యెంతయు సనుతపించుచుండిరి. కృష్ణ చాణూరులు పలువిధములయిన యాయామల్లయుద్ధపు విన్నా ణములచే నొండొరులతోఁ బోరువిధముననే బలుఁడును ముష్టి కుఁడును బోరిరి. కృష్ణుని మోఁచెయిమొదలయిన యవయవ ముల ప్రహారములు వజ్రపాతములవలె నిష్ఠురములగుటచే వాని వలనఁ జాణూరుఁడు దనయంగములు కలంగినలంగుటయు నూ టికి సత్తువదూలి డిందుపడుచుండెను. అంతవాఁడు డేగవలెనుర వడితోఁబైకి జెంగలించి రెండుచేతులను బిడికిలించుకొని క్రుద్ధుం డై వాసుదేవునివక్షమునఁ బొడిచెను. ఏనుఁగు పూదండచేతఁ గొట్టువడిన చందంబున నతఁడాదెబ్బకు నించుకయుఁ జలింపఁ డయ్యె. అంతఁ గృష్ణుఁడు చాణూరుని రెండుచేతులను బట్టికొని పలుమాఱు గిరగిరం ద్రిప్పి యంతకేవాఁడువేగయును జెడలఁగా నేలపయినివేసికొట్టెను. వాఁడు సొమ్ములును, దలవెండ్రుకలును బూదండలునువీడి చెల్లచెదరుకాఁగా నింద్రధ్వజమువలెఁగ్రింపఁ గూలెను.అల్లముష్టికుఁడును మొదటముష్టిచే బలరామునిఁబొడు వఁగా నతండు బలువయిన తనయఱచేత వానిని బిట్టుగాఁ జఱ చెను.అందులకువాఁడు మిక్కిలియుఁ గుపితుఁడై యెంతయుఁబీడ నొంది నోరనెత్తురు వెడలఁగ్రక్కుచు నుసురుఁవీడి గాలిచేతఁ గొట్టువడిన వెనుమ్రాఁకువలె నేలపయిని గూలెను. అంతఁ గూటుఁడు దలపడిరాఁగా, మేటిపోటరి యైనబలరాముఁడు వానిని

సరకుసేయక యెడమచేతి పిడికిటతోఁ బొడిచి యవలీలఁ జంపెను. అట్లె శలుఁడును, గృష్ణుఁడు కాలిమొనచేఁ దాఁకఁగాఁ దల ద్రెస్సి చచ్చెను. తోసలకుఁడు రెండుగాఁ జీల్పఁబడి కెడసెను. ఇట్లిరువురును గూలిరి. ఇట్లు చాణూరుఁడును ముష్టికుఁడును గూటుఁడును శలుఁడును దోసలకుఁడును హతులుకాఁగాఁ దక్కిన మల్లులందఱును బ్రాణములు దక్కించుకొనఁగోరి పరుగులువాఱిరి. అంత రామకృష్ణులు తమ యీడుగోపకులను బిలిచి వారిని గూడిమాడి వాద్యములు వాయించుచుండఁగా, సొగసయిన నూపురములు గల్లుగల్లుమని మొరయ, నర్తనాదులు సేయుచు విహరించిరి. రామకృష్ణులు గావించిన యాకృత్యమునకుఁ గంసుఁడొకఁడు దక్క బ్రాహ్మణులు మొదలుగా సజ్జనులయిన జనులందఱును బాగుబాగని యుబ్బి చెలరేఁగిరి. మేటిమల్లులు హతులై తక్కినమల్లులు పలాయితులుకాఁగాఁ గంసుఁడు దనవాద్యములను వాయింపకుండ నిలిపి, 'దుర్వృత్తు లయినయీవసుదేవుని కొడుకులను బురమునుండి వెడలఁదఱుముఁడు. గోపకుల ధనమంతయు దోఁచుకొనుఁడు. దుర్మతియగునందుని బంధింపుఁడు. దుష్టబుద్ధియు దుర్జనుఁడు నగు వసుదేవుని వేగ చంపుఁడు. నా తండ్రియగు నుగ్రసేనుఁడు పరపక్షపాతిగాన యతనిని సయితమనుచరులతోడఁ జంపుఁడు' అనెను. కంసుఁ డిట్లు బిరుసులు

కంసవధము.

పలుకుచుండఁగా నవ్యయుండు కృష్ణుండు మిక్కిలియుఁ గోపంబు నొంది చులుకమెయిని గుప్పించి యెగసి యొకవెట్టునఁ బొడవగువాని మంచముపయి నెక్కెను. అట్లు తనకు మృత్యువగు నాకృష్ణుఁడు తనపయి నుంకించుచుండుటను జూచి కంసుఁడు

దిట్టండుగాన నాసనమునుండి తటాలున లేచివాలును బలకయుం
గయికొనెను. అట్లు కంసుండు ఖడ్గము చేతంబూని డేగవలె
నాకాశంబున గుడియెడమలుగా వేగ దిరుగుచుండంగా దుర్వి
షహం బై యుగ్ర మగు తేజము గలవాండుగాన కృష్ణుండు,
గరుడుండు సర్పమునుంబోలె, బలిమిమెయినివాని నొడిసిపట్టు
కొనెను. అట్లు వాని తలవెండ్రుకలుపట్టుకొని కిరీటము దొరలి
పడం, బొడవగు మంచమునుండి రంగముక్రిందికిం బడంద్రొబ్బి
విశ్వాధారుండును స్వతంత్రుండు నగునబ్జనాభుండు వానిపయిని
దానును బడెను.అంతి జనులుచూచుచుండంగాం బ్రాణమువీడిన
యాకంసుని భూమిపయిని, సింహము గజమునుంబోలె, నీడ్చెను.
అప్పుడు జనులెల్ల హాహాకారములుసేయ నాధ్వని మిక్కిలియు
బెట్టిదమై చెలంగెను.వాండు నిత్యమునుదనబుద్ధియందుం గృష్ణుని
భయముగొని, త్రాగునపుడును మాటాడునపుడును దిరుగునపు
డును నిదురించునపుడును నూర్పు విడుచునపుడును నాయీశ్వ
రుండు చక్రాయుధుండై ముంగల నుండునట్లు గనుచుండిన
వాండు గాన యాసారూప్యమునే, యతిదుర్లభం బగుదానినే,
దానును బొందినవాండయ్యె. ఆకంసుని ననుచరించుచునుండు
తోంబుట్టువులు కంసుండు న్యగ్రోధకుండు మొదలగువారెన
మండ్రును మిక్కిలియుం గ్రుద్ధులై తమభ్రాత నట్లుచేసిన కసిదీ
ర్చుకొనంగోరి కృష్ణునిపయిని దలపడిరి. అపుడు మిక్కిలియురవడి
తోవారుపైంబడనుద్యుక్తులగుటం జూచిబలరాముండు పరిఘము
నెత్తికొని సింహము పశువులనుంబోలె నందఱను బిలుకుమా
ర్చెను. అప్పుడు మింట దుందుభులు మొరసెను. కృష్ణుని విభూ
తులగు బ్రహ్మరుద్రాదులు మిక్కిలియు సంతసంబునం బువ్వులు



1982. శ్రీకృష్ణుండు కంసుని వధించుట.

జల్లుచు నెంతయుఁ గొనియాడిరి. అప్సరస లాడిరి. కంసాదుల భార్యలు మొద లగుస్త్రీలు తమసుహృదులు మృతు లగుటకు దుఃఖితలై కన్నులం దశ్రువులు వెల్లిగొన శిరములు మోఁది కొనుచు నచ్చటికివచ్చిరి. వారు వీరశయ్యయందుఁ బరుండియున్న పతులనుగాఁగిలించుకొని వగచుచుమాటికిఁ నశ్రువులవ్వారిగాఁ దొరుఁగుచు సుస్వరంబున నిట్లు విలపించిరి. 'హానాథా! అయ్యో! ప్రియా! ధర్మజ్ఞా! కరుణాకలితా! వత్సలా! నీవు హతుఁడవు గాఁగా, మేమును మాగృహములును బిడ్డలును హతులమయితిమె చుమీ! పురుషర్షభా! పతివగు నిన్నుఁ బాయుటచే నీపురియును మావలె నుత్సవములును మంగళములును మాలినదై యెంతయు శోభిలకున్నది. నీవు నిరపరాధము లయిన భూతములకు మిక్కుటమయిన ద్రోహముఁ గావించితివి. వాని చేతనే యిట్టిదశను బొందింపఁబడితివి. భూతద్రోహి యెవఁడు సుఖము నొందును? మఱి సమస్తము లయినభూతములకును నితఁడు పుట్టుచోటును లయించుచోటు నగునుగదా! మఱి రక్షకుండు నగునుగదా! అట్టిమహనీయుని నవజ్ఞచేయువాఁ డెందును సుఖంబున మనునా? మనఁడుగదే' యని విలపించిరి. లోకములకు శ్రేయములఁగూర్చు భగవంతుఁడు కృష్ణుఁ డారాజకాంతల నోదార్చి, హతులయినవారికిఁ గావింపవలసిన లౌకికములగు దహనాదిక్రియలను జేయించెను. పిదపఁ దల్లిదేవకిని వసుదేవునిని బంధమునుండి విడిచివచ్చి రామకృష్ణులిరువురును వారి యడుగులకు శిరంబుసోఁక వందనము గావించిరి. దేవకియు వసుదేవుఁడును పుత్త్రులు తమకు వందనములు సేయఁగా వారు జగ

దీశ్వరులని తెలియుటచేఁ గంసునివలని జంకుమాని వారిని గౌఁగిలించికొనిరి. ఇది నలువదినాలుగవయధ్యాయము.

---

కృష్ణుఁడు తలిదండ్రులను దేవకీవసుదేవులను నూరార్చుట

పురుషోత్తముఁ డంతఁ దన తలిదండ్రులు దేవకీవసుదేవులు నిరతిశయపురుషార్థభూతుం డని తనకలరూపుఁ దెలిసియుండుట నెఱింగి వారి కట్లుండరా దని జనమోహినియగు తనమాయను వారిపయినిఁ బచరించెను. అంత నాయదుకులతిలకుఁడు బలునిఁ గూడి యా తలితండ్రులకడకుఁ బోయి వినయావనతుఁడై 'అమ్మా! తండ్రీ!' యను నాదరంపుఁ బలుకుల వారికిఁ బ్రీతి గొలుపుచు నిట్లనియె. 'మీ రిరువురు మానిమిత్తమై నిత్యమును దహదహపడుచుండినను మీకన్నపుత్త్రుల మగు మాబాల్యపౌగండ కౌమారములు నొక్కప్పుడును మీపొంత జరుగకయె పోయినవి. దౌర్భాగ్యుల మయినమాకు మీదాపునఁ గూడి మాడి యుండుటయుఁ గలుగదయ్యె. తండ్రియింట నుండుబాలురు వారి బుజ్జవములనొంది పొందునట్టి సొంపుపెంపును మాకు లభింపదయ్యె. సమస్త పురుషార్థములకును బుట్టుచోటయిన యీదేహము నెవరివలనఁ బుట్టి యెవరిచేఁ బెంపఁబడుచున్నదో, యట్టి తలిదండ్రుల ఋణమును దీర్చుకొనుటకు మనుఁజుఁడు నూఱేండ్ల యాయువుకొలఁదికిని శక్తుఁడుగాఁడు. వారి కొడుకులయం దెవఁడు సమర్థుఁడై యుండి తన దేహముచేతను ధనముచేతను వారికి బ్రతుకు జరుపఁడో, వాఁడు మృతుఁడయి పరలోకమునకుఁ బోఁగా యమదూతలు వానిమాంసమును వానిచేఁ దినిపింతురు. తల్లినిఁ, దండ్రిని, వృద్ధుని, పతివ్రతయగు

నిల్లాలిని, నిసువయిన కొడుకును, గురువును, విప్రుని, శరణుఁజొచ్చినవానిని, సమర్థుఁడయ్యు భరింపనట్టివాఁడు జీవన్మృతుఁడే యగును. కాఁబట్టి మీ రిరువురు కంసునివలన మిక్కుటముగా మనసులు దిగులువడియుండఁగా మేము సమర్థులమై మీయిరువుర నర్చింపకయే యిన్నిదినములు వ్యర్థముగాఁగడచిపోయెను. తల్లీ! పరతంత్రుల మయియున్నందున దుఃఖితు లయియున్నమీయిరువురికిని శుశ్రూష సేయకున్న దురాత్ములమగుమాతప్పును క్షమింపవలయును' అనెను. ఇట్లు విశ్వాత్ముఁ డగుహరి మాయామనుష్యుండై పలికినపలుకులకు మోహితులై యీ యిరువురుఁ దమయొడియందుఁ వారిని గూర్చుండఁబెట్టికొని కౌఁగిలించుకొని యెంతయు ముదము నొందిరి. మఱియు వారు తమకన్నీటి ధారలచే వారలను దడుపుచు, స్నేహపాశములు పెనఁగొనఁగా, మిక్కిలియు మోహితులై, బాష్పములు కుత్తుకలందు నడ్డువడ నించుకయుఁ బలుకఁ జాలకుండిరి. ఇట్లు భగవంతుఁ డా దేవకీపుత్త్రు తలిదండ్రుల నూఱడించి తన మాతామహుండయిన యుగ్రసేనుని యదువులకు రాజుఁగావించి యతనితో 'మహాభాగా! మేము నీప్రజలము. నీవు మాకధిపతివై మావలనఁ బనిగొనఁదగును. యయాతిశాపమువలన యదువులు సింహాసనము నధిష్ఠింపరాదు. నీ భృత్యుండ నగు నేను నిన్నుఁ గొలుచుచుండఁగా దేవతాదులయినను నమ్రులై నీకు బలుల నర్పింతు రనఁగా, నితరులకు దక్కినరాజు లర్పించుటను జెప్పనేల?' యనెను. అంత విశ్వదర్శనుండగు నాకృష్ణుఁడు, కంసునిభయమువలన నలుదిక్కులకుఁ బలాయితులై యుండిన తనజ్ఞాతులును సంబంధులు నగు యదువులు, వృష్ణులు, అంధకులు, మధువులు, దాశార్హులు, కుకురులు

మొదలగువారలను బిలిపించి యూఱడించి పలయు మన్ననలు గావించి పరదేశవాసమువలన నుఱిక్కి చిక్కియున్నవారిని ధనములచేఁ దృప్తులను గావించి వారివారి గృహములయందు నివసింపఁజేసెను. వారందఱును గృష్ణబలరాముల భుజములచేత రక్షితులై కోరినకోర్కులు వడసి యాయిరువురవలన దమమనముల తుందుడు కెల్లఁదీఱఁబరిపూర్ణకాములై యుండిరి. మఱియుఁ బ్రతిదినమును, జక్కందనముల యిక్కయై, కరుణయు గొనబునవ్వును గడలుకొనుచుండు నునుఁజూడ్కులకు నిమ్మయి, వికసిల్లియుండుకృష్ణునిముఖారవిందమును వారహరహమునుసంతసము దొంతరలుగొనఁ జూచుచుఁ దమగృహములందు నిచ్చలుక్రీడించుచుండిరి. అపుడు మిక్కిలి ముదిసినముదుసళ్లు సయితము, మాటిమాటికిఁ గృష్ణు ముఖారవిందామృతరసమునుగన్నుఁగవలచేఁద్రావుచు నెంతయు బలమును దేజమును బొందినవారయిరి. పిదపఁ గృష్ణుండును రాముఁడును నందునికడకుఁబోయి యతనిఁ గౌఁగిలించుకొని 'తండ్రీ! మీరలిరువురును మిక్కిలి మక్కువలు పిక్కటిల్ల మాయిద్దఱను మిక్కిలియుఁ బెంచి బుజ్జగించితిరి. ఇది యొకవింతగాదు. తలిదండ్రులకుఁ దమ శరీరమునకంటెఁ గన్న బిడ్డలయందుఁ బ్రీతి మిక్కిలి యెక్కుడుగదా. దేవకీవసుదేవులేకాని మేము తలిదండ్రులము గామందువేమో. బంధువులు పోషించుటకును రక్షించుటకును సమర్థులుకాక దిగవిడిచిన నిసువులను నెవరు తమకన్నబిడ్డలవలెఁ బెంచి పెద్దఁ జేయుదురో, వారే తల్లియుఁ దండ్రియు నగుదురు. తండ్రీ! మీరు ప్రేపల్లెకుఁ బొండు. మేమును నించుఁ గలసుహృదులకుఁ బ్రియముగావించి యంతమాయందలి నెయ్యమున వందుచుండు చుట్ట

ములను మిమ్మును జూచుటకై తప్పకవత్తుము' అనెను. ఇట్లు కృష్ణుఁడు నందునిని, దక్కిన గోపకులను నూఱడించి, వస్త్రాభరణములను గంచు పిత్తళి మొదలగువానిమయము లయిన పాత్రములను నాదరముతో నొసంగి పూజించినవాఁడయ్యె. నందుఁడు నారామకృష్ణులను గౌఁగిలించి యనురాగంబున విహ్వాలించుచుఁ గన్నుఁగవల నశ్రువులు వెల్లిగొన గోపకులం గూడి మందకుఁ బోయెను.

### రామకృష్ణుల యుపనయనము. గురుకులవాసము. గురుపుత్త్రిలను దెచ్చుట.

అంత వసుదేవుఁడు పురోహితుఁడగు గర్గాచార్యునిచేతను, బ్రాహ్మణులచేతనుయథావిధిగా రామకృష్ణులిరువురుపుత్త్రులకును ద్విజసంస్కార మగు నుపనయనముఁ జేయించెను. అంత నతఁడు బ్రాహ్మణులను జక్కఁగా నలంకృతులను గావించి పూజించి పిదప బంగారుమాలికలు దాల్చినవియుఁ జక్కఁగా నలంకృతములునై, కొమ్ముల మేలగు పట్టువస్త్రమాలికలు గట్టంబడియున్న గోవులను దూడలతోఁగూడినవానిని వారికి దక్షిణగా నొసంగెను. మఱియుఁ దాను రాముఁడును గృష్ణుఁడును జన్మించిన నక్షత్రమందు మనస్సుచేత దానముచేసిన గోవులను,గంసుఁడధర్మమున నపహరించినవాని నపుడు దలంపునకుఁ దెచ్చుకొని రాచకొట్టమునుండి వానినిదెప్పించి మహామతిగావున దానము చేసెను. ఇట్లు రామకృష్ణు లుపనయనసంస్కారము నొంది ద్విజత్వమును బడసి యదుకులాచార్యుం డగు గర్గుఁడుపదేశించిన బ్రహ్మచర్యవ్రతమును నాచరించుచుండిరి. తరువాత సమస్త విద్యలకును బుట్టుచోటయి సర్వజ్ఞు లయినయాజగదీశ్వరు లిరు

వురు, స్వతస్సిద్ధమగు తమ విమలజ్ఞానమును మనుష్యచేష్టితము లచే మాటిపుచ్చుచు గురుకులవాసమును గోరి కాశ్యపగోత్రుండును నవంతీపురవాసియును నగు*సాందీపనుం డనుగురువుకడకుం బోయిరి. అట్లు వారిరువురును విధ్యుక్తముగా గురువునుగొలిచి జితేంద్రియులై యనిందితం బయినగురువృత్తి నితరులకుం గఱపువారై యాదరముతోడ దేవునివలె గురువును భక్తితోడ సేవించుచుండిరి. బ్రాహ్మణోత్తముం డాగురువును వారు నిర్మలభావంబునం దన్ను బరిచరించుట కెంతయు సంతుష్టినొంది శిక్షాకల్పాదులగు నంగములతోడను నుపనిషత్తులతోడను గూడ వేదములనెల్ల వారికిం జెప్పెను. మఱియు మంత్రదేవతాది రహస్యంబుతోడ ధనుర్వేదమును, మన్వాదిధర్మశాస్త్రములను, మీమాంసాన్యాయాదులను, దర్కవిద్యను, సంధివిగ్రహాదులగు నాఱువిధముల నొప్పు రాజనీతిని జెప్పెను. ఆపరమపురుషు లిరువురును సర్వవిద్యాప్రవర్తకులు గావున గురు వొక్కతూరి చెప్పినమాత్రనే యతం డుపదేశించిన దంతయుం జక్కంగా గ్రహించినవారయిరి. వా రఱువదినాలుగుదినములలో నఱువదినాలుగు విద్యలను నియమమున గ్రహించిరి.అంత నాచార్యుని గురుదక్షిణ వేఁడుఁడని ప్రార్థించిరి. ఆబ్రాహ్మణుండును రామకృష్ణుల యాయద్భుతమహిమను నతిమానుషమయినవారిచేష్టయును గాంచి వీరు మహాపురుషు లని మనసున నిశ్చయించి తనపత్నితోడ

---

*'అథో గురుకులే వాసమిచ్ఛన్తా వుపజగ్మతుః। కాశ్యాంసాందీపనం నామ అవన్తీపురవాసినమ్' అని వీరరాఘవపాఠము. 'కాశ్యాం సాందీపనిం నామ' అని మునిప్రభావప్రకాశ శ్రీధరాదుల పాఠము. కాశియందున్న సాందీపని యను నవంతీపురవాసికడకుం బోయిరని యర్థము.

నాలోచనముసేసి ప్రభాసక్షేత్రమున మహాసముద్రమందుఁబడి మృతుండయిన తమబాలునిఁ దెచ్చియిచ్చునట్లు వేఁడెను. అప్పుడు వల్లెయని యమ్మహారథు లిరువురును నపారపరాక్రములు గావున ప్రభాసమునకుఁ బోయిఁ జేరి, యందు సముద్రపుఁ జెలియలికట్టనుబొంది యట క్షణముసేపు గూర్చుండిరి. అపుడు సముద్రుఁడు వారిని నీశ్వరులని యెఱింగి వారలకుఁ దగుపూజ గావించెను. కృష్ణుం డాసముద్రునితో 'నీవిందు నీవెనుకటిమచే మ్రింగిన బాలకుని,మాగురుకుమారుని, వేగ తెచ్చియిమ్ము' అనెను. సముద్రుఁడు, 'దేవా! ఆబ్రాహ్మణకుమారుని నేను హరింపలేదు. కృష్ణా! పంచజనుఁ డను దైత్యుఁ డపహరించినవాఁడు. వాఁడు నాకు మిక్కిలి యసాధ్యుఁడు. ఆయసుర జలములోపలఁదిరుగుచు శంఖరూపముదాల్చి యుండునుగాన వానిని దెలిసికొనుట యశక్యము. వాఁడే బాలుని హరించినాఁడు' అనెను. అదివిని కృష్ణుఁడు మహాసమర్థుండు గాన వేవేగ జలమునందుఁజొచ్చి వానిని జంపెను; కాని వాని కడుపున బిడ్డఁడు గానఁబడఁడయ్యె. అంతఁ గృష్ణుఁడువానియంగమునఁ బుట్టిన శంఖమును, పాంచజన్యమను దానిని, జేకొని బలరామసహితుండై రథమునెక్కి యమునిప్రియపురంబయిన సంయమనికిఁ బోయి బలరాముఁడును దానునుశంఖములను బూరించిరి. అంత శాస్త్రమునుల్లంఘించుప్రజలను దండించు నాయముఁడును నాశంఖఘోషమును విని యెదుర్కొని వచ్చి వారికి భక్తిం జేసి పుష్కలముగా నెంతయు గొప్పపూజఁగావించి సర్వభూతహృదయనివాసుం డగు కృష్ణునితో వినమ్రుండై 'ఓ! లీలా మానుషరూపధారీ! విష్ణూ! మీయిరువురకు నేమిసేయుదును. ఆనతిం' డనెను. కృష్ణుఁడు 'నీభటులు మాగురుపుత్త్రుని

నతనికర్మము చొప్పున లోఁబఱిచి యిటఁ దెచ్చినారు. అయినను మహారాజా ! నా యాజ్ఞ మున్నిడికొని వానిని దెచ్చియున్న. దానంజేసి నీకు దోషముకలుగదు' అనెను. యముఁడును 'జిత్త' మని గురుపుత్త్రునిఁదెచ్చి యిచ్చెను.యదుసత్తము లాబాలునిఁ దమగురువున కొసంగి 'మఱియు నేమేనివేఁడు' డని యడిగిరి. గురువు'నాగారాములారా! మీయిరువురు గురుదక్షిణను జక్కఁగా నొసంగితిరి. ఇటువంటి మీబోఁటులకు గురుండనగునాకుఁ గామములలో నేది కలుగక మిగిలియున్నది? ఏదియు లేదు. కనుక వీరులారా ! మీగృహములకుఁ బొండు. మీయిరువుర కీర్తి లోకములను బావనములుసేయుచు వెల్లివిరిసి యుండుఁ గాక' యనెను. వా రిట్లు గురువువలన ననుజ్ఞనొంది వాయువేగంబగురథమునెక్కి, యదిమేఘమునలె ధ్వనించుచుండ, స్వగృహమునకు వచ్చిరి. మధురయందలి ప్రజలు పెక్కుదినము లారామకృష్ణులను జూడకుండినవారుగాన వారి నపుడఁచూచి దారపోసికొన్న ధనము మరల దొరికినవారివలె యంగఱును నానందపూర్ణులయి యుండిరి.ఇది నలువదియైదవయధ్యాయము.

---

## కృష్ణుఁ డుద్ధవుని వ్రేపల్లెకుఁ బంపుట.

ఉద్ధవుఁడు వృష్ణులయందు మిన్న. మఱి కృష్ణునకుమంత్రియు మిక్కిలియుఁ గూర్చు చెలికాఁడును నగును. అతఁడు స్వభావము ననే మిక్కిలి బుద్ధిమంతుఁడు. అటమీఁద బృహస్పతికిఁ జక్క శిష్యుఁడయినవాఁడు. ప్రపన్నార్తిహరుం డగు భగవంతుఁడు హరి, యొక్కరహస్యసలమున నేకాంతభక్తుఁడును శ్రేష్ఠుఁడు నగు నాయాదవునిఁ గేలు కేలంగీలుకొలిపి'సౌమ్యా! ఉద్ధవా! నీవు

వ్రేపల్లెకుఁ బొమ్ము. పోయి నాతలిదండ్రులకుఁ బ్రీతిగలిగింపుము. మఱియు నన్నెడఁబాసి గాసిలుచున్న గోపికలవిరాళిని నాచెప్పు మాటలను జెప్పి పోకార్పుము. వారు నాయందే మనస్సులనెల్ల నిలిపి, నేనే తమప్రాణములుగా నొప్ప, నాకొఱకుఁ దమదేహ పోషణములెల్ల దిగవిడిచి, నన్నే ప్రియతమునిఁగాను దమయాత్మ భూతునిఁగాను మనంబుల నిశ్చయించినవారయిరి. ఎవ్వరునా కొఱకు లోకధర్మములను దిగవిడుతురో వారిని నేను భరింతును. నిరతిశయప్రియతముం డగు నేను దవ్వులనున్నను నావ్రేపల్లె ముద్దియలు నన్నే తలంచుకొనుచు, ఉద్ధవా! విరాళినిసైఁపక తహ తహపాటునకు లోనయి తమదేహధర్మములను మఱతురు. మఱి యునేను 'వేగమరలి వత్తు'నని యూఱడఁబలికిన పలుకులచే నా గొల్లచెలువలు నాయందే మనస్సుల నెలకొలిపి విరహతాపం బున మిక్కిలి పొక్కుచు నెంతో కష్టపడుచున్ననుఁ దమప్రాణ ములనెట్లో యతికష్టమునఁదాల్చి బ్రతికియున్నవారు సుమీ !' యనెను. ఉద్ధవుఁడు తనయధిపతియగు కృష్ణుని సందేశమును గయికొని రథము నారోహించి నందుని మందకుఁ బయనమై పోయెను. *సూర్యుం డస్తమించుతఱికి నతఁడు సిరిగులుకుచున్న నందవ్రజమును జేరెను. అప్పుడాపల్లెను జొచ్చుచున్న పశువుల ఖురఘూళులు గ్రమ్ముటచే నతనిరథ మెవ్వరికిని దెలియ

* నందునివ్రేపల్లె యంతగా దూరముగాకుండియు నుద్ధవుఁడక్రూరునివలె భక్త్యుద్రేకమువలన నెడనెడజాగుచేసి పోయినందునఁ బ్రొద్దుగ్రుంకునపుడు దానిఁజేరెనని తెలియునది. మఱియు గోధూళిపటలమాతనిరథమును గ్రమ్ము టచే గోపికల కతఁడు రాత్రివచ్చుటదెలియక మఱునాఁడే తెలిసినదనియుఁ దెలియునది.

కుండెను. మఱియు నాపల్లెయందు, పోతరించియున్న యెద్దులు వెదమొదవులకై పెనఁగులాడుచున్న చప్పుళ్లు బోరుకొనుచుండెను. పొదుగుల బరువుల కాఁగలేక క్రేపులవెంటఁ బరుగిడుచున్న యావులు దానికొక చెలువు గూర్చుచుండెను. మఱియు నిటునటు గంతులిడుచున్న లేఁగలును, గట్టఁబడియున్న దూడలును,దానికొక బెడఁగుగా నుండెను. ఇంతేకాక యావులను బిదుకుతఱిని, దూడను 'విడువు!విడువకు! తోడ్కొనిరా!వలదు! వలద'ను పలుకులయులివులచేతను, బిల్లంగ్రోవులరవళులచేతను, నది తళుకొత్తుచుండెను. బలరామకృష్ణుల చేష్టితములనే పాడుచుఁ జక్కఁగా నలంకృత లయి యున్నగోపికలచేతను నిమ్ముగాఁ గయిసేసికొని యున్నగోపకులచేతను నదియెంతయు రాజిలుచుండెను.మఱియు నగ్నియు, సూర్యునియు, నతిథులయు, గోవులయు. విప్రులయుఁ, బితృదేవతలయు నర్చనలతోఁ గూడియున్నగోపగృహములును, ధూపదీపములును, మాల్యములును, దానిమనస్సున కింపు గావించినవి. అందు నలుప్రక్కల గోముగాఁ బుష్పించిన వనములు బలసియుండుటచే నందుఁబలువగల పులుఁగులును, దుమ్మెదకదుపులును జేయు నాదములు బోరుకొనుచుండెను. మఱియు హంసలును గారండవములును నెరసియున్న యందలి తామరతంపరలచే నది సొంపు పొంపిరి వోవుచుండెను. కృష్ణుని గారామయిన యనుచరుం డాయుద్ధవుఁడు వచ్చియున్నాఁడని విని నందుఁడు మిక్కిలియుఁ బ్రీతుఁడై యతనిని గృష్ణునిఁగాఁదలఁచి పూజించెను. అంత నతనికిఁ బరమాన్నమును భుజింపనిడి పిదప నతఁడు మంచమున సుఖముగాఁగూర్చుండి బడలికలు వీడియుండఁగా, నందుఁడతని కాలుపిసుకుచుఁ

దక్కిన పరిచర్యలును గావించుచు నిట్లని యడిగెను.—'మహా భాగా! మా చెలి వసుదేవుఁడు చెఱనుండి విముక్తుఁడై సుహృదులు బలసికొలువ బిడ్డలు మొదలగువారును దానును గుశలముగా నున్నాఁడే కదా? పాపాత్ముఁడా కంసుఁడు తనదుష్టకర్మముచేతఁ దనబలంగముతోడ హతుఁడయ్యె ననుట భాగ్యముగదే! వాఁడుధర్మశీలురయిన సాధువులనుసదా ద్వేషించుచుండును. అట్టిపాపి రూపుమాయుట భాగ్యముగదా! అదియట్లుండ మాకృష్ణుఁడిం దున్నతల్లిని, సుహృదులను, చెలికాండ్రను, గొల్లలను, దానే దిక్కయిన యీపల్లెను, నిండలి గోవులను, బృందావనమును గోవర్ధనపర్వతమును వీరినెల్లఁ దలంచుకొనునా? ఆగోవిందుఁడు,తనవారిని మఱి,యొకమాఱేని చూచుటకు నిటవచ్చునా? అపుడేని చక్కని నిక్కుగల ముక్కును సొగసయిన చిఱునగవు దొలంకు చూపులునుగల యాముద్దుమొగమును జూతుముగదా! కాఱుచిచ్చునుండియు గాలివాననుండియు, వృషాసురునివలన నుండియు, గాళియునివలననుండియు, గడవరాని తక్కిన మృత్యువులనుండియు మహాత్ముఁడా కృష్ణుఁడు మమ్ముఁ గాచిపుచ్చెను. ఆకృష్ణుని చేష్టితములును, వానికడకంటి కులుకుఁజూపులును, వానినవ్వును, వానిపలుకులును, నెప్పుడునుదలంపునకు వచ్చుచుండఁగా మాకుఁ దక్కినపను లెవ్వియు సాగకుండునుజుమీ. కృష్ణుని యడుగులచే బెడఁగారుచుండు నదీపర్వతవనప్రదేశములను మఱియుఁ దక్కినఁ గ్రీడాస్థానములను జూచుచునేయుండఁగా,మాకిట మనసుతన్మయత్వమునొందుచుండును. రాముఁడును గృష్ణుఁడును దేవతల గొప్పకార్యముతీర్చుకొఱకై యిట నవతరించిన దేవోత్తము(సంకర్షణ నారాయణు)లని

నాకుఁదోఁచుచున్నది. గర్గుఁడును నట్లె చెప్పెను.మఱియు వారు వేయి యేనుంగుల బలిమిగల కంసునిని,బెట్టిదులయిన జెట్టిమల్లులను, మేటియేనుంగును, గువలయాపీడమును, సింహముపశువులనుంబోలె, నవలీలగానే చంపివచ్చిరి. మూఁడుతాలముల కోలఁదిగలిగి యినుమువలె మిక్కిలియు దృఢమైన యాధనువును, మేటిగజము చెఱకుతుంటనుంబోలె,విఱిచెను. పర్వతమునొక్కచేతనే యేడుదినములు దాల్చెను.మఱియుఁ బ్రలంబుఁడు, ధేనుకుఁడు, అరిష్టుఁడు, తృణావర్తుఁడు, బకుఁడు మొదలుగా సురాసురులను జయించునట్టి దిట్టలగు దైత్యులనునతఁడు లీలచేఁబొరిపుచ్చెనుగదే' యనెను.నందుఁడు బుద్ధియంతయుఁగృష్ణునియందుఁదగిలిమక్కువపిక్కటిల్లుచుండఁ,గృష్ణుని చెయ్వులను దలంచితలంచి ప్రేమంపునురవడికిఁ బరవశుఁడయి, కన్నీటడగ్గుత్తికపడ, నేమియుం బలుకనేరక యూరకుండెను.యశోదయుఁదనపుత్త్రునిచరితములను వారు వర్ణించుచుండగా వినుచును,జన్నులఁబాలుసేఁపఁగన్నీరు మిక్కిలియుఁ దొరిఁగినదయ్యె. ఆనందయశోదలకు భగవంతుం డగు కృష్ణునియం దీచందమున నగ్గల మయిన యనురాగ ముండుటనుజూచి యుద్ధవుఁడు ముదమునొంది నందునితో 'మానదా ! మీయిరువురకు నఖిలగురుం డగునారాయణుని యందు నిటువంటి యనురాగబుద్ధి గలిగియుండుటవలన మీరిందు దేవతలకు సయితము మిక్కిలియుఁ గొనియాడఁదగినవారలగుట నిజము. ఈరామకృష్ణు లిరువురును, బ్రధానమును బురుషుఁడు నగుదురు.కాన విశ్వమున కెల్లబీజము లగుపృథివ్యాదులకునుగారణభూతులు. ఈపురాణపురుషులు, దేవమనుష్యాది నానారూపములనున్నభూతములలోపలఁజొచ్చి జ్ఞానమునుబ్రవ

ర్తింపఁ జేయుచుండువారలు. ఎవ్వనియందులోకులు క్షణమాత్ర మయినను విషయాంతరముల పొత్తులేక విశుద్ధమయి యున్న మనసును నిలిపి,కర్మవాసనలనుగాల్చిపుచ్చి, జ్ఞానప్రచురంబును సర్వసన్నం బగుటచే సప్రాకృతరూపంబును నగుపరమగతిని దత్పదమును బొందుదురో, యట్టి యఖిలాత్మ హేతుభూతుం డయిన నారాయణునియందు, సాధువుల రక్షించుకారణమును బట్టి మనుష్యమూర్తి నొందినభగవంతునియందు, మహాత్మా! అనురాగమును మీరుమిక్కిలి పట్టుకొలిపితిరి. కృతకృత్యుల రయితిరి. ఇఁక మీయిరువురకుఁ జేయఁ గోఁజవడిన కృత్యమేమి కలదు? ఏమియులేదు. అచ్యుతుఁడచిరకాలముననే వ్రేపల్లెకు రాఁగలఁడు. యదుతిలకుఁ డాకృష్ణుఁడు తలిదండ్రులకు మీకుఁ బ్రియముగావింపఁ గలఁడు.కృష్ణుఁడు సర్వయాదవులకునువిరోధి యగు కంసుని రంగమునడుమఁ జంపి మిమ్ముఁగదిసి యపుడేమి చెప్పెనో, దానిని సత్యము గావించునే కాని తప్పఁడుచుఁడీ. 'అయినను జాగెట్లోర్తు' మందురా? మహాభాగులారా! దుఃఖపడకుఁడు. కృష్ణునిఁ ద్వరలోనే చూడఁగలరు. 'మఱి యతఁడు మధురయందే యున్నాఁడని తలంచితిరా?' అట్లు గాదు. అతఁడు కట్టెయందు నిప్పువలె భూతముల హృదయములోపలనే యున్నాఁడు. చిలికిననే కట్టెయ యందలి నిప్పు పొడసూపునట్లు భక్తిఁ జేసిననే హృద్గతుం డతఁడు పొడ కట్టును జూఁడీ. 'అయినను బ్రియతములగు వసుదేవాదులను విడిచి యెట్లు రాఁగలఁ' డందురా? అతనికి నొక్కఁడును బ్రియుఁడు లేఁడు; అప్రియుఁడును లేఁడు. మఱి యతనికి నుత్త ముఁడుగాని యధముఁడుగాని సమానుఁడుగాని గలుగఁడు.

ఏలన నతనికి 'నాది' యనెడుమమతాభిమానము గలుగదు. మఱి యందఱియందును సమానుఁడు. అతనికిఁ దల్లియుఁ దండ్రియు భార్యయుఁ బుత్రులు మొదలగువారును దనవారును బెఱవారును గలుగరు. ఏలన నతనికిఁ గర్మము లేదు; కాన కర్మారబ్ధమగు దేహమును లేదు. ఇఁక దేహమునుబట్టి గలుగు తల్లి మొదలగువా రెక్కడిది? అతనికి జన్మమును గలుగదు; అవతారమె కాని. అతఁ డట్లు జన్మకర్మాదులు లేకున్నను గ్రీడార్థము సాధువులను రక్షించుకొఱకును నుత్తమమధ్యమాధమ యోనులగు దేవమనుష్యతిర్యగాదులయందు నావిర్భవించుచున్నాఁడు సత్త్వము రజస్సు తమము ననెడి ప్రాకృతగుణముల కతీతుఁడు లోను గాఁడయ్యును, తనలీల కుపకరణములుగా నాగుణములనుబూనుచున్నాఁడు. అతఁడాగుణములతోఁ గ్రీడించుచున్నను వానికిఁ గీడ్పడక వానినిగడచి యుండును. అతనిక్రీడ మఱేమిగాదు. తా నుత్పత్తి మొదలగునవి లేనివాఁడై విశ్వమును సృజించుచును, రక్షించుచును, సంహరించుచును నుండును. ఈ జగద్వ్యాపారమే యతనికిఁ గ్రీడ. చూపు గిరగిరం దిరుగుచుండుఁ భూమియు నట్లె తిరుగునదిగాఁ దోఁచునట్లు, ఆత్మ తానే కర్తయయ్యుండియు నహంమతిచేఁ గర్తకాని దేహమునే కర్తగాఁ దలంచుచున్నది. భగవంతుఁడీహరి మీయిరువురకు మాత్రమే యాత్మజుఁడుగాఁడు. అతఁడు సమస్తమున కంతరాత్మ గావున యందఱికిని నాత్మజుఁడు. అందఱికిని నతడుఁ దల్లియుఁ దండ్రియు నీశ్వరుండు నగును. కన్నదియు, విన్నదియు, జరిగినదియు, జరుగునదియు, జరుగఁగలదియు, స్థావరమైనదియు, జంగమమును, గొప్పదియుఁ, జిన్నదియు నగు నేవస్తువుగాని యచ్యు

తుఁడు లేని దొక్కటియుఁ గలుగదు. అతఁడు లోకములకెల్ల లోనఁ జొచ్చి శాసించుపరమాత్మయగుటచే జగమంతయు నతఁడే' యనెను. ఇట్లు నందుఁడును గృష్ణానుచరుఁడగు నుద్ధవుఁ డును పరస్పరము మాటలాడికొనుచుండఁగా నారాత్రి కడచెను. అంత గోపికలును మేలుకాంచిలేచి దీపములను మఱింత నెస కొలిపి, కడపమొద లగునింటిపట్టుల గంధాదులచే నర్చించి, పెరుఁగు చిలుకందొడఁగిరి. ఆముద్దియలు దీపంపుఁ గాంతులచేఁ దమ యాభరణములయందలి మణులు తలతలమని మీఁదు మిక్కిలి ప్రకాశింపఁ జేతులయందు దండలవలెనున్న కడియ ములు బెడఁగుసూప, నాఁకత్రాళ్లను లాగుచు, ఆయడటునఁ బటువు లయినపిఱుందులునుగబ్బిగుబ్బలునుహారములునుజలింప కమ్మలకాంతులు చెక్కులఁ జిందులుద్రొక్క, కుంకుమచే నెఱ్ఱ వాఱిన నెమ్మొగము లెమ్మెచూప, నెంతయు వెలుంగుచుండిరి. ఆగొల్లచెలువ లరవిందలోచనుని కృష్ణునిముద్దులు సుద్దులు పాడుచుఁ బెరుఁగు దఱువఁగా నాపాటలరవళియుఁ బెరుఁగు చిలుకునులివ్రునుగూడి దిశల యమంగళములనెల్లఁ దూలిం చుచు మిన్నుముట్టినవయ్యె. అంత భగవంతుఁడు సూర్యుఁడుద యింపఁగా మందయందలి సుందరులాపల్లె ద్వారమున బంగారు మయ మయినరథ మొకటియుండఁ గాంచి 'ఎవరి దీరథము. కంసునికోర్కి యీడేర్ప నాయకౄరుఁడు, కమలలోచనునిఁ గృష్ణుని మధురాపురికిఁ గొంపోయిన యాకౄరుఁడు, వచ్చి నాఁడాయేమి? కంసునే చంపించినాఁడే! మరల రానేల! మృతుఁడయినతనయధిపతి కంసునికిఁ బరలోక క్రియలకు మన లనుగొని మనకండలను బిండములు గావించి నెఱవేర్ప ను

న్నాఁడా?' అని యి ట్లొండొరులు గుజగుజలు వోవుచుండఁగా నుద్ధవుఁడును గాల్యకరణీయములను దీర్చుకొని యట వచ్చెను.
ఇది నలువదియేడవయధ్యాయము.

---

గొల్లచెలువలు కొందామరలవంటి కన్నుంగవయు మోఁకాలివఱకువ్రేలాడు నిడుదబుజములును, పీతాంబరమును, పద్మమాలికయు,నొప్పులుగులుకుచున్నముఖారవిందమును మెఱుఁగువెట్టిన కుండలములునుదాల్చి పొల్చుచున్నయాకృష్ణానుచరుని, ఆయుత్తమశ్లోకుని పాదారవిందములే యాశ్రయించి యున్నయాయుద్ధవునిఁ, గాంచి యుత్సుకలై తెలినవ్వు మొలకలొత్త 'ఎవఁడే ! కడుసొగసుగాఁ జూపట్టుచున్నవాఁడు. కృష్ణునివేషమును భూషణములను దాల్చియున్నాఁడు. వీఁడెవ్వఁడు? ఎక్కడనవచ్చినాఁడే ! మఱి యెవ్వరుపంపిరే' యని యొండొరులతోఁ బలుకుచు నందఱును నతనిఁ జుట్టుకొన్నవారయిరి. వారు నును సిగ్గు లగ్గలించునగవులను జూడ్కులను దియ్యనిపలుకులనునర్ఘ్యాదులను నతనిని సత్కరించిరి. అంత నేకాంతంబునఁ గూర్చుండియున్న యతనినిఁ గృష్ణునిదూతఁగాఁ దెలిసి యతనికిఁ బ్రణతలై వినయముతోడ 'నీవు యదుపతియగు కృష్ణుని భృత్యుఁడ విటవచ్చితివని యెఱుఁగుదుము. మీభర్త యతఁడు తలిదండ్రులకుఁ బ్రియముసేయఁగోరి నిన్నిటఁబంపినాఁడు. ఇదియేకానియతనికి వ్రేపల్లెయందుఁ దలంపునకు రాఁదగినపని మఱియొకటి మాకుఁ దోఁపకున్నది. తలిదండ్రులకుఁ బ్రియముసేయఁ గోరికయేలందువా? బంధువులపట్ల స్నేహానుబంధము, మునికి సయితము త్రోసిపుచ్చ నెంతమాత్రమును శక్యముగాదు. కాన

తలిదండ్రులయెడఁ బ్రీతియొక పెచ్చుగాదు. అట్లు బంధువులు గాని తక్కినవారియందలి నెయ్యమో యొక ప్రయోజనమును బట్టి కలిగినది. కాన యది, యాప్రయోజనము కారణమై యుండునంతవఱకే యుండును. కనుక నిది నిక్కముగాదు. పురుషులకుఁ దమ్ముఁ గూడు వెలపడఁతులయందుఁ గలిగియుండు చెలిమివలెను, దుమ్మెదలకుఁ దేనెలొలుకు పువ్వులయందుఁ గల యనురక్తివలెను, నదియుండును. ధనమంతయుఁ బోయినవానిని వేశ్యలును విడుతురు. పాలింప సమర్థుఁడుగాని రాజును బ్రజలు విడుతురు. ఆచార్యుని విద్యగఱచిన పిదప శిష్యులు విడుతురు. దక్షిణ యొసంగినపిదప యజమానుని ఋత్విజులు విడుతురు. ఫలములు లేని మ్రాఁకును బక్షులువిడుచును. అన్నముగుడిచినపిదప నిండ్ల నతిథులు విడుతురు. కాలినయడవిని మృగములును దిగ విడుచును. అట్లె పరకాంతను ననుభవించినపిదప నది తనివి నొందకున్నను జారుఁడు విడుచును గదా' యనిరి. ఇట్లు కృష్ణుని దూతయుద్ధవుఁడు వ్రేపల్లెకుఁబోవఁగా, గోపికలు తమ మనో వాక్కాయములను వానివ్యాపారములను గోవిందునియందుఁ జొనిపి యాభగవంతుఁడు బాల్యమందును గైశోరమందును గావించినకృత్యములను దలంచితలంచి పాడుచును సిగ్గులువిడిచి యేడుచుచును లౌకిక వ్యవహారములెల్ల వీడి యడిగినవారయిరి. వారిలో నొకగోపిక కృష్ణునిపొందునే తలంచుకొనుచుండి

## భ్రమర గీత.

యొకతుమ్మెద నటఁజూచి ప్రియుఁడుపంపిన దూతఁగాఁ గల్పించు కొని యానెపమున నుద్ధవునకుఁ దగులునట్లు దానితోనిట్లనియె. గోపిక—'ఓ మధుపా! నీవాధూర్తుని చుట్టమవుగదే! మాసవ

తాలి గుత్తంపు గుబ్బలయొత్తున మిక్కిలియు నలంగి కలంగి యుండలికుంకుమ దట్టముగా నంటుకొనియున్న వానిపూమాలిక యందలి పూఁదేనెను గ్రోలఁగా నాకుంకుమ దగిలి యెఱ్ఱవాఱిన మీసలుగదా యివి నల్లని నీకు? ఆసుద్దులఁ దలఁపించు నీయెగు మీసలతో మాపాదములముట్టకు. ముట్టి వేఁడుకొనకుమా. ఆ యదుపతి కృష్ణుఁడా మానవతుల ప్రసాదమునే చూచుకొనుఁగాక. మా ప్రసాదమువలదు. ఓ! ఏలందువా? వాని నెయ్యముతియ్యము నలువుర రచ్చలోఁబెట్టిరవ్వసేయవలసిన దే. మఱివానికిదూతవైయిట్టివాఁడవగునీవేతగుదువు. కూడినపడఁతిని నెడఁబాయునట్టివానికిఁగ్రోలినపువ్వును దిగవిడుచునట్టినీవుగా దూతవు! ఇట్టి నడవడివానికి, ఇట్టిదూతను బుచ్చువానికి, మునుపటిమమ్ముదిగనాడి యిప్పటియీముద్దియల దయను జూచుకొనుటయేతగును. 'అతఁడుమీకేమియుపకారముచేసెననియిట్లగ్గించెద'రందువా? వాఁడుతాపత్రయమును మఱపించిమరులుగొలుపు తన కెమ్మోవి యమృతమునునొక్కమాటు మమ్ముఁ గ్రోలనిచ్చి తేనియ జుఱ్ఱినపువ్వులను నీవు దిగవిడుచునట్లు, మమ్ముఁ దోడనే దిగవిడిచినాఁడు. కానవాఁడు నీయట్టివాఁడు. వాని యట్టివాఁడవు నీవు. అకటకటా! ఇసుమంత నెనరులేనివాని పాదపద్మముల నా శ్రీదేవి యెట్లు కొలుచుచున్నదో! ఆయుత్తమశ్లోకుని బూటకపుసుద్దులు మనస్సును హరింపఁగా బేలుపడి వాని పాదపద్మములను బరిచరించుచున్నదే. మేమా లక్ష్మివలెఁ దెలివిలేని వారముగాము చుమీ యిట్లు పరిచరించుటకు. ఓషట్పదా! అడవిద్రిమ్మరుల మగఁమాయెదుట మేము పలుమాఱనుభవించి పనుపడియున్న యీయదుపతిని నేల యూరక పాడుచున్నావు?

దీనిచేత నీకు మావలన నీకోర్కియు సిద్ధింపదుసుమీ! కృష్ణుని చెలిమికత్తియ లగుపురసుందరుల యెదుట వాని ముచ్చటలను పాడుము. అప్పుడు వానికి మిక్కిలి కూర్పు నా పడఁతులు వాని బిగికౌఁగిలింతలచేఁ దమ గుబ్బచన్నుల గాటంపుఁగసి తీఱఁగా నీవుకోరినది యొసంగుదురు పో! మాముంగల జుంజుమ్మని పాడవలదు. 'ఔనుగాని యాస్త్రీలతనికి దొరకుటకష్టమే' యందువా? దేవలోకమునను భూమియందును పాతాలమందును గల సుందరులలో, నతని మతకంపుసొగసు నగవులకును గనుబొమల త్రిప్పులకును నతనికిఁ బడయరాని పడఁతు లెవ్వరుగలరు? ఆ నవ్వులయొప్పునకును బొమలత్రిప్పునకునే కదా యాతనిచరణ రజమును లక్ష్మియు సేవించుచున్నది. వానికి వశగత లయినయా పడంతులలోమే మెవ్వరము? మేమట్లు బేలుపోయి వశపడు వారముగాము సుమీ. మఱి దీను లగుజనులపట్లనే వాని నుత్తమశ్లోకుఁడని పాడవలయునేకాని దీనులముగాని మాయట్ల వలదు. * నీపాదముచే నాశిరసును ముట్టకుము. వలదన్న మాననేమి? ముకుందునివలనఁ గఱచిన నీదౌత్యంపు సుద్దులను, నీ మొగమిచ్చకపు మాటలును, చాలు. వేఁడికొనుటయందు బలు జాణవులే! నీవు చెప్పఁదలంచిన దంతయు నే నెఱుంగుదును. కృష్ణునివలె నిన్నును నమ్మరాదు. 'వాఁడుచేసిన తప్పేమి'? యందువా? తనకొఱకే బిడ్డలను మగలను తక్కుంగల పుణ్యాలోక

* ఇంతపఱకుఁ దమ పాదమూలమునఁ దిరుగుచున్న తుమ్మెదను దమ్ము బ్రసన్నలం జేయుటకై యట్లు చేయుచున్నదిగాఁ గల్పించిచెప్పి, యిపుడు తమ శిరసుపయిని దిరుగుచున్నదానిని చెవులలో రహస్యముగాఁ బ్రియునివార్త చెప్పఁదలఁచి తిరుగునట్లుగాఁ గల్పించి చెప్పుచున్నారని తెలియునది.

ములను విడనాడిన మమ్ము దిగవిడిచినాఁడే! ఇంతకన్నఁ దప్పేమి గలదు. కాన వాఁడు నెనరుమాలినవాఁడు. అట్టివానిపట్ల సంధి వలనఁ బనయేమి? కృతఘ్నునితో సంధి యెంతమాత్రముఁ దగదు. వానికి నెనరు లేమియేకాదు.క్రూరత్వాదులును గలవు. కాకేమి? వేఁటకానివలె వంచించి కపిరాజును వాలిని జంపినాఁడు. బోయలును మాంసమునకై మృగములను జంపుదురు. వారిధర్మముచొప్పున మాంసమునకై వానిని జంపినదియులేదు. వట్టి కటికితనముచేతనే చంపినాఁడే! ఒక యాఁడుదానికి సీతకు లోనయి తన్నువలచిన మఱియొక యాఁడుదానిని శూర్పణఖను ముక్కుసెవులుగోసి విరూపఁగావించినాఁడు. ముందె వాయసమువలె బలియొసంగిన బలినిగయికొని వానిని త్రాళ్లచే బంధించినాఁడు.కాన యానల్లనివానితోడిపొత్తులు చాలుఁజాలు.'అట్లైనివాని నిత్యమేలపాడెద' రందువా?వానికథలముచ్చటలుమాత్రమదియేమొా విడువఁదరము గాకున్నదే!వానికథలు విడువరాకుంచుట మాకేకాదు. ఇందుఁ బెక్కండ్రు జను లాకృష్ణు చరిత్రలీల యనెడుకర్ణామృతమునం దొక్కకణికను నొక్కమాఱు త్రావినంతనే రాగద్వేషాదు లగుద్వంద్వధర్మములెల్లఁ దూలఁగా నచేతనప్రాయులై తోడనే దుఃఖితమం బగుతమగృహకుటుంబమును విడిచి పక్షులవలె *భిక్షుచర్యను గ్రుమ్మరుచుందురు. మగజింక యిల్లాం డ్రగునాఁడుజింకలు తెలియమిచేత వేఁటకాని మతకంపుఁబాట రవళిని వినునట్లు, మేమును గుటిలుం

* అనగా సన్న్యాసులవలెఁ బ్రాణధారణమాత్రమును జేయుచుందురని స్తుతిగర్భమగునింద.అచేతనప్రాయు లన్నచో ఆత్మస్వరూపసక్తిను బొందినవారని స్తుతిగర్భ మగునింద.

డగు నాకృష్ణుని పలుకు నిక్కమని నమ్మి, వాని నఖక్షతము లచే మరులు వేండ్రమై తీవరింపఁగా, నొక్కమాటు వానినలపు పొలుపును గంటిమి. దూతా! వానిముద్దులు చాలు. మఱి వేఱు ముచ్చటఁజెప్పుము. అనుంగుఁ జెలికాఁడా? పోయి మరలి వచ్చితి వేమి? మీచెలువుఁడు కృష్ణుఁడు మరలఁబంపఁగా వచ్చితివా? అట్లని భ్రమరా! నీవు మాకుఁ బూజ్యుండవు. నీ వేదేనిఁబడయఁ గోరితివేని దానిని వేఁడుము. ఇచ్చటనున్న మమ్ముఁ, బ్రొత్తు విడువరాని యావన్నెకాని ప్రక్కకు నెట్లులయించుకొని పోఁగలవు? సౌమ్యా! లక్ష్మీవధూటి యతనితోడఁగూడియే, యతని వక్షమునసే, యెప్పుడును నున్నదే! సౌమ్యా! శ్రీకృష్ణుఁ డిపుడు మధురయం దున్నాఁడా? అతని తలిదండ్రులను గృహములను బంధువులగు గోపకులనును దలంచునా? ఒకానొకప్పుడేని తన కింకరీజనులమగు మాముచ్చటను జెప్పుకొనునా? అవి యటుం డనీ. అగురుకమ్మ వాసనల బుగులుగొనుచుండు తన బుజమును మాశిరమునం దెప్పు డిడునోకదా! చెప్పుమీ' యనిరి.

అంత నుద్ధవుఁడు గోపిక లట్లు కృష్ణునిఁజూచుటకై యువ్విళ్లూరుచుండుటనుజూచి ప్రియుండుచెప్పి పుచ్చినమాటలచే వారి నూఱడించుచు నిట్లనియె. 'ఔరా! మీ రెంతో కృతార్థలు! మీరు లోకములందెల్లఁ బూజ్యురాండ్రు. కాకున్న, మీరు భగవంతుఁ డగువాసుదేవునియం దిట్లు మనస్సు నర్పింతురా? దానములు వ్రతములు తపములు హోమములు జపములు వేదాధ్యయనములు నింద్రియములు నను వీనిచేతను, శ్రేయస్సు గలిగించు తక్కినవిధములచేతను గృష్ణునియందు భక్తిని సాధించుట శక్య మగుచున్నది. ఉత్కృష్టమైన యిట్టి చక్కని

భక్తిని, మునులకును దుర్లభమయినట్టిదానిని, మీరు సుఖముగానే భగవంతునియందుఁ బచరించితిరే! మఱియు భాగ్యవశమునఁ బుత్త్రులను, బతులను, దేహములను, స్వజనములను, గృహములను విడిచి మీరలు కృష్ణుం డనుపరమపురుషుని వరించితిరే! కావున మీరే కృతార్థలరు. లోకపూజితలు. మహాభాగలారా! మీరు విరహముచేత, నధోక్షజుం డగు కృష్ణునియందుఁ గరణత్త్రయముచేతను భక్తిని బచరించితిరే! ఇదియె నాకు మహానుగ్రహముచుఁడీ! దీనిని దలంచి నేనును గృతార్థుఁడ నయితిని జుఁడీ. కల్యాణులారా! మీకింపుఁగూర్చు మీచెలువుఁడు చెప్పి పుచ్చినమాటలు వినుఁడు. భర్తయగు నా భగవంతుని రహస్యములను వెలిపుచ్చువాఁడనై నే నాసందేశమును గొనివచ్చితిని.భగవంతుఁడు—'నేను సమస్తమున కంత రాత్మనగుటచేత, మీకు నొకప్పుడును నన్నుఁబాసి యుండుట గలుగదుచుఁడీ! ఆత్మనువిడిచి శరీరముండునా? గార్యములగు దేవమనుష్యాది శరీరములయందుఁ గారణము లయినభూమి వాయువు అగ్ని జల మాకాశమ నెడి మహాభూతములు కలిసియె వర్తించుచుండును. మహాభూతములకును వాని కార్యములకును బరస్పరవియోగము లేకుండునట్లు, నేనును మనస్సును జీవులబుద్ధిని నింద్రియములను శబ్దాదిగుణములునుగూడి సమస్తజగత్తునకుఁ గారణభూతుఁడనై కలసి వర్తించుచుందును. కారణమునువిడిచి కార్యముండనియట్లు సర్వకారణుఁ డగునన్నుఁబాసి జగమున నొక్కటియు నుండదుగాన నాతోడి వియోగము గలుగనేరదు; నాయందే, నన్నుఁగొనియే, నన్నే,సంకల్పముమహిమచేత వ్యష్టి

రూపమున నేకాక *భూతేంద్రియగుణము లను సమష్టిరూపమునను సృజించుచును బరిపాలించుచును జంపుచును నుండును. జీవుఁడు దేహేంద్రియమనఃప్రాణాదులకు వేఱయ్యును గర్మమునుబట్టి సత్త్వాదిగుణసంబంధము నొందియుండును. కాన స్వరూపమున నిర్మలుఁడు, జ్ఞానస్వరూపుఁడు. ఇట్టివాఁడు 'నేను దేవుఁడను మనుష్యుఁడను నిదురించితి' నని చెప్పుట యెట్లన్నచోఁ బ్రకృతిపరిణామములగుమనోవ్యాపారవిశేషములయిన జాగ్రత్స్వప్నము సుషుప్తియును జేరి యతఁడు దేవాదిరూపముగాఁ బ్రతీతుఁడగుచున్నాఁడుకాని మఱేమికాదు. నిదురించి మేలుకొన్నవాఁడు స్వప్నమందుఁ గన్నపదార్థములను బొల్లుగాఁ జూచునట్లు, జీవుఁడు మాయాపరిణామరూపంబగు మనస్సుచేత శబ్దాదివిషయములను నప్పటలేనట్టివానినయినను దాననుభవించినవానివలె దుర్లభములయినవానినిగాఁ దలంచుచుండవలయును. ఆమనస్సుచేతనే బాహ్యేంద్రియముల పొందు గలుగుచున్నది. అట్టిమనస్సును జడతలేనివాఁడై యడంచి పుచ్చవలయును. † సమామ్నాయమును, యోగమును, సాంఖ్యమును, త్యాగ

* దీనిచేత మహత్తు మొదలుగాఁ బృథివివఱకుఁ గలవారికి భగవంతుఁడే యుపాదానమని తెలియునది. దీనిచేత సమస్తవస్తువులును బ్రహ్మాత్మకములై యీశ్వరునికిఁ బరతంత్రములై యుండునుగాని అబ్రహ్మాత్మకమును స్వతంత్రము నగున దొక్కటియు లేదని చెప్పఁబడినది. ఈశ్లోకమున దేహాత్మభ్రమమును నిరసించుచున్నారు.

† సమామ్నాయమనఁగా నుపదేశము. లేక వేదార్థజ్ఞానానుష్ఠానము. యోగమనఁగా వివేకాది సాధనసప్తకముతోఁ గూడినది. సాంఖ్య మనఁగా ప్రత్యగాత్మ స్వరూపావలోకనము. తప మనఁగా అనశనాదులు.

మును, తపమును, దమమును, సత్యమును, నను వీనికి, నదులకు సముద్రము తుదియగునట్లు, మనస్సును నియమించుటయె తుది (అనఁగా ఫలము)యగును. ప్రియులారా ! నేను మీకన్నులకు దూరముగా వర్తించుచుండుట మీమనస్సులు నన్ను దగ్గఱి యుండుటకును, మీరు నన్నెప్పుడును ధ్యానింపవలయునని కోరి యునే కాని, మఱేమికాదు. పడఁతులకుఁ మనస్సు, తమప్రియతము‌ఁడు దూరమందుండఁగా వానియందుఁ జొచ్చియుండునట్లు వాఁడే తనదగ్గఱఁ గన్నులయెదుట నుండఁగా వానియందుం డదు. మీమనస్సునంతయుఁ దక్కిన వ్యాపారములన్నిటినుండి యుడిపి నాయందేచొప్పించి నన్నే నిత్యమును స్మరించుచు నచిర కాలమున నన్నుఁబొందఁగలరు. కల్యాణులారా ! స్త్రీలెవ్వరు తమమగలు మొదలగు వారడ్డగించుటవలనఁ బల్లెయందే యుండి వనమందుఁ గ్రీడించుచున్న నాతోడ రాసక్రీడఁ బొందరయిరో, వారు నాచేష్టితములనే చింతించుచు నన్నే పొందిరిగదా. ఇదియె నిదర్శనముచుఁడీ! యనెను' అని చెప్పెను. ఇట్లు ప్రియతముం డగు కృష్ణుఁడానతిచ్చి పంపినమాటలనువిని గొల్లచెలువ లాసందేశము వలనఁదొంటివియోగ‌ల్లఁదలంపునకు రాఁగా సంతోషమున నుద్ధవునిఁ జూచి, 'యదువులకు హితుఁడును శాపకారియు నగు కంసుఁడు భాగ్యవశమున హతుఁడయ్యెనుగదా ! కృష్ణుఁడును దనయాప్తుల కోర్కులెల్ల నోడఁగూర్చి, వారింగూడి మాడి, యిపుడు, భాగ్యవశమునఁ గుశలముగానున్నాఁడుగదా. సౌమ్యా! కృష్ణుఁడాపురస్త్రీల నునుసిగ్గుతోడి నవ్వున నివ్వటిల్లుచు నెయ్యము తోలఁకుచుండు పిసాళిబెళుకుం జూడ్కులను బేలువడి మాయెడఁ జూపవలయు. ప్రియమును వారియెడ నెఱపుచున్నాఁడుగా? మఱి యెన్నఁడు

రతి విశేషములనెల్ల నెఱింగిన వాఁడు. ఆపురస్త్రీలకుఁ బ్రియుం డయినవాఁడు. మఱి వారిపలుకులకును, గులుకు బెళుకులకును లోఁబడియె తీరును. కాన వారికెల్లు చిక్కువడకుండును ? మఱి కృష్ణుఁడు పురసతులనుగూడియుబునుపుచ్చునపుడునడుమమమ్మే ముఖ్యముగా నుద్దేశించి చెప్పుకొనుట యెక్కడిది ? కానిపల్లె పట్టుజనుల వేఱు నుచ్చటలేవేని యలవ్రొకగా వచ్చినపుడైనను మమ్ముఁ దలంచుకొనునా ? ఒకనాఁడు బృందావనమందు వెన్నెల తెల్లగలువలవలెను మల్లెలవలెను జాబిల్లివలెను దెల్లనై యుల్లసిల్లుచుండఁగా రాసగోష్ఠి నలవఱిచి కాలియందెలు గల్లుగల్లుమని మొరయుచుండఁ బ్రియురాండ్రగు మేము తనయింపయిన కథలను బొగడుచుండఁ గ్రీడించిన యారాత్రులను దలంచుకొనునా? కృష్ణుఁ డిటవచ్చునా?వచ్చి తనకై దుఃఖించి పురపురఁ బొక్కుచున్నమమ్ముఁగృష్ణుఁడు, ఇంద్రుఁడు మబ్బులచే వనమునుంబోలె, దనయంగములచే స్పర్శనాలింగనాదులుచేసి బ్రతికించునా ? మున్ను కృష్ణుఁడు వేఱుగతిలేక యిక్కడ నుండెను. ఇప్పుడన్ననో, శత్రువులనెల్లఁజంపి రాజ్యమును బడసియున్నాఁడు; కాన నిఁక గొప్పరాజకన్యలను బెండ్లాడి ముదంబునఁ దేలుచు సుహృదులు బలసికొలువ వెలయుచుండును. కాన యెందుల కని యిక్కడికి వచ్చును ? వేయేల ? వాఁ డాలక్ష్మీదేవికిఁ బతియైనవాఁడు. లక్ష్మి యటుండనీ. తనంతటనే యవాప్తసమస్తకాముఁడు. అట్టిమహాత్మునికి నడవి ద్రిమ్మరుల మగుమనచేతఁగాని మఱి తక్కినపురకాంతలచేతఁగాని కావలసినప్రయోజన మే మున్నది? ఏమియు లేదుగదే. పింగళ యనువేశ్యయు 'వైరాగ్యమే పరమసౌఖ్య'మని చెప్పినది.

మనమది యెఱింగియే యున్నను,గృష్ణునియందలి యాశతోఁ గ్రుసి పుచ్చరాకున్న దే ! ఏమిసేయుదుము. ఆతఁడు తానెంత యెల్ల కున్నను లచ్చి యాతని వక్షస్థలమునుండి యొకప్పుడనియు వీడ కుండును. అట్టియుత్తమశ్లోకుని మంతనంపుముచ్చట నెవఁడు దిగవిడువ నేర్చును? ప్రభూ ! ఈనదులను బర్వతములను వన ప్రదేశములను,ఈగోవులను, ఈవేణుధ్వనులనుబలరామునింగూడి కృష్ణుఁ డిందుఁ గొలిచినాఁడుచుమీ! ఇవి నందగోపకుమారుని చక్కందనంపు సంపదలకు నిక్కమైనయతనియడుగులనుబట్టి, మాటిమాటికిఁ దలంపించుచున్న వే!కాన యెట్లును మఱవనేరము. వాని మురిపెంపునడలును, ఒఱపైనమేలి చిఱునవ్వులును విలాసంపుఁజూపులును, తేనియలు గాఱుపలుకులును, మాచిత్తముల నువ్వెత్తు దొంగిలినవే!మాకెట్లు వానినిమఱవఁగూడును? ఓనాథా ! ఓరమానాథా ! ఓగోకులనాథా! ఆర్తినాశకా! గోవిందా! గోకులమంతయు దుఃఖార్ణవమున మునిఁగియున్నదిగదే! దాని నుద్ధరింపుమా?' యనిరి.ఆగోపికలు కృష్ణుఁడుచెప్పిపుచ్చిన మాటలవలన విరహజ్వరము మాని, యాకృష్ణుఁడు సర్వాంతరాత్ముం డని యెఱింగి యుద్ధవునిఁ జూచిరి.ఉద్ధవుండును నచ్చటఁ గొన్ని నెలలు గోపికలవంతలనెల్ల నుడుపుచును, వసించియుండి, కృష్ణలీలాచరితములను బాడుచును గోకులమును రంజించుచుండెను. ఉద్ధవుం డానందునిమందయం దెన్నిదినము లుండెనో యన్నిదినములు నాపల్లెవారలకుఁ గృష్ణుని ముచ్చటలచేత నన్నిక్షణ ప్రాయములుగా నుండెను.మఱియు నాహరిదాసుఁ డుద్ధవుఁడందలినదులను వనములను గిరులను ద్రోణులను బుష్పితములయినవృక్షములనును గన్నులవిందుగాఁ జూచుచునునందందుఁ

గృష్ణుఁడు గావించిన లీలల నడుగుటచే గోపకులకు నాకృష్ణుని దలంపించుచుఁ దాను రమించుచుండెను. మఱియు నతం డాగోపికలకు గృష్ణునివలని తాత్పర్యమున మనసులు దిటచెడి యీవిధమునఁ గుందుచుండుట మొదలుగాఁ జూచి యెంతయు సంతుష్టితో వారికి నమస్కరించువాఁడై యిట్లు పాడెను—ఈగోపవధూమణులకు నఖిలాత్ముండగు గోవిందునియం దేయీచందమున భక్తిభావము పెచ్చు పెరిఁగియున్నదే! వీరిజన్మమే జన్మము. సంసారభీతులై ముముక్షువులగు మునులును భక్తులుగాని మాబోంట్లును నట్టిభక్తిభావము రూఢమైయుండుట నేకదా వాంఛించుచుందుము. మఱియు ననంతుఁ డగుభగవంతుని కథలచవిం దగిలియుండువారికి బ్రహ్మజ్ఞానములుగాని, బ్రాహ్మణజన్మములుగాని, యేమియెక్కుడు? అడవులం దిమ్మరుచు వ్యభిచారశీలురయిన యీయేవంపుఁ బడఁతులెక్కడ? పరమాత్ముండగు కృష్ణునియందు భక్తిభావము రూఢమగుట యెక్కడ? అయినను నీశ్వరుఁడు తనకలరూపును దెలియనివాఁడయ్యును నేదోయొకభావమునఁ దన్ననువర్తించుచుండు నట్టివానికి మిక్కిలిమేలయిన యౌషధమును దీసికొనఁగా నారోగ్యము నొసంగునట్లు, తానే శ్రేయము నొసంగుచున్నాఁడు. రాసక్రీడ యనుమహోత్సవమందుఁ గృష్ణుఁడు ప్రేపల్లె పల్లవపాణులకంఠములను దనభుజదండములచేతఁ గౌఁగిలించుకొనివారికెంతయు సొంపుగలుగఁ గ్రీడించి పచరించినట్టిప్రసాదము, అతని వక్షమునందే యెల్లప్పుడును నుల్లసిల్లుచుండునట్టి లక్ష్మీదేవికిఁ గాని, తామరపూవన్నెయు వాసనయుఁ గులుకుచుండు తెలిగంటి మించుబోండ్లకుఁ గానికలుగదయ్యె. ఇఁకఁ దక్కినపడఁతులకుఁ గలుగుట యెక్కడిది? ఈగోపికలు మగలు బిడ్డలు మొదలగు తమ

వారిని దిగవిడిచి యార్యులమార్గం బగుధర్మమునువిడనాడి, వేద ములెంత వెదకినను గానరాకున్న ముకుందుని పదవిని—ముకుం దస్వరూపగుణానుచింతనమును - గాంచిరే ! ఇట్టి మహాభాగ్య వతుల పాదధూళిని బొందునట్టి పొదరులు తీఁగలు నోషధులు మొదలగువాని నడుమ నే నేదేని యొక పురువుగానో గడ్డిగానో పుట్టుదునా? పుట్టితినేని వారిపాదరేణు స్పర్శమునకుఁ బాత్రుండ నగుదును. దేనిని లక్ష్మీదేవి యర్చించెనో, మఱి యాప్తకాము లగు బ్రహ్మాదులును యోగీశ్వరులును దమచిత్తములందుఁబూజిం తురో, యట్టిభగవంతుని కృష్ణుని పదారవిందమును రాసగోష్ఠి యం దీగొల్లసుందరీమణులు తమ గుబ్బలయం దిడికొని కౌఁగి లించి తాపములన్నియు దిగవిడిచిరిగదా! వీరిభాగ్యమేమిచెప్ప! ఎవ్వారి హరికథాగానము ముల్లోకములను పావనముచేయు చున్నదో, యానందవ్రజసుందరీమణుల పాదరేణువులకు మాటికి వందనముచేయుచున్నాను' అనెను. అంత నుద్ధవుఁడు గోపికల ననుజ్ఞవేడి కయికొని యశోదను నందునినిఁ దక్కుంగల గోపి కలనును వీడుకొనిపోవువాఁడై రథము నారోహించెను. అట్లు వెడలిన యతనిని నందుఁడు మొదలగుగోపకులు పలువగలకాను కల నెత్తికొని కదియవచ్చి కన్నుల నశ్రువులు గాఱుచుండ, 'మామనస్సుల వ్యాపారములెల్లఁ గృష్ణుని యడుగుందమ్ములనే యాశ్రయించియుండుఁగాక. వాక్కులు వానినామములనే పలు కుచుండుఁగాక. మేనులు వానికి మ్రొక్కులు మొదలగువాని యందే తగిలియుండుఁగాక. కర్మానుగుణం బగునీశ్వరేచ్ఛచేత నెందేని పుణ్యాపాపకర్మములచేత భ్రమించుచుండు మేము శుభ కర్మములేవేని గావించితిమేని, దానములెవ్వియైననొసంగితిమేని

వానినిబట్టిభగవంతుఁడగు కృష్ణునియందు ననురాగముగలుగుఁ గాక' యనిరి.ఇట్లు గోపకులు కృష్ణునియందలి భక్తింజేసియతని భృత్యుని నుద్ధవుని సమ్మానింపఁగా నతఁడు కృష్ణపాలితంబగు మధురకు మరలవచ్చెను.అంత నతండు కృష్ణునకు నమస్కరించి ప్రీతిగడలుకొన వ్రేపల్లెవారలకుఁ గలభక్త్యతిశయమును జెప్పెను. కృష్ణునకును బలరామునకును రాజగు నుగ్రసేనునకును నందాదు లొసంగిన కానుక లొసంగినవాఁ డయ్యె. ఇది నలువది యేడవయధ్యాయము.

---

అంత భగవంతుఁడు కృష్ణుఁడే సర్వాత్ముండును సర్వదర్శనుండు నగుటంజేసి తాను మున్నాడినమాటను దలంచుకొని, మరులుగొని తపించుచున్నసైరంధ్రికిఁ గుబ్జకుఁ బ్రియంబు సేయువాఁడై దాని గృహమునకుఁబోయెను. దానిభవనమును, మిక్కిలి వెల పొడుగయిన గృహోపకరణములతోఁగూడి క్రీడాపరికరము లన్నింటిచేతను సమృద్ధమై యుండెను. మఱియు నందు ముక్తాపుదండలును బతాకలును మేలుకట్లును శయనములును నాసనములును వాసనలు బుగులుకొనుచుండు ధూపములును దీపములును బుష్పమాలికలును గంధములును గలిగి చెలువు గులుకుచుండెను. మఱియుఁ గామశాస్త్రమం దుపదిష్టములగు నానావిధరతిబంధములు వ్రాసియున్న చిత్తరువులు పలువన్నియలచే మిక్కిలి సొగసుగులుకునట్లు వ్రాయంబడియుండెను. ఆ కృష్ణుఁడు తనగృహమునకు వచ్చుచుండుటను జూడఁగానే యాకుబ్జ మిక్కిలియు సంభ్రమమునఁ దొడిఁబడ గద్దియనుండి దిగ్గనలేచి చెలికత్తియలును దానును నతనిని దగురీతినిఁ

గదిసి మేలయిన యాసనములు మొదలగునవి యర్పించి యత
నిని బూజించెను. అంత నాకాంత యుద్ధవునిని లెస్సఁగాఁబూ
జించి యాసనమిడఁగా నతఁడు దానిని గేలముట్టి యందుఁగూ
ర్చుండక నేలపయినే కూర్చుండెను. కృష్ణుండును లోకమందలి
కాముకుల చేష్టితముల ననుసరించువాఁడై యంతవల కెవ్వరు
నెక్కఁగ క్రొత్తదియై మిక్కిలి విలువగలమేలి మంచమునధిష్ఠిం
చెను. ఆసైరంధ్రియు, జలకమాడి, మైపూఁతలలంది,పట్టుచీరలు
వగట్టి, సొమ్ములుదాల్చి, పూదండలును గంధములును గయికొ
నెను. పిదపఁ గప్పురపువాసనలు బుగులుకొను తమ్ములమునైచి
కొని యమృతమువంటియాసవముఁ ద్రావెను. ఇట్లు పెక్కువుప
చారాదుల చేఁదన నెమ్మేనునలంకరించుకొనినునుసిగ్గునెక్కొన,లీల
మెయి వెలికింబికట్టిల్లినచిఱునవ్వు నివ్వటిలుకులుకుఁజెయ్వులు
తళుకొత్త, పిసాళించు నునుబెళుకు జూడ్కులు నిగిడించుచును,
మాధవునికడకు నచ్చెను.నవసంగమమునకై సిగ్గుగడునగ్గలింపఁ
గొంకుచున్న యాపంకజాక్షిని బిలిచి, కృష్ణుఁడు కంకణభూషి
తంబగుదానికేలుపట్టుకొని సెజ్జకుచాఱిచి, మైపూఁతయొసఁగిన
యినుమంతపుణ్యమే తప్ప మఱియొకమేలు నోఁచి యెఱుంగని
యామెఱుంగుఁబోఁడిని గూడినవాఁడయ్యె. ఆపడఁతియు వెన్ను
నియడుగుఁదమ్ములను మూర్కొనుచు, వానిని మకులునఁగ్రాగి
యున్న గుబ్బచన్నులందునుఱొమ్మునందును గన్నుఁగవను నొ
య్యనిడికొని వానిగాఢంపుఁదమిని వీడఁబుచ్చుచు, చన్నుఁగవ
నడిమికి నానందమూర్తియగు నాయందగానిని గదియించిరెండు
చేతుల బిగియఁ గౌఁగిలించుకొని పెద్దయుంగాలముగాఁబెచ్చుపె
రుఁగుచుండినమదనతాపమును దిగవిడిచినదయ్యె. ఆయింతియో

గులకు సయితముపొందరాని యీశ్వరుని, కైవల్యము నిచ్చునట్టి నాథునిని, ఇంచుక మైపూంత యర్పించినంతమాత్రముచే దాను బొందియు, అయ్యో! నిరతిశయపురుషార్థ మగునాకైవల్యము నడుగక భాగ్యహీనుడై 'అంబుజనయనా! నీపొందును విడిచి యుండ నించుకైన నేరను. ప్రియతమా! నాతోడఁగూడి కొన్నిదినములు క్రీడించుచు నిందు వసించియుండఁగదే' యని తుచ్ఛమైన విషయసుఖమునే యాచించెను. అట్లడిగిన యాసైరంధ్రిని దియ్యనిపలుకుల నెంతయుమన్నించి యది వరముగాఁ గోరిన పొందును 'మరలివత్తు' నని సమ్మానప్రదుండుగాన చెప్పి యొసంగి, యంత నా సర్వేశుఁడు సర్వసంపత్సమృద్ధమైన నిజగృహమునకు వచ్చెను. భక్త్యాదులచేఁ దప్పఁ దక్కినయుపాయముల నెంతమాత్రము ప్రసన్నునిఁజేయ నలవిగాని వాఁడును, సర్వేశ్వరులగు బ్రహ్మాదులకును నీశ్వరుం డగువాఁడును, నగుభగవంతుని నించుక మైపూఁతచేతనే ప్రసన్నునిఁ గావించికొని, యాపడఁతి తుదిఁబోయి లగ్గుగాక నీచంబగు శబ్దాదివిషయసుఖమునే యాచించినదే! అది యెంతకుబుద్ధి! ఎంతదౌర్భాగ్యురాలు! అంతఁ గృష్ణుండు బలుసమర్థుఁడు గాన నక్రూరునిచేత నొకానొక * కార్యము చేయింపఁ దలంచియు, నాయక్రూరునిక వేళ ప్రియము సేయఁగోరియు, బలరాముని నుద్ధవునింగూడియు తనిగృహమునకుఁ బోయెను. అతఁడు తన బంధువులయిన యాపురుషలలామములను దవ్వుననేచూచి లేచి యెదుర్కొని యెంతయు ముదంబుపొదల బిగియఁ గౌగిలించికొని యలరించెను.

* హస్తినాపురమున ధర్మరాజాదులకడకుఁ బంపుటయె యీకార్యమని తెలియునది.

అంత నతఁడు వారికి మ్రొక్కెను. వారు నతని కభివాదనము చేసిరి. అతఁడు వారికి నాసనములిడి వారందుఁ గూర్చుండిన పిదప వలెయుపూజలు గావించెను. మఱియు నతఁడు వారిపాదములను గడిగిన జలములను శిరమునందుఁ దాల్చి, యర్ఘ్యాదులనొసంగి, దివ్యములగు నంబరములును బుష్పమాలికలును మేలయినభూషణములును నిచ్చి, యర్చించి శిరసు నేలసోఁక మ్రొక్కి, యతని యడుగుల నొడియం దిడికొని పిసుకుచు, వినయంబున నమ్రుఁడై కృష్ణునితోడను రామునితోడను 'భాగ్యవశమునఁ బాపాత్ముఁడు కంసుఁడును వానిబలంగమును హతులయిరి. మీకులమిది కంసుని వలనఁ గలిగినదురంత మయినపెనుసంకటమునుండి మీరుద్ధరింపఁగా, మిక్కిలి వర్ధిలుచున్నది. మీరిరువురును బ్రధానమును బురుషుండు నగుదురు. ప్రకృతిపురుషశరీరకులై జగత్తునకు నుపాదాననిమిత్తకారణము లగుదురు. మఱి జగన్మయులరు. మీయిరువురు దప్ప మఱి వేఱొకటి యుత్కృష్టమైనది గలుగదు. మీ రిరువురే సర్వోత్కృష్టులరు. మీ విశేషభూతములయిన ప్రకృతి పురుషాకారములచేతఁ బ్రకృతి పురుషశరీరకుండ వగునీవలన సృజింపఁబడినదై నామరూపముల వేఱువేఱ విభక్తమైయున్న యీ చిదచిదాత్మక మగు విశ్వమును, లోనని యంతయగు నంతరాత్మగాఁ జొచ్చి బ్రహ్మమా ! * పెక్కువిధ

* ఇట ఆధారభూతుఁడగు నీయందు నీచేతనే ప్రకృతిపురుష శరీరకుండగునిన్నే జగద్రూపమునఁబరిణమింపఁజేసి, వానివానికి నియంతగా నాత్మరూపమునఁ బ్రవేశించి, దేవమనుష్యాది శబ్దములు నీపర్యంతము చెల్లునట్లు బుద్ధికిఁ దోఁచుటచే, వారరూపముల నీవే పెక్కులుగాఁ దోఁచెదవని యర్థము. దేహమునకుఁ గల నామము దేహియగు నాత్మకును జెల్లునుగాన చిదచిత్తులను దన

ములఁ జూపట్టుచున్నావు. ఇట్లగుట వేదములకుఁ బ్రత్యక్షము నకు గోచరములే కాని మఱియొకటిగాదు. సమష్టులగు భూమి మొద లగునవి, తాము కారణముగాఁ గలవియుఁ దమకార్యము లును వ్యష్టిరూపములు నగు చరాచర భూతములయందుఁ బెక్కులై కానిపించులాగున, నీ వేకరూపుండవయ్యు నీవు కార ణముగాఁ గలిగి సమష్టి వ్యష్టిరూపముల నున్నసమస్తభూతము లందును బెక్కువిధముల వెలుంగుచున్నావు. మఱియు వాని యం దంతరాత్మవై యుండి నియమించుచు నున్నావు. ఇట్లు పెక్కువిధములఁ దోఁచుటవలన జీవునివలెఁ గర్మపరతంత్రుఁడవై కాదు. నీవు నీయంతట స్వతంత్రుఁడవు. మఱియు నీకు విశేషణ ములయిన సత్త్వరజస్తమోగుణములచేతఁ బ్రపంచమును సృజించుచును, బాలించుచు, సంహరించుచు నుందువు. అయిన నాగుణములచేతఁగాని తన్మూలకమయిన సృష్టి మొదలగువ్యా పారములచేతఁగాని పట్టువడవు. నీవు జ్ఞానస్వరూపుండవు, కాని నీకు బంధముకలుగునని యూహించుటకు నయినను హేతువు గానరాదే! దేవాదిరూపము లగు దేహాద్యుపాధులు జీవునకుం బోలె నీకును కర్మభోగార్థములని నిరూపింపఁబడవు. కాన జీవు నందంతరాత్ముఁడవై యున్న నీకుఁ దన్మూలమయిన సంసారము చక్కఁ గలుగనేరదు. అది నీ దేహభూతుఁడగు జీవునికే కలు

శరీరముగాఁజేసి తాను శరీరియగు నంతరాత్మయై యుండుటచేత నాశరీరభూ తములకుఁ గల నామములెల్లఁ దనవిఁయును చెల్లుటంబట్టి యవి యున్నియుఁ దానుగాఁ బెక్కులుగాఁ జూపట్టుచున్నాఁడని యాశయము. ప్రకృతి పురుష శరీరకుండై యిట్లుపాదానమగుచున్నాఁడు కాని స్వరూపముచేతఁ గాదని తెలియునది.

గును. అట్లు నీకు సంసారమేకలుగదనఁగాఁ దన్మూలమయిన బంధముగాని బంధప్రసక్తమయిన మోక్షముగాని యెక్కడిది? అయినను రామాదిదేహములను దాల్చి చూపట్టెదవేయన్నచో నది నీయిచ్ఛచేతఁ గలిగిన దేహములేకాని కర్మవశతచేతఁగాదు. అయిన నందఱికట్లేల తెలియదన్నచో నది జీవేశ్వరులకలరూపు దెలియకున్న మాయావివేకమే కాని మఱేమిగాదు. నీవు జగమునకు హితముకొఱకు నూర్పులరూపమున నుపదేశించిన పురాణంబగు వేదమార్గము (ధర్మము) తానెప్పుడెప్పుడు లగ్గుగాని పాషండమార్గములచేత బాధింపఁబడునోయపుడు దానిని సంస్థాపించుటకై శుద్ధసత్త్వమయంబగు విగ్రహమును దాల్చుచుందువు. ప్రభూ! నీ వట్టివాఁడవు గావున నాసురప్రకృతులగు రాజులు నందలకొలఁది యక్షౌహిణులను వధించి భూభారమును బోఁగొట్టుటకును, రాకులముకీర్తిని విరివిగాఁ బరగించుటకును నీ విందు నీ సంకల్పమున బలరామునిఁగూడి వసుదేవుని గృహమున నవతరించితివి. ఈశా! ఎవ్వనికి సకలదేవతలును బితరులును భూతములును రాజులును శరీరము లగుదురో, ఎవ్వనిపాదములను గడిగినజలములు ముల్లోకములను బవిత్రములు గావించునో, యట్టి జగద్గురుండును నధోక్షజుండునునగు నీవు చొచ్చినందున మాగృహములు నేఁడుగదా మిక్కిలియు భాగ్యవంతములయినవి! భక్తుల కత్యంతప్రియుండును, సత్యవచనుండును, సుహృదుండును గృతజ్ఞుండు నగు నిన్నుఁదప్ప మఱి యెవ్వనిని బండితుఁడగువాఁడు శరణుఁజొచ్చును? ఎవ్వనిని జొరఁడు. ఏలన నీవు భజించువారికి సకలమయిన కామితములను, కామితములే కాదు, వృద్ధియును క్షయమును లేక నిరతిశయానందరూప

మయిననీయాత్మను సయితమునిచ్చువాఁడవుగదే. బ్రహ్మాదులగు దేవోత్తములకును మహాయోగీశ్వరులకును నెవ్వనికలతావు దెలియ శక్యముగాదో యట్టి నీవు, జనార్దనా! మాకిందుఁ గన్నులకు మాతోంటిభాగ్యవశమునఁ గనుపట్టుచున్నావు. కాన పుత్త్రులు పడఁతులు ధనములు గృహము లాప్తులు దేహములు మొదలగువానియందు నీదుమాయంజేసి దగులువడునట్టి మోహపాశమును వేవేగఁ ద్రుంపుమా!' యని ప్రార్థించెను. ఇట్లా భక్తుం డకౄరుఁడు తన్నర్చించి స్తుతింపఁగా భగవంతుఁడు కృష్ణుఁడు తన యింపారుపలుకుల నాతని మోహపెట్టుచు నవ్వు దొలఁకుచుండ నతనితో 'ఓయీ! నీవు నిత్యమును మాకు హితకరుండవు గాన గురుండవు; పినతండ్రివి, కాన పూజ్యుండవు. మఱికంసునివలెఁగాక కొనియాడందగుచుట్టమవు.నీవిట్టివాఁడవు గావున మేము నీకు రక్షింపఁదగువారమును బోషింపఁదగువారమును దయఁజూడందగువారము నగుదుము! ఇంతేల! మేము మీకు బిడ్డలము. కాన మేము పూజ్యులముగాము. నీవేమాకుఁ బూజ్యుఁడవు. పూజ్యుఁడవు మాకుమాత్రమేకావు. మిముబోఁటి భాగవతులును మిక్కిలి యుత్కృష్టులు గాన దమయాత్మశుద్ధి యనెడు శ్రేయమును గోరుమానవులు నిత్యమును మిముబోఁటిట్లను సేవించుచుండవలయును. 'మనుష్యులకన్న సేవించుట కెక్కుడయిన దేవతలు లేరా!' యందువా? ఆదేవతలు స్వప్రయోజనపరులేకాని పరోపకారులగు సాధువులు గారు. మీరే యట్టిసాధువులు. జలమయము లగుగంగాదితీర్థములుగాని,మట్టితోను ఱాతితోను గావింపఁబడిన దేవాదిప్రతిమలు గాని, మీబోంట్లవలెఁ బావనములు గావు. అవి (స్నానపాన పరి

చర్యాదులవలనఁ) జాలగాలముననే పావనములు చేయుచున్నవి. మిముబోఁటి సాధువులో దర్శనమాత్రముననే పావనముచేయుదురు. ఇట్టివాఁడవు గావున నీవు మాకుఁ గలసుహృదులలోపల నెంతయు మేటివి. కాన మాకు శ్రేయమును గావింపఁగోరి పాండవుల సుఖదుఃఖముల నరసి వచ్చుటకై హస్తినాపురమునకుఁ బొమ్ము. తండ్రియగుపాండురాజు మృతుండుగాఁగా, బాలురగు నా పాండవులను వారితల్లిని మిక్కిలియు దుఃఖితులై యున్నవారిని, రాజు ధృతరాష్ట్రుఁడు తనపట్టణమునకుఁ గొనిపోయెనని యు,వారందు వసియించుచున్నారనియు వినుచున్నారము.ధృతరాష్ట్రుఁడు, తన దుష్టపుత్త్రుం డగు దుర్యోధనునకు వశగతుఁడై మఱియు నంధుఁడునుగావునఁ దమ్మునిబిడ్డలగునా పాండవులయందుఁ గృపణబుద్ధి గలిగియుండును గాని సమముగా వర్తింపఁడనుట నిజము. పొమ్ము. వారియిప్పటియునికి బాగో సెబ్బరయో తెలిసికొనుము. అది తెలిసికొని పిదప సుహృదు లగువారికి సుఖము గలుగువిధమును గావింతము' అనెను భగవంతుఁడాయీశ్వరుఁడు కృష్ణుఁ డిట్లక్రూరునకు నానతిచ్చి యంత బలరామునిని నుద్ధవునిని గూడి నిజగృహమునకుం బోయినవాఁ డయ్యె. ఇది నలువదియెనిమిదవ యధ్యాయము.

---

ఆయక్రూరుఁడు హస్తినాపురికిఁబోయెను.అది కురురాజోత్తముల యశస్సూచకములగు దేవబ్రాహ్మణాయతనాదులచే డంబుగులుకుచుండెను. అతఁడందు భీష్మునిని విదురునిని, గుంతిని,బాహ్లికుని, సోమదత్తుని,ద్రోణునిఁ, గృపునిఁ,గర్ణుని, దుర్యోధనుని,

నశ్వత్థామును, పాండవులను, దక్కిన సుహృదులను బంధువులను విధ్యుక్తముగాఁ గదిసి, వారు తన్ను సుహృదులకుశలవార్త లడుగఁగాఁ జెప్పి తానును వారికుశలమునడిగెను. అంత సతండు రాజగు ధృతరాష్ట్రుఁడు దుష్పుత్త్రులంగని మనస్సుదిటయంతగాలేక, ఖలు లగుకర్ణాదుల యిష్టముచొప్పున నడచుచుండువాఁడుగాన పాండవులయెడ వర్తించుచొప్పునుగనుఁగొనఁగోరి యందుఁగొన్నినాసములు నసించియుండెను. మఱియుదుర్యోధనాదులుపాండవులయందుఁ బ్రజలకుఁ గలయనురాగమును, వారల తేజమును ఓజస్సును, బలమును, వీర్యమును, వినయమును మొదలయిన సద్గుణములనును జూచి సయింపనోక వారికి విషము పెట్టుట మొదలయిన దుష్టకర్మములను గావించుటయు మఱియుఁగావింపఁదలంచి యుండువాని నన్నియును నక్రూరునకుఁ బృథయు విదురుండును వివరించి చెప్పిరి. పృథయు నటకువచ్చిన తనయన్న దమ్ముని నక్రూరునిఁజూచి తనపుట్టింటిసి తలంచుకొనుచుఁగన్నుల యం దించుక నీరు గ్రమ్ముచుండ 'సౌమ్యా! తల్లియుఁ, దండ్రియు, నన్నదమ్ములును, నప్పసెల్లెండ్రును, మేనల్లుండ్లును వారి కులస్త్రీలును, జెలికత్తియలును, మమ్ముఁదలఁచుకొందురా ? భక్తవత్సలుండును శరణ్యుండును గన్నకొడుకు నయినయా భగవంతుఁడు కృష్ణుఁడును దామరలవంటి కన్నుంగవగలయాబలరాముఁడును దమ మేనత్తకొడుకులను దలంతురా ? తోఁడేళ్ల నడిమి లేడియుంబోలె పగవారినడుమఁజిక్కి స్రుక్కుచున్న నన్నును, దండ్రిమాలిన నాబిడ్డలనును, నాకృష్ణుఁ డూరడఁబలుకునా?' అనియంతఁ గృష్ణుని మనంబునఁదలఁచి 'కృష్ణా! కృష్ణా! మహాయోగీ! విశ్వాత్మా! విశ్వభావనా! గోవిందా! నిసువులతోడఁ గంది కుందు

చున్న నేను నిన్నుశరణుఁజొచ్చితిని. ననుఁగావుమా ! మృత్యు వగు సంసారమునకు వెఱచుచున్న మనుష్యులకు నపవర్గప్రద మయిన యీశ్వరుని నీదుపాదారవిందములుదప్ప మఱియొకటి శరణము గానరాదుగదే. రాగద్వేషములు లేక శుద్ధుండై బ్రహ్మంబును బరమాత్మయునై *యోగేశ్వరుండును యోగుండును నగుఁ గృష్ణునకు మ్రొక్కెదను. కృష్ణా! నిన్నుశరణుఁజొచ్చితినిగదే' యనెను.

శుకుఁడు-రాజా ! ఇట్లు నీప్రపితామహియగు కుంతి తన బంధువులను జగదీశ్వరుం డగుకృష్ణునిని దలంచుకొని దుఃఖము పట్టలేక మిక్కిలియు రోదనముగావించెను. అక్రూరుఁడును మహాయశుం డగువిదురుఁడునునాయమతోఁ బాటిగా సుఖదుఃఖములు గలిగి యుండువారుగాన యామెతో 'నీపుత్రులను గన్నధర్మానిలేంద్రాదులు వారిని గావకపోదురా' యని దిటచెప్పి యెంతయు నోదార్చిరి. అంత నక్రూరుఁడు వెడలిపోవువాఁడై తనకన్నబిడ్డలయందే మిక్కిలి మనసుదగిలి పాండవులయెడ విషముండై యున్నరాజగు ధృతరాష్ట్రునితోఁ, దగ్గఱిబంధువు లగు కృష్ణాదులు మంచిమనంబునఁ జెప్పిపుచ్చినమాటల సుహృదులెల్ల వినుచుండఁగా ని ట్లనియె.

'ఓ ధృతరాష్ట్రా ! నీవు కురువులకుఁ గీర్తిని వర్ధించువాఁడవుగదే! నీతమ్ముఁడు పాండురాజు మృతుఁడుకాఁగా నీవిపుడుసింహాసనము నెక్కియున్నావు. భూమిని ధర్మమునఁబరిపాలించుచును,

---

* యోగేశ్వరుఁడనఁగా నాయాయధికారుల కనుగుణముగాఁ బెక్కువిధముల నున్న న్యాసయోగమునకు నిర్వాహకుఁ డయినవాఁ డనుట. యోగుఁడనఁగా నిరుపాధికసర్వవిధబంధు వని యర్థము. వీరరాఘవులు.

ప్రజలను శీలముచే రంజించుచును, దమవారియందు సముఁడై వర్తించుచు, నుండు వేనినిరపాయంబగు శ్రేయమునుగీర్తినిబొందుదువు.మఱియొక విధమున నడచుకొందువేని,జనులచే నిందితుఁడవైనరకమునుబొందుదువు. కాఁబట్టిపాండవులయందునునీపుత్త్రులయందును సముండవై వర్తింపుము.కన్నబిడ్డలవలెఁ గడమబిడ్డల జూడనొప్పునా?యనవలదు. ఇందెవ్వనికిఁగాని మఱెవ్వనితోడను నెడతెగని కూడికకూడియుండుట గలుగదు. రాజా ! తనసొంత దేహముతోనే యట్టికూడిక గలుగదే ! ఇఁక నాలుబిడ్డలతోడ నెక్కడిది? ప్రాణి తా నొక్కఁడే పుట్టుచున్నాఁడు; కాని యాలుబిడ్డలతోడఁగాదు. తా నొక్కఁడే చచ్చుచున్నాఁడు; కాని తనతోఁగూడ మఱెవ్వరునుజావరు.తనసుకృతమును దానొక్కండే యనుభవించుచున్నాఁడు; దుష్కృతమును దానొక్కఁడే కుడుచుచున్నాఁడు గాని కూడ మఱియెవ్వరును గుడువరు. పుత్త్రాదులు తాము పోషింపఁ బడవలయువార మను నెపమునిడికొని మూఢుండగువాఁ డధర్మమున నార్జించిన విత్తమును, చేఁపకు జీవనమగు జలములను దానిబిడ్డలగు చేఁపలుంబోలె,హరింతురు. కాన పుత్త్రులు శత్రులేకాని మఱేమిగాదు.ఎవఁడు తనవియనెడు బుద్ధితో వేనిని బోషించుచున్నాఁడో యాప్రాణములును, ధనములును,బుత్త్రకళత్త్రాదులును,వాఁడుకోరిన కామముల ననుభవింపక యే మృతినొందెఁగా,వానిని దిగవిడిచిపోవుచున్నవి.తనకు హితములను దెలియక యనర్థములనుమాత్త్రము తెచ్చికొనుటయందు నేర్పరియగు నట్టిపురుషుఁడాప్రాణాదులనెల్ల దిగవిడువఁగా వానిని బోషించుటకై తా నొడిగట్టినపాపమునుమాత్త్రము దీసికొని తనకోర్కె యొనఁగూడకయె స్వధర్మమునకు విముఖుఁ

డై తుద నంధమితామిస్రమను నరకమును జొచ్చుచున్నాఁడు. రాజా! విషయస్థితి యిట్లుండుటనుబట్టి యీ దేహమును నీనినిసం బంధించినవాని నన్నింటిని, స్వప్నమందలి యాశ్చర్యంబగుమనో రథముంబోలె ననిత్యమగుటను గనుఁగొని తనబుద్ధిచేతఁ దన్న డంచి పుచ్చుకొని, ప్రభూ! యన్నింటను సమబుద్ధి గలవాఁడవై రాగద్వేషాదులు వీడి శాంతుఁడవై యుండుము' అనెను. ధృత రాష్ట్రుఁడు, 'ఉదారా! నీవు మంగళావహము లగుపలుకులాడి నపుడు, ఆపలుకుల నెంత వినుచున్నను, మరణశీలుండగువాఁ డ మృతమును ద్రావి తనివి నొందనట్లు, నేనుదృప్తినొందకున్నాను. నీవాక్కు నిరతిశయహితమైనదిగదే! సౌమ్యా! నీమాటలెంత మధురమును హితము నయ్యును,నాకది పుత్త్రునియందలి ప్రేను మక్కువనుబట్టి సౌదామని మెఱుపువలెఁజంచలమయి మనస్సుం డుటవలన నందు రూఢిగా నిలిచియుండ కున్నది. ఇది తెలిసియు నిట్టియజ్ఞాన మేలందువా? భూభారమును దీర్చుటకై యదు కులమునం దవతరించి యున్న యీయీశ్వరుఁడు చేయఁదలఁచి యున్నదానిని బురుషుఁ డెవఁడు మఱియొకవిధము గావింప నేర్చును? ఎవఁ డితరులకుఁ దెలిసికొనఁ దరముగానిచందముగల తనప్రకృతిచేత నీబ్రహ్మాది దేహసమూహములను సృజించి యీ దేహములం దంతరాత్మయై చొచ్చి శబ్దాది విషయముల నాబ్ర హ్మాదులకువారివారికి నియతమైయున్న చొప్పునఁబంచియిడునో, యితరులకుఁ దెలియరాక తనకు విహారతంత్రమైయున్న సంసార చక్రమును *ద్రిప్పుచుండు నాసర్వోత్కృష్టునకుఁ బరమేశ్వరు

* అపరమేశ్వరుని విధిచొప్పున నాబుద్ధి ప్రవర్తించునే కాని నావలనఁ దప్పేమియుఁ గలుగదని ధృతరాష్ట్రుని భావము.

నకు నమస్కారము' అనెను. ఆయక్రూరుఁడును ధృతరాష్ట్రుని యభిప్రాయము దెలిసికొని పాండవాదులగు సుహృదులయనుజ్ఞ గొని మరల మధురకు వచ్చెను. ధృతరాష్ట్రుఁడు పాండవులందు గావించిన విషప్రదానాదికమగు కృత్యములను, గృష్ణుఁడు దన్నెఱింగి రమ్మని పంపినవానిని, నంతయును దెలిసికొని రామకృష్ణులకుఁ జెప్పినవాఁడయ్యెను. ఇది నలువదితొమ్మిదవయధ్యాయము.

దశమస్కంధము పూర్వభాగము

స మా ప్త ము.



శ్రీకృష్ణాయ పరబ్రహ్మణే నమః.

శ్రీవేదవ్యాసాయ నమః.

శ్రీశుకాయ నమః.



Printed at the Ananda Press, Madras.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA120B126 |
|---|---|
| పుస్తకం పేరు | శ్రీమద్భాగవతము ఆంధ్ర వచనము 06 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 433 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 1668A,1682A,1684A,1698A,1708B,1742A |
| లేని పేజీలు | 1TO1632 |
| తయారు చేసినది | |
| పేజీలు విడదీసినది | |
| స్కాన్ చేసినది | అశ్విని |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |

BLANKS=1750A,1820B,1838A,1846B,1860A,1902A,1912B,1922B,1934A,1966A,1982B **2024**